# KASIKHANDAMU

BY

SREENADHA.





RS' EDITION.

V. RAMASWAMY SASTRULU & SONS
292, ESPLANADE ROW
MADRAS.
1924.

శ్రీ ర స్తు.

# శ్రీ కాశీఖండము

శ్రీ నా థ క వి ప్ర ణీ త ము.



చె న్న పురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచే
ప్ర క టి త ము.
1933

# వి ష య సూ చి క.



## పీ ఠి క.



## ప్ర థ మా శ్వా స ము.



## ద్వి తీ యా శ్వా స ము.

## తృతీయాశ్వాసము.

## చతుర్థాశ్వాసము.

## పంచమాశ్వాసము.



## షష్ఠాశ్వాసము.

## సప్తమాశ్వాసము.



---

# ప్ర కా శ క వి జ్ఞ ప్తి.



1914-వ సంవత్సరాంతమున శ్రీనాథకవికృత కాశీఖండ
మును ముద్రింపఁ దలఁచి యచ్చుప్రతితో సంప్రతించుకొనుచు
నోరియంటల్ లైబ్రరీలో నున్నవ్రాఁతప్రతిప్రకారము సాపు
వ్రాయించితిమి. తరువాత నాంధ్రసాహిత్యపరిషత్తులో వ్రాఁత
ప్రతులున్నవని తెలిసి యోరియంటల్ లైబ్రరిప్రతితో సంప్ర
తించుకొనుచు నాయాప్రతులలో నుండుపాఠాంతరములనన్ని
టిని సమకూర్చినారము. పిదప వీని నన్నిటిని మాపండితు లగు
శ్రీమాన్, ఉత్పల వేంకటనరసింహాచార్యులవారు సంస్కృత
మూలముతో సరి చూచి యొకప్రతిని సిద్ధము చేసిరి. ఈగ్రం
థమునందు నచ్చటచ్చటఁ గొన్ని లోపములు గలిగియుండ వని
చెప్పఁజాలము. కాని పరిష్కర్తలకును బ్రకాశకులకును దగిన
ప్రోత్సాహమును గలిగించుట మనలో శూన్యమైనందున నింత
కన్న నత్యంతశ్రమము వహించుట కెంతమాత్రము వీలులేక
యున్నదని నొక్కి వక్కాణించుచున్నాము. ఇదివఱకు ముద్రిత
మగు ప్రతికిని బ్రకృతము మాచే ముద్రితమగుప్రతికిని సహృద
యులు కొంచెము తీఱిక చేసికొని తారతమ్యమును గనుఁగొని
రేని మాశ్రమ మెంత యైనదియు విదితము గాక పోదు.
కావున నిందులోని క్వాచిత్కలోపములకు విబుధులు క్షమింపఁ

ప్రార్థితులు. ఈగ్రంథముఁ బరిష్కరించి యిట్టియోగ్యస్థితికిఁ దెచ్చిన శ్రీమాన్, ఉత్పల వేంకటనరసింహాచార్యులవారికిని, పీఠిక నొకదాని వ్రాసి పంపుఁడని కోరినవెంటనే వ్రాసి యిచ్చిన మామిత్రులగు బ్రహ్మశ్రీ, నాగపూడి కుప్పుసామయ్యగారికిని మాకృతజ్ఞతను వెల్లడించుచున్నారము.

ఇట్లు,

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# పీ ఠి క.

---

ఆంధ్రమహాకవీశ్వరులలోఁ గవిత్రయమువారిం బేర్కొ-నినవెనువెంట సన్నుతింపఁ దగినకవినాథుఁడు శ్రీనాథుఁడు. గుంటూరుజిల్లా సత్తెనపల్లెతాలూకా ఫిరంగిపుర మనుగ్రామమున శ్రీవీరభద్రస్వామియాలయమున కెదుట నున్నశిలాస్తంభమునఁ గన్పట్టుశాసనమువలన దానిని శ్రీనాథుఁడు శాలివాహనశకము 1331 సంవత్సరము (హూణశకము 1410 సంవత్సరము)నకు సరియగు విరోధిసంవత్సరమున వ్రాసినట్లు తెలియ నయ్యెడు. దీనింబట్టియు నితనికావ్యములఁ గైకొన్న కృతిపతులు జీవించియున్నకాలములంబట్టియు నితఁడు హూణశకము 14-15 శతాబ్దములనడుమ జీవించి యుండె ననుట నిస్సంశయము.

శ్రీనాథుఁడు జీవించియుండినకాలము మనకుఁ దెలిసినను నితనిజన్మస్థానముంగూర్చియు నితఁడు వసించినప్రదేశంబులం గుఱించియు నిర్ణయముగ నెఱుంగరాకున్నయది. అయినను నితనికావ్యములవలన నితఁ డనేకదేశములు సంచరించి పెక్కుపుణ్యతీర్థములు సేవించినవాఁ డని తెలియనగు. సామాన్యముగా నితఁడు కృష్ణాగోదావరీమధ్యదేశంబులలో నుండె నని చెప్పవచ్చుం గాని ప్రాయికముగా నితఁడు రాజమహేంద్రవరమున నివసించి యుండె నని కాశీఖండములోని

సీ. "ఉండు నేవీట మార్కండేయమునినాథ
 సజ్జలింగ మనంగశాసనుండు
ప్రవహించు నేవీటిపశ్చిమప్రాకార
 మొరసి గంగమ్మ సాగరముకొమ్మ

యావిర్భవించినాఁ డేవీటికోటలో
బలభేది మదనగోపాలమూర్తి
పాలించు నేవీటిప్రాగుదక్కోణంబు
నుమబోటి శ్రీముల్లగూరిశక్తి
తే. ప్రబలథారాసురత్రాణభద్రజాతి
కరిఘటాసైన్యదుస్సాధకనకలోహ
గోపురద్వాగకవాటప్రదీపిత మతి
సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము."

(ఆశ్వాసము 1. పద్యము 58.)

అనువర్ణనమువలన నూహింపఁదగియున్నది.

కవిత్రయమువారు దక్కఁ దక్కినసకలాంధ్రకవీశ్వరులలో శ్రీనాథుఁ డగ్రగణ్యుఁ డని చెప్పుట యతిశయోక్తి కానోపదని భావింతు. ఇప్పలుకులు విన్నచో నాచనసోమనాథుని పేరు పండితులతలంపునకు వచ్చుట నిక్కువము. నాచనసోమనాథునికవనము కవిత్రయమువారికవనముకంటె రసవత్తరంబని బహుజనపల్లి సీతారామాచార్యులుగారును వీరేశలింగము పంతులుగారును వచియించియున్నారు. చిన్నయసూరియు నీతిచంద్రికయందుపోద్ఘాతంబున "నలికంబున యక్షిని డాఁచినట్టిసర్వజ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతుఁ" అని పొగడియున్నాఁడు. అయినను సర్వవిధంబులను నాచనసోమునికవిత్వము కవిత్రయమువారికవనమునకు సరిరాదనియే నాయభిప్రాయము. ఇంతయేల? శ్రీనాథునికావ్యములను నాచనసోమునియుత్తరహరివంశమును దారతమ్యనిర్ణయంబు సేయుమనీషతోఁ బరిశీలింప నాడెందమున నించుకయుఁ గొంకులేక శ్రీనాథునికవనము దెసగౌరవాధిక్యముతోఁచుచున్నయది.

శ్రీనాథుఁడు పెక్కు కావ్యములను రచియించి పెక్కు రకుసు గృతి యొసంగెను. వీనిలో శృంగారనైషధము, భీమేశ్వరపురాణము, కాశీఖండము, హరవిలాసము అను నిమ్మహాకావ్యంబులు ముఖ్యములు. ఇతఁడు రచించిన మరుత్తరాట్చరిత్రయు, శాలివాహనసప్తశతియు మనకు లబ్ధములు గావు. పండితారాధ్యచరిత్రముఁ బ్రచారములో నున్నట్లు కానంబడదు. శ్రీనాథప్రణీత మగుశివరాత్రి మాహాత్మ్య మనుగ్రంథ మొకటి యాంధ్రసాహిత్యపరిషత్తువారికి దొరకియున్నది. అది యింతకు నశ్రుతచరంబగుటచే నది శ్రీనాథకృత మవునో కో యని డెందంబున సందియంబు వొడమ దానియందుఁ గొంత భాగముఁ జదివినపిదప నాసంశయంబువాసె. వీథినాటకమును బల్నాటి వీరచరిత్రమును దద్విరచితంబు లని యందురు గాని యది విశ్వాసార్హంబుగాఁ దోఁపదు.

శ్రీనాథుఁడు సర్వతోముఖపాండిత్యభూషితుం డగు మహాకవీశ్వరాగ్రేసరుఁడు. ఇతనిశైలి గంగాలహరిచందంబున ననర్గళధారాసముల్లసితం బై యనన్యాదృశప్రౌఢఘాటీచమత్కారగంభీరంబై కోమలశబ్దసముదయసుభగంబై నిరుపమానమై నివ్వటిల్లు. సంస్కృతంబునను నాంధ్రంబునను శ్రీనాథుని ప్రయోగకల్పన లసదృశంబులు. తత్తద్రసోచితపదవ్రాతంబుఁ బరఁగించి రసపోషణంబు సేయుటయందు శ్రీనాథునికిఁ గలప్రావీణ్యం బగణ్యంబు. చక్కనియాంధ్రలోకోక్తు లితనికవిత్వంబున నందందు వెలయుచుఁ జదువువారిమనంబుల సొగయించు. ఇతనికవనంబున నాంధ్రరచనలకంటె సంస్కృతరచనలు బహుళము లై యున్నవి. ఏపద్యముఁ జూచినను హృద్యముగా

నున్నను శ్రీనాథునిసీసపద్యములు చరణంబుల నిలుకడ వెలయ సమపాదవిన్యాసంబులఁ బొలుపారుచు మదకలభంబుగమనంబునఁ గ్రాలుచు నత్యంతమనోజ్ఞము లై తనరారు. వీని కుదాహరణంబులెత్తి వ్రాయ నవకాశంబు లేమిని విరమించితి. ఇమ్మహాకవి వేములవాడభిమకవి, నన్నయ, తిక్కన, యెఱ్ఱన, వీరిం బూర్వమహాకవీశ్వరులఁ గా నుతించి వీరికవిత్వములం దత్యంతగౌరవాదరంబులు గలిగియుండెనని కాశీఖండములోని

సీ. "వచియింతు వేములవాడభీమునిభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని త్రోవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు
తే. నైషధాదిమహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ!
యిపుడు చెప్పఁ దొడంగినయీప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్యపేర."

(ఆ. 1 పద్యము 13.)

అనుపద్యముచేఁ దెల్లం బగు. ఇట్టి ప్రశంసకు నిస్సంశయముగా శ్రీనాథుఁడు పాత్రుఁడనుట కితనిగ్రంథములు నిదర్శనములై యున్నవి.

ఆంధ్రభాషయందుఁ బ్రబంధశైలికి మార్గదర్శి యెఱ్ఱాప్రెగ్గడ యని చెప్ప నొప్పు. అతఁడు లక్ష్మీనృసింహపురాణమును

రచియించి ప్రబంధపరమేశ్వరుఁ డనుబిరుదుఁ గాంచెను. అల్లసానిపెద్దనార్యునికిఁ గృష్ణదేవరాయ లాంధ్రకవితాపితా మహుఁడనుబిరుదు నొసంగెఁ గదా! ఒక్క మనుచరిత్రమునకే నిరవధికానందంబంది యట్టిగొప్పబిరుదు నొసంగినయమ్మేదినీ రమణుని యాస్థానంబున శ్రీనాథుఁ డుండి మనుచరిత్రకంటె నెల్లవిధంబులను మేలనం దగుశృంగారనైషధము, హరవిలా సము, భీమేశ్వరపురాణము, కాశీఖండము లోనగుమహాగ్రం థముల నతని కంకితము చేసి యుండినచో నిమ్మహాకవి వరేణ్యున కమ్మహీపతివరేణ్యుం డెట్టిబిరుదు నొసంగియుండునో యెఱుంగరాదు. నిక్కము పరికింప శ్రీనాథుఁడె యాంధ్రభా షను బ్రబంధశైలిని విస్తరించి పోషించియున్నవాఁడని యొప్పుకొనక తప్పదు. కావుననే రామరాజభూషణుఁడు

---

మ. "మహిమున్వాగనుశాసనుండుసృజియింపంగుండలీంద్రుండు
తన్మహనీయస్థితిమూలమైనిలువ శ్రీనాథుండు ప్రోవ న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువా
టించునీ, బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగ
ల్భ్య మూహించెదన్." (వసుచరిత్రము ఆ. 1.)

అని శ్రీనాథుని వినుతించి యున్నవాఁడు.

అల్లసానిపెద్దన తనశైలికి శ్రీనాథునిశైలి నూఁతకొమ్మ గాఁ జేకొని యున్నవాఁ డనుట పండితలోకవిదితము. అట్టు లయ్యుఁ బెద్దన తనకావ్యంబున శ్రీనాథునిపేరైన నుడువమి కరంబు విచారకరంబు.

ఇమ్మహాకవిశార్దూలంబున కల్లయవేమభూపాలుఁడు కవి సార్వభౌముఁ డనుబిరుదు నొసఁగినట్లు

శా. "ఈక్షోణిన్నినుఁ బోలుసత్కవులు లేరీనాఁటికాలంబునన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించుంగవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్."

(కాశీఖండము ఆ. 1 పద్యము 14.)

అనుపద్యమువలనఁ దెలియవచ్చెడు.

సకలవిద్యాసనాథుఁ డని యొకబిరుదు నైషధంబున గద్యములోఁ గానంబడియెడి. అది మహీపతు లెవరేని యొసంగినదియో స్వయముగాఁ గవి కల్పించినదియో నిర్ణయింపఁజాలకుండెడు.

ఇతనికావ్యంబు లన్నియు స్తుత్యనీయంబు లేయైనను రచనాచమత్కృతియందును బదసారళ్యమునందును బ్రౌఢిమోల్లసనంబునందును గాశీఖండము తక్కినవాని కన్న మిన్న యని తోఁచుచున్నది. సంస్కృతమునఁ గాశీఖండము నతిప్రౌఢము గావునఁ 'గాశీఖండమయఃపిండ' మ్మని పండితులు వక్కాణింతురు. శ్రీనాథకృతకాశీఖండమును నిట్టిదే యని చెప్పఁదగియున్నది.

ఇతఁడు సకలశాస్త్రనిష్ణాతుఁడును మహాశివభక్తుఁడును బరమపుణ్యుఁడునునగును త్తమవిప్రుండుగానిపామరులనుకొనునట్లు కామకేళీపరతంత్రుఁ డగుదుర్వృత్తుండు కానోపఁ డని యితనిగ్రంథంబులఁ జదువువారికిఁ దెల్లంబు గాక మానదు.

ఇమ్మహాకవిసార్వభౌమునిచరిత్రంబును గుఱించియుఁ గబ్బంబులఁ గూర్చియు నెంతయేని విస్తరించి వ్రాయవలసియున్నను వాని నచిరకాలంబుననే యొండొకచో వ్రాయం దలంచి యింతటితో దీనిని విరమించితి.

1-2-1917.

నాగపూడి కుప్పుసామయ్య.

# శ్రీ కాశీఖండము

## పీఠిక.

### ఇష్టదేవతాప్రార్థనాదికము.

శా. శ్రీకాశీనగరాధిరాజ్యపదవీసింహాసనాధ్యాసి లో
కైకగ్రామణి విశ్వనాథుఁడు విశాలాక్షీమనోభర్త సు
శ్లోకుం దొడ్డయయల్లభూవరతనూజుఁ వీరభద్రేశ్వర
క్ష్మాకాంతుంజగనొబ్బగండని మహైశ్వర్యాన్వితుం జేయుఁ తన్.

సీ. కంఠాగ్రకరిరాజు డుంఠివిఘ్నేశుండు
వడఁకుగుబ్బలికూఁతుకొడుకుకుఱ్ఱ
యాకాశమండలం బనునల్లకలుపకు
నకరు వాద్యుండు లోలార్కమూర్తి
గోపాలభామలగుబ్బచన్నులమెచ్చు
గీర్వాణవంద్యుండు కేశవుండు
కట్టి ప్రీడాశూన్యకటి గోపురద్వార
పరిరక్షకుఁడు కాలభైరవుండు

తే. కాలకంఠునిశిరసుపూ గగనగంగ
కాశికాక్షేత్రమున కేడుగడయు నైన
యిందఱును నిత్తు రెల్లప్పు డీప్సితమ్ము
లల్లభూపాలు వీరభద్రాధిపునకు. 2

సీ. కబరికాభారంబు గైఁ పెక్కి విరులతో
నవటుభాగంబుపై నత్తమిల్ల

నలఁతి లేఁజెమటచే నసలుకొన్న లలాట
కుంకుమంబునఁ జిన్ని కురులు మునుఁగఁ
బసిఁడికుండలఁ బోలుపాలిండ్లభరమున
సన్నపుఁగౌఁదీఁగె జలదరింపఁ
దరళతాటంకరత్నప్రభారింఛోళి
గండస్థలంబులఁ గౌఁగిలింపఁ
తే. గాశికారామకల్పవృక్షములనీడఁ
గుతపవేళలయందు నాఁకొన్నవారి
కమృతదివ్యాన్న మిడువిశాలాక్షి గౌరి
శాశ్వతైశ్వర్యములు కృతిస్వామి కొసఁగు. 3
ఉ. పాయక నిర్నిరోధనిరపాయసమగ్రకృపాగుణైకపా
రాయణతావిలాసము తిరంబుగ నంబుజసూతి వీరనా
రాయణు దానవైభవధురంధరు సంగరసవ్యసాచి దీ
ర్ఘాయురుపేతుఁ జేయుత నృపాగ్రణినల్లయవీరభద్రునిన్. 4
తే. కంఠపట్టిక నోంకారఘంట మొరయఁ
జెలఁగుఁ గావుత మన్నగక్షేత్రసీమఁ
గవికుటుంబంబుపాలిటి దివిజసురభి
జలజసంభవుబోటి భాషావధూటి. 5
వ. అని సముచితప్రకారంబునఁ బూజ్యపూజాతత్పరుండ నై
యొక్కనాఁ డాత్మగతంబున నిట్లని వితర్కించితి. 6
సీ. చిన్నారిపొన్నారిచిఱుతకూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నొడివితి

సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకునిమహిమఁ
తే. బ్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మనుమహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టకవిని. 7
ఉ. స్కాందపురాణసంహితకు ఖండము లేఁబది యందులోన నా
నందవనానుభావకథనంబున శ్రోతకు వక్తకుం శుభా
నందపరంపరావహము నైజగుణం బగుఁ గాశిఖండ మా
కందువ యే నెఱింగిసమకట్టితిఁ గావ్యముఁగా నొనర్పఁగాన్.
వ. ఇమ్మహాప్రబంధప్రారంభంబుఁ గర్ణాకర్ణికావశంబున నాక
ర్ణించి కర్ణాంతవిశ్రాంతవిశాలనేత్రుండును, బంటవంశకమల
మిత్త్రుండును, నశ్రాంతవిశ్రాణన క్రీడాపరాయణుండును,
వీరనారాయణుండును, నిత్యసత్యుండును, బల్లవాది
త్యుండును, భూభువనభారభరణదీక్షాదక్షదక్షిణ భుజా
భుజంగుండును, రాయవేశ్యాభుజంగుండును, గీర్తిగంగా
తరంగిణీప్రవాహపవిత్రితస్వర్గమర్త్యపాతాళుండును, జగ
ద్గోపాలుండును, విమలధర్మశీలుండును నగునల్లయవీరభద్ర
భూపాలుం డొక్కనాఁడు. 9
సీ. త్రైలోక్యవిజయాభిధంబైనసౌధంబు
చంద్రశాలాప్రదేశంబునందు
సచివసైన్యాధీశసామంతనృపవర
సీమంతినీజనశ్రేణి గొలువ

శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు
విద్వత్కవీంద్రులు విస్తరింపఁ
గర్పూరకస్తూరికాసంకుమదగంధ
సారసౌరభము దిక్పూరితముగ
తే. నిజభుజావిక్రమంబున నిఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరునియంక మాశ్రయించి
నిండుకొలువుండెఁ గన్నులపండువుగను. 10

వ. అప్పుడు నన్నుం బిలువంబంచి సముచితాసనంబునం గూ
ర్చుండ నియమించి యున్నయవసరంబున. 11

తే. రాయవేశ్యాభుజంగ సంగ్రామపార్థ
గాయగోవాళ వేమనక్ష్మావరుండు
గూర్మియనుజన్ముహృదయంబుఁగోర్కె రెట్టెఁగి
యర్థి ననుఁ జూచి యిట్లని యానతిచ్చె. 12

సీ. వచియింతు వేములవాడభీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని శేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు
తే. నైషధాదిమహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ!

యిపుడు చెప్పఁ దొడంగిన యీప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్యపేర. 13

శా. ఈక్షోణిన్నినుఁ బోలుసత్కవులు లే రీనేఁటికాలంబునన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించన్ గవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్.

వ. అని యనంతరంబ కర్పూరవసంతరాయండు వీరభద్రేశ్వ
రుండు కర్పూరతాంబూలసహితంబుగా జాంబూనదాంబ
రాభరణంబు లిచ్చినం బరిగ్రహించి. 15

సీ. ఆంధ్రక్షమామండలాఖండలుం డైన
వేమభూపతికృపావీక్షణంబు
ఘోడెరాయాంకసద్గుణరాజభీమేశ్వ
రస్వామిపదసమారాధనంబు
కమలాద్రినిలయమార్కండేయశివమౌళి
చంద్రాంశునవసుధాసారధార
వేదాద్రినరసింహవిపులవక్షస్థ్సలీ
కల్హారమాలికాగంధలహరి

తే. గారణంబులు నుద్బోధకములు గాఁగ
సంభవించిన సాహిత్యసౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభునిఁ జేసి
కాశికాఖండముఁ దెనుంగుఁగా నొనర్తు. 16

తే. కలిగెఁ బదియాఱువన్నె బంగారమునకుఁ
బద్మరాగంబుతోడి సంపర్కలబ్ధి
కాశికాఖండ మనుమహాగ్రంథమునకు
నాయకుఁడు వీరభద్రభూనాథుఁ డగుట. 17

వ. అని తన్మహాప్రబంధకల్పనాకుతూహలాయత్తచిత్తుండ నై.

సీ. బాదరాయణుపాదపద్మంబులకు మ్రొక్కి
ప్రాచేతసుని మనఃపదవి నిలిపి
భట్టబాణమయూరభవభూతిశివభద్ర
కాళిదాసుల మహాకవులఁ గొలిచి
రాజశేఖరుని భారవి మాఘుఁ గీర్తించి
ప్రవరసేనుని దండి భాసుఁ దలఁచి
హర్ష బిల్హణుని మల్హణుఁ జోరుఁ గొనియాడి
క్షేమేంద్రు వేడుకఁ జిత్తగించి

తే. శబ్దశాసను నన్నపాచార్యుఁ దలఁచి
సత్కవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి
సత్ప్రబంధమహేశ్వరు శంభుదాసు
నధికతరభక్తిసంయుక్తి నాదరించి. 19

తే. మత్పితామహుఁ గవిపితామహునిఁ దలఁతుఁ
గలితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందనమందారసదృశకీర్తి
సరససాహిత్యసామ్రాజ్యచక్రవర్తి. 20

వ. అని యనంతరంబ కృతీశ్వరు వంశం బభివర్ణించెద. 21

### కృతిపతివంశవర్ణనము.

సీ. కలశాబ్ధికన్యకాకరపల్లవద్వయీ
సంవాహనక్రియాసముచితంబు
నిఖిలవేదాంతవాణీవధూధమ్మిల్ల
బహుళపుష్పామోదభావితంబు

ప్రణతనానాసుపర్వకిరీటసంఘాత
రత్నాంశురాజినీరాజితంబు
సనకాదిసన్మునీశ్వరమనోమంటపా
భ్యంతరరత్నదీపాంకురంబు
తే. పతగకేతను శ్రీపాదపంకజంబు
గారణంబుగ జన్మించె భూరిమహిమ
గంగసైదోడు రిపుకోటిగళముతాడు
నాలుగవజాతి సమధికోన్నతవిభూతి. 22

శా. ఆవర్ణంబున నుద్భవించి గుణరత్నార్ణోనిధానంబు శ్రీ
దూపూరం బెరుమాళ్లు రెడ్డియభివృద్ధుల్గాం చెమృత్యుంజయ
గ్రీవాక్ష్వేళకలంకపంకహరణక్రీడాకళాగర్విత
ద్యావాపృథ్వ్యవకాశపేశలయశోధారానభస్సింధువై. 23

తే. అతనియర్ధాంగలక్ష్మి శ్రీయన్నమాంబ
గాంచెఁ దనయుల నర్థార్థికల్పతరుల
నల్లయాధీశ పెదకోట యన్నప్రోల
దొడ్డయేశ్వర పినకోటరెడ్డివిభుల. 24

సీ. అవనిభారధురీణతాధరీకృతమహా
క్రోడప్రధానుఁ డల్లాడనృపతి
ఘాటీసమాటీకనాటోపవిధ్వస్త
కుటిలాహితుఁడు పెదకోటశౌరి
పంటాన్వయక్షీరపాథోధిసంపూర్ణ
పూర్ణిమావిధుఁ డన్నప్రోలవిభుఁడు
ప్రోద్దామసుప్రతాపోదయవ్యతికర
స్ఫాయాధికుండు దొడ్డాయరెడ్డి

తే. హాటకాచలధీరుండు మేటిబిరుదు
పాటి కలవాఁడు కరహాటలాటచోళ
కాశకర్ణాటదేశరాట్కటకసుకవి
కోటినుతకీర్తి శ్రీపిన్నకోటరెడ్డి. 25

తే. పంటకులరాజు దొడ్డభూపాలునకును
బరమకల్యాణి యన్నమాంబకును సుతులు
ప్రోలభూపతియును గోట భూపతియును
భువననుతకీర్తి యల్లాడభూపతియును. 26

వ. అందు. 27

సీ. కుటిలారిరాట్కంఠకుహరాంతములఁ గాని
క్రీడింపనీఁడు కౌక్షేయకాహి
హరిదంతసౌధశృంగాగ్రవీథులఁ గాని
తిలకింపనీఁడు కీర్తిధ్వజంబు
నాశ్రితబంధుమిత్త్రారామములఁ గాని
సాగనీఁడు కృపావసంతలక్ష్మి
హరిణభృన్మూర్ధసుచరణాబ్జములఁగాని
మరుగనీఁడు నిజాత్మమధులిహంబుఁ

తే. బ్రళయసంరంభశుంభదారభటిపటిమ
భయదఫాలాక్షభావసంభవదభంగ
దహనమహనీయదివ్యప్రతాపవిసర
దసమజయహారి దొడ్డయయల్లశౌరి. 28

మ. జయధాటీసమయంబులన్ విలయజంఘామారుతాడంబర
స్మయహారిప్రవిజృంభమాణఘననిస్సాణోగ్ర భేరీస్వనం
బయి యొడ్డాడి భయంకరోడ్డమరశౌర్యం బైన శ్రీ రెడ్డిదొ
డ్డయయల్లాడనృపాలువాలునకు బిట్టల్లాడు దిక్చక్రముల్.

మ. లలితాహంకృతి దొడ్డభూవరునియల్లాడక్ష్మమానాథు నా
జుల మార్కొన్నవిరోధిరాజు లమరస్తుత్యప్రతాపప్రభా
కలితశ్రీయుతులై సుఖింతు రెలమిం గల్యాణశైలంబుపైఁ
గలధౌతామలహర్మ్యరేఖలమరుత్కాంతాకుచాగ్రంబులన్.
మ. అనవేమక్షితిపాలుపౌత్రి యగువేమాంబామహాదేవికిన్
ఘనుఁ డయ్యల్లడభూమిపాలునకు సంగ్రామస్థలీగాండివుల్
తనయుల్వేమవిభుండు వీరవసుధాధ్యక్షుండు దొడ్డప్రభుం
డనునన్నయ్యయుబాహువిక్రమకళాటోపప్రతాపోద్ధతుల్.
వ. అందగ్రజుండు. 32
మ. కొనియెం గంచుకముల్ సముద్భటనటద్ఘోటీభటప్రౌఢిఁ గై
కొనియె న్వేడుకఁ జీడికోట యహితక్షోణీశు లల్లాడఁ జే
కొనియె న్నాకపరంబు వీఁక మదవద్ఘోరారిసంహారి యై
ఘనుఁ డల్లాడమహీశువేమన నిరాఘాటైకథాటీగతిన్. 33
సీ. సప్తమాడియరాయచంద్రబింబాననా
చికురవల్లరులపైఁ జిన్నిపువ్వు
ఝూడెజంతురాన్నటిజననాథశుద్ధాంత
కుచకుంభములమీఁది కుంకుమంబు
బారహదొంతిభూపాలలీలావతీ
గండస్థలంబులఁ గలికినవ్వు
కలువపల్లొడ్డాదికటకాధిపతివధూ
సీమంతవీథులఁ జేరుచుక్క
తే. యల్లడాధీశవేమక్ష్మనాథినాథ
భూరినిష్ఠురథాటీవిహారచటుల
సైన్యనాసీరతుక్ఖారశఫపుటోత్థ
వింధ్యపార్శ్వవసుంధరావిపులధూళి. 34

సీ. పండువాసులతాని పావడంబిచ్చిన
భద్రేభములు వీథిఁ బాళె ముందు
నొడ్డెధాత్రీనాథుఁ డుపదఁ బుత్తెంచిన
బింబారుణోష్ఠి సంబెళ వహించుఁ
గర్ణాటభూపతి కానుక యనిపిన
ముక్తాతపత్త్రంబు మ్రోల మెఱయు
యవనాధిపతి యుపాయనముగా నొసఁగిన
పాగాహయంబులు వాగె పచ్చు
తే. దూర మంతంత బారహాదొంతిమన్నె
సప్తమాడియరాజన్యసమితి మ్రొక్కు
రాయవేశ్యాభుజంగసంగ్రామపార్థ
గాయగోవాళవేమనత్మాధవునకు. 35

క. చటులత నల్లయవేమన
పటుధాటీవిజయభేరిభాంకృతు లెనయుఁ
గిటిసామజహరిసమధిక
కటుకంఠగభీరకుహరకహకహరవమున్. 36

సీ. ధరియింప నేర్చిరి దర్భ వెట్టెడు వ్రేళ్ల
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగమట్టియమీఁదఁ
గస్తూరికాపుండ్రకములు నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబుల మ్రోలఁ
దారహారములు ముత్యాలసరులు
చెరువంగ నేర్చిరి శిఖలనెన్నడుములఁ
గమ్మనిక్రొత్త చెంగల్వవిరులు

తే. ధామముల వెండి పైఁడియుఁ దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు
వేమభూపాలుఁ డనుజన్ము వీరభద్రు
ధాత్రి నేలింప గౌతమీతటమునందు. 37

తే. ప్రకటశాఖోపశాఖలఁ బంటవంశ
ముద్ధరించిన వేమేంద్రుఁ డుదయ వేళ
శివు విశాఖునిఁ దండ్రిఁ బూజించు భక్తి
లలితబిల్వత్రిశాఖపలాశసమితి. 38

సీ. త్ర్యంబకాచలకన్యకాంబుపూరంబున
నఘమర్షణస్నాన మాచరించి
నిద్దమైన మడుంగునీర్కావిదోవతి
కనకమేఖలతోడఁ గటి ఘటించి
మూలమంత్రాక్షరంబుల భూతి మంత్రించి
పుండ్రకంబులు ఫాలమున ధరించి
క్రొత్తముత్తెములతో రుద్రాక్షమాలిక
లష్టోత్తరశతంబు లఱుతఁ దాల్చి

తే. పుండరీకాజినమునఁ గూర్చుండి శంభు
నర్చనముఁ జేయునపుడు మహాప్రమథుఁడు
చాల నొప్పారు రెండవశంభునట్లు
వీరనారాయణుఁడు రెడ్డి వేమవిభుఁడు. 39

శా. చంచల్లీలల హస్తకంకణమణిచ్ఛాయ ల్విసాళింపఁ బూ
జించు న్వేమమహీవిభుండు నవరాజీవంబులం గల్వలన్
బ్రాంచత్కాంచనపుష్ప కేసరములం బ్రాసాదపంచాక్షరిన్
మంచుంగొండయనుంగుఁ బెండ్లికొడుకున్ మధ్యాహ్నకా
లంబునన్. 40

వ. తదనుసంభవుండు. 41

ఉ. రాజశశాంకశేఖరుఁడు రాజకిరీటవతంస మష్టది
గ్రాజమనోభయంకరుఁడు రాజులదేవర రాజరాజు శ్రీ
రాజమహేంద్రభూభువనరాజ్యరమారమణీమనోహరుం
డాజిఁ గిరీటి కీర్తినిధి యల్లయవీరనరేంద్రుఁ డున్నతిన్.

మ. మనుతుల్యుం డగుకాటభూపరుని వేమక్ష్మాతలాధీశునం
దనఁబాణిగ్రహణంబుచేసెఁ బ్రియమొందన్ వీరభద్రేశ్వరుం
డనతల్లి న్వనితామతల్లి నుదయాస్త్రాద్రీంద్రసీమావనీ
ఘనసామ్రాజ్యసమర్థసుప్రథిమసాక్షాదిందిరాదేవతన్. 4

తే. అట్టియనతల్లి పుణ్యగుణాభిరామ
దనకుఁ బట్టంపుదేవిగా ధన్యలీల
వసుధయెల్ల నేకాతపవారణముగ
నేలు నల్లయవీరభద్రేశ్వరుండు. 4

సీ. మకరకుండలవజ్రమాణిక్యదీప్తులు
చెక్కుటద్దములపై జీరువాఱ
డాకాలిగండపెండారంబుదాపున
బొమ్మలై వైరిభూభుజులు వ్రేలఁ
గలయంగ నలఁదినకస్తూరినెత్తావి
యష్టదిక్కులయందు నవఘళింప
మొగము చూచినమాత్ర మూర్ధాభిషిక్తులు
మోడ్పుఁజేతులు మస్తముల ఘటింప

తే. మెఱుఁగుఁదీఁగెలఁ బోలుభామినులు గొలువ
నిండుకొలువుండెఁ గన్నులపండు వగుచు
రాయవేశ్యాభుజంగవీరప్రతాప
విభవుఁ డల్లాడభూపతి వీరవిభుఁడు. 4

స్రగ్ధర. జంభారాతీభశోభాచకచకనిభముల్ శాంభవీయాట్టహా
సా,రంభావష్టంభరేఖారభటిలటహాముల్ రాజరాజాద్రి తే
జ, స్సంభారభ్రాంతిదంబుల్ సకలభువనదీ ప్త్యాకరంభంబుల
య్యె,జృంభించ వీరభద్రక్షితిరమణయశశ్శ్రీవధూవి
[భ్రమంబుల్.

క. ఏరీ ధరణిపు లల్లయ
వీరక్ష్మాపతికి సాటి వితరణగరిమ
థారాధరధారాధర
థారాధరవాహదానధారానిధికిన్. 47

సీ. గోదావరీపావనోదకంబుల హేమ,
కలశశతంబుల జలక మార్చు
గర్పూరకస్తూరికాకుంకుమంబులఁ
గలపంబుఁ గూర్చి శ్రీగంధ మలఁదు
సప్తగోదావరీస్వర్ణపుష్కర హేమ
సౌగంధికముల నర్చన మొనర్చు
గలధౌతపాత్రలఁ గాలాగురుచ్ఛేద
బహుళధూపంబులు బరిఢవించు
తే. వేనవేలు నివాళులు విస్తరించు
నమృతదివ్యాన్నముల నుపహార మిచ్చు
సంఘటించు నశేషోపచారములను
బ్రమథనాయకునకు వీరభద్రనృపతి. 48

చ. విలసితకీర్తిశాలి యగువీరమహేశ్వరు * దేహారంబు శ్రీ
నిలయమునం ద్రిసంధ్యమును నిర్మలసౌధసువర్ణజాలకం
బుల వెడలుం గిరీశగళమూలహాలాహలకాంతిఁ బోలి గు
గ్గులుమహిసాక్షివాసనలగ్రొవ్వినమంగళధూపధూమముల్.

* అన్నిమాతృకలలో నిట్లె యున్నది. అర్థము చింత్యము.

ఉ. ఈశ్వరుఁ డింటివేల్పు జగదేకగురుం డగుఘోడెరాయ
మేశ్వరుఁ డాత్మవంశగురుఁడీగులు నిత్యవినోదకృత్యముల్
శాశ్వతధర్మకీర్తులు దలంపఁగ నమ్మినసొమ్ము లాదిగ
ర్భేశ్వరుఁ డంట నైజ మెనయే నృపు లల్లయవీరశౌరికిన్

సీ. తెంచు నెవ్వని హేతి దృప్తారినరవర
గైగ్రివేయపరిలసత్కంధరముల
ముంచు నెవ్వనికీర్తి ముగ్ధేందుధరకంఠ
కాకోలవిషమషీ కాళిమంబుఁ
బెంచు నెవ్వనిబుద్ధి పంచాస్త్రపరిపంథి
పాదపాథోజతాత్పర్యచర్య
మించు నెవ్వనిమూర్తి మీనచిహ్నజయంత
నలనలకూబరాదుల జయించి

తే. యతఁడు వాగడొందు రాయవేశ్యాభుజంగుఁ
డవధిమహీధరచరమగాఢాంధకార
ఘట్టఘట్టనపటుప్రతాపతపనుఁ
డల్లనరనాథుదొడ్డభూవల్లభుండు.

శా. ఔరా! యల్లయరెడ్డిదొడ్డవసుధాధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతిఘోరఘోషమున నిర్భేదించె నొడ్డాది శృం
గారంకోటయు లోఁతగడ్తయును నుద్ఘాటించె నత్యుద్ధలీ
క్షీరాంభోధితటంబునన్నిలిపె దిక్సీమాజయస్తంభముల్

మ. హరి దాఁటించెఁ బురోపకంఠమున వాహ్యాళిప్రదేశంబునన్
దరుదే యల్లయరెడ్డినందనుఁడు దొడ్డయ్యక్షమాధీశ్వరుం
డిరువైనాలుగుమూళ్ల మేర యనుగో సెక్కింపఁగా నేలయ
ద్ధరణీనాథునికీర్తి దాఁటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండమున్.

మ. సరిలే రీజలరాశివేష్టితమహీచక్రంబున న్విక్రమా
పరగాండీవికిఁ జక్రవాళమహిభృత్పర్యంతవిశ్వంభరో
ద్ధరణప్రౌఢభుజాభుజంగమున కుర్వీధాత్రీశు లల్లాడభూ
వరున న్యయ్యకకుంఠవాఙ్మయకళావైకుంఠరాట్సయ్యకున్.

సీ. జిష్ణువైభవరేఖఁ జెలువొందుటయుఁ గాక
పావకవిస్ఫూర్తిఁ బరఁగు టెట్లు
ధర్మరాజవిభూతి దర్పించుటయుఁ గాక
పుణ్యజనోపాఖ్యఁ బూను టెట్లు
మహిఁ బ్రచేతోరీతి మహిమఁ దాల్చుటఁ గాక
తగ జగత్ప్రాణాఖ్యఁ దాల్చు టెట్లు
ధనదత్వవిఖ్యాతి ఘనత నొందుటఁ గాక
శంకరసుషమచే జరగు టెట్లు

తే. తెలిసి దిక్పాలకాంశావతీర్ణుఁ డగుట
భోగమున శుద్ధి సూనృతమున జయమున
నాజ్ఞ బలమున ధనమున నధికకరుణ
నల్లభూపాలనందనుఁ డన్నవిభుఁడు. 55

ఉ. వల్లకిచక్కికాహళముఢక్కహుడుక్కఝర్ఝరుల్
ఝల్లరి యాదిగాఁ గలుగుశబ్దపరంపర తాళశబ్దమై
యుల్లసిలం బ్రబంధముల కొప్పుగ నాడుదు రగ్రవేదిపైఁ
బల్లవపాణు లీశ్వరునిఁ బంటమహీశులు పూజసేయఁగన్.

శా. మార్కండేయమహేశ్వరుం డఖిలసామ్రాజ్యంబు బాలింప
గా, నర్కేందుల్గలయంతకాలము తదీయాంఘ్రిద్వయీభక్తి
సం, పర్కోదంచితభాగ్యసంపదల నాత్మోమండలీవల్లభుల్
కోర్కుల్మిండఁగ సేవకత్వమునఁ గైకొంద్రాయు రైశ్వర్యముల్

సీ. ఉండు నేవీట మార్కండేయమునినాథ
సజ్జలింగ మనంగశాసనుండు
ప్రవహించు నేవీటిపశ్చిమప్రాకార
మొరసి గంగమ్మ సాగరముకొమ్మ
యావిర్భవించినాఁ డేవీటికోటలో
బలభేది మదనగోపాలమూర్తి
పాలించు నేవీటిప్రాగుదక్కోణంబు
నుమబోటి శ్రీముల్లగూరిశక్తి

తే. ప్రబలధారాసురత్రాణభద్రజాతి
కరిఘటాసైన్యదుస్సాధతనకలోహ
గోపురద్వారక వాటప్రదీపిత మతి
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

మ.*కలపుంస్కోకిలకంఠకోమలకుహూకారస్ఫురత్పంచమ
స్ఖలదధ్వన్యములైన కాలముల మార్కండేయనాథేశ్వరు
లలితక్రీడల వీరభూపతి వసంతం బార్చు నవ్వీటివీ
థులఁ గర్పూరహిమాంబుసంకుమదకస్తూరీపటీరంబులన్.

ఉ. ప్రాకటవిక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
నేకసితాతపత్త్రమున నేలెను వీరనృపాలుఁ డుత్తమ
శ్లోకుఁడు వేమశౌరియనుజుండు సమున్నతవైభవాఢ్యుఁడై
చీఁకటియుర్గ గళింగయునుజిల్కసముద్రముసింహశైలమున్

* ఈ పద్యము కొన్నిప్రతులలోఁ గనుపట్టదు.

## షష్ఠ్యంతములు.

క. ఈదృశగుణగణనిధికిని
వేదార్థకవిత్వతత్త్వవిధివిత్పటిక్ష్మా
త్మాదివిజకవిజనాశీ
ర్వాదప్రాగీయమానవైభవనిధికిన్. 61

క. తురికాకరబేతాళున
కరిభయదభుజాపరాక్రమాభీలునకున్
శరణాగతమరుకేరళ
కురుభూపాలునకు జగదగోపాలునకున్. 62

క. అంభోధివలయితావని
సంభరణప్రౌఢనిజభుజార్గళయుగళీ
సంభావితకిటికచ్ఛప
కుంభీనససార్వభౌమకులకుధరునకున్. 63

క. వేమాధిపానుజునకును
రామామదనునకు ఘోడెరాయగురుశ్రీ
భీమేశ్వరశిష్యునకు
న్వేమాంబాగర్భసలిలనిధిచంద్రునకున్. 64

క. త్రైలోక్యవిజయసౌధవి
శాలమహోత్తుంగచంద్రశాలాసతత
వ్యాలోకితగౌతమక
న్యాలహరీవిరహతాండవాటోపునకున్. 65

క. అనతల్లివల్లభునకున్
గనకాద్రివినిద్రకల్పకద్రుమలీలా
వనభవనకిన్నరస్త్రీ
జనతాజేగీయమానచారిత్రునకున్. 66

క. నిర్ఘృణనిర్ఘాతస్ఫుట
నిర్ఘోషకఠోరధాటినిస్సాణమహా
దీర్ఘతరధణధణంకృతి
ఘూర్ఘట్టననిర్దళితచతుర్దిక్కునకున్. 67

క. హాటకకుభృద్ధనుర్ధర
జూటీకోటీకుటీరసుమనస్తటినీ
వ్యాటీకితోర్మిసంఘో
ద్ఘాటవచోవైఖరీజితద్రుహిణునకున్. 68

క. గజదళవిభాళబిరుదున
కజగవధరభక్తిభావితాత్మునకు సమి
ద్విజయునకు రాయవేశ్యా
భుజగునకును వీరభద్రభూపాలునకున్. 69

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కాశీ
ఖండంబు. 70



శ్రీ ర స్తు.

# ప్ర థ మా శ్వా స ము

కథాప్రారంభము.

పురాణప్రశంస.

సీ. పద్మాదికంబులు పదియు నెనిమిదియు
నాదిపురాణంబు లాపురాణ
జాతంబు నాల్గులక్షలసంఖ్యగలయది
యుపపురాణంబు లం దుద్భవించెఁ
బదునొకండవది యై బహుసంహితలతోడ
బహుఖండములతోడ బహువిచిత్ర
కథలతో నేకలక్షగ్రంథపరిమాణ
కలితమై శ్రీమహాస్కాంద మొప్పు
తే. నమ్మహాస్కాందమునకు సారాంశ మనఁగ
నాల్గుపురుషార్థములకుఁ దానక మనంగ
బ్రహ్మవిద్యకు నాదికారణ మనంగ
నఖిలఖండంబులందుఁ బ్రఖ్యాతి వడసె. 71
తే. మూఁడులక్షలఁ బదియేడు ముగిసిపోవఁ
దాఁ బ్రవర్తిల్లు లక్షగ్రంథములతోడ
సమధికస్ఫూర్తి నేపురాణములు సాటి
గరిమ కందంబునకు మహాస్కాందమునకు. 72
తే. వరుస నెనిమిది యన్యదేవతలఁ జెప్పుఁ
బదిపురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించుఁ

జంద్రమౌళిప్రభావంబు సమధికముగ
శ్రుతులయట్ల పురాణసంహితలు నొడువు. 73

తే. సరవి సర్గంబు నాఁ బ్రతిసర్గ మనఁగ
వరుసతో వంశవంశానుచరితము లనఁ
గ్రమపరిప్రాప్తి మన్వంతరము లనంగ
లలిఁ బురాణంబునకు నైదు లక్షణములు. 74

తే. గ్రంథపరిసంఖ్య నాల్గులక్షలు పురాణ
మది చతుర్దశవిద్యలయందుఁ బెద్ద
సాగు ధర్మార్థ మం దానుషంగిక మయి
యాదికాలికమందు బ్రహ్మార్థగరిమ. 75

ఉ. అట్టిదివో పురాణముమహత్త్వముసూతుఁడు వద్వదుండుగాఁ
బట్టి కనిష్ఠజన్మమునఁ బ్రాకృతుఁ డయ్యును రుద్రభావులై
నట్టిమహామునీంద్రులకు నంబుజసంభవునంతవారికిన్
దిట్టతనంబుమీఱ నుపదేశము నేయుచునుండు బ్రహ్మమున్.

## నైమిశశబ్దనిర్వచనము.

సీ. ఆది మనోమయం బగునొక్కచక్రంబుఁ
గల్పించె బ్రహ్మ జగద్ధితముగఁ
గల్పించి యాబండికలు డొల్చె సత్యలో
కంబుననుండి యాకమలగర్భుఁ
డది డొల్లి గిరివిష్టపాంతరంబులు దాఁటి
క్రమముతో భూమిచక్రమున వ్రాలె
వ్రాలి రంహస్స్ఫూర్తి వచ్చి వచ్చి ధరిత్రి
నిమ్నోన్నతుల శీర్ణ నేమి యయ్యె

తే. నేమి విరిసినకతన నన్నేలనెలవు
నైమిశంబయ్యె నదియ తా నైమిశంబుఁ

దన్మహాపుణ్యావనమున ద్వాదశాబ్ద
సత్త్రయాగంబుఁ గావించె శౌనకుండు. 77

వ. ఆసత్త్రయాగంబునందు శౌనకాదిమహామునులు సూతా న్వయసంభవుం డైనసూతు నర్చించి తన్ముఖంబునం బురాణేతిహాససంహితలు వినిరి గావున నమ్మహావిద్యాస్థానంబు సూతమునిసంవాదాత్మకంబు. 78

తే. స్కాందమునయందు నేఁబదిఖండములకు
బహుకథాసంగతులు నేయ బాగు గాదు
ఖండఖండంబులందును గలిగినట్టి
కథలపరిపాటి సంగతిగ్రహణమునకు. 79

వ. ఇమ్మహాస్కాందమ్మునకు నవయవంబు లాఱుసంహిత లవి క్రమంబున సనత్కుమారసంహిత పంచపంచాశత్సహస్రిక, సూతసంహిత షట్సహస్రిక, శాంకరసంహిత త్రింశత్సహస్రిక, వైష్ణవసంహిత పంచసహస్రిక, బ్రహ్మసంహిత త్రిసహస్రిక, సౌరసంహిత యేకసహస్రిక, ఈసంహితలయందుఁ బంచనాగరఖండంబు, గమలాలయఖండంబు, రేవాఖండంబు, నేకవీరఖండంబు, మైలారఖండంబు, గోదావరీఖండంబు లివి యాదిగాఁ గల పంచాశత్ఖండంబులందు. 80

## కాశీఖండప్రశంస

శా. ప్రాశస్త్యంబు వహించు ద్వాదశసహస్రగ్రంథసంక్లృప్తి వి
శ్వేశక్షేత్రవియన్నదీవటుకడుంఠీశాద సత్కీర్తనో
ద్దేశప్రక్రమశోభితాద్భుతకథాధిష్ఠాన మై శ్రేష్ఠ మై
కాశీఖండమఖండవైభవమునం గాస్కాందాబ్ధిమధ్యంబునన్.

వ. ఈకాశీఖండంబు వేదవ్యాససూతసంవాదాత్మకం బనియు నుం గొందఱు చెప్పుదురు. దీనికిం గథాక్రమణిక వింధ్యానా

రదసంవాదంబు, బ్రహ్మలోకప్రభావంబు, గోదానమాహాత్మ్యంబు, వారాణసియందగస్త్యాశ్రమవర్ణనంబు, మునిదేవతాసమాగమంబు, పతివ్రతాచరిత్రంబు, కుంభసంభవప్రార్థనంబు, తీర్థప్రశంస, శివశర్మోపాఖ్యానంబు, సప్తపురీప్రశంస, సంయమనీస్వరూపంబు, మహేంద్రలోకదర్శనంబు, వహ్నిసముత్పత్తి, క్రవ్యాద్వరుణసంభవంబు, గంధవత్యలకావర్ణనంబు, చంద్రలోకప్రాప్తి, యుడులోకవృత్తాంతంబు, శుక్రసముద్భవంబు, శనైశ్చరలోకవర్ణనంబు, సప్తర్షిలోకధ్రువలోకవర్ణనంబులు, కుమారాగస్త్యసంవాదంబు, మణికర్ణికాసముద్భవంబు, గంగామాహాత్మ్యంబు, భైరవావిర్భావంబు, దండపాణిజన్మంబు, కళావత్యుపాఖ్యానంబు, సదాచారంబు, బ్రహ్మచారిప్రకరణంబు, స్త్రీలక్షణంబు, కృత్యాకృత్యప్రకరణంబు, గృహస్థధర్మంబు, యోగనిరూపణంబు, కాలజ్ఞానంబు, దివోదాసవర్ణనంబు, యోగినీవర్ణనంబు, లోలార్కోత్తరార్కసాంబాదిత్యద్రుపదాదిత్యారుణాదిత్యవర్ణనంబు, దశాశ్వమేధతీర్థమాహాత్మ్యంబు, పిశాచమోచనంబు, గణేశ్వరప్రేషణంబు, గణేశ్వరమాయాప్రపంచంబు, ఢుంఠిప్రాదుర్భావంబు, విష్ణుమాయాప్రపంచంబు, దివోదాససముచ్చాటనంబు, పంచనదోత్పత్తి, బిందుమాధవసంభవంబు, వైష్ణవతీర్థమాహాత్మ్యంబు, మందరాచలంబుననుండి యిందుమౌళి కాశికాపురంబున కేతెంచుట, జైగిషవ్యోపాఖ్యానంబు, కృత్తివాససముత్పత్తి, దుర్గామాహాత్మ్యంబు, ఓంకారమాహాత్మ్యంబు, త్రిలోచనసముద్భవంబు, కేదారకేశవర్మేశమాహాత్మ్యంబులు, పతీకథ, విశ్వభుజాఖ్యానంబు, దుర్దమకథ, వీరేశ్వరాఖ్యానంబు,

కామేశ్వరవిశ్వకర్మేశ్వర సతీశ్వరామృతేశ్వరవర్ణనంబులు, వ్యాసభుజాస్తంభంబు, క్షేత్రతీర్థకదంబవర్ణనంబు,ముక్తిమంటపవర్ణనంబు, విశ్వేశావిర్భావంబు, దేవతాయాత్రావిధానంబు ననఁ బుణ్యాఖ్యానంబు లేకోత్తరశతంబునుం గలిగి.

శా. ఆశాస్యంబులు సంఘటించుచును బహూపాఖ్యానశాఖోపశాఖాశోభాసముదంచితాభ్యుదయమై స్కాందాబ్ధిసంజాతమై
యీశానుగ్రహలబ్ధముక్తిఫలమై యెక్కాలముం శ్రోతకుం
గాశీఖండ మఖండవైభవమునం గల్పద్రుమప్రక్రియన్.

వ. పూర్వఖండంబున బ్రహ్మర్షి నారదుండు తీర్థయాత్ర చరించెనని సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పి వారదుగం గాశీవృత్తాంతం బిట్లని చెప్పం దొడంగె. కృష్ణద్వైపాయనుండు ప్రియశిష్యుం డైనసూతున కనంతరకథాక్రమంబునం గాశీఖండకథాకథనప్రారంభంబున నిట్లనియె. 84

నారదుండు వింధ్యమున కేతెంచుట.

తే. ఇవ్విధంబునఁ దీర్థంబు లెల్ల నాడి
నర్మదానది నవగాహనం బొనర్పఁ
దలఁచి గోదావరీసింధుతటము పట్టి
దండకారణ్యవీథిమధ్యంబు దరిసి. 85

వ. ముందట. 86

శా. కాంచెం గాంచనగర్భసంభవుఁ డుదగ్రగ్రావకోటిస్థల
చ్చంచన్నిర్ఝరవేణికాసలిలసంజాతాబ్జసౌగంధ్యముం
బంచాస్యస్ఫుటకంఠనాదహతశుంభత్కుంభిగర్వాంధ్యముం
న్యంచద్ఘాటకభూమిభృచ్ఛిఖరగర్వావంధ్యమున్వింధ్యముం.

క. రేవాతరంగశీకర
సేవాహేవాకపాకశిశిరమరుత్పృ

స్తావపరికంప్యమానజ
టావలి యగు చతుఁడు వింధ్య మల్లనఁ జేరెన్. 88

క. తాపసకులాగ్రగణ్యా
శ్రీపాదాంభోజయుగళచిహ్నశ్రేణీ
నైపథ్యపరమపుణ్యశి
లాపట్టం బగుచు నయ్యిలాధర మొప్పున్. 89

సీ. త్రసరేణుపరిమాణధాతుధూళీపాళి
యలికంబులకు వింతచెలువు నొసఁగ
ఘన మైనరారాపుచనుదోయి రాయిడి
నిఱుపేదనడిమికి వెఱపు చూపఁ
దొలుకాఱుమెఱుఁగుఁదీఁగెల నేలుకన్నులు
వడ దాఁకి యొక్కింత వాడు పాఱ
సిందూరతిలకంబు చెమటచిత్తడిఁ దాఁకి
యలకభాగంబునం దసలుకొనఁగఁ
తే. గనకమేఖల జఘనచక్రమునఁ జాఱ
నీవిబంధంబు నాభిపై నెమ్మి వదల
మహతి ధరియించి యొకతనుమధ్య దన్ను
ననుసరించుచు గాంధర్వ మభ్యసింప. 90

## వింధ్యవర్ణనము.

సీ. కర్పూరకదళికాకాంతారపవనంబు
లధ్వనీనులశ్రాంతి నపనయింప
మదురంగఁ బండినమాలూరఫలములు
చెంచుకన్యలకుచశ్రీలఁ జెనయ
నురగవల్లీగాఢపరిరంభణంబులఁ
బోఁకమ్రాఁకులు గెంపు పొదలుకొనఁగఁ

బాటలీవకుళచంపక సౌరభముతోడ
విచికిలామోదంబు వియ్యమంద
తే. గమియ నామూలచూడంబుగా ఫలంచి
యంబరము మోచి యున్న యుదుంబరములు
లీల బ్రహ్మాండభాండమాలికలభూష
లవధరించిన వృషభాంకు ననుకరించె. 91

క. దరవికచవకుళకురవక
పరిమళసంభారలోలబంభరమాలా
పరిషజ్ఝంకారధ్వని
తెరువరులకు మన్మథప్రదీపన మొసఁగున్. 92

వ. వెండియుఁ గర్కరేటుకకీరతారరటనంబును దాత్యూహ
వ్యూహాకుహాకుహారావకోలాహలంబును గలకంఠకంఠకో
మలకుహూకారంబును మదకలకలవింకచుంకృతికారకాక
లీకలకలంబును బుంఖానుపుంఖఝిల్లీఝుంకారధారాప్రసా
రంబును సముద్ధతధ్వాంక్షనిధ్వానపాటవాటోపంబును
సముత్కటోత్కోశవాసితవ్యాపక్రోశీసంరంభసంభ్రమం
బును గోయష్టివదననిష్ఠ్యూతనిష్ఠురారావ నిష్ఠాసౌష్ఠవంబు
నుం గూడికిటిశరభగండవేదండశార్దూలసింహగవయసృ
మరచమరవాతప్రమీలులాయఖడ్గ కురంగభల్లూకఫేరవ
గోలాంగూలాదినానామృగంబులరొలుంగులతోడఁ గీడ్ప
అచి లతాకుడుంగగర్భంబులం బ్రతిశబ్దంబులావిర్భవింపం
జేయఁగిసలయముకుళకుసుమశలాటుఫలభరితం బై బిసరు
హబాంధవునికిరణవిసరంబుల సొగయనీకమసమసకనై యిరు
లసలుకొనుచు నిసుకచల్లిన రాలనిసపరుడ్రాలుగల వింధ్య

వసుంధరాధరప్రాంతకాంతారంబు దఱిసి చనువాఁడు
ముందట. 9

మ. నలినప్రోద్భవసూతి గన్గొనియె వింధ్యక్షోణిభృత్కంధరా
బలవద్గండశిలాభిఘాతవిలుఠత్పాథస్తరంగచ్ఛటా
స్ఖలనారంభవిజృంభమాణపటుఝుంకారస్ఫుటాంతర్మదన్
గలనాతత్పరభక్తలోకపరిరక్షాశర్మదన్ నర్మదన్. 9

తే. దివిజముని నర్మదానదిఁ దీర్థ మాడి
విమలభస్మంబు నిఖిలాంగకముల నలఁది
యలుత రుద్రాక్షమాల్యంబు లనువుపఱచి
భవుని నోంకారనాథునిఁ బ్రస్తుతించి. 9

వ. అప్పుడు. 9

తే. స్థావరం బైనరూపంబు జలదవీథి
నావరించుచు మొదల నున్నట్ల యుండ
జంగమం బైనరూపంబు సవదరించి
యెదురుగా వచ్చె వింధ్యమహీధరంబు. 9

తే. అతిథి గడునల్పుఁ డైన నత్యధికుఁ డైన
నింటి కేతేరఁ బ్రియ మందు నెవ్వఁ డేని
వానిగౌరవ మది గౌరవంబు గాని
కాదు గౌరవ మాకారగౌరవంబు. 9

సీ. మొగులు ముట్టినమహామూర్ధంబు ధర మోవఁ
బాదాంబుజములకుఁ బ్రణతిఁ జేసి
యంతరంగముకంటె నత్యున్నతం బైన
పృథుహేమపీఠంబు వెట్టఁ బంచి
దధ్యాజ్యమధుపుష్పదర్భాదికము లైన
యష్టాంగములతోడి యర్ఘ్య మిచ్చి

యాత్రాసముత్థితాయాసఖేదము వాయ
నంఘ్రిసంవాహనం బాచరించి
తే. శ్రాంతి దీఱుట యెఱిఁగి హస్తములు మొగిచి
వినయవినమితగాత్రుఁడై వింధ్యశిఖరి
తనగుహారంధ్రములు ప్రతిధ్వనుల నీన
వేల్పుఁదపసికి నిట్లని విన్నవించె. 99

వ. మహానుభావా! భవదీయకృపాకటాక్షవీక్షాసుధారసప్రవాహంబునరజగప్రసరంబునుద్వాదంఘ్రినఖచంద్రమండలజ్యోత్స్నాసమున్మేషణంబునం దమఃకాండంబును ఖండింపఁబడియె. ఇంతకాలంబునకుఁ బ్రాగ్జన్మకృతంబులైనసుకృతంబులు ఫలించె. విశ్వంభరాభారభరణదీక్షాధురంధరంబులగునాకులంబువసుంధరాధరంబులలోన మాన్యుండనైతి ధన్యుండ, గృతార్థుండ; భాగ్యవంతుండ. అది యట్లుండె. యుష్మత్పాదారవిందసందర్శనంబునం బ్రభవించినయానందప్రవాహం బుల్లంబున వెల్లివిరిసినకతంబున నేయర్థంబునకు నవకాశంబు లేదు. ఐనను నొక్కవిన్నపంబు సావధానమతి వై యవధరింపుము. నీకు సేవాంజలీపుటంబు. పంచాశత్కోటివిస్తీర్ణం బైనభూమండలంబునందు నీచూడనియట్టి మహీధరంబులు లేవ. కొండలు లెక్కకుఁబెక్కు కలుగుంగాకేమి? దిక్కుంజరంబులకు దిక్కై కూర్మంబునకు నర్మిలియై క్రీడాక్రోడంబునకుఁ దోడై పాఁపఱేనికిం బ్రాపై యేను బోలె నెక్కటి యీసర్వసర్వంసహాచక్రంబునుభరియింపంగలయది యే? మందరంబు మందరశ్మి, నీలంబునీలనిలయం, బస్తం బస్తవ్యస్తం, బుదయం బనభ్యుదయంబు, క్రౌంచంబకించనంబు, గంధమాదనంబు పేద, పారియాత్రం.

చేతన్మాత్రంబు, మలయదర్దురత్రికూటంబులొక పాటి
మహేంద్రనిషధద్రోణంబులు దరిద్రాణంబులు, హేమకూ
టంబుగిటగిటన, తక్కుఁజిల్లుకొండలఁ బేర్కొనం గారణ
బేమి? ఇప్పుడిప్పాట నాతోడం బ్రతిభటింపఁ గలయది సు
గరుడఖచరవిద్యాధర యక్షకిన్నరగంధర్వదర్వీకరా
యంబునుగల్పతర్వాది కానూన కామధుగ్ధేనుమండలంబు
విబుధవేదండశుండాదండచులికితోద్గీర్ణ స్వర్ణదీకాండగ
డూషితబ్రహ్మాండగోళంబును నగుసుమేరుశైలంబు. మ
యిద్దఱ తారతమ్యంబును నెఱుంగుదు. నాకు నగ్గిరికినిప్పు
గొన్ని వాసరంబులనుండి యీరసంబు పెరుఁగం గఱకు
నెట్టుకొని సాగుచున్నది. ఇంక నెట్టుందు? భట్టార
మోహంబుడిగి పక్షపాతంబు పరిత్యజించి యానతిమ్ము.

తే. అని యవష్టంభసంరంభ మతిశయిల్లఁ
బలుకుటయు నాత్మ గర్హించి నలువపట్టి
యొం డనాక యొక్కింతసే పూరకుండి
యుస్సు రనుచును వేఁడినిట్టూర్పు వుచ్చె.

వ. పదంపడి నిలింపమౌనికలహప్రియుండుగావునఁ ద్రిభువనో
ద్రవకారణంబై ననునమ్మహామహీధరసంఘర్షణంబునకు
తించి శక్తిసంధుక్షణార్థంబు వింధ్యంబున కిట్లనియె.

శా. నాతో నీ విపు డెట్టు లాడితి ప్రధానత్వం బపేక్షించి
స్ఫీతాటోపమహాప్రతాపగుణగంభీరార్థయుక్తంబుగా
నాతో నిట్లని యాడె మేరువు ప్రధానత్వం బపేక్షించి
స్ఫీతాటోపమహాప్రతాపగుణగంభీరార్థయుక్తంబుగన్.

తే. నీ వెఱుంగుదు నీలావు నిక్కువముగ
నెఱుఁగుఁ దనలావు తా నమ్మహీధరంబు

తప్పకుండ మీయిద్దఱతారతమ్య
మెంతవారును దెలియంగ నెంతవారు. 104
వ. శ్రీశైలవేంకటాహోబిలశోణాద్రిసాలగ్రామాదిపర్వతంబులు మహానుభావంబున మీయిద్దఱకంటె నధికంబులు. మీఁగర్వాలాపంబులు విని యోర్వవచ్చునే? మిమ్ము నేమనవచ్చు? హెచ్చుకుం దాళనేరక విషాదంబున నిట్టూర్పునిగుడించితి. మముఁబోఁటి తీర్థయాత్రాపారీణులకు నిది యేటిచింత? మీకు మే లయ్యెడుఁ బోయి వచ్చెద నని నారదుం డెందేనియుం జనియెఁ దదనంతరంబ. 105
తే. విబుధమునిమాట చెవిఁ గ్రొవ్వేఁడి యగు డ
వంధ్యగర్వోదయుం డైన వింధ్యశిఖరి
చాల నుద్వేగ మంది విచారపరత
నాత్మగతమునఁ దాను నిట్లనుచు నుండె. 106
తే. శాస్త్ర మాచార్యసన్నిధిఁ జదువఁ డేని
నిద్ధబోధంబు మది సంగ్రహింపఁ డేనిఁ
దెగువ మీఱి ప్రతిజ్ఞ సాధింపఁ డేని
జ్ఞాతిజయ మందఁ డేని తజ్జనుఁడు జనుఁడె? 107
ఉ. కంటికి నిద్ర వచ్చునె? సుఖం బగునే రతికేళి? జిహ్వకుఁ
వంటక మిందునే? యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబు గలయట్టిమనుష్యున కెన్నఁడేనియుఁ
గంటకుఁ డైనశాత్రవుఁ డొకండు దనంతటివాఁడు గల్గినన్.
క. ఎవ్వనితో నెచ్చోటం
జివ్వకుఁ జే సాఁపవలదు చే సాఁచినచో
నివ్వాల నవ్వాల నెవ్వరు
నవ్వక యుండంగఁ బగర నణఁగింపఁ దగున్. 109

శా. ఆచందంబున నంతరంగమున కత్యంతంబుఁ దీవ్రవ్యథా
ప్రాచుర్యంబు ఘటింపఁ జాలదతిఘోరం బైనదావానలః
బేచందంబున నంతరంగమున కి ట్లీజ్ఞాతిభూభృజ్జిగీ
షాచింతాభరమావహించునతిదుస్సాధ్యవ్యథాభారముః
సీ. భేషజం బెద్దాని భేదింపఁ జాలదు
లంఘనంబున నెద్ది లావు చెడదు
తఱిగించు బుద్ధినిద్రామహోత్సాహత్సు
థాకారతేజోబలాది నెద్ది
నాసత్యచరకధన్వంతరిప్రభృతివై
ద్యులకు నసాధ్య మై యుండు నెద్ది
దివసంబు లా తే డతిక్రమించినయప్డు
జీర్ణత్వదశ నధిష్ఠింప దెద్ది
తే. ప్రత్యహంబు నవత్వంబు వడయు నెద్ది
యట్టిచింతాజ్వరంబు న న్నలముకొనియె
నేమి సేయుదు నింక నే నెచటఁ జొత్తు
నెట్టు నిర్జింతు మేరుమహీధరంబు 11
క. ఉప్పర మెగసి యజాండము
చిప్పలు రాలంగ మేరుశిఖరంబులపైఁ
గుప్పించి దాఁటుకొందునొ
తప్పక నామనసులోని తహతహ దీఱన్. 11
ఉ. ఒక్కఁడు మాకులంబున సముద్ధతిఁ జూపిన జాతరోషఁ
తెక్కలు దెంచి వేలుపులతేఁ డటు పాపము చేసెఁ గాక యా
తెక్కలు నేఁడు గల్గిన నెఱింగి జవంబునఁ బాలు తెంచి
టెక్కనె కూటకోటితటు లెల్లను నుగ్గులు గాఁగ మేరువున్
తే. అడుసులోపలఁ దాటిపం డదిమినట్టు

లదుముదునె కాని పాతాళ మంటికొనఁగ
వేల్పు లెల్లను విభ్రాంతి విహ్వలింపఁ
బాదముల మెట్టి నాదాయఁ బసిఁడికొండ. 114
శా. ఈయైశ్వర్యముఁజూడఁ జాలుదునె నే నిప్పాట నానాఁటికి
న్రే యిందుగ్రహతారకంబులు పగల్ నీరేరుహాప్తుండు నే
వాయోగంబు మెయిన్ బ్రదక్షిణముగావర్తిల్లఁగానిర్భరా
సూయామానపరీతచేతసుఁడనై శూన్యోద్యమప్రక్రియన్.
తే. అడ్డపెట్టెదఁ గాక తీవ్రాంశురథము
ప్రహరిఁ దిరుగక యుండంగ ఘర్మగిరికిఁ
దరతరంబ యజాండకర్పరము దాఁక
ఘనశిరశ్శృంగశృంగాటకములు పెంచి. 116
వ. అని యవష్టంభసంరంభంబున. 117
మ. అవరోధించెనువింధ్యభూధరముబ్రహ్మాధ్వంబుదర్పోద్ధుర
వ్యవసాయోద్భటరౌద్రభంగినురులింగాకారుఁడై యాశ్వ
డవరోధించినగర్వరేఖ బలిదైత్యధ్వంసి నారాయణుం[రుం
డవరోధించినదేవమూర్ధమొగినూర్ధ్వాండంబుతోరాయఁగ
తే. మేదినీధర మిబ్భంగి మిన్ను ముట్టి [న్
నిట్టనిలుచుండి చూచె నిర్నిమిషదృష్టిఁ
దనయనుష్ఠానకాలంబుఁ దప్పకుండు
బ్రాహ్మణుఁడు తేపకడఁ బోలె భానుపాదుపు. 119
వ. * అంత. 120

సూర్యోదయవర్ణనము.

సీ. చిలుసానఁ బట్టించి చికిలి సేయించిన
గండ్రగొడ్డలి నిశాగహనలతకుఁ

* ఇప్పద్యది కొన్ని మాతృకలలో లేదు.

గార్కొన్న నిబిడాంధకారధారాచ్ఛటా
సత్త్రవాటికి వీతిహోత్రజిహ్వా
నక్షత్రకుముదకాననము గిల్లెడుబోటి
ప్రాచి నెత్తినహస్తపల్లవాగ్ర
మరసి మింటికి మంటి కైక్యసందేహంబుఁ
బరిహరింపంగఁ బాల్పడ్డ యవధి
తే. సృష్టికట్టెట్టు తొలుసంజచెలిమికాఁడు
కుంటు వినతామహాదేవికొడుకుఁగుట్టు
సవితృసారథి కట్టెట్టుచాయఁ దెలుప
నరుణుఁ డుదయించెఁ బ్రాగ్దిశాభ్యంతరమున. 12

సీ. ప్రాలేయకిరణబింబంబు వెల్వెలఁ బాఱి
యస్తాచలంబుపై నస్తమిల్ల
వరుసతో నోషధీవల్లీమతల్లులు
కాంతివైభవలక్ష్మికచ్చువదల
రవికాంతపాషాణరత్నంబులం దుబ్బి
యగ్ని ప్రత్యుత్థాన మాచరింపఁ
బ్రబలాంధకారధారాచ్ఛటాపటలంబు
పంచబంగాళ మై పాఱిపోవ
తే. నుదయపర్వతకటకగండోపలములఁ
బక్షమూలచ్ఛిదావ్రణప్రభవ మైన
నెత్తు రనియెడువిచికిత్స నివ్వటిల్ల
భానుకిరణంబు లొక్కకొన్ని ప్రాఁకె నభము. 122

సీ. తఱిపివెన్నెలలోని ధావళ్య మొకకొండ
నవసుధాకర్దమద్రవము గాఁగఁ

జిన్నారిపొన్నారి చిఱుతచీఁకటిచాయ
యసలుకొల్పినమషీరసము గాఁగ
నిద్రమేల్కాంచిన నెత్తమ్మిమొగడల
పరువంపుఁబుప్పొళ్లు హరిదళము గాఁ
దొగరువన్నియ లేఁతతొలుసంజకెంజాయ
కమనీయధాతురాగంబు గాఁగ
తే. వర్ణములు గూడి యామినీవ్యపగమమున
జగము చిత్రింపఁ దూలికచంద మైనఁ
గొమరుఁబ్రాయంపునూనూఁగుఁగొదమయెండ
ప్రాచి కభినవమాణిక్యపదక మయ్యె. 123
తే. ప్రాగ్దిశాకాంతనిండుగర్భంబునందు
సూర్యుఁ డుదయింపఁ బ్రొద్దులు చొచ్చి యుండ
మొదలఁ దీండ్రించు లేఁతక్రొమ్మొలకయెండ
నింగి యింగిలికాన నభ్యంగ మాఱ్చె. 124
చ. కమలము లుల్లసిల్ల రవికాంతశిలాధమనీలతాసహ
స్రములఁ గృపీటసంభవుఁడు రాజఁగఁ జీఁకటియారుసోరు
గా, గుముదము నిద్రవోఁ బొడుపుఁగొండపయిన్ రవి
యొప్పెఁ జూడఁగా, సమధికలీల నింద్రునిహజారపు
మేడకుఁ బైఁడికుండ యై. 125
సీ. చరమరింఖాపుటాంచలటంకశిఖరంబు
లుదయాద్రిచటి జాఱకుండ మోపి
తీఁగ సాఁగినభంగి దీర్ఘదీర్ఘము లైన
యంగకమ్ముల రజ్జు లలమి యెత్తి
సుత్రాసుఁ డై వెన్క కొరిగి పిచ్చుకకుంటు
విప్రతీపంబుఁ గా వినుతి సేయ

నపగతవ్యాసంగ మగుటఁ జిత్కారంబు
వెలిగాఁగఁ జక్రంబు విభ్రమింప
తే. నభ్రవీథికి లంఘించె నమ్మహాద్రి
గంధవాహ ప్రవాహాభిఘట్టనమునఁ
గేతనముమీఁదిపసిఁడికింకిణులు మొరయ
మెఱపు మెఱసినచందాన మిహిరురథము. 12

సీ. దోర్దండఘట్టనత్రుటితగ్రహగ్రావ
ధూళిపాళిమిళద్ద్యుస్థలములు
ధ్వజపటపల్లవోద్ధతమరుత్సంపాత
పరికంపమానోడుపరివృఢములు
గ్రాసాభిలాషానుగతవిధుంతుదపునః
ప్రాప్తచక్రవ్యథోపద్రవములు
శ్రాంతాశ్వనిబిడనిశ్శ్వాసధారాధుత
స్వర్ధునీనిర్ఝరజలచరములు
తే. గగనపదలంఘనైకజాంఘాలికములు
పద్మవనబాంధవునిరథప్రస్థితములు
సాఁగె నది దక్షిణాయనసమయ మగుట
దర్దురముమీఁద మలయభూధరముమీఁద. 13
తే. నడచె దుండీరదేశంబునడిమిచాయ
గగనఘంటాపథంబునఁ గమలహితుఁడు
పాండ్యభూపాలశుద్ధాంతభవనహేమ
దీర్ఘికలయందుఁ దననీడ తేజరిల్ల. 14
సీ. ఒకదీవి కేఁగొండ యుదయాద్రి గ్గై యుండు
నది యొండుదీవికి న స్తశిఖరి

యొకదీవిఁ దొలుసంజ యున్మేషమునఁ బొందు
        నుదయించు మఱుసంజ యొండుదీవి
నొకదీవి నిండుచంద్రికలు మిన్నులు ప్రాఁకు
        నొకదీవిఁ జేరెండ యుబ్బి కాయు
నొకదీవి శవణిల్లు నొకఋతుప్రారంభ
        మొకదీవి నిగురొత్తు నొండుఋతువు
తే. దక్షిణాయన మొకదీవి దళుకుఁ జూపు
నుత్తరాయణ మొకదీవి నుప్పతిల్లు
నిన్నిటికి యత్ప్రభావంబు హేతుభూత
మట్టిరవి తేరు సాఁగె లంకాద్రిమీఁద. 129
సీ. మలయాచలంబుపైఁ జిలువయిల్లాండ్రల
        ఫణరత్నములయందుఁ బ్రతిఫలించి
లంకాపురంబున శాంకరీదేవత
        మకుటేందు రేఖతో మచ్చరించి
కాంచీపురోపాంతకంపాతరంగిణీ
        నాళీకావనరాజి మేలుకనిపి
ద్రవిళసీమంతినీ స్తనమండలంబుల
        నవకంపుఁజెమరుబిందువుల నిలిపి
తే. సహ్యగిరిరాజకన్యకాజలనిధాన
సలిలహరిపరస్పరాస్ఫాలనోత్థ
కణలవాసారనీహారగంధవాహ
సంగమంబులఁ బథపరిశ్రాంతిఁ దొఱఁగి. 130
వ. ఇవ్విధంబున దక్షిణాపథంబునం జనునప్పుడు. 131
సీ. విస్ఫురమరధ్వాంతౌఘువిధ్వంసనక్రియా
        పరమదీక్షారంభగురుమయూఖ

దశశతపరిషదాధారమండలుఁ డైన
చండభానుని కధిష్ఠాన మగుట
భారంబు భరియింప బరువుపడ్డది వోలె
మూఁపుమూఁపున నుండి మొక్కలమున
ననిలంబు లేడును నంచెలంచెలు గట్టి
యాకాశవీథి నందంద నడవ

తే. నడచురవితేరు మింటిసన్నడిమిచక్కిఁ
బ్రగ్గనఁగఁ దాఁకె వింధ్యపర్వతముచలులఁ
గఠిననిర్ఘోషనిర్ఘాతఘట్టనమునఁ
బంకజాతభవాండకర్పరము వగుల. 13

క. తగులువడి యపుడు వడి సెడి
గగనమణిరథంబు దొరగలువడి నిలిచెఁ దా
బొగరుమొగకడలియక్కలిఁ
దగిలి నిలువఁబడినఘనవితతియుంబోలెన్. 1

క. ఒక్కనిమేషము రాహువు
పుక్కిటిలోఁ దగులుపడక పోయెడుభానుం
డిక్కొండ ప్రక్కఁ జిక్కెం
బెక్కేఁడులు విధివశంబు పెం పెట్టిదియో? 1

తే. రెండువేలును నిన్నూటరెండుయోజ
నంబు లర్ధనిమేషమాత్రంబునందు
నంబరంబునఁ బాఱుతీవ్రాంశురథము
నిలిచె బహుకాల మిట్టిదే నియతిమహిమ. 1

క. స్థితిసర్గవిసర్గములకు
గతి భానుఁడు గేవలంబ కానఁ దదీయ

ప్రతిబంధము త్రైలోక్య
ప్రతిబంధం బై విపత్పరంపరఁ దనరన్. 136

సీ. లేవయ్యె స్వాహాస్వధావషట్కారంబు
లుడివోయెఁ ద్రేతాగ్నిహోత్రవిధులు
కాలంబుకొలఁది లెక్కలు వెట్ట నేరక
చిత్రగుప్తాదులు చిక్కువడిరి
యిది సంజ యిది రాత్రి యిది వాసరం బను
సమయవర్షము లపక్రమము లయ్యె
స్రావితో వర్షంబు సమకూర కుండుటఁ
బంట లేబరమయ్యెఁ బాఁడితోడఁ
తే. గొన్ని దేశంబు లెండచే గొవరువోయెఁ
గొన్ని దేశంబు లివముచేఁ గొంకువోయెఁ
గొన్ని దేశంబు లిరులచే గుత్తివడియెఁ
గొన్ని దేశంబు లివచేతఁ గూడఁబడియె. 137

సీ. పూచినకొరవిపూఁబోదరింటిచ్చందానఁ
గత్తెర యొక్కచోఁ గదలకుండె
నొకచోఁ దగుల్పడె నుపకారికొఱటికిఁ
దర మైనరోహిణీతారకంబు
నొకచోఁ బునర్వసు పూఁగె వృక్షముకొమ్మ
సుడివడ్డముత్యాలసోఁగువోలె
శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు
గుంటిమీఁదటిప్రత్తి కొడుపువోలె
తే. స్వాతిచిత్తలు తోరణస్తంభయుగము
ననుకరించుచు నొక్కచో న త్తమిల్లె

జిఱుతవోయినమూఁకుటి చెలువుఁ దాల్చి
హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రియందు. 13
సీ. నేత్రంబు లున్మేషనిస్పృహత్వము నొంద
శ్రుతిపుటంబుల శక్తి చొక్కమడఁగ
ఘ్రాణేంద్రియజ్ఞానకళయారుసౌరుగా
జిహ్వావివేకంబు చిఱుతవోవ
నంతరంగమున మోహాంధకారము గ్రమ్మఁ
దనువు చేష్టాదరిద్రత వహింపఁ
బ్రాణముల్ శ్వాసమాత్రమునఁ బర్యవసింప
దలచీర యెఱుఁగనిదశ ఘటిల్లఁ
తే. బాము గఱచిన మూర్ఛిల్లి పడినయట్లు
పడిరి పాశ్చాత్యదేశంబుపంచజనులు
తరణిదీధితి లేమిఁ జైతన్య మెడలి
వితతనిద్రాసమావేశవిహతు లగుచు. 13
వ. అనిన విని నైమిశారణ్యమునీశ్వరు లటమీఁదివృత్తాంత
మెయ్యది యని యడిగిన. 14

ఆశ్వాసాంతము.

శా. పారావారపరీతవిశ్వవసుధాభారోత్థతిప్రక్రియా
ధౌరంధర్య! సరోరుహేక్షణ! సమిద్గాండీవకోదండ! దా
క్షారామప్రమదాకఠోరకుచకుంభాభోగసంక్లప్తక
స్తూరీస్థాసకముద్రితస్థగితవక్షోవీథికాభ్యంతరా! 14
క. వేమాంబాప్రియనందన!
హేమాచలధీర! భువనహితచారిత్రా!
హేమాద్రిపానుసంభవ!
రామారతిరాజ! రాజరాజకిరీటా! 14

భుజంగప్రయాతము.—

హర శ్రీపదాంభోరుహద్వంద్వపూజా
పరాధీన! కారుణ్యపాథోనిధానా!
కురంగేక్షణాపుష్పకోదండమూర్తీ!
శరచ్చంద్రికాస్నిగ్ధసంసిద్ధకీర్తీ! 143

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్త్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయప్రణీతంబైన కాశీఖండం బనుమహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# ద్వితీయాశ్వాసము.



రాజమహేంద్రవరమ
హారాజ్యశ్రీస్వయంవరాధీశ్వర! శృం
గారకళాఝుష కేతన!
యారాధితభుజగహార! యల్లయవీరా!

**దేవతలును మునులును బ్రహ్మకడకేగి స్తుతించుట.**

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. ఇవ్విధంబున నకాండప్రళయంబు సంభవించిన నమరాసురోరగబగులోకంబు గాందిశీకం బగుటయు మునులును దేవతలుఁ గూడి బ్రహ్మలోకంబునకుంబోయి బ్రహ్మనిట్లని స్తుతియించిరి.

తే. బ్రహ్మ! బ్రహ్మస్వరూప! హిరణ్యగర్భ!
యమృత! కేవల! యప్రతర్క్యానుభావ!
వేదవేద్య! చిదాత్మ! యనాదినిధన!
చిత్తగింపుము సంస్తుతించెదము నిన్ను.

తే. డెందమును వాక్కు నెవ్వాని నందలేవు
కాంతు రెవ్వాని దహరపుష్కరమునందుఁ
బరమయోగీంద్రు లధికతాత్పర్యలీల
నట్టినీకు నమస్కార మఖిలవంద్య!

తే. ప్రకృతిరూప! గుణత్రయోపాధియుక్త!
కాల! కాలాతిరిక్త! నిష్కామహృదయ!

సత్త్వగుణమున హరి వై రజస్తమోగు
ణముల శంభుఁడ వగునీకు నతి విరించి! 5

సీ. బుద్ధ్యహంకారరూపుని భజింతుము నిన్నుఁ
బంచతన్మాత్రరూపా! భరింపు
పంచకర్మేంద్రియపంచబుద్ధీంద్రియా
త్మక! మనోరూప! యేమఱకు మమ్ము
క్షిత్యాదిపంచకాకృతి మమ్ము రక్షింపు
విషయాత్మకా! మమ్ము విడువ వలదు
బ్రహ్మాండరూప! మాపాలిపెన్నిధి వీవు
పాలింపు మముఁ దదభ్యంతరస్థ!
తే. కొలుతు మర్వాక్పరాగ్రూపుఁ గోరి నిన్ను
విశ్వరూపుని నిన్ను సేవింతు మెపుడు
నవధరింపుము నిత్యసత్యస్వరూప!
సదసదీశ్వర! యభయహస్తంబు సూపు. 6

సీ. నిగమత్రయంబు నీనిశ్వాసపవనంబు
నీమూర్తిభేదంబు నిఖిలజగము
నీయంఘ్రి మేదిని నీమూర్ధ మాకాశ
మంతరిక్షము నాభి యండ్రు నీకుఁ
జంద్రుండు హృదయంబు చక్షు వబ్జహితుండు
తనురుహవ్రాతంబు దరులు నీకు
నీవు సర్వంబును నీయందు సర్వంబు
స్తోతృస్తుతిస్తవ్యజాత మీవు
తే. మ్రొక్కెదము నీకు నని మహామునులు సురలు
నలికతలమున సేవాంజలులు ఘటింప

ద్రుహిణుఁ డెంతయు నాత్మ సంతోష మంది
యందఱిని జూచి యి ట్లని యానతిచ్చె.

తే. ఆర్య మగునీ స్తవంబున కనఘులార!
యేను బరితుష్టి నొందితి నిచ్చయందు
నేమి వలసిన నట్టిద యిత్తుఁ గాన
నిది యభీప్సిత మనుఁడు మీ రింపు మీఱ.

మ. నిరవద్యస్థిరభక్తితోడ ననుఁ గానీ శంభుఁ గానీ రమే
శ్వరుఁగానీగుఱియించియెవ్వరఁటయీసార స్తవంబుల్ జ
తురు వారందఱ కేమువ్వురముసంతుష్టింబ్రసాదింతుమీ
పరుదారల్ధనధాన్యపౌత్త్రపశురత్నాయుస్సుఖారోగ్యముల్

వ. మీ కెయ్యది యభీష్టం బట్టివరంబు గోరుండిచ్చెద. ఇక్క
డికి వచ్చియు నిక్లేటికి నాకులత్వంబు విడువరు? స్వస్థుల
గం ద్రు. నాలోకంబునఁ గామక్రోధలోభమోహామదమ
త్సర్యహింసాసూయాదులు లేవు. మూర్తంబు లగు
యామ్నాయంబులు విద్యలు యజ్ఞంబులు దక్షిణలు సత్
ధర్మ తపోబ్రహ్మచర్యముఖ్యంబులు నుల్లసిల్లెడుంజూడుఁడ
మఱియు ని ట్లనియె.

సీ. తల్లిదండ్రులకు నిద్దపుభక్తి శవణిల్ల
శుశ్రూష చేసినశుద్ధమతులు
పతులకు నిర్వ్యాజపరమతాత్పర్యతఁ
బరిచర్య సలిపినపద్మముఖులు
సజ్జనావళికి నిష్కారణంబున నుప
కార మొనర్చినధీరగుణులు
దఱి దప్ప కుండ సంధ్యాజపహోమతం
త్రంబులు నెఱపినధర్మవిదులు

తే. బ్రహ్మరతులు తపస్వులు భవ్యతీర్థ
సేవకులును సద్వ్రతులు నిస్పృహులు మొదలు
గాఁగ నొప్పెడు తత్పుణ్యకర్మపరులు
వీరె చూడుఁడు సుఖ మున్నవార లిందు. 11

క. మతిచేసి యిష్టధనములు
క్షితిసురులకు నొసఁగినట్టిశిష్టులు సుండీ!
యతులహిరణ్మయహర్మ్య
స్థితు లగుచుఁ జరించువారు చిరశుభలీలన్. 12

తే. ఉభయముఖు లగుగోవుల నొండె నొండెఁ
గపిల లగుధేనువులఁ బుణ్యకాలతిథుల
దాన మొనరించినట్టిసత్యప్రతిజ్ఞు
లీమహార్ష పీఠంబుల నెసఁగువారు. 13

బ్రహ్మ దేవతలకును మునులకును గోబ్రాహ్మణప్రభావంబు సెప్పుట.

వ. అని చెప్పి యప్పరమేష్ఠి బ్రాహ్మణులసామర్థ్యంబును గోవుల మాహాత్మ్యంబును నొక్కించుక వర్ణించుతలంపున నిట్లనియె.

తే. నాకు శంభునకును బద్మనాభునకును
దుష్టికరములు రెండువస్తువులు గలవు
విప్రులును గోవులను నవి వినుఁడు మొదల
నొక్కకులము ద్విధాభంగి నొంది యుండు. 15

చ. సకలఫలంబులుం గురియు జంగమతీర్థము లెందు బ్రాహ్మణ
ప్రకరము లట్లుఁ గాక పెడవాయుటయెట్లుతదీయభాషణో
దకముల సేవకావలికిఁ దత్ క్షణమాత్రన జన్మజన్మబం
ధకత సహాగతంబు లగుత త్తదనేకమహాఘపంకముల్. 16

చ. వినుఁ డనయంబు గోవులు పవిత్రముగోవులు మంగళంబుద
ద్ఘనఖురటంకశృంగపరిఘట్టదళద్ధరణీరజశ్ఛటల్.

గనుఁగొని నవ్వుచుండుఁ బురఘస్మరమూర్ధజటాటవీనట
ద్ఘనపథసింధువార్లహరిగర్వభరార్భటిఁ బావనోన్నతిన్.
చ. ప్రతివసియించు గోవులఖురంబులయందు సమస్తతీర్థసం
తతియును సర్వపర్వతవితానము గొమ్ములమధ్యసీమ న
ద్భుతచరితుండుశంకరుఁడుభూధరకన్యయుఁదానునుండు
ద్వితతకుచేభకుంభపరిదిగ్ధపటీరపవిత్రవక్షుఁడై.
క. కొనియాడుఁ బితృగణంబులు
గొనియాడు ఋషివ్రజములు గురుసమ్మదముల్
జనియించు వేల్పులకుఁ గం
దనిపెంపున నరుఁడు గోవు దానము సేయన్.
శ్లో. గోమయం యమునా సాక్షా ద్గోమూత్రం నర్మదా శుభా
గంగా క్షీర స్తు యాసాం వై కిం పవిత్ర మతః పరమ్.
శ్లో. గవా మఙ్గేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ,
యస్మా త్తస్మా చ్ఛివం మే స్యా దిహ లోకే పరత్ర చ.
క. అనుమంత్రంబులు చెప్పుచు
నొనరించును ధేనుదాన మర్వీసురవ
ర్యున కెవ్వఁ డాతఁ డధిగత
వినుతులు గను జగమునందు విశ్రుతలీలన్.
క. స్తుతిపూర్వముగఁ బ్రదక్షిణ
మతిభక్తి రచించు నెవ్వఁ డావుల కతనిఁ
ధృతిఁ బొందు నపుడు సకల
క్షితికిఁ బ్రదక్షిణము నియతిఁ జేసినఫలముల్.
క. ముందటఁ బిఱుఁదం గ్రేవల
డెందమునం గరము సందడిలవలదా యు

స్పందశుభావహములు గో
బృందము లని మాకుఁ బుట్టుఁ బ్రియ మెల్లపుడున్. 24

క. నీరాజనంబు నెఱపుదు
రారఁగ గోపుచ్ఛమున నిజాంగంబుల కె
వ్వారలు వారలయఘములు
దూరమున నడంగు నిండ్ల దొరకొనుఁ బ్రియముల్. 25

తే. వినుఁడు గోవులు విప్రులు వేదచయము
సతులు లోభవిహీనులు సత్యపరులు
దానశీలు రియ్యేడ్వురు దాల్తు రెపుడు
నవని నెంతయు విగతభయంబు గాఁగ. 26

గీ. నాదులోకంబునకు మీఁదు నలిననాభు
లోక మందూర్ధ్వమగు గుహ్యలోక మవల
భర్గలోకంబు దత్సమీపస్థలమున
గోకులంబులలోకంబు గొమరు మిగులు. 27

సీ. ప్రవహించు నెచ్చోటఁ బరిపూర్ణసంపదఁ
దొలుకాడుచు నపారదుగ్ధనదులు
సవరిల్లు నెచ్చోట జర డగ్గఱఁగ నీక
సంతతయౌవనసౌష్ఠవంబు
లల రొందు నెచ్చోట నాజ్యనిర్ఝరులతో
బహుసంఖ్యఁ బాయసపర్వతములు
బెడఁగొందు నెచ్చోటఁ గడమ యెంతయు లేమి
సామగ్రి శుభవస్తుసంచయంబు

తే. నట్టిగోలోకమునయందు నధివసింతు
రభవుచేఁ బ్రొద్దు ప్రొద్దు నెయ్యంబుఁ గనుచు

నలఘుమూర్తులు గోమాతృకలు సుశీల
యాదిగాఁ గలపరమకల్యాణనిధులు. 2

వ. అట్లు గావున గోవులకు మిగిలినయుపాసనీయంబులు లే
గోప్రదాతలకు మిగిలినపుణ్యవంతులు లేరు. వెండియు నా
ర్ణింపుఁడు. సరస్వతీతీర్థమృతులును,మార్తాండుండుమకరస్థు
డగుచుండఁ బ్రయాగతీర్థంబునమాఘస్నానంబు చేసినకృ
ర్థులునువారణాసియందుఁబంచనదంబునం గార్తికమాస
దుఁ దీర్థమాడినవిశుద్ధదేహులును గురుక్షేత్రంబునంగా
కామాత్రంబైనను గనకంబు దానంబొనర్చినదాతలుమొ
లుగాఁగలనానాధర్మపరు లస్మదీయలోకంబున వీరె నిజ
చితపదంబులం గల్పస్థాయు లయి సుఖంబు లనుభవిం
చున్నవారుమీకును నింక భయంబువలవదు.మీరువచ్చి
కార్యం బె నెఱుంగుదు వింధ్యం బవంధ్యగర్వోదయ
బున గీర్వాణభూధరంబుతో మచ్చరించి శృంగోచ్ఛ్రాయ
బులఁ బతంగమార్గం బవరోధించి భువనంబులకు శ
నేయుచున్నయది. ఈయకాండప్రళయంబునకు బెగ్గలంబ
యాపత్పరిహారార్థంబు నన్ను శరణంబు చొచ్చితిరి. అ
నిరసనంబునకు నుపాయంబు చెప్పెద.మహామునియగస్త్య
డవిముక్తం బనువిముక్తక్షేత్రంబున విశ్వేశ్వరువిరూపా
భోగమోక్షప్రదాయకుం దారకబ్రహ్మోపదేశార్థంబు సే
చుచున్నవాఁడు. అతఁడు మీకార్యంబు సంఘటింపఁ
వాఁడు. మీరచ్చోటి కరిగి యమ్మహాత్ము నభ్యర్థింపుఁ

క. వాతాపీల్వలు లనియెడు
దైతేయులఁ గుటిలకపటతంత్రోద్ధతులఁ

భ్రాతల వధించె వ్రేల్మిడి
నాతం డెల్లరును వెఱతు రమ్మునిపతికిన్. 30

వ. పొండు మీకు మేలయ్యెడునని పుండరీకభవుండు వీడ్కొల్పిన వారును మహాప్రసాదంబని ప్రసన్నాంతరంగులై సత్యలోకంబు వెలువడి *[వచ్చువా రంతరాంతరంబుల మూర్తిమంతంబు లైన వేదంబుల వేదాంగంబులయజ్ఞంబుల దక్షిణల సత్యంబుధర్మంబు దపంబు శ్రుతిస్మృతిపురాణేతిహాసంబులం బతివ్రతల బ్రహ్మచారుల మాతాపితృభక్తుల గోగ్రహణహితుల గాయత్రీజపపరాయణుల నుభయముఖగోప్రదాతలఁ గపిలాదానతత్పరుల బ్రాహ్మణపాదోదకప్రాశనుల సరస్వతీతీర్థమృతులమకరరాశిస్థితుం డై మార్తాండుం డుండ మాఘస్నానంబు ప్రయాగతీర్థంబునం జేసినకృతార్థుల వారణాసియందుఁ బంచనదంబునం గార్తికమాసంబునం దీర్థంబాడినవిశుద్ధదేహులఁ గురుక్షేత్రంబునం గాకిణికామాత్రం బైనను గనకంబు దానంబు చేసినదాతలను విలోకించుచు.] 31

తే. విమలకైవల్యకల్యాణవిత్తనిధికి
విశ్వనాథుని మొదలిశ్రీవేశ్మమునకుఁ
గాశికాక్షేత్రమున కేగఁ గదలి రపుడు
కోర్కు లిగురొత్త బృందారకులును మునులు. 32

వ. హర్షోత్కర్షంబునం దమలోన. 33

సీ. మనభాగ్యమునఁ గాదె కనకాచలేంద్రంబు
విశ్వాధికోన్నతవిభవ మొందె

* ఈకుండలితభాగము పెక్కుమాతృకలలోఁ గనఁబడదు.

మనభాగ్యమునఁ గాదె మార్తాండమండలి
విసువీథి రోధించె వింధ్యశిఖరి
మనభాగ్యమునఁ గాదె మర్త్యపాతాళత్రి
విష్టపంబులకు నరిష్ట మొదవె
మనభాగ్యమునఁ గాదె కనకగర్భుండు ప్ర
త్యక్షమై యుపదేశ మానతిచ్చె
తే. నహహా! మనభాగ్యమునఁ గాదె యమరతటిని
దరి వసించినవాఁడు వాతాపిదమనుఁ
డిన్ని భాగ్యంబులును గూడియిచ్చె మనకుఁ
గాశికాక్షేత్రరాజవీక్షాసుఖంబు. 34
క. ఏకక్రియ ఫలయుగ్మము
నాకర్షింపంగఁ జాలు నాలోపాము
ద్రాకాంతుఁ గుఱిచి పోవఁగ
శ్రీకాశీదర్శనంబు సిద్ధించెఁ దగన్. 35

**దేవర్షులు బ్రహ్మనియోగంబున నవిముక్తంబునకేతెంచి యగస్త్యునిదర్శించుట.**

వ. అనుచు బ్రహ్మలోకంబుననుండి డిగ్గి వారు వారణాసిపురో పకంఠంబున శ్రీకంఠజటాటవీకుటజకోరకంబును బరమేష్ఠి కమండలుతీర్థసలిలధారాధోరణియును గుపితకపిలమునిపరి వృఢకపిలదృగనలచుళుకితపురఖిలగరసుతస్వర్గారోహణ సోపానమార్గంబును నగుభాగీరథియందు మణికర్ణికాకుండం బునఁ దీర్థంబాడి తీర్థోపవాసులకువాసోహిరణ్యగంధసార కర్పూరకస్తూరికాకుంకుమంబులనుఖండశర్కరాపూపసూపా జ్యదధిపయఃఫలాదితర్పణద్రవ్యంబులను నుపానత్పాదుకా చ్ఛత్రంబులనుగుండికాదండరల్లకవ్యజనచామరంబులఁగౌపీ నశాటికాకరండంబులను దైలలవణేంధనంబులను గుగ్గులు

మహిషాక్షీ ప్రముఖధూపద్రవ్యంబులను వెండియుం గ్రియా
కాండంబులనుం బరితోషంబు సంపాదించి విశుద్ధహృద
యులుఁ బ్రసన్నాత్ములు నై శ్రుతిస్మృతిపురాణేతిహాసప్రతి
పాదితవేదానువచన యజ్ఞ దాన తపోవ్రతాదులచేతం
బ్రక్షీణసకలకల్మషులు భస్మోద్ధూళితాంగులు రుద్రాక్ష
మాలికాలంకారులునై శంకరుంగురంగాంకశేఖరు నిరస్తసమ
స్తోపాధిక స్వప్రతిష్ఠాఖండ సచ్చిదానందైకరసాద్వితీయ
స్వరూపు విరూపాక్షు విశాలాక్షీహృదయాధీశ్వరు విశ్వే
శ్వరమహాదేవు సందర్శించి ప్రణమిల్లి జగన్నిర్మాణనియమ
పరిపాలనాది శక్తియుక్తుం డగునద్దేవుం బంచబ్రహ్మ పంచా
క్షరప్రణవమంత్రంబుల నావాహనస్థాపన సాన్నిధ్యసన్ని
రోధనసంకలీకరణాదులగు దశవిధసంస్క్రియాకలాపం
బుల నుపచరించి వెండియు. 36

క. ఆడిరి ప్రమోదనృత్తము
పాడిరి మంద్రకమహాప్రబంధంబుల మో
మోడిరి తైర్థికులకుఁ గో
ల్గాడిరి కైవల్యలక్ష్మి నమరులు మునులున్. 37

సీ. అందంద చేసిరి యభవుగేహమునకు
ధన్యాత్ము లంగప్రదక్షిణములు
యోగపీఠారూఢ నుమబోటి నర్చించి
రభ్యర్హితులు సువర్ణాంబుజముల
డుంఠివిఘ్నేశు లడ్డుకపూపమోదకా
ద్యుపహారములఁ దృప్తి నొందఁ జేసి
రవధరించిరి పురాణాఖ్యానముఖముల
సమధికం బగుమహాస్థానమహిమ

తే. వీట్రి పెద్దతలారి నిస్సాటికలికి
దిస్స మొలవేల్పు పార్వతీదేవిపట్టిఁ
గాలభైరవుఁ గుక్కురగణపరివృఢు
ననుచరించిరి మునులు నాకౌకసులును. 38

వ. అనంతరంబ. 39

సీ. పంచాక్షరీమంత్రపారాయణమునకు
నెవ్వానిమానసం బేడుగడయు
దర్పోద్ధతు లగువాతాపీల్వలులకును
వధశిలాస్థాన మెవ్వానికుక్షి
యాది నెవ్వానిదివ్యావతారమునకుఁ
బూర్ణాంబుకుంభంబు పురిటియిల్లు
మెఱసి లోపాముద్ర మెఱుఁగుఁబోలిండ్లపైఁ
బవళించు నెవ్వానిభవ్యమూర్తి
తే. కసరి యెవ్వానికంఠహుంకారరవము
కొండచిలువలకులములోఁ గూర్చె నహుషు
నట్టి పరమమహాతేజు నలఘుతేజు
వెదకి రానందవనములో విబుధమునులు. 40

సీ. డుంఠివిఘ్నేశుఁ డుండుప్రదేశ మీక్షించి
లోలారునగరిమోసాల వెదకి
దండపాణ్యాసవభాండేశ్వరంబులు
గుక్కుటస్థానంబు గుద్దలించి
కేశవస్వామిలోఁగిలి పరామర్శించి
కాలభైరవదేవుగవను జూచి
శ్రీవిశాలాక్షిగోష్ఠీవాటి శోధించి
యపవర్గమంటపోపాంత మరసి

తే. విబుధగంగాతరంగిణీవేణిమధ్య
సైకతోత్సవవేదికాసంప్రరూఢ
తరుణమంజులకుంజవేతసకుడుంగ
వీథికలయందు దృష్టి యావిష్కరించి. 41

వ. కుంభసంభవు నన్వేషించువాఁడు జగద్ధితకార్యారంభులు జంభమథనపురోగము లైనసురలును గీష్పతిప్రధాను లైన మునులును నానందకాననంబన మహాశ్మశానంబన రుద్రావాసంబనఁ గాశియను వారణాసియను నవిముక్తక్షేత్రంబున లోలార్కకేశవులు కోటిద్వయంబును, భాగీరథి నారియు, ధర్మంబుశరంబును, గలిలక్ష్యంబును, విరూపాక్షుండు ధన్వియుంగాముక్తిపురంధ్రీభ్రూలతానుకారంబును, జంద్రరేఖాఛాయాప్రకారం బై తాను గోదండంబుభంగి నంగీకరించి విశ్వేశ్వరశ్రీమహాదేవునకు నిఖిలదేవతా సార్వభౌమునకుఁ దైత్రిలోక్యసామ్రాజ్యపట్టాభిషేకంబునకుఁ దగుపీఠంబునుంబోలి యమ్మహాస్థానంబుఁ గలయఁగ్రుమ్మరి యచ్చోటి పెద్దలవలనం గందువ యెఱింగి చని తత్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించి యందు. 42

సీ. కండూయనము సేయుఁ గరటిశుండాదండ
పుష్కరమ్మున సింహపోతకంబు
వాలారునఖముల వదన మించుక యెత్తి
ముద్దాడుఁ బులి లేఁటిముద్దరాలి
నిండుకౌఁగిటఁ జేర్చి నెమ్మిమైఁ దోఁడేలు
గోదమచింబోతును గుస్తరించుఁ
గుంజమంటపకుటీక్రోడమధ్యంబున
నాఖుతోఁ జెలలాడు నడవిపిల్లి

తే. యెండ దాఁకక యుండంగ నెత్తి పట్టుఁ
బగలు ముంగికి భుజగంబు పడగగొడుగు
క్రోతితో మైత్రి వాటించుఁ గొండగోఁజెయ
యార్వ్వశేయునిపుణ్యాశ్రమాంతరమున. 4

వ. వెండియు నవ్వనంబున నీవారోదనమండం బుష్ణమధుర
బుగగండూషించి క్రొత్తపురిటాలికిం గురంగికి మెత్తమెత్త
కురంగంబు గ్రోల్చు. ప్రసర్పత్సర్పిరభిఘూతప్రవాహాథార
గంధపాణింధమం బై కర్కంధూఫలోన్మిశ్రశాకపాకంబు
తాలింపులకమ్మనికంపుపాంథఘ్రాణంబుల కింపుసొంపుసం
దించు, సరసీతీరంబున సారసంబు సారస్యంబు పక్ష్మలింపలక్ష్మ
ణాకంఠోపకంఠంబునంగంఠంబుఁ జేర్చిసుఖపారవశ్యంబున
జొక్కునో? ముక్కంటి లోఁగంటం గనుంగొనుచు నిశ్చ
ధ్యానయోగానుసంధానంబున మాధుర్యంబు భుజించెనో
యెఱుఁగరాకుండ నుండు. శ్రుతిస్మృతిపురాణేతిహాస
హితాతాత్పర్యపర్యాలోచనఁ బచేళిమంబైనవివేకంబున
త్స్యమాసనం బభ్యర్హితులు పరిహరింతు రని యెఱిం
కాఁబోలుఁబంకజోత్పలకుముదకల్హారసంకులంబులగుకొల
కులఁ బెద్దమీను కొండికమీనుం దాఁకదు. దరవికచవకు
కురువకనాగకేసరపరాగధూసరంబు లగుమధుమాసవా
రంబులందును బంచబాణుం డించువిల్లెక్కువెట్ట వెఱచు
గావునఁ గొంచి కొంచియుఁ బశుపక్షిమృగమిథునంబు
నిధువనక్రీడ లాచరించు. కంఠగతప్రాణంబు లగుజంతు
లకుం గాలకంఠుండు గరుణావశంవదుండై కర్ణోపకంఠంబు
జేరి యుపదేశించు తారకబ్రహ్మమంత్రరాజంబు మంత్ర
బున విని యెఱుంగుటం జేసి మధుమదోల్లాసంబున నది శ

విరి సేయుచున్నయవియో యన నిందిందిరంబులు మంద్ర స్వరంబున ఝంకారంబు సేయు. నక్తభోజనవ్రతస్థులతోడి సంసర్గంబుననో చకోరవర్గంబు నక్తంబులంజంద్రచంద్రికా కరంభంబునఁ గౌతూహలంభరత్వంబు సంభావించు నట్టిపుణ్యాశ్ర మంబు దరిసి చనునప్పుడు మునులు బృందారకులు నిజాం తర్గతంబున. 44

తే. ఎన్నఁడును సేగి లేనట్టి యిమ్మహాశ్మ
శానమునయందుఁ గాఁపున్న జంతువులకు
నేటి నాకంబు? పున్నియం బెడలినప్పు
డొలికమునఁ గూలవలయుఁ గీలూడినట్లు. 45

తే. అపునరావృత్తిశంభులోకాధివాస
సౌఖ్య మొనగూడు నిచ్చోటిజంతువులకుఁ
గాన మనకంటెఁ గడు మేలు కాశినుండు
కీటపక్షిసరీసృపక్రిమికులంబు. 46

సీ. కాశికానగరంబుకడసీమమున నున్న
చండాలుఁ బోల రాఖండలాదు
లానందవనములో ననశనస్థితి నున్కి
భువనసామ్రాజ్యవైభవముఁ బోలు
నవిముక్తదేశస్థుఁ డయ్యెనేఁ బతితుండు
నశ్వమేధాధ్వరాహర్త దొరయు
వారణాసీసంభవం బైన మశకంబు
నైరావణముతోడ నవఘళించు

తే. నాటుకొని శ్రీమహాశ్మశానమున నున్న
యణుకనగ్నాలవటుఁ డైన నాగ్రహమున

గర్వితోద్ధతి నేతెంచుకాళరాత్రి
మృత్యుదేవతమునిపండ్లు మెఱుకఁ జాలు. 47

తే. ఎన్నికల్పంబు లరిగిన నెడలిపోవ
దెంద రింద్రులు గడచిన నెలమి దప్ప
దెన్ని మన్వంతరంబులు చన్న నెపుడుఁ
బసిమి దప్పదు కాశికాపట్టణంబు. 48

ఉ. తత్తరపాటు లేక నదిఁ దాన మొనర్చి పినాకపాణి దే
వోత్తము విశ్వనాథుఁ గరుణోదధిఁ గమ్మనిపూవుగుత్తులన్
బత్తిరిఁ బూజ చేసి నుతిపాఠములన్ దవణించువారికిం
దోత్తులువోలెఁ దక్కుదురు దొప్పలుదోరలుముక్తిభామినుల్.

సీ. ధర్మంబు కాశికాస్థానమధ్యంబున
నాల్గుపాదంబుల నడచి యాడు
నర్థంబు కాశీపురాంగణంబునయందు
నానాప్రకారమై నటన మిగులుఁ
గామంబు కాశికాకటకఘంటావీథి
గర్వించు రాజలోకంబు లేవ
మోక్షసంపదలు గాశీక్షేత్రమునయందుఁ
బ్రవ్వి తండంబు లై నివ్వటిల్లుఁ

తే. గాశి కల్యాణమున కాదికారణంబు
కాశి యణిమాదిసిద్ధులకట్టుపట్టు
కాశి జనలోక సంకల్పకల్పవల్లి
కలుషపిశితంబు మెసవురాకాసి కాశి. 50

సీ ఉర్వీధరశ్రేణు లుఱ్ఱూఁత లూఁగంగ
నేడుగాడ్పులు వీచు నెన్నఁ డేనిఁ

జండభానుండు పంద్రెండుమూర్తులు దాల్చి
యెసఁగి యెండలు గాయు నెన్నఁ డేనిఁ
బుష్కలావర్తకాంభోధరవ్రాతంబు
లెలగోలు వర్షించు నెన్నఁ డేని
భూర్భువస్స్వర్లోకములు ముంచి జలరాసు
లేకోదకముఁ జూపు నెన్నఁ డేనిఁ

తే. నెన్నఁడే నుండు గాలంబు మిన్ను చక్కి
భూతములు గ్రాలు నెన్నఁడేఁ బుట్టినిండ్ల
నపుడు వారాణసీక్షేత్ర మైదుక్రోసు
లంతమేర యుపద్రవం బందకుండు. 51

తే. ఉత్తరోత్తర మభివృద్ధి నొందుచుండుఁ
గాశి ధర్మార్థకామమోక్షములు నాల్గు
చంద్రకళయట్లు శుక్లపక్షంబు రేలు
నాఁడునాఁటికి నభివర్ధనంబు నొందు. 52

సీ. పాలిండ్లు గదలంగఁ బసపుఁబయ్యెద విచ్చు
నచలాధిపతికూర్మి యాఁడుబిడ్డ
ఘూత్కార మొనరించుతొండంబుముక్కున
శీకరాసారంబుఁ జిలుకు దంతి
ప్రత్యక్షమై వచ్చి భాగీరథీగంగ
మృదులహస్తము సాఁచి మేను నిమురుఁ
బ్రమథోత్తముఁడు భృంగి భయరక్షణార్థమై
ఫాలాగ్రమునఁ దీర్చు భసితరేఖ

తే. దక్షిణశ్రుతి మీఁదుగా ధాత్రిఁ జెంది
పెద్దనిద్రకు మ్రాఁగన్ను పెట్టువేళ

బంచజనులకుఁ దారకబ్రహ్మవిద్య
యభవుఁ డుపదేశ మొనరించు నపుడు కాశి. 53

వ. అని వారణాసీపురంబు వర్ణించుచు. 54

తే. వృక్షశాఖాంచలంబుపై వ్రేలుచున్న
కోటిసంఖ్యల నీర్కావిగోవణములు
విఘ్నమృగములఁ బట్టంగ వేసినట్టి
చీరతెర లనుసంస్మృతిఁ జిగురు గొల్ప. 55

సీ. ఎదుర లోపాముద్ర పదపద్మములముద్ర
సికతిలం బగునేలఁ జెలువు మిగుల
శ్యామాకముష్టియాచ్ఞార్థంబు మృగములు
ఋషికన్యకలరాక కెదురుచూడ
దేవార్చనాధూపదివ్యగంధములచే
హోమధూమము తావి యుద్ది వడయ
వటుజనస్వాధ్యాయవర్ణసందోహంబు
శారీశుకంబులు చర్చ చేయఁ

తే. గాశికాపట్టణమునకుఁ గ్రోశమాత్ర
గగనగంగాప్రవాహసైకటికభూమి
బ్రహ్మలోకమునకు ననుప్రాస మైన
కలశజునిపర్ణశాల డగ్గఱిరి వారు. 56

వ. అప్పుడు. 57

మ. శివుఁడే దాత శివుండె భోక్త శివుఁడే చేయు న్మఖాదిక్రియల్
శివుఁడే విశ్వము నే శివుండ ననుచుఁ జింతించుచుఁ జాహ్నవీ
సవిధశ్రీఫలవృక్షవాటమున భస్మస్నానశుద్ధాంగుఁడై
భవ! కాశీధవ! నీలకంఠ! యనుచుఁ భావించు ధన్యాత్మునిన్.

క. రుద్రాక్షభూతిముద్రా
ముద్రితనిఖిలావయవుని ముక్తిపదశ్రీ
భద్రాసనస్థు లోపా
ముద్రాపరిపూర్ణపార్శ్వు మునిపుంగవునిన్. 59

మ. నిజనామంబున శంభులింగము భవానీదృక్చకోరంబు నం
బుజగర్భాదిసురేంద్రవందితపదాంభోజంబుఁ గల్పించె మం
త్రజపధ్యానపరాయణుండగుచుఁ దత్పార్శ్వంబునన్ ద్వీపిరా
డజినాగ్రంబుననున్న పాశుపతవిద్యారాజ్యపీఠస్థునిన్. 60

క. పాటలజటాకిరీటు ల
లాటంతపసప్తసప్తి లలితమనోజ్ఞ
స్ఫాటికమణిజపమాలా
వ్యాటికిరత్కరసరోరుహాంగుళిపార్శ్వున్. 61

క. పంచబ్రహ్మంబును శ్రీ
పంచాక్షరమును నఘోరపాశుపతంబున్
గించిత్ప్రస్ఫురదధరో
ష్ఠాంచలముగ జపము సేయునాదిమశైవున్. 62

మ. అవధానంబున నప్పటప్పటికి భక్త్యావిష్టుఁడై పార్వతీ
ధవ! గంగాధర! నీలకంఠ! మదనధ్వంసీ! మహాదేవ! రు
ద్ర!విరూపాక్ష!భుజంగహార!యనుచున్ ధారాధరవ్యూహసం
భవగర్జారభటిన్ బఠించుఁ బరమబ్రహ్మర్షి లేఖర్షభున్. 63

సీ. అంతర్విలోకనవ్యాప్తి యుద్వాసించి
బాహ్యంబునకు దృష్టి పాఱ విడిచి
లీల రుద్రాక్షమాలిక దక్షిణశ్రవ
శ్శష్కులీశిఖయందు సంతరించి

పదిలంబుగా మున్ను పరిఢవించినయట్టి
నలినాసనంబుబంధము వదల్చి
వేదాగమపురాణవిద్యోద్భవము లైన
పురమర్దన స్తోత్రములు పఠించి
తే. యప్పు డప్పుడ యోగసమాధి యుడిగి
యధికశాంతిఁ బ్రసన్నాత్ముఁ డైనవానిఁ
బ్రణవపంచాక్షరీమంత్రపరమసిద్ధుఁ
గుంభసంభవమునిఁ గనుంగొనిరి సురలు. 64
తే. జయజయధ్వను లెసఁగంగ సంయములును
నమరులును మ్రొక్కి రపు డమ్మహాత్మునకును
బిన్న పెద్దతనంబు రూపింప నీదు
శాంభవంబైన దివ్య తేజంబుమహిమ. 65
వ. అగస్త్యుండును బ్రత్యుత్థానంబు చేసి యందఱకు నాతిథ్య
సత్కారం బొనర్చి సుఖాసీనులైనవారిం గుశలప్రశ్న
పూర్వకంబుగా నాగమనకారణం బడిగిన. 66
తే. మునులు నమరులు నత్యంతవినయపరతఁ
దారు వచ్చినకార్య మంతయును జెప్ప
యావదర్థపదోక్తివిద్యానిరూఢు
నాంగిరసుఁ బ్రార్థనము చేసి రధికభక్తి. 67
వ. బృహస్పతియు నమ్మహానుభావు నవలోకించి యిట్లనియె. 68

బృహస్పతి దేవర్షి నియుక్తుండై యగస్త్యునితో సంభాషించుట.

సీ. ధన్యాత్ముకుండవు మాన్యుండ వెంతయుఁ
గృతకృత్యుఁడవు జగద్ధితకరుఁడవు
ప్రత్యాశ్రమంబును బ్రతినగంబును బ్రత్య
రణ్యంబు సంశ్రితవ్రతులు లేరె?

నీప్రతాపంబును నీప్రభావంబును
నౌదార్యమును నెందులేదు గానఁ
బ్రణవపంచాక్షరబ్రహ్మవిద్యామహో
పనిషత్తు నీపాణిపల్లవాగ్ర

తే. మిట్టి నిను వేఁడ వచ్చితి మిందఱమును
గమలగర్భునియానతిఁ గాశిపురికి
భువనసంక్షోభకారియై పుట్టె నొక్క-
కడిఁదియుత్పాత మది నీవు గడపవలయు. 69

వ. అని పలికి వాచస్పతి పుష్పంబునకు వాసనయుంబోలె నవినాభావసంబంధంబున నమ్మహామునికి సహధర్మచారిణి యైయరుంధతికి సావిత్రి కనసూయకు శాండిల్యకు సరస్వతీలక్ష్ముల కుమకు శతరూపకు మేనకకు సునీతికి సంజ్ఞకు స్వాహాకుం దోడిజో డగులోపాముద్ర వీక్షించి యిట్లనియె. 70

బృహస్పతి లోపాముద్రకుఁ బతివ్రతాధర్మంబులు సెప్పుట.

తే. అమ్మ! కుశలంబె? సాధ్వి! యనామయంబె?
దేవి! భద్రంబె? లెస్సలా? పూవుఁబోఁడి!
సారపరమపతివ్రతాచారవైభ
వాధిరాజ్యంబు జరుగుచున్నదియె? తరుణి! 71

సీ. ప్రాణేశుఁ డారగింపక భుజింపవు భర్త
నిద్రింపకయమున్న నిద్రవోవు
నాథుండు మేలుకొనకమున్న మేల్కాంతు
కైసేయ కెన్నడుఁ గవయ వధిపు
ధవుఁడు ప్రోషితుఁ డైనతఱి వాడి యుండుదు
పతికి నెప్పుడు మాఱు పలుక వీవు

పురుషునీగికి నల్ప మనక సంతోషింతు
మొగ మెత్త నేరవు మగనియెదురఁ
తే. జెఱఁగుమాసినమూన్నాళ్లు సిగ్గుతోడఁ
బతివిలోకనమార్గంబుఁ బరిహరించి
సవితృఁ డుదయింప నాల్నాళ్ల జలక మాడి
చూడ వెవ్వారిఁ బురుషునిఁ జూచి కాని. 72
మ. పసపుంగుంకుమకజ్జలంబునుసుగంధ్వాసంబుతాంబూలముః
గుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్
విసు వొక్కింతయు లేక తాల్పవలయుఁ వీనిఁ సదాకాలము
న్నసిఁ జక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్.
తే. రజకితోడ నుదక్యతో శ్రమణతోడ
విధవతో నాథుతో రాయువెలఁదితోడఁ
జెడిపెతోఁ జాలఁ బోరామి సేయఁ జనదు
ప్రాణసంకటములను బుణ్యాంగనలకు. 73
సీ. పతి పిల్వఁబంచినఁ బని యేమి యని వచ్చి
చెప్పినయుడిగంబు సేయవలయు
భర్తయానతి లేక ప్రకృతిబంధునకైన
నేపదార్థంబును నీగి పెట్ట
జీవితేశ్వరుఁడు డించినయోగిరంబులు
గుత్స సేయక భుక్తి గొనుట తగవు
సుఖసుప్తుఁ డగునిజేశుఁ బ్రబోధ మొనరింపఁ
గా దనుష్ఠానభంగమునఁ దప్ప
తే. నొంటి నెచ్చోటి కరుగుట యుక్తి గాదు
తడుపు గట్టక నీళ్లాడఁ దగవుగాదు

కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁద
జక్కిమీఁదను గూర్చుండ జాడ గాదు. 75

క. నాగరికత్వము వాచా
ప్రాగల్భ్యము జూపఁ జనదు పతిముందట సం
భోగక్రీడావిభవో
ద్యోగంబులఁ దక్క సతికి నుత్పలనయనా! 76

క. ఇది ధర్మం బిది యీలువు
ఇది వ్రత మిది సద్వివేక మిది యాచారం
బిది దేవపూజ యధిపతి
యుదితం బాలంబు సేయ కుండుట సతికిన్. 77

క. కాంతుఁడు సంతోషించిన
సంతోషింపంగ వలయు సతి కతఁ డాత్మన్
సంతాపించినపట్టున
సంతాపింపంగ వలయు జలజేక్షణకున్. 78

వ. కొందఱు కులటలు పతి దురవస్థఁ బొందినఁ దెవులుపడిన శృంఖలాబద్ధుం డైనను బరిత్యజింతురు. కొందఱు దుష్టమతులు లేమిఁ గుందువడినభర్తనధికకార్పణ్యంబు పచరించి సర్పిర్లవణతైలతండులాదులకై సిబ్బితి పఱుతురు. కొందఱ టిచ్ఛావతులు ప్రియుండు దమకు నేమి యిచ్చిన మెచ్చక హెచ్చు కుందాడుదురు. కొందఱు వరాక లేకాకినులై మగని మొఱఁగి యెక్కడికేనియుం బోదురు. కొందఱు దుశ్శీల లశ్లీలవాక్యంబుల నందందఁ బ్రియునిముందట మం దెమేలంబునం బ్రేలుదురు. ఇందఱు నాథునిం గులంబు వారిని నరకంబునం ద్రోచి తారును నంద కూలుదురు. 79

సీ. చీఁకటితప్పు చేసిన సరోరుహనేత్ర
గూబ యై వసియించుఁ గోటరమున
వింతవానిఁ గటాక్షవీక్షణంబునఁ జూచు
కిసలయోష్ఠి వహించు గిల్లకన్ను
మగఁడు దన్నొత్తిన మార్మొత్తునలివేణి
వ్యాఘ్రియై జనియించు వనములోనఁ
జిఱుదిండి తనవారి మొఱఁగి యాహారించు
నలివ సూకరజాతియందుఁ బుట్టు
తే. నధిపుఁ గోపించి హుంకార మాచరించు
పడఁతి మూఁగవు సవతిసౌభాగ్యలక్ష్మిఁ
జూడఁ జాలక మదిలో నసూయ సేయు
భామ దుర్భగ యగు నన్యభవములందు. 8

ఉ. దూరముపోయి యెండఁబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటగేహళులదాఁక నెదుర్కొని తీర్థ మార్చి యా
హారము పెట్టి వీర్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూరువు లొత్తి చిత్తమున కుబ్బొనరించుట ధర్మ మింతికిన్. 
తే. తగవు పాటించి యల్పంబు దండ్రి యిచ్చు
నల్ప మల్పంబ భ్రాతయు నాత్మజుండు
ప్రార్థితం బైనధన మనల్పముగ నిచ్చు
ప్రాణనాథుని సరియె యేబంధువులును? 8

సీ. ఓర్పుమై నుప్పిండి నుపవాస ముండనీ
మగనాలిసరి పోల్పఁ దగదు విధవ
సద్భక్తి దేవతార్చనము సేయంగనీ
మగనాలిసరి పోల్పఁ దగదు విధవ

ఆశ నానాదివ్యదేశముల్ ద్రొక్కనీ
మగనాలిసరి వోల్పఁ దగదు విధవ
తిరిగి నానాపుణ్యతీర్థంబు లాడనీ
మగనాలిసరి వోల్పఁ దగదు విధవ

తే. నిద్ర మేల్కాంచి రేపాడి నియమపరత
నహిమభానుని వీక్షింప కటకుమున్న
తగదు వీక్షింప నరునకుఁ దల్లి వదినె
నత్తగారిని దప్పించి యన్యవిధవ. 83

ఉ. జీవముతోడఁ బాసి యశుచిత్వముఁ బొందిన మేనుగంధతో
యావభృథాభిషేకము సహస్రఘటంబుల నాచరించినన్
బావన మౌనె, యట్ల పతిఁ బాసి వితంతుత నొందినట్టిరా
జీవదళాయతాక్షి యశుచిత్వము వాయదు వేలెఅంగులన్.

తే. ప్రియము గలిగిన నంగీకరింపవలదు
ముండదీవన రేపాడి మోముఁ జూచి
బైసిమాలిన పరమనిర్భాగ్యురాలు
విధవ దానియాశీస్సును విషసమంబు. 85

సీ. పెండిలినాఁడు భూబృందారకులు గన్య
నప్పగించిరొ లేదొ యధిపుఁ గూర్చి
సహచారిణివి గమ్ము సకలకాలమునందు
నిండుఁజందురునిఁ జంద్రికయుఁ బోలెఁ
దొలుకాఱుమొగులు విద్యుల్లేఖయును బోలె
ననుగమింపఁగఁ బాడి యతివ మగనిఁ
బితృవనంబునదాఁకఁ బతివిమానము వెంటఁ
గైసేసి కొలనాడఁ గదలుభంగిఁ

తే. బిఱికికండ 'యొకింత లే కఱమి వేడ్కఁ
జి చ్చుఱకఁ బోవువికచరాజీవనేత్ర
కశ్వమేధంబుఫలము తథ్యంబు గలుగుఁ
బదము పదమున కిది. వేదభాషితంబు 8

తే. పుట్టలోపలిపాము నభ్యుద్ధరించు
వశ్యమంత్రుండు పాములవాఁడపోలె
భ ర్త నభ్యుద్ధరించుఁ బాపంబువలన
నగ్ని నుఱికినయట్టి పద్మాయతాక్షి. 8

గీ. పెక్కుమాటల నిటు జాగుపెట్ట నేల
సాధ్వి ఘర్షింప నొకఁ డెట్టు చాలఁ గలఁడు?
గంధవాహంబు వెఱచు నక్కలువకంటి
పసుపుపయ్యెద పాలిండ్లఁ బాయఁ దట్టి. 8

తే. ఔర్వశిఖికంటె శిఖికంటె నర్కుకంటెఁ
బిడుగుకంటెను దీవ్రమై బిఱుసు చూపు
నాత్మఁ దప్పఁగఁ దలఁచుదురాత్మకులకు
నహహా! పతిదేవతాప్రభావాతిశయము. 8

చ. తొలఁగుదు రంత నంత యమదూతకిరాతులు భీతచిత్తులై
కలుషసమన్వితుం డయినకాంతునిదారుణలోహపాశశృం
ఖలికలు వీడ్చి పుచ్చుకొని కాంతచితాగ్నిశిఖాముఖంబునన్
వెలువడియాత్మభర్తవెనువెంటహుటాహుటిఁగూడివచ్చినన్.

తే. ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాకభువనంబునం దాత్మనాథుఁ గూడి
వెఱ పొకింతయు లేక చి చ్చుఱికె నేని. 91

తే. తండ్రివంశంబునం దేడుతరములకును
దల్లివంశంబునం దేడుతరములకును
ధవునివంశంబునం దేడుతరములకును
శాశ్వతస్వర్గసౌఖ్య మీఁ జాలు సాధ్వి. 92

వ. అని పలికి బృహస్పతి లోపాముద్రం గనుంగొని దేవీ! నీప్రసంగవశంబునం గొన్ని యోషిద్ధర్మంబులు చెప్పితి. నీవు మహాపతివ్రతవు. నీబోఁటిపుణ్యవతులు కొందఱు గలుగం బట్టి గదా వసుంధర దిరంబై యున్నయది. ఇదె నీకు నమస్కారంబు.

క. మావచ్చిన కార్యమునకు
నీ వనుకూలత భజించి నిర్మలకరుణా
శ్రీ వెలయఁగఁ బ్రార్థింపుము
నీవల్లభు భువనకుశలనిర్వాహకునిన్. 94

వ. అని యగస్త్యమహామునిం జూచి వెండియుం బ్రణమిల్లి యాఖండలగురుం డి ట్లనియె. 95

బృహస్పతి యగస్త్యునితోఁ దమవచ్చిన కార్యంబు నెఱింగించుట.

సీ. ప్రణవంబు నీవు నిర్మలగుణాలంకార!
యామ్నాయవిద్య యీయలరుఁబోఁడి
తప మీవు శశికళోత్తంసభక్తినిధాన!
శాంతి యీసంపూర్ణచంద్రవదన
ఫల మీవు వాతాపిబలదర్పభంజన!
సత్క్రియ యీగంధసారగంధి
మిహిరుండ వీవు విశ్వహితప్రవర్తక!
చైతన్యలక్ష్మి యీచపలనయన
తే. బ్రహ్మతేజంబు నీయందుఁ బ్రజ్వరిల్లుఁ
బ్రజ్వరిల్లుఁ బతివ్రతాపరమతేజ

మీాలతాతన్వియందు మాకిందఱకును
నుభయతేజంబులును మహాభ్యుదయ మొసఁగు. 96

తే. శక్రుఁడీతండు శిఖి వీఁడు జముఁ డితండు
రాక్షసుఁడు వీఁడు పాథోధిరాజు వీఁడు
పవనుఁ డీతండు కిన్నరపతి యితండు
వృషభవాహనుఁ డీతండు విశ్వవంద్య! 97

వ. వీరె మునులు. వీరె సిద్ధసాధ్యమరుత్కిన్నరకింపురుషగంధ
ర్వవిద్యాధరు లగుదేవయోనులు. మావచ్చినకార్యం బవధ
రింపుము. వింధ్యం బనుమహీధరంబు విబుధశైలంబుతోఁ బ్ర
తిస్పర్ధించి యూర్ధ్వాండకర్పరంబు నిజశిరశ్శృంగశృంగా
కంబుల నుద్ఘాటించుచు ననూరుసారథిరథంబవరోధించి నక్ష
త్రగ్రహతారకాచక్రంబుఁజిక్కుపఱచి సప్తసమీరణస్కంధ
ంబులనుం బ్రతిబంధించి శింశుమారాకారంబునం దారా
వీథిఁ బవ్వడించిన పాంచజన్యధరు నొరసి యాత్మానప
నుత్తరించి గగనగంగనాలింగనంబు చేసియురులింగాకా
రైనధూర్జటిం ద్రివిక్రమాకారంబున విరాడ్రూపుండగు
ష్వక్సేను ననుకరించుచున్న యది. తృటినిమేషకాష్ఠాకా
ముహూర్తాహోరాత్రపక్షమాసర్త్వయనసంవత్సరయుగ
ధ్యాసంధ్యాంశమన్వంతరకల్పమహాకల్పాదిభేదభిన్నంబై
దార్థంబులం బరిచ్ఛేదించుకాలంబునిరస్తసమస్తోపాధికస్వ
తిష్ఠాఖండసచ్చిదానందైకరసాద్వితీయరూపుండై నవిరూ
ఢుండు దప్పించి యన్యులనుంబరిచ్ఛేదించు. అట్టికాలంబ
కుందపనపరిస్పందంబు మూలంబు. మార్తాండుండు కొం
ప్రక్కం జిక్కి కడలిమొగయక్కలిం దగులువడినజోగుబ
బోలె నెదురు నడవ మఱలం బఱవ లేక చీకాకుపడియు

వాఁడు. ప్రాహ్ణాపరాహ్ణామధ్యాహ్న సమయంబులు గత్తరఁ గ
లసి యుంటం జేసి నిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబులుప
సంహృతంబు లయ్యె. ప్రాచ్యోదీచ్య దేశంబు లంధకారా
తపహిమానిలంబులచేతం జేతనావైకల్యంబు వహించె.
భువనంబుల కకాండప్రళయం బావిర్భవించె. కల్పాంతకా
లంబునందును గసుగందకుండుం గావున నవ్వేసవిఁ గాశీ
క్షేత్రంబునందునుపరతి చూపదు.ఏమును నిమ్మహోపద్రవం
బునకుం బ్రశాంతిఁ గోరి యబ్రహ్మణ్యంబు సేయుచు బ్రహ్మ
శరణు సొచ్చితిమి. అవ్విరించి కరుణాకటాక్షంబున నీక్షించి
యీయాపద యపనయింపవాతాపిహారితాపసుండుదక్కం
దక్కినవాఁడు సమర్థుండుగాఁడు. అతనిం బ్రార్థింపుఁడు,పొం
డని తాన నీకందువ చెప్పిన నీయానందవనంబున కరుదెంచి
తిమి. ఇఁక మీఁదఁ గోపాటోపావకుంఠకంఠకఠినహుంకార
ధారావష్టంభంబునం ద్రివిష్టపరాజ్యలక్ష్మీమదాంధుం డైన
నహుషుని నిమిషమాత్రంబున ధాత్రీమండలంబునం బడఁ
ద్రోచిన మహానుభావుండవు. నీవ ప్రమాణంబు. 98

క. ఎవ్వాఁడు నిసర్గకఠినుం
డెవ్వాఁడు సన్మార్గరోధి యీర్ష్యాపరుఁ డై
యెవ్వాఁడు దన కధికునితోఁ
జివ్వకుఁ జేసాఁచు వానిసిరు లద్రువముల్. 99

వ. అనినవాచస్పతిపలుకులాకర్ణించియమ్మునిపుంగవుండిట్లనియె.

తే. యత్న మొనరింతు నీకార్య మనువుపడఁగ
జనుఁడు మీమీనివాసదేశముల కర్థి
నున్నవాఁడు గదా! వీఁడె యుమయుఁ దాను
గాశికాభర్త మనపాలికల్పతరువు. 101

వ. అనిన వారును మహాప్రసాదం బని సముచితప్రకారంబున
గుంభసంభవుని వీడ్కొని నిజనివాసంబులకుం జనిరి. అన
తరంబ యగస్త్యుండు లోపాముద్రం జూచి యిట్లనియె.

అగస్త్యుండు కాశీవియోగంబునకుఁ బరితపించుట.

తే. కమలలోచన! మనుజుఁ డొక్కటిఁ దలంప
దైవ మొక్కటిఁ దలఁచు నెంతయు నిజంబు
కాశిఁ బెడఁబాయ నని యేను గదలకుండఁ
గాశిఁ బెడఁబాపె దైవంబు కరుణలేక. 103

తే. అప్పటికి నియ్యకొంటిఁ గా కంబుజాక్షి!
ఋషులపాలింటివే యింతలేసి పనులు?
కొసర కాఁబోతు నాఁబోతు గ్రుమ్ములాడ
నడిమి లేఁగెయ్యగతి వచ్చె నాకు నిపుడు. 104

సీ. వివరించి చూడంగ విసుమానములుగాక
గోత్రారి వెఱచునే కుధరములకు?
యుగవిరామమున నుత్తుంగత లూఁపఁగఁజాలు
గాలి కొండ దమింపఁ జాల దెట్లు?
సర్వభూతంబుల శాసింపఁజాలెడు
జములావు గిరియందుఁ జటులువడునె?
దహనునిదాహకత్వంబు మహీధ్రసం
స్తంభంబునకు శక్తి చాల దొక్కొ?
తే. రుద్రు లాదిత్యతుషితమరుద్గణములు
దక్కఁగల దేవతలు జగత్త్రయము మ్రింగి
యుమియఁ జాలుదు రట్టివా రోపలేరె?
వింధ్యగిరిగర్వసంరంభవిభవ మడఁప. 105

తే. కామధేనువుఁ దనయింటఁ గట్టినాఁడు
గలవు తనతోఁటలోపలఁ గల్పతరులు
అట్టియింద్రుండు ప్రార్థించె నట్టె నన్ను
నింతపని కియ్యకొనకుండ నెట్లు నేర్తు? 106

సీ. మాటనిల్కఁడఁ గాదె? మధుకైటభులు ద్రొల్లి
హరిచేతఁ జచ్చి రేకార్ణవమున
గరుడుఁడు మోమోటఁ గాదె? వాహన మయి
వనజాక్షు నెక్కించుకొనియె వీఁపు
సాకతంబునఁ గాదె? చక్రాయుధుఁ డడంపఁ
బాతాళబిలములో బలి యడంగె
విశ్వాసమునఁ గాదె వృత్రాసురేంద్రుండు
సమసె నంబుధివేల శక్రుచేత
తే. మెఱసి యుపకార మొనరింప మేలు వచ్చుఁ
గీడు వచ్చు మనంబులో నోడ వలదు
వాఁడు చేసినధర్మంబు వానిఁ గాచుఁ
గీర్తి యొక్కటి సాలదే? కేవలంబ. 107

చ. ప్రతిదివసంబు విందుము పురాణముఖంబునఁ గాశియందుసం
తతముగ నంతరాయములుదాఁకుచునుండుననంగనిప్పుడా
శ్రుతి నిజమయ్యె నే నిదె యశోకమనస్కత నుండఁగా నత
ర్కితగతివచ్చెఁజూడుమిదెకిన్నరకంఠి!మహాంతరాయముల్.

తే. విముఖుఁ డయ్యెఁ జుమీ! నాకు విశ్వభర్త
గాక యూరక యేభంగిఁ గలుగనేర్చు
సకలకైవల్యకల్యాణజన్మనిలయ
కాశికాక్షేత్రవిప్రయోగవ్యథార్తి. 109

తే. పాణియాహారకబళంబుఁ బాఱవైచి
కూర్పరము నాకు వెనువెట్టికూళ వోలె
భోగమోక్షములకు జన్మభూమి యైన
కాశి విడిచి నరుం డన్యదేశ మరుగు.

చ. తటుకున నియ్యకొంటి మతి దప్పి మరుద్గురునంతవాని
నటమటమింకఁ బోక యడియాసల నుండుటఁ బాపుదైవమ
యిటు ననుఁ జిక్కు వెట్టె దె యనేకవిధంబుల నెట్లు చెప్పిన
గటకట! యెట్లు వాయనగుఁ గాశిక మోక్షపదప్రకాశిక

సీ. పాయంగ వచ్చునే ప్రాలేయగిరికూట
సమవతీర్ణజలౌఘు జహ్నుకన్య?
మఱువంగ వచ్చునే మందారమధురసా
స్వాదఘూర్ణితనేత్రు వటుకనాథు?
విడువంగ వచ్చునే విఘ్నాంధకారార్కు
ఢుంఠివిఘ్నేశు మండూకజఠరు?
మానంగ వచ్చునే మధ్యాహ్నకాలంబు
శ్రీవిశాలాక్షి కెంజేతిభిక్ష?

తే. సురలు ప్రార్థింపఁగాఁ బ్రతిశ్రుతము చేసి
యెట్టు వోకుండ నేర్తు నే నింతవాఁడ?
నెట్టు వో నేర్తుఁ గాశిఁ బుణ్యైకరాశిఁ
బ్రకటగుణరత్నదుగ్ధాంబురాశిఁ బాసి.

క. కాశీక్షేత్రము పంచ
క్రోశము కైవల్యలక్ష్మికులగృహ మని యా
క్రోశించు శ్రుతులు వినియును
దేశాంతర మరుగ సమ్మతింతు రభాగ్యుల్.

తే. కాశిఁ బాయుదుఁ గాకేమి కలువకంటి!
యంతరవిముక్తతీర్థంబు నాశ్రయింతు
నంతరవిముక్తతీర్థ మెయ్యదియొ యనిన
వరణయును నాశియును నైనవారణాసి. 114

వ. భ్రూఘ్రాణంబులసంధి యవిముక్తస్థానం బది యభ్యంతర
తీర్థంబు తీర్థంబులు బాహ్యాభ్యంతరభేదంబుల ద్వివిధంబులై
యుండు. 115

తే. ఎల్లవియు బాహ్యతీర్థంబు లిందువదన!
యరయ బాహ్యంబు లయ్యు నాభ్యంతరములు
కాశికాతీర్థ మాదిగాఁ గలవు కొన్ని
వాని వినిపింతుఁ బరిపాటి వనిత! వినుము. 116

సీ. శీర్షంబునందలి శ్రీశైలతీర్థంబు
మల్లికార్జునదేవుమనికిపట్టు
ఫాలభాగమునందుఁ బ్రాలేయమయ మైన
విమల కేదారతీర్థము వసించుఁ
గుచచూచుకములందుఁ గురుజాంగలక్షేత్ర
తీర్థరాజము సంప్రతిష్ఠఁ బొందు
భ్రూవల్లరీయుగ్మమునకు మధ్యంబున
నానందవనతీర్థ మధివసించు

తే. నంతరంగమునఁ బ్రయాగ మాశ్రయించు
నిమ్మహాతీర్థములు పార్వతీశ్వరునకు
విహరణస్థానములు వేదవిశ్రుతములు
వెలుపలను లోపలను నుండుఁ దలిరుఁబోఁడి! 117

వ. బాహ్యాభ్యంతరంబులయందును నవిముక్తతీర్థం బుత్తమో
త్తమంబు. అట్టితీర్థంబుననుండి యఖండంబు సచ్చిదానందైక

రసంబు నద్వితీయంబు నగునిష్కళంకస్వరూపంబును న
నారీశ్వరాదిరూపం బైనసకలస్వరూపంబును నగువిశ్వ
థునుపాసింప నొడగూడ దయ్యెం గావున నింక నేను భా
తీర్థంబున నయ్యభవు నుపాసించెద. సంసారసాగరంబు
యింపసాధనం బగుటఁ దీర్థం బయ్యె. ఆభ్యంతరంబైన
విముక్తతీర్థంబు బ్రహ్మవిష్ణుమహేశ్వరులకుపలబ్ధిస్థానంబగుట
త్రిమూర్తులకు సాధారణంబయ్యునుమహేశ్వరునకుం బ్ర
ధానస్థానం బై యుండు. 11

సీ. ఏవిధంబున నాత్మ నెఱుఁగుదు నే నంచు
యాజ్ఞవల్క్యుని నత్రి యడిగెఁ దొల్లి
యవిముక్తమునయం దుపాస్యుఁ డాత్మఁ డటంచు
యాజ్ఞవల్క్యుం డత్రి కానతిచ్చె
నాయవిముక్తమెం దాశ్రయించినది యం
చడిగెఁ గ్రమ్మఱ నత్రి యాజ్ఞవల్క్య
నను వార వరణయందును నాశియందును
నది యుండు నని యత్రి కానతిచ్చె
తే. యాజ్ఞవల్క్యుండు భ్రూమధ్య మాస్థలంబు
వరణ సంసారదోషనివారణంబు
నాశి యింద్రియదోషవినాశనంబుఁ
జేయుచుండుట యిది నిర్వచింపఁబడియె. 119

వ ఆభ్యంతరావిముక్తక్షేత్రదర్శనంబు బ్రహ్మనాడీ పవమా
జయంబునం గాని సిద్ధింపదు. 120

సీ. ప్రకృతిరూపిణి యైనపాఁపపూఁబోఁడికి
మహదాదివికృతులు మలక లేదు

మొగము విచ్చి సుషుమ్న మూలరంధ్రముఁ గప్పి
వంశాస్థిసంబంధవలనలీల
నది మీఁదు ప్రాఁకి మధ్యమనాడితోఁ గూడి
ద్రుహిణరంధ్రముఁ గప్పఁ దోఁకచివరఁ
జక్కఁ చాయఁ జరింప సమకూరకుండుట
నిడఁ బింగళను గాలి యెక్కు డిగ్గుఁ
తే. గెలనివాఁకిళ్లు రెండు వేగిరము మూసి
నడిమివాఁకిలిఁ దెఱవ నెన్నండు నేర్చు
సాధకుఁడు నాఁడుగాని వశ్యంబు గాదు
పవనవిజయంబు వానికిఁ బద్మనయన! 121
క. ఇడ వామనాడి పింగళ
కుడినాడి సుషుమ్న మధ్యగోచర యగు నీ
కుడియెడమ మధ్యనాడుల
కుడురాజానన! త్రిమూర్తు లొగి దైవంబుల్. 122
క. హరి యిడకు నలువ పింగళ
కరవిందదళాయతాక్షి! యమృతాంశుకళా
ధరుఁడు సుషుమ్నానాడికిఁ
బరిపాటి నధీశు లనుచుఁ బలుకుదు రార్యుల్. 123
వ. పవనంబునకు సుషుమ్నాప్రవేశలక్షణం బైన యోగంబు వివరించెద. బ్రహ్మలోకప్రాప్తిద్వారం బగుట సుషుమ్న బ్రహ్మనాడి యనం బరఁగు. షణ్ణవత్యంగుళప్రమాణంబైన దేహంబునట్టనడుమఁ ద్రికోణాకారం బై కుక్కుటాండంబు చందంబున నుండునది కందస్థానంబు. 124
తే. నాభికందంబు క్రిందట నలినగంధి!
కుండలీశక్తిదేవత యుండునెలవు

కుండలీశక్తి నాఁగఁ జకోరనేత్ర!
పాముచందాన నుండెడు ప్రథమధమని.

వ. అది మూలప్రకృతి. మహదాదిప్రకృతివికారంబులేడు
దానిమేనిమలకలు. అప్పాఁపచేడియయు సుషుమ్నా
తోడం బెనంగొనియుండు.

క. గిటగిట నెనిమిదిమలకలఁ
గుటిలీభావము భజించి కుండలి ప్రాఁకుఁ
నిటలాంతముదాఁక ను గ్రిం
దటిమొగ మైమ్రేలు నంద్రు తద్జ్ఞులు దానిన్.

తే. దానిచుట్టును నుండు లేఁదలిరుఁబోఁడి!
డెబ్బదియు రెండువేలు నాడికలు మేన
ముఖ్యనాడులు వానిలో ముద్దరాల!
పదియునాలుగు ననుచుఁ జెప్పుదురు బుధులు.

వ. ఇడానాడియందుఁ జంద్రుం డధివసించియుండుం గా
నందుఁ 'బవనం బుద్గమించుకాలంబు రాత్రి. ప్రవేశిం
కాలంబుపగలు. పింగళానాడియందు సూర్యుండధివసిం
గావున నందుఁ బవనం బుద్గమించుట దివంబు. ప్రవే
చుట రాత్రి. ప్రాఙ్ముఖస్థితుఁ డగుపురుషునకుఁ బింగళా
దక్షిణదిక్కున నిడానాడి యుత్తరదిక్కున నుండుఁగా
మకరాయనసమయంబునదక్షిణ దిగవస్థితుండగుసూర్యు
గర్కటాయనపర్యంతంబు నుత్తరంబునడచుటం జేసి యు
రాయణం బయ్యె. ఈచందంబునం బింగళాస్థితుం డగు
నుండు యావత్కాలంబు నిడయందు సంక్రమించు న
కాలం బుత్తరాయణం బీప్రకారంబున దక్షిణాయన
నెఱుంగునది.

చ. సమగతి నేకకాలమున సంగతి యామవతీకళత్రుఁడుఁ
గమలహితుండు ప్రాణమనుగాడ్పులు దారటుకూడిపింగళా
ధమనినిడాసి తీవ్రగతిఁ దార్కొని క్రుంకుదురస్తమింతు రే
సమయమునందుఁదాల్చునది చంద్రనిభాస్య! యమాభిధాన [మున్.

తే. పాము కుండలి చంద్రుండు ప్రాణపవన
మాసిరావల్లి యెప్పు డయ్యనిలుఁ గ్రోలు
నది యశేషాంగకగ్రాస మైనయట్టి
గ్రహణకాలంబు సుమ్ము సారంగనయన! 131

వ. ప్రాణంబ యాదిత్యుండు. ఆదిత్యుండ చంద్రుండు. ఆప్రాణా
నిలంబు మూలాధారప్రవేశానంతరంబుదయించు. మూర్ధ
ప్రవేశానంతరం బస్తమించు. దేవతలకు మొదలివిషువం
బైనమేషాయణంబున సూర్యుం డుదయించు. విషువాం
తరం బైన తులాయనంబున నస్తమించు. ప్రాణోదయాస్త
మయసమయంబులు విషువద్ద్వయంబు. 132

చ. మొదల సుషుమ్నఁ జొచ్చునిడఁబుట్టినగాడుపుకొంతసేపునం
బిదప సుషుమ్నఁబుట్టినసమీరము చొచ్చునిడాఖ్యనాడికిన్
మొదలనుబిమ్మటంబవనముల్ దిరుగంబడి చొచ్చుఁ గానన
య్యదనులుసంక్రమంబులనియాడుదురాగమతత్త్వకోవిదుల్.

వ. అని యవిముక్తక్షేత్రవియోగదుఃఖంబున మానసాంతర
విముక్తక్షేత్రమాహాత్మ్యం బుపన్యసించి యనంతరంబ
కాశికావిరహవేదనాభరంబు దుస్సహం బగుట నౌర్వశే
యుండు కాశిని లక్ష్యంబు చేసి యిట్లనియె. 134

క. ఆమచ్చిక లాచను వా
ప్రేమాతిశయంబు విస్తరింపఁగ వశమే?

త్మామండలతిలకమ పర
భూమికి ని న్నెట్లు వాసి పోవుదుఁ గాశీ! 13

మ. నిజ మేఁ బల్కెద బాహులెత్తి శ్రుతివాణీజాహ్నవీగో
ధ్వజదుంతీశగణేశ్వరుల్ గుఱిగ నోవారాణసీదేవి! యో
గజచర్మాంబరుకూర్మిపట్టణమ! యోకల్యాణి! నీ బోల
బుజగర్భాండమునందు లేవు నగరంబుల్ తీర్థరాజంబులు

తే. లేవు లింగంబు లవిముక్తలింగమునకు
సాటిసేయంగ భూర్భువస్స్వ స్త్రయమున
రావు దక్కటిపుణ్యతీర్థములు నీకు
సాటిసేయంగ భూర్భువస్స్వ స్త్రయమున. 13

వ. అని యెట్టకేలకుం గదలి విరాళింగొన్నచందంబున మ
గుడిచినపోల్కి నపస్మారంబెత్తినపగిది నన్నుగొన్న విధంబు
దూపటిల్లినతెఱంగునఁ దూలపోయినరీతి విషం బెక్కి
లీల గ్రుక్కఁగన్ను వెట్టినలాగున లాహిరి పట్టినభాతి మ
బెక్కినమాడ్కి నుంగిడిగొన్నభంగి నోసరిల్లుచునుహ్హాసుచు
నుమ్మలించుచు నుదిలగొనుచు నుపతాపం బందుచు
నూటాడుచు నూర్వశీనందనుం డూర్ధ్వబాహుండై య
చ్చైస్స్వరంబున. 13

సీ. పరమకల్యాణి! యోభాగీరథీ! గంగ!
వార్ధిభామిని! పోయివత్తు నమ్మ!
యమశేంద్రులార! లోలార్క కేశవులార!
వనజసంభవ! పోయివత్తు నయ్య!
శ్రీవిశాలాక్షి! దాక్షిణ్యపుణ్యకటాక్ష!
వాసవార్చిత! పోయివత్తు నమ్మ!

శ్రీపూర్ణభద్రపారిషదనాయకులార!
వటుకభైరవ! పోయివత్తు నయ్య!

తే. తీర్థసంవాసులార! కృతార్థులార!
పాశుపతులార! భాగ్యసంపన్నులార!
మందిరోద్యానవాటికామఠములార!
పోయివత్తునె మీకాశిపురము విడిచి? 139

సీ. కలహంసి! రారాదె కదలి నాతోఁ గూడి
నీ వేలవత్తమ్మ నెమ్మి నుండి
కదళికాకాంతార! కదలి రా ననుఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
నాతోడఁగూడి యంతర్గేహ! యేతెమ్ము
నీవేల వత్తమ్మ నెమ్మినుండి

తే. రండు ననుఁ గూడి యోపరివ్రాట్టులార!
వత్సలత గల్గి మీరేల వత్తు రయ్య!
పరమనిర్భాగ్యుఁ డైననాపజ్జఁ బట్టి
కటకటా! సౌఖ్యజలరాశిఁ గాశిఁ బాసి. 140

వ. అని యెట్టకేలకుఁ గాశీనగరంబు వెడలి కొంతదవ్వు నడచి విప్రయోగవేదనాదూయమానమానసుం డై వదనంబు వలువపట్లు పట్టం బాదంబులు గుదివడ నుష్ణానుచు నొకవట విటపినీడనజ్జటాధరుండు చతికిలంబడిలోపాముద్రకిట్లనియె.

తే. భూమిపతిపుత్త్రి! చెప్పుమా బుద్ధిమతివి
కాశి వెడలంగ వలసె నేకారణమునఁ.

గారణము లేక యూరక కలుగు నెట్లు
సుఖము దుఃఖము నరునకు సులభలీల? 1[illegible]

వ. కాశ్మీరంబులయందుఁ గుంకుమం బనునది దేశాపేక్ష; దివస
నంద కమలవికాసంబు, రాత్రియంద యుత్పలవికాస
ననునది కాలాపేక్ష; పుణ్యవంతునకు సుఖంబు, పాపిష్ఠు
దుఃఖంబు ననునది యదృష్టాపేక్ష; సర్వంబును నీశ్వరేచ్ఛా
యత్తం బనునది యీశ్వరాపేక్ష; విశ్వంబును గ్రహవ
బనునది గ్రహాపేక్ష; మాకుఁ జూడ నీశ్వరప్రేరణంబు
గర్మంబు సుఖదుఃఖంబుల నాపాదించు; ఈశ్వరుం డెవ్వ
రక్షింపవలసె వానిచేఁ బుణ్యకర్మంబులు చేయించు. నె
నిం జెఱుపవలసె వానిచేఁ బాపకర్మంబులు చేయించు. ఆ
ద్యాన్వితరాగద్వేషాదిలక్షణక్లేశపంచక మూలంబునఁగ
కర్మాతిశయంబు? అక్కర్మఫలం బిహలోకపరలోకంబు
బ్రాణు లనుభవింతురు. కర్మంబునకుమూలభూతంబైన క్లే
పంచకం బెంతకాలం బనువర్తించునంతకాలంబునకుఁ బ్రి
ధంబు పరిపాకంబు నానావిధయోనిజన్మప్రాప్తియు నాయు
సుఖదుఃఖఫలోపభోగంబును జన్మంబునజన్మహేతుకర్మ
చరితార్థం బయ్యెనేనియు నవశిష్టంబులై యాయుర్హే
వులు భోగహేతువులు నైన కర్మంబులకు ఫలానురూ
పైనభాగ్యంబుఁ బరమేశ్వరుండు గల్పించుచుండు. 1[illegible]

తే. ఏమి చెప్పఁగ నున్నది? యేవిధమునఁ
గాశి వెడలించుచున్నాఁడు కాలగళుఁడు
మనము లోఁగితి మేని లోఁగునె శివాజ్ఞ?
యుడుము నడికిన నడుకునే జడియపెట్టు? 1[illegible]

వ. అని వెండియు. 1[illegible]

సీ. వక్షస్స్థలంబున వైచు మంత్రము చెప్పి
జమిలిపాముల రాచజన్నిదంబు
జడ లల్లి చొల్లియం బిడి యెకసకెముగా
బాలేందుశకలంబుఁ బదిలపఱచుఁ
గంఠమూలమునందుఁ గస్తూరిమాఱుగాఁ
గాలకూటవిషంబుఁ గీలుకొలుపుఁ
గటిభాగమునయందుఁ గట్టు రింగులువాఱ
మెఱుఁగారు మువ్వన్నె మెకముతోలు
తే. గట్టువాలుపడంతి చక్కటికిఁ దోఁపఁ
దఱచు గైసేయుచుండు నాతల్లి కాశి
యయిదుక్రోసులపొలములో నంత నంతఁ
జావుకై యందుఁ జచ్చినజంతువులకు. 146
చ. అని యెదుపండి మ్రొక్కి నయనాంబురుహంబుల బాష్ప
బిందువుల్, చినుకఁగ వెక్కివెక్కి కలశీసుతుఁ డోయన నేడ్చు
నీ రెలుం, గున నొకకొంత సేపు మఱి గొబ్బున మిన్నులు
మ్రోవ నుద్ధుర, ధ్వనిఁ బఠియింపఁ జొచ్చెఁ బ్రణవంబునఁ
గూర్చినమంత్రరాజమున్. 147
వ. అచ్చోటు గదలి ప్రతిదినప్రయాణంబుల వింధ్యాచలంబు
డాయం జనుదెంచి విషమదృషత్ఖండవిలసనస్థలంబును
జరత్తరుకోటరజఠరలుఠదజగరగళగుహా నిష్ఠ్యూతనిష్ఠురప
వనసంధుక్షమాణదవదహనశిఖాకలాపంబునునుగ్రతరశరభ
చటులచపేటపాతమోహితకోలంబును సముద్ధతస్తబ్ధరోమ
కంఠకఠోరఘుర్ఘురధ్వానఘుమఘుమాయమానదిక్కుంజర
క్రోడంబును గ్రీడచ్ఛక్రోడశిశుచరణనఖశిఖాశిఖరవిశీర్య
మాణశిఖరశేఫాలికాకుసుమకేసరరజఃప్రసరధూసరవాసర

కరకరవ్రాతంబును బరుషతరుపవనబిలపతితపచేలిమదళ
భక్షణఫుల్లగల్ల భల్లూకప్రకరంబును నగుమహాగహ
మధ్యంబున. 1[illegible]

సీ. యక్షరాజుఁ దలంచి యక్షిగోళంబుల
నశ్రుపూరము నించు నర్మి మిగిలి
పలుమాఱు మఱి దండపాణిసౌహార్దంబు
భావించి భావించి పలవరించు
సంభ్రమోద్భ్రములు విశ్వాసపాత్రంబుల
సౌవిదల్లుల నర్థి సంస్మరించు
దిగ్గజాఘోరసిద్ధివినాయకకపర్ది
చింతామణీగణేశితులఁ బొగడు
తే. జ్యేష్ఠసౌభాగ్యసుందరీచిత్రకంఠ
వికటదుర్గామహాదేవి విశ్వబాహు
వాపికాదేవతల నిజస్వాంతవీథిఁ
గాంచి గఱుదాల్చు సర్వాంగకములఁ దపసి. 1[illegible]

క. త్రిణయనునిరాణివాసము
నణిమాద్యైశ్వర్యవితరణామరతరువుఁ
మణికర్ణిక ముక్తివధూ
మణికర్ణికఁ దలఁచుఁ దపసి మానసవీథిన్. 1[illegible]

సీ. కఠవల్లిఁ జింతించుఁ గఠము సంశోధించుఁ
బ్రాణోపనిషదభిప్రాయ మరయుఁ
బరిపాటి ముండకోపనిషత్తుఁ దాపనీ
యోపనిషత్తు నభ్యపగమించు
దటియు నథర్వవేదశిరఃప్రపంచంబు
లారణ్యకముత్రోవ లరసి చూచుఁ

బ్రహ్మోపనిషదర్థపరిమళంబు గ్రహించు
శ్రీభగవద్గీతఁ జిత్తగించుఁ
తే. దల వకారంబు శ్వేతాశ్వతరము ననెడు
నుపనిషత్తులు దలఁపోయు నొయ్య నొయ్యఁ
గాశికాక్షేత్రవిప్రయోగప్రభూత
హృదయసంతాపశాంతికై యిల్వలారి. 151
వ. అప్పుడు. 152
మ. క్షితిపాలోత్తమవంశభూషణము లక్ష్మీభారతీపార్వతీ
ప్రతిబింబంబు సమగ్రకాంతిమతి లోపాముద్రనీక్షించి య
ద్భుతముంబొందుచువింధ్యనామకమహాభూమీధరారణ్యదే
వత లందంద నమస్కరింతురుమనోవాత్సల్య మేపారఁగన్.
మ. నలి వింధ్యాచలకాననాంతరమున న్వారాణసీత్యాగవి
హ్వలభావంబున నిల్చి నిల్చిహర!నీహారాంశుమూర్ధన్య! ని
ర్మల!కాశీశ్వర!నీలకంఠ!యనుచుర్వ్యగ్రాఁగన్నువాటిల్లఁ ద
త్కలశీసూనుఁడుమూర్ఛఁగై కొనుఁగ్రమక్షామాక్షరోల్లాసి
వ. వెండియుఁ గుంభసంభవుండు. [యై.
చ. దురితము లెన్ని చేసితినొ తొల్లిటిజన్మమునందుఁ గాశికా
పురమున సర్వజంతువులు భూరివిముక్తులు గొల్లవెట్టఁగా
హరహర! నెత్తిఁజేతు లిడియశ్రులుగన్నులనుప్పతిల్లఁగాఁ
గరినిభయానతో నిదె పొకాలెదమిన్నులు వడ్డచోటికిన్.
తే. ఏల మ్రింగితి వాతాపి నిల్వలుఁ? నిల
నేల త్రోచితి దివినుండి యోలి నహుషుఁ?
నాప్రభావంబు గాదె న న్నదిరిపాటు
కాశి వెడలంగఁద్రోచె నిష్కారణంబ. 157

సీ. ఎన్నఁడు చూతునో యింకొక్కమాఱేను
బ్రకటకైవల్యంపురాశిఁ గాశి?
నెన్నఁడు చూతునో యింకొక్కమాఱేను
జగదేకపావని జహ్నుకన్య?
నెన్నఁడు చూతునో యింకొక్కమాఱేను
మహిమాస్పదము ముక్తిమంటపంబు?
నెన్నఁడు చూతునో యింకొక్కమాఱేను
విశ్వలోకాధ్యక్షు విశ్వనాథు?
తే. నింక నెన్నఁడు చూతునో యేను డుంఠి?
నింక నెన్నఁడు చూతునో యేను దుర్గ?
నింక నెన్నఁడు చూతునో యేను వటుకు?
నింక నెన్నఁడు చూతునో యేను గుహుని?

**అగస్త్యుండు లోపాముద్రతోఁ గాశిఁ బెడబాయుట వింధ్యగర్వాపహరణము.**

వ. అనుచు నల్లనల్లన వచ్చుకుంభసంభవు దవ్వుదవ్వులంగాఁ కాంచనశిరశ్శృంగశృంగాటకంబులం గమలభవాండకటాహంబు లుద్ఘాటించుతనమేనిపొడవు నేలసపాటంబు వంచి వింధ్యాచలంబమ్మహానుభావు నెదుర్కొనియె. అహర్కునిరథంబుచక్కఁ జాయ నడచె. పవనస్కంధంబు నిర్బంధంబు లుడిగె. ఇందుండు చిందిలిపడసాగె. మంగళ బృహస్పతిశుక్రశనైశ్చరరాహు కేతువులు దమతమలోకంబులు దప్పకచరింపం దొడఁగిరి. ప్రపంచంబు సర్వంబు యథాపూర్వంబునం బ్రవర్తిల్లె. కాలంబు లేర్పడియె. అనంతరంబ పురుషాకారంబు దాల్చి యజ్జగతీధరంబు గో యజ్జలం బ్రత్యుద్గమించి.

సీ. ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబుఁ
గడదాఁక నెఱిఁగినకలితలాని
వాతాపిదైత్యు నిల్వలునితోఁ గూడంగ
జఠరాగ్ని వేల్చినపవనకర్తఁ
గోపించి నహుషునిఁ గుంభీనసంబుగా
హుంకార మిచ్చినయుగ్రతేజు
వానకాలమునాఁడు వండుపట్టిననీటి
కాలుష్య ముడిపెడుకతకఫలముఁ
తే. బాండుభసితత్రిపుండ్రాంకఫాలభాగు
భద్రరుద్రాక్షమాలికాభరితవపు
భార్యయును దాను నేతెంచుపరమశైవుఁ
గాంచె వింధ్యాచలేంద్రంబు కలశభవుని. 160

క. కాశీనగరవియోగ
క్లేశభవక్రోధవహ్నికీలల నాశా
కాశధరిత్రీవలయము
లాశుగతిం గాల్పఁ గడఁగునట్టిమహోగ్రున్. 161

వ. కాంచి యక్కుంభినీధరంబు కుంభసంభవు నతిథిసత్కార సంభావనావిశేషంబులంబరితోషంబు సంపాదించికరాంభో రుహంబులు మోడ్చి 'మహానుభావా! నీయాజ్ఞాప్రసాదభా వంబున ననుంగృతార్థుం జేయు' మని పలికిన. 162

సీ. వింధ్యాచలేంద్ర ! పృథ్వీభృత్కులశ్రేష్ఠ!
దక్షిణాపథముతీర్థంబు లాడఁ
బోవుచున్నార మీపుప్పుఁబోఁడియు నేను
బెద్దకాలమునాఁటిపెరువ గాన

లావు చాలదు జరాక్లైబ్యంబుకతమునఁ
బోడ వెక్కినపుడు డిగెడునపుడును
నభ్రంకషము లైనయానీశిరశ్శృంగ
శృంగాటకము లిట్లు చిఱుతపఱచి
తే. యనఘ! నేఁ గ్రమ్మఱఁగ వచ్చునంతదాఁక
నుండవలయు ధరిత్రిలో నొదిగి నీవు
చేయు నాయాజ్ఞ లెస్స యోఁ జేయకున్న
నెఱిఁగెదవు గాక రజ్జాడ నేల యిపుడు?

వ. అనిన వింధ్యంబు మహాత్మా! చరాచరంబైనజగంబున నీయాజ్ఞఁ జేయనివారునుం గలరె? నీవు మరలి విచ్చేయునంతదాఁకను నిట్ల యుండెద ననినఁ గుంభసంభవుం డనుదీవించినిజపాదాంభోరుహవిన్యాసంబుల విశ్వంభరాభాగంబు భాగ్యవంతంబు గావించుచు దక్షిణదిశాభిముఖుండై చనియె నని చెప్పిననైమిశారణ్యవాసు లటమీఁదివృత్తాంతం బెయ్యది యనుటయు.

ఆశ్వాసాంతము.

ఉ. బలవద్బారహదొంతిమన్నెధరణీపాలావరోధాంగనా
విలసన్మంగళసూత్రరక్షణకళావిఖ్యాతకారుణ్య! య
త్కలకర్ణాటతురుష్కరాట్పరమమిత్రా! కుండలిస్వామిపా
డలపూజాపరతంత్రధీవిభవ! పంటక్ష్మాపచూడామణీ!
క. భూపాలమథన! జంబూ
ద్వీపేశ్వర! విమతరాయవేశ్యావిటఘా
టీపటహడాన్నినాదా
టోపప్రక్షుభితదిక్కుడుంగక్రోడా!

ఉత్సాహ.—
బంధులోకపారిజాత! పంటవంశపావనా!
సంధివిగ్రహప్రధానషడ్గుణా! విశారదా!
గంధవాహభుక్కలాపకంఠకోణనాభిని
ర్గంధనక్రియామహాప్రగల్భకీర్తివైభవా! 167

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయప్రణీతంబైన కాశీఖండం బనుమహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

—•—

శ్రీ ర స్తు.

# తృతీయాశ్వాసము.





మద్దేసటివంశ
గ్రామణి! మూర్ధాభిషిక్తకంఠీరవ! సు
త్రామనిభవైభవోన్నత!
భామాపాంచాల! వీరభద్రనృపాలా!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

ఉ. అప్పృథివీధరంబు హృదయంబున సంతస మందె నే[...]
యుం, గోపనుఁ డెల్లకాలమును గుంభభవుం డతఁ డిప్పు[...]
గ్రుఁడై, శాపవిషప్రయోగమునఁ జంపఁ దలంచిన [...]
మెవ్వర, ష్టాపదశైల మిప్పటికి శంక వహింపకయుం[...]
గావుతన్.

వ. అని కుంభసంభవుని ప్రత్యాగమనంబుఁ గోరుచు వింధ్యా[...]
చలంబు వంధ్యోదయం బై వసుంధరాగర్భంబున నడఁ[...]
యుండె.

తే. ముని జటాధారి శివభక్తుఁ డనఘమూర్తి
యెవ్వఁ డేతెంచు నప్పు డత్తెత్తి చూచుఁ
గుంభసంభవుఁ డనుకోర్కి కొనలుసాఁగ
వసుమతీధర మతఁ డేల వచ్చు మరలి?

తే. మొదలిపెక్కువయును బోయి మునిఁగె నద్రి
కలశజునినేత్రమునఁ గెంపు గాన నైన
నొరుని యైశ్వర్య మీక్షించి యుపతపించు
నట్టిఖలునకు నది పెద్ద యౌనె? తలఁప. 6

క. సిద్ధింప వీప్సితంబులు
సిద్ధించిన వేనిఁ బిదపఁ జెడు నన్యునిసం
వృద్ధిఁ గనుంగొని యెవ్వని
బుద్ధి నసూయాగ్రహంబు వొడమ నతనికిన్. 7

తే. అప్రయోజన మభివృద్ధి నతిశయిల్లు
నప్రయోజన మడఁగుఁ గాలాంతరమున
నకట! యీర్ష్యాగ్రహగ్రస్తుఁ డైనయట్టి
ఖలునిసంపద విధవచన్నులును బోలె. 8

వ. ఆసమయంబునం బాకశాసనపావకపరేతరాజపలలాశిపాశి పవనపాలస్త్యపశుపతులు పరమహర్షోత్కర్షంబున నగస్త్యమహర్షిం బ్రస్తుతించిరి. పతంగుండు బసిండికొండనెత్తంబు చక్కటివియత్తలంబున నడవం దొడంగె. 9

సీ. స్ఫటికభూములయందుఁ బ్రతిబింబములు చూచి
యితరాశ్వబుద్ధి హేషిత మొనర్చుఁ
బద్మరాగోపలప్రస్థభాగములందుఁ
జరమసంధ్యాశంక జాడ్య మందు
మరకతమణిశిలామధ్యంబునందు దృ
శ్యాదృశ్యమూర్తులై యలఁచు సూతు
వైడూర్యమణిమయవప్రాంతములయందు
సలిలాభిలాష నొదలలు వాంచుఁ

తే. గిన్నరస్త్రీలఁ జూచి లంఘింపఁ బాఱుఁ
గావరం బెత్తి యుద్దామకామవికృతి
వాయుజవములు రవి తేరివారువములు
వేల్పుగుబ్బలిప్రస్థానవీథియందు.

సీ. తమతనుచ్ఛాయ మేఘములు పచ్చనివన్నె
నుభయపక్షములు నై యూఁగియాడఁ
గళ్యాలఁ దెగినసృక్వముల క్రొన్నెత్తురు
లాననంబులకుఁ గెంపావహింప
నుడుపథంబునయందు నుండినగతి ధార
గమనవేగంబునఁ గానఁ బడఁగ
శుకముఖద్విజకోటి సులభకౌతూహల
వ్యతిషంగమునఁ జేరి యనుచరింపఁ

తే. జిలుకలును బోలె హేమాద్రిశిఖరశృంగ
కల్పవృక్షాటవీవాటికలఁ జరించె
మహీధరముసేయునంకిలి మానుటయును
వనజవనబాంధవుని తేరివారువములు.

సీ. ఆకాశవాహినిసైకతంబుల ఖురాం
చలటంకములు గ్రుంగ జడనుపడిన
శాతకుంభాచలస్థపుటస్థలంబున
జక్రాభిహతివడి చాలకున్న
బహులదూర్వాశంకఁ బ్రణతదేవకిరీట
మరకతద్యుతులకై మరులుగొన్న
నిందుబింబముఁ జూచి చెందుప్పుగలుసావి
యఱు లెత్తి నాకంగ నాసపడిన

తే. బసిఁడిగిలుకలచేర్కోలఁ బరిఢవించి
కఠినహుంకార మొనరించి కనకరథము
వారువంబులఁ బఱపె దుర్వారలీల
బిరుసు తహతహ వినువీథిఁ బిచ్చుగుంటు. 12

**అగస్త్యుండు దక్షిణకాశికిం బోవుట.**

వ. ఇవ్విధంబునం భువనోపద్రవంబుఁ బ్రశాంతిం బొందించి దక్షిణకాశీసందర్శనంబునంగాని కాశీవియోగవేదనాభారంబు డిందుపడ దని డెందంబున నిశ్చయించి మందమంద ప్రయాణంబులఁ గెందలిరాకుఁబోఁడింగసుగందకుండ ముందఱ బిఱుంద నడిపించుచు నెడనెడఁ బుణ్యవాహినీతీర్థంబుల గ్రుంకులువెట్టి యష్టమూర్తి నభ్యర్థించుచుం గొన్నివాసరంబులకుఁ గుంభసంభవుండు గోదావరి నోరసికొనుచు నాంధ్రదేశంబున నరుగునప్పుడు. 13

మ. అహరారంభములందుఁ బ్రస్రవణశైలాధిత్యకాకందరా
కుహరక్రోడకటాహగద్గదనటద్గోదావరీసింధువా
ర్లహరీశీకరమాలికాశిశిరము ల్పంపాసఖుల్ దండకా
గహనగ్రావహులువాయువుల్ దపసికింగల్పించెనాహ్లాదమున్.

తే. ఋషికిఁ బంపాసరోవీచిపృషతశిశిర
గంధవాహప్రవాహసంబంధములును
గాశికాక్షేత్రవిప్రయోగప్రభూత
తాపశాంతి యొనర్పంగ నోపవయ్యె. 15

సీ. పట్టసశ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథునంఘ్రులకు నెరఁగి
పురశాసను ననంతభోగేశ్వరస్వామి
హిమశైలకన్యకాధీశుఁ గొల్చి

పద్మాద్రిపై రుద్రపాదంబు లర్చించి
చేరి మార్కండేయశివు భజించి
కోటిపల్లీతీర్థకుండలాముఖముల
నర్ధేందుధరు విరూపాక్షుఁ దలఁచి
తే. పల్వలస్థానమున భూతభర్త నిలిపి
కణఁకఁ గౌంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి
దక్షవాటిక సప్తగోదావరమున
మునిఁగి భీమేశ్వరునిఁ గాంచె మునివరుండు.
శా. ప్రాతఃకాలము తీవ్రభానుఁ డుదయింపన్ సప్తగోదా
స్రోతఃపూరమునన్మునింగియభవున్ సోమార్ధచూడామణి
జ్యోతిర్లింగమయస్వరూపుఁగొలిచెన్ శుద్ధాంతరంగంబున
బాతివ్రత్యమహాప్రభావనిధి లోపాముద్ర భీమేశ్వరున్.
మ. మునిచూడామణియెల్ల సత్కళలకున్ మూర్ధాభిషిక్తుండు
పునఁ జారీకరణాంగహారముల తావుల్ మెచ్చికీర్తించు
శనివారోత్సవవేళఁ గన్గొనియె నాస్థానంబునన్ రాజస
దనయుందానును దేశిమార్గమునగంధర్వాప్సరోనృత్తము
వ. అంత.
తే. కుంభజుఁడు దక్షిణాభిముఖుం డగుటయు
నదను వీక్షించి వచ్చె నో యనఁగ వచ్చె
శంబరారిప్రతాపాగ్ని సామిధేని
నవశరద్వేళ శ్రీభీమనాథుఁ గొలువ.
తే. జిగురుకొన్న రజస్స్ఫూర్తిఁ జెఱఁగుమాసి
జలదకుంభోదకంబున జలకమాడి
మలయజాచ్ఛపయోధరమండల లగు
దిగ్వధువులందు శుచిఁ బ్రవర్తించె నినుఁడు.

సీ. అభినవోన్మేషచిహ్నం బైనతోలుచూపు
కౌస్తుభాలోకరేఖలకు నలఁగ
సాంగభంగం బైనయావులింతకు వేల్పు
లంగుళిస్ఫోటంబు లాచరింప
శాఖశాయనికు లై సంవర్తభృగ్వాది
మునులు హస్తాంభోజములు మొగుడ్ప
ధృతచేతనంబు లై దివ్యాయుధంబులు
జయజయధ్వనులతో సంస్తుతింప
తే. కలువతేకులువోని పెంజిలువతేని
యరఁటికుబుసంబుపొరలు మై నంటియుండ
నిదుర మేల్కాంచి కూర్చుండె నుదధినడుమ
విష్ణుఁ డఖిలేశ్వరుఁడు శరద్వేళయందు. 22

వ. వెండియుఁబాకవశవిశీర్ణదిశాశాల్మలీగుల్మతూలరాశిదేశీయం బులు వియదురగనిర్మోకశకలభ్రమంబులు నభ్రముపలిశరీర శుభ్రంబులు నగుసితాభ్రంబు లభ్రంబునం బరిభ్రమించి ఖండఖండంబు లై యాఖండలకోదండంబుల గగనమండ లంబు నలంకరించె కొదమమొగుళ్లు దొరలును దడంబడు వలుఁదవడగండ్లు పుష్పాంజలులును నులుముచప్పళ్లుమర్దళ ధ్వనులుగా గగనరంగస్థలంబునం గ్రొమ్మెఱుంగుగొండ్లి పరి ఢవించెమత్తవనమయూరమత్తకాళినిసకలమధురకంఠకేకా గీతికావసానంబునం గళాపించె. కుంభద్రోణంబు లంభో ధరంబులు గురిసి వెలిచినయనంతరంబ యంతంత నుట్టిపడు నట్టిసలిలబిందువులునుం బోలె రజనీశుక్తిముక్తాఫలంబులు నక్షత్రంబు లంతరిక్షంబున సంప్రేక్షణీయంబు లయ్యె. దాక్షారామకటకాప్సరస్తాటంకినీవదనారవిందలావణ్యబిందు

నిష్యందంబు చందురుండు కందర్పదిగ్విజయకీర్తిస్నా
యుం బోనియచ్చవెన్నెల విచ్చలవిడిం గాయం దొడం
కుముదంబులు ముదం బందె, లాంగలి చెంగలించె, తె
స్లిల్లె, కాసర గాచె, దోస దోరగిలంబారె, పయ్యోద వి
వారి పండఱియె, కరి మదంబుఁ గురిసె, నందిపోతు
రించి ఖణిల్లున ఱంకె వైచె, అసలడుగువడియె, నెఱిని
దిబ్బ చూపె, నిద్ర చవియయ్యె, ఏడాకులపొన్న క్రొ
పెరిఁగె, వరిగ వెరిగె, గసగస యెసక మెసఁగె, పెసరు
కొనియె, దవనిక పొదలె, తెక్క ప్రాసంగు దొండము
వడియె, మదకలహంససారసకలాలాపకోలాహలవ్యా
భితకకుభంబు లైనవిహారవేశంతంబులు గాంతాకుచద్వ
ద్వయసవారిపూరవంతంబు లయ్యె నయ్యవసరంబున.

తే. కార్తికికవేళ భీమశంకరునినగర
వింధ్యసంస్తంభయిత దూఱె విమలబుద్ధిఁ
దొయ్యలియుఁ దాను జిచ్చఱతోరణంబు
కలుషసంహాతిసంహారకారణంబు.

క. దక్షిణవారాణసి యగు
దాక్షారామంబు సొచ్చి తరుణేందుధరుఁ
వీక్షించినగోలెను గా
శీక్షేత్రాలోకసుఖము చేకుఱె బుషికిన్.

క. క్లేశంబును సౌఖ్యంబును
నాశువునను గుంభజన్ముఁ డభిమర్శించెం
గాశీవిరహము దక్షిణ
కాశీసంగమము వరుసఁ గలిగినకతనన్.

వ. పరోపకారపరుండయినవానికిఁ బుంఖానుపుంఖంబుసంపదలు సంభవించు. తీర్థస్నానదానజపహోమదేవతార్చనాదులు పరోపకారంబునుంబోలనేరవు. పరోపకారంబుకంటె ధర్మంబు లేదు. లోకోపకారపరాయణుం డైనవాతాపితాపసున కింతలేసిప్రయోజనంబులు సమకూఱకుండునె? ఇవ్విధంబున భోగమోక్షనివాసంబైన దాక్షారామంబునం గొన్ని దినంబు లుండి కొల్లాపురంబునకు శ్రీమహాలక్ష్మి దర్శింపంబోఁ దలంచి యమ్మైత్రావరుణి. 27

{ అగస్త్యుండు కొల్లాపురంబున కేగుచు మార్గమున వీరభద్రేశ్వరు దర్శించుట. }

సీ. అంతగప్రవాహయై యావిర్భవించె నే
ధరణీధరముపొంతఁ దల్లిబావి
పాఱె నేశైలంబుపాదమూలంబుగఁ
గల్లేటితో వృద్ధగంగ వారి
యుదయించె నేకొండయుత్తరాశారసా
తలకుక్షి సప్తగోదావరంబు
జనియించె నేశిలోచ్చయము దక్షిణమునఁ
గణ్వవాహిని యుప్పుఁగడలికొమ్మ
తే. పద్మగిరితోడఁబుట్టు వేపర్వతంబు
బలసియుండు నేయద్రికిఁ బంచలింగి
యట్టివీరభద్రాఖ్యమహాచలమున
కరుగుదెంచెను వింధ్యమదాపహారి. 28
వ. ఇట్లరుగుదెంచి లోపాముద్ర కిట్లనియె. 29
తే. దక్షిణానందవిపినమధ్యంబునందు
గ్రతువిధిధ్వంసవేళ దేవతల నళికి

వీరభద్రేశుఁ డీయద్రి వెన్నుఁ దన్ని
గౌతమీవారిఁ దరవారిఁ గడిగినాఁడు.

తే. పంకజత్న్మాధరము వీరభద్రగిరియు
నంధ్రభూమికి వక్షోరుహద్వయంబు
భువనచతురకరంబ మంభోరుహాక్షి!
గౌతమీగంగ ముత్యాలకంఠమాల.

సీ. ఎవ్వాఁడు డాచేతి క్రొవ్వాఁడినఖమునఁ
జిదిమె భాషాదేవిచిగురుముక్కుఁ
గనకమేఖలఁ గ్రుచ్చి కట్టె నెవ్వాఁడు లీలఁ
జెఱఁగుపైఁ బూషార్కుమెఱుఁగుపండ్లు
కోర కెవ్వాఁడు పదాంగుష్ఠభాగంబున
నుడురాజుపొట్టగు జ్జులుకనూఁదెఁ
దటిగ నెవ్వాఁడు ఖడ్గధారాంచలంబున
నగ్నినాలుక లేదు నంటఁబట్టి

తే. మోఁదె నెవ్వాఁడు ముప్పదిమూఁడుకోట్ల
వేలుపులఁ బారఁ బార వెన్వెంటఁ దగిలి
యట్టిశ్రీవీరభద్రుఁ డీయద్రిమీఁద
భద్రకాళియుఁ దా నుండుఁ బద్మనయన!

తే. బ్రహ్మసువేద్య మాదిగాఁ బట్టి సొంత
మతివ! గోదావరీనదీహారమునకు
నడుము నాయకరత్న మై నలువు మిగులఁ
బంచలింగాశ్రయము వీరభద్రశిఖరి.

వ. అని చెప్పి యచ్చోటు గదలి ప్రతిదినప్రయాణంబుల.

క. క్షీరారామంబునఁ బ్రా
చ్యారామంబునను నాదిమారామమునం

దారాధిపచూడామణి
నారాధించెను మునీంద్రుఁ డతివయుఁ దానున్. 35

వ. అనంతరంబయమ్మునిసింహుండుసహ్యాగిరికన్యకాప్రవాహంబునఁ గృతావగాహనుం డయి కదలి పశ్చిమాంభోధితీరంబున సౌరాష్ట్రసోమనాథేశ్వరశిరశ్చంద్రచంద్రికాధౌతకలధౌతసౌధవీథికాసముల్లిఖితగగనమండలం బయి పదునెనిమిదియోగపీఠంబులందును సుప్రసిద్ధం బైనకొల్లాపురంబునకుం జని యందు. 36

ఉ. శ్వేతవరాహకల్పమున వెన్నుఁడు సూకరవేషధారి యై
యాతతదంష్ట్రికాంకురమునందుధరిత్రి వహించియుండఁగా
నాతనిమీఁద లేఁతపాలయల్క వహించి తొలంగి వచ్చెనో
యీతరలాక్షి? యంద్రుబుధులెప్పుడునాజగదేకమాతృకన్.

తే. భద్రకాళికయైఘోరపరశుధారఁ
గోలదైత్యునిఁ బొరిగొన్నఘోరమూర్తి
శౌరివక్షస్స్థలీనభశ్చంద్రరేఖ
శ్రీమహాలక్ష్మి భక్తి వీక్షించెఁ దపసి. 38

క. కొల్లాపురిలక్ష్మికిఁ బ్రణ
మిల్లిరి పులకాంకురములు మేనులఁ బొడమన్
హృల్లేఖామంత్రోపని
షల్లతికాకుసుమమునకు సతియుం బతియున్. 39

వ. అనంతరంబ కుంభసంభవుం డాత్మగతంబున. 40

## అగస్త్యుండు లక్ష్మిని స్తోత్రము చేయుట.

సీ. క్షీరోదకన్యకు శ్రీమహాలక్ష్మికిఁ
గమలాయతాక్షికిఁ గంబుకంఠి

కఖిలలోకేశ్వరి కామ్నాయవినుతకుఁ
గనక కేతకపుష్పగర్భగౌరి
కరుణాధరోష్ఠికి నమరకోటికిరీట
కోటివిటంకసంఘాటఘటిత
రత్నాంకురప్రభారాజినీరాజిత
శ్రీపాదపద్మపీఠోపకంఠ
తే. కంబురుహనాథుదేవి కనాదిశక్తి
కిందిరకు లోకమాతకు నిగురుఁబోఁడి
కలరువిల్కానితల్లికిఁ బ్రార్థితార్థ
కల్పవల్లికి మ్రొక్కఁగఁ గంటి మంటి.
వ. అని అనంతరంబ.
తే. చందురునియందు జ్యోత్స్నవు చంద్రవదన!
ప్రభవు వాసరకరునందుఁ బద్మనయన!
దాహశక్తివి పూఁబోఁడి! దహనునందు
మ్రొక్కెదను నీకుఁ గల్యాణమూర్తి! లక్ష్మి!
తే. బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు
హరుఁడు హరియించు భువనంబు లవసరమున
నెట్టు సమకూఱు వీరికి నీప్రభావ
మీవు గలుగంగఁ బట్టి కా కిందువదన!
ఉ. పండితుఁడాతఁడాతఁడు ప్రభావసమగ్రుఁడతండుశూరుఁ
తండు వివేకి యాతఁడువదాన్యుఁడతండు మహాకులీనుఁ
తండుకళావిదుండతఁడుధన్యుఁడతండుమనోజ్ఞమూర్తిఁ
వ్వండుభవత్కృపాకలనవైభవలక్ష్మికిఁ బాత్రమిందిరా!
చ.పురుషునియందుభాగ్యమునుబాల్తికయందువిలాసరేఖయు
గరిహరులందుఁ బక్షిభుజగంబులయందు మహీరుహావ

హరితతృణాదులందుఁ బసులందును బెయ్యలయందుఁగ్రుక్క
లం,దరుదుగ బెంపునొప్పుభవదంశవిశేషముసూవెయిందిరా!

ఉ. *ఎవ్వని నేని నీవు దయ నించుకఁ జూచిన వానిఁ జూతు ర
ప్పువ్విలుకానిఁగాసతులు భూపతిఁగాఁ బ్రజ కల్పకంబుగాఁ
నవ్విబుధాశ్రితప్రతతి యంబుధిఁగాఁగులగోత్రగోత్రముల్
కవ్వడిఁ గాఁ బరద్విషులు గర్ణునిఁగాఁ గవు లెల్ల శ్రీసతీ!.

ఆ. కమలనయన! నీవు కలచోటు సరసంబు
నీవు లేనిచోటు నీరసంబు
కంబుకంఠి! నీవు కలవాఁడు గలవాఁడు
లేనివాఁడు నీవు లేనివాఁడు. 47

సీ. పరిపూర్ణ హేమకుంభములు హస్తంబుల
ధరియించి యిరువంకఁ గరులు గొలువఁ
బలఁగ మై వరశంఖపద్మమహాపద్మ
మకరాదినిధులు నేమమునఁ గొలువఁ
వింజామరలు దాల్చి వెనుకదిక్కున దేవ
గంధర్వగుహ్యకాంగనలు గొలువ
నెలవంక బలువంక నింద్రాదిదివిజులు
సేవాంజలులు మాళిఁ జేర్చి కొలువ

తే. భర్మపంకజకర్ణికాభద్రపీఠి
కాగ్రమున నిండుకొలువుండి యఖిలలోక
రక్షణము సేయు ని న్నేను బ్రస్తుతింతు
నసమసౌభాగ్యగుణధన్య! యబ్ధికన్య! 48

---

* ఈపద్యము మద్రాస్ ఓరియంటలులైబ్రరిలోనుండు నొకతాళపత్ర
ప్రతిలోమాత్ర మున్నది. ఇతరము లగు వెక్కుప్రతులయందుఁ గన్పట్టదు.

వ. పరమార్థవస్తువిచారము సేయవచ్చిన శక్తిమంతుం డై
యీశ్వరునకు శక్తి యగునీకు భేదంబు లేదు, గావున శ
యుక్తుం డైన యీశ్వరునకుం గలసృష్టిస్థితి సంహృతితి
భావానుగ్రహరూపంబు లైనకృత్యంబు లైదును నీయ
దహనునకు దాహశక్తియు, నుష్ణాంశునకు దీధితియు
జంద్రునకుఁ జంద్రికయుంబోలె నీశ్వరునకు నీవు సహజ
ధ్రువవు నై యుండుదు. ఇహజన్మజన్మాంతరంబుల వి
తంబు లైనవ్రతదానాదులచేతసంచితంబు లైనదురితంబు
నిరసింపఁబడుటం జేసి యస్తరజస్తమస్తను లైనయుత్తము
విశుద్ధసత్త్వు లయి నీతత్త్వంబుఁ జింతింతురు. భోగాప
లక్షణం బైనఫలంబు పరమేశ్వరుండు పశుగణంబున కి
నపుడు నిన్ను మున్నిడికొనికాని యీఁజాలండు.
బ్రహ్మంబు కారణబింద్వాత్మకం బై బిందునిష్యందత్వంబున
బురుషేచ్ఛాప్రయత్నంబున మూలాధారావస్థితపవనసం
క్షణంబునం జేసి యభివ్యక్తం బై పరావాక్కనంబడు.
బ్రహ్మం బీనాభిపర్యంతం బావాయువుచేతనభివ్యజ్యమా
బై నమనంబుతోడం గూడి సామాన్యస్పందప్రకాశరూ
ణియుఁ గావ్యబిందుతత్త్వాత్మికయు నీశ్వరాధిదేవతయు
పశ్యంతీ వాక్కనంబడు ఆబ్రహ్మం బావాయువుచేత
దయపర్యంతం బై విశేషస్పందరూపయునాదబిందుమయ
హిరణ్యగర్భాధిదేవతయు నై మధ్యమవాక్కనంబడు.
బ్రహ్మం బాస్యపర్యంతం బావాయువు చేతన కంఠాదిస్థా
బులయందు దభివ్యజ్యమానం బై యకారాదిక్షకారా
వర్ణమాలారూపం బై నిశ్చయాత్మయై శ్రోత్రగ్రహణ

గ్యం బై వైఖరీవాక్కనంబడు. ఈచతుర్విధసూక్ష్మస్థూల మాతృకాస్వరూపవు. ఇట్టిదేవి! నీకు నమస్కారంబు. 49

తే. అని నుతించినఁ బ్రియ మంది యబ్ధికన్య
కలశజునిఁ జూచి యి ట్లను గారవమున
ననఘ! నీస్తోత్రమునకు నాయాత్మ మెచ్చె
నీవు గోరినవర మిత్తు నెమ్మి వినుము. 50

వ. ఇంక రాఁగలయిరువై తొమ్మిదవద్వాపరంబున నీవువ్యాసుండవై వారణాశీపురంబున వేదపురాణసంహితాధర్మశాస్త్రంబులు వక్కాణింపంగలవాఁడవు. ఇప్పు డొక్కహితంబు సెప్పెదఁ దుంగభద్రాతీరంబునఁ గిష్కింధాచలోపాంతంబున స్వామిమల యనుకాననంబునం గుమారస్వామి వసించియున్నవాఁడు. నీ వచటి కరిగి యతనివలన వారణాశీస్థానమాహాత్మ్యంబు విను మని పలికి లోపాముద్రం గనుంగొని యక్కాంతకుముద్రికాకటకహారకేయూరాదు లగుదివ్యాభరణంబులఁ బ్రసాదించె. ఇవ్విధంబునం గొల్లాపురలక్ష్మిచేతఁ బ్రసాదంబు వడసి దంపతులు చరితార్థులయి సముచితప్రకారంబునన మ్మహాదేవివీడ్కొని స్వామిమలకుంజనువాఁడై కొన్ని పయనంబు లరిగి ముందఱఁగఠోరమదపరిణతిదశావష్టంభసంరంభసముజ్జృంభమాణ హేరంబదశనకులిశకోటిభిద్యమానహాటకకటకఠాంకారఘట్టితతారాంగణంబై చతుర్ద్వారంబులను జతురంతరచతుష్పక్షద్వారంబులషోడశగవాక్షంబులద్వాత్రింశన్మకరతోరణంబులఁజతుష్షష్టినాట్యకూటంబులఁబంచాశదుత్తరసహస్రదీర్ఘికలను శతసహస్రకోటిలింగంబులను దశసహస్రకోటిశక్తులనుం గోటితీర్థం

బులనుం గలిగి వరాహకుండమల్లికాకుండక్షీర కుండా
కుండంబులచేతనుఁ గదళీవనబదరీవనగౌరీవనబిల్వవనా
నంబులచేతను హాటకేశ్వరగుప్తమాహేశ్వర నందిమండ
నివృత్త్యాదు లయినదివ్యస్థానంబులచేతను రససిద్ధిరసాయ
సిద్ధిమూలికాసిద్ధిపాదుకాసిద్ధ్యాదు లగుసిద్ధక్షేత్రంబులచే
నుశోభితంబై దివ్యామృతనిర్మలశ్రీస్వయంభూజ్యోతిర్లిం
మూర్తి యగుమల్లికార్జునమహాదేవునకు నిజనివాసం
యభిరామం బగుశ్రీశైలంబుఁ జేరవచ్చె నయ్యవసరంబు

**అగస్త్యుండు శ్రీశైలంబున కేతెంచుట.**

మ. పరిరంభం బొనరించెఁ గుంభభవునిం బాతాళగంగాంబు
ర్ఝరకల్లోలఘటాపృషద్వ్యతికరప్రాలేయముల్ హాటకే
శ్వరజూటీకృతమాలకేసరరజస్సౌరభ్యసంపన్నముల్
కరివక్త్రాభరణాహిపీతపరిముక్తంబు ల్వనీవాయువుల్.

శా. ఆమిత్రావరుణాంశసంభవుని వింధ్యాటోపవిధ్వంసి లో
పాముద్రాసహితుంగనుంగొనిరియుత్పన్నప్రమోదంబుల
వ్యామగ్రాహ్యపయోధరల్ కుటిలనీలాగ్రాలకల్ తథ్యమి
థ్యామధ్యస్థితమధ్య లాటవికసేనాధీశసీమంతినుల్.

సీ. వాతాపిదమనుండు పాతాళగంగయం
దఘమర్షణస్నాన మాచరించె
హాటకేశ్వరదేవు నారగ్వధంబుల
నర్చించె వింధ్యదర్పాపహారి
గగనర్షివృషభుండు కంఠీరవాననను
వైకుంఠబిలమధ్యవాసుఁ గొలిచె
నేకాంతరామేశు నిందుశేఖరుని ద
ర్శించె నీవారముష్టింపచుండు

తే. గూర్మి రంభోరువును దానుఁ గుంభభవుఁడు
కుంభినీధరదుహితృవత్ణోజశాత
కుంభకుంభద్వయీపరిరంభణార్త
శంభు శ్రీమల్లికార్జును సంభజించె. 54

మహాస్రగ్ధర. యని హృల్లేఖాదిమంత్రాభ్యసననిరతుఁ డై
యాగమోక్తప్రకార, క్రమయుక్తిం గంధపుష్పాక్షతదళ
ములశ్రీకంఠు నర్ధాంగలక్ష్మిఁ, భ్రమరాంబాదేవి నంతర్భ్రి
మరఫలభరప్రహ్వాచూతద్రుపుణ్యా, శ్రమవాటీహేమ
సింహాసనవిలసదధిష్ఠాన నర్చించె నిష్ఠన్. 55

తే. చెలువయును దాను నారీతి బిలసహస్ర
మార్గశాఖోపశాఖల మౌనివరుఁడు
విధుకిరీటులఁ బూజించె వెదకి వెదకి
యమృతమయలింగమూర్తుల నధికభక్తి. 56

వ. వెండియు నయ్యైల్వలమథనుండు యథావిధి మండూకకుం
డంబునం గ్రుంకె. పంచాక్షరీమంత్రసిద్ధుండు పంచధారాప
ల్లధారలనునిర్ఝరప్రవాహంబులఁగృతావగాహనుండయ్యె
పాటలజటాకిరీటుండుహాటకకూటశిఖరశృంగాటకాఖేటం
బునఁ గోటిలింగంబులం భజించె. లోపాముద్రాధిపతి యా
ద్రికటకభద్రాసనంబున సమున్నిద్రప్రతాపముద్రావిద్రుతా
క్షుద్రోపద్రవుండగునుద్యానవీరభద్రుశ్రీభద్రవహరిద్రాక్షతం
బుల భద్రదారుద్రుపారిభద్రద్రుమకోరకంబుల నారాధించె
బ్రహ్మపాదారవింద ద్వంద్వంబుహరిచందనచర్చామచర్చికల
నర్చించె. సిద్ధతాపసమూర్ధాభిషిక్తుండు ఘంటాసిద్ధేశ్వరుని
వలన మంత్రసిద్ధివడసె. మహాభాగుండు భోగవతీతీరంబున

భోగేశ్వరు భోగాపవర్గప్రదు భుజంగభూషణు భజించె వారముష్టింపచుం డిష్టకామేశ్వరునకుం బటిష్ఠనిష్ఠావిశే బులం దుష్టిఁ గావించె. భువనగోప్త మాతృకలఁ దలం నహుషమథనుండుముషితసకల కలుషంబగుకదళీవనవి భువి నిగమభషకపరిషదనుగతవృషభగమనుం గపట వటు నచలదుహితృపరివృఢు నశఠమతిం గొలిచె. అ రంబ యొక్కవివిక్తప్రదేశంబున సుఖాసీనుం డై.

తే. అర్థిఁ గుంభోద్భవుం డిట్టు లనియె సతికిఁ
బద్మలోచన ! చూడు శ్రీపర్వత మిది
పాయ కిం దుండుఁ బార్వతీప్రాణవిభుఁడు
మల్లికార్జునదేవుండు మదనవైరి.

తే. ధవళలోచన ! శ్రీపర్వతంబుమహిమఁ
బ్రస్తుతింపంగ శక్యమే బ్రహ్మకైన
గండశిల లెల్ల శంభులింగంబు లిందు
సిద్ధమును లిందుఁ జరియించుచెంచు లెల్ల.

క. చాకున్న నీదు ముక్తుల
శ్రీకాశీక్షేత్ర మెవ్వరికి నే నిక్కం
బీకుధర మిచ్చు శిఖరా
లోకనమాత్రమున ముక్తు లుల్లసిలంగాన్.

వ. అనియె నప్పుడు లోపాముద్ర ముద్రికామణిమయూ రేఖలు నఖశిఖరంబులం జిగురొత్త విద్రుమప్రవాళం యుల్లాసంబు నుల్లసంబాదుపాణిపల్లవంబులు మోడ్చి భాగంబునంగీలించి వినయవినమితోత్తమాంగయై యు గనుంగొని సస్నేహంబును సబహుమానంబును సా

గంబును సాభిప్రాయంబును సవిభ్రమంబును సోపాలంభం
బునుం గాఁ గుంభసంభవుండు మహాదేవి కిట్లనియె. 61

సీ. హృదయంబులో సంశయించి నిగూఢార్థ
మిద మిత్థ మని నిశ్చయింపలేక
యది తేఁటతెల్లఁగా నడుగంగఁ దలఁచి ల
జ్జాసాధ్వసంబులు సందడింప
నవనమ్రముఖపద్మ వై యున్నదానవు
ప్రాగల్భ్యసరణి యేర్పడునో యంచు
మాటాడనేరనిమాఁటినంగవు నీవు
సకలకాలంబు నోసరసిజాక్షి !

తే. కాంత ! యేకాంతవేళలఁ గాంతునెదుర
నగుచుఁ దెగడుచు నుండుట తగవుసూవె
వలనిసిగ్గున వెలుపునఁ గలసిమెలసి
యుండకుంటకు మాబోఁటు లోర్వఁ గలరె? 62

వ. అనిన విని లోపాముద్ర మౌనముద్ర దిగనాడి మునీంద్రున
కిట్లనియె. 63

సీ. చతురశీత్యాయామసంపన్న మై యోజ
నోత్సేధవైభవాభ్యుదయ మయ్యు
ముప్పదియోజనంబులవెడల్పును గల్గి
సార్ధత్రికోటితీర్థాన్విత మయి
సమధికాష్టాశీతిసాహస్రసంయమి
జనసమాకుల మయ్యు సప్తకోటి
మంత్రాశ్రయం బయ్యు మహనీయమహిమ మై
తనరారునీపర్వతంబునందు

తే. శిఖర మీక్షించునంతన చేరు నట్టి
ముక్తి జనులకు మఱి జీవములు దొలంగఁ
జచ్చినప్పుడు గాని మోక్షంబు లేని
కాశి కరుగంగ నేఁటికిఁ గాళ్ల జాలి.

వ. మఱికొందఱు కేవలవిజ్ఞానంబుఁ బ్రశంసింతురు. కొందఱు విజ్ఞానసముచితంబైనకర్మంబు సేవింతురు. కొందఱు దానంబులు గొనియాడుదురు. కొందఱు వ్రతంబులు సెప్పుదురు. కొందఱు యజ్ఞంబులు మెత్తురు. కొందఱు తపంబులు గొనియాడుదురు. కొందఱు బ్రహ్మచర్యం బభినందింతురు. కొందఱు గార్హస్థ్యంబుఁ బ్రస్తుతింతురు. కొందఱు వానప్రస్థాశ్రమంబు మన్నింతురు. కొందఱు సన్న్యాసంబుఁ బ్రసంగింతురు. కొందఱు తీర్థసేవ యావిష్కరింతురు. కొందఱు స్వాధ్యాయం బధికరింతురు. కొందఱు కాశీశ్రీపర్వతాదిశివస్థానంబులు బ్రశంసింతురు. ఇన్నియు ముక్తిసాధనంబుల. అందులోన సులభంబగుముక్తిసాధనం బెయ్యది ? వినవలతు నానతిమ్ము. సంశయబీజభూతంబులైనయావిప్రతిపత్తివచనసహస్రంబులు వినంగ. నాడెందంబు డోలాందోళనం బందు చుండు.

క. అని యడిగినఁ గలశీసుతుఁ
డనుమోదరసార్ద్రహృదయుఁడై దేవికి ని
ట్లను నడుగవలయునర్థమ
వనజానన ! యడిగితు ముక్తివైభవ మలరన్.

{ అగస్త్యుండు లోపాముద్రకు బాహ్యాభ్యంతర తీర్థమాహాత్మ్యంబుఁ జెప్పుట. }

శా. శ్రీశైలాదులు ముక్తికారణములై చెప్పంబడుం దీర్థముల్
ప్రాశస్త్యంబును నన్నితీర్థముల కప్రత్యూహమై వర్ధిల్

గాశీప్రాప్తికరంబు లైనకతనం గైవల్యలక్ష్మీదముల్
గాశీక్షేత్రముగైకొనుందరుణి!సాక్షాన్ముక్తిహేతుత్వమున్.

వ. ప్రయాగ నైమిశంబు కురుక్షేత్రంబు గంగాద్వారంబు నవంతిక యయోధ్య మధుర ద్వారక సరస్వతి సహ్యాంబు గంగాసాగరసంగమంబు కాంచి త్ర్యంబకంబు సప్తగోదావరంబు గాలంజరంబు ప్రభాసంబు బదరికాశ్రమంబు మహాలయం బోంకారంబు పురుషోత్తమంబు గోకర్ణంబు భృగుతీర్థంబు పుష్కరంబు శ్రీపర్వతంబు నా నివి మోక్షకారణంబు లైనమహాతీర్థంబులు. 68

సీ. శంభుప్రసాదంబు సమకూఱకుండినఁ
దీర్ఘయాత్రకు సమ్మతింప దాత్మ
దీర్ఘంబు లాడంగఁ దివుట లేకుండినఁ
బ్రతిబంధదురితంబు వాసిపోదు
ప్రతిబంధదురితంబు వాసిపోకుండినఁ
గాశి కేగెడునట్టికడఁక లేదు
శ్రీకాశికాపురక్షేత్రవాసము లేక
విజ్ఞానవాసన విస్తరిలదు

తే. జ్ఞానమునఁ గాని మోక్షంబు సంభవింప
దలివ! జ్ఞానం బనంగ వేదాంతవాక్య
సంభవం బైన దదియ సుజ్ఞాన మందు
రితర మజ్ఞాన మిాసూక్ష్మ మెఱిఁగి కొనుము. 69

క. ధారాతీర్థం బనఁగాఁ
దారాధిపవదన! ఖడ్గధారాంచల మ
ద్ధారాంచలమునఁ ద్రెళ్లిన
వీరాగ్రేసరుఁడు ముక్తివిభవముఁ గాంచున్. 70

తే. తీర్థములు మానసములు ము_క్తిప్రదములు
తరుణి! యివి మేలు బాహ్యతీర్థములకంటె
మానవుం డివి యేమఱె మధురవాణి!
బాహ్యతీర్థంబు లాడ నిష్ఫలము సూవె.

సీ. తీర్థంబు సత్య మింద్రియనిగ్రహము తీర్థ
మనసూయ తీర్థంబు వనరుహాక్షి!
తీర్థంబు దానంబు తీర్థంబు సంతోష
మనుకంప తీర్థంబు కనకగౌరి!
బ్రహ్మచర్యంబు తీర్థంబు తీర్థము ధృతి
యమము తీర్థము విద్రుమాధరోష్ఠి!
సమత తీర్థంబు విజ్ఞానంబు తీర్థంబు
పుణ్యంబు తీర్థంబు పువ్వుఁబోఁడి!

తే. తీర్థములు మానసంబులు ధీవిశుద్ధి
యతిశయిల్లంగ నివి యాడ కాడినట్టి
పంచజనులకుఁ గలహంసపక్షిగమన!
బాహ్యతీర్థావలులు తీర్థఫలము నీవు.

చ. బిసరుహపత్రలోచన! కృపీటములందు మునింగియాడఁ
మొసళులుమీలుకర్కటకముల్ గమఠంబులువానికబ్బు
యసదృశమైనతీర్థఫల మట్టివిధంబు సుమీ! తలంప మా
నస మగుతీర్థమాడనిజనంబులకుం బహుబాహ్యతీర్థమఁ

తే. సుదతి! యేటికి నంతర్విశుద్ధి లేని
బాహ్యసంశుద్ధి? బహుతీర్థపరిచయమున
వేయుఁగడవలజలమున వెలిఁ గడిగిన
గలుగునే శుద్ధి వారుణీకలశమునకు?

తే. రాగదోషమలాపహారక్షమంబు
మానసం బైనతీర్థంబు మందగమన!
యవనిఁ బంకరజోవ్యపాయక్షమంబు
బాహ్యతీర్థంబు మెచ్చు రుత్పలదళాక్షి! 75

సీ. దర్శించినపుడ చిత్తము నిర్నిబంధనం
బగుఁ బ్రసాదగుణంబు నందు నేనిఁ
గలుషంబు గాని దుర్గంధంబుఁ బొరయని
సలిలంబు నెరవుగాఁ గలుగు నేనిఁ
బావనక్షేత్రపుణ్యావనీధరతపో
వనసన్నికర్షంబు దనరు నేని
సంశితవ్రతు లైనసంయమిశ్రేష్ఠుల
యధికపరిగ్రహం బబ్బు నేనిఁ

తే. దీర్థ మది దక్కుఁ గలయది తీర్థ మగునె?
ధవళలోచన! సలిలమాత్రమునఁ జేసి
ముదిత! దేహమునం దంగములకుఁ బోలెఁ
దారతమ్యంబు గలదు తీర్థముల కవని. 76

వ. సారంగనయన! తీర్థాంగంబు లప్రతిగ్రహం బనహంకారం బకోపనత్వం బనాలస్యంబు సూనృతంబు సమాధానంబు శ్రద్ధధానత్వంబు హేతునిష్ఠ క్షేత్రోపవాసంబు పితృతర్పణంబు బ్రాహ్మణభోజనంబు పితృశ్రాద్ధంబు పిండప్రదానంబు శిరోముండనంబు మొదలుగాఁ గలయవి సాంగోపాంగంబు లయిఫలంబు లీఁజాలు. మఱితీర్థతారతమ్యంబు వివరించెద.

సీ. చెలువ! శ్రీగిరియందు శిఖరేశ్వరం బను
శిఖరంబుఁ జూచినఁ జేరు ముక్తి

కాంత! శ్రీశైలంబుకంటె వేగంబునఁ
గేదార మిాఁ జాలుఁ గేవలత్వ
మంతకంటెను వేగ మరవిందలోచన!
యమృత మిానోపుఁ బ్రయాగతీర్థ
మాప్రయాగముకంటె నతివేగమునఁ జేయు
నపవర్గ మింతి! మహాశ్మశాన

తే. మతివ! యానందకాననప్రాప్తికరము
లఖిలతీర్థంబులును సందియంబు లేదు
కాశికాతీర్థ మాడక కదియరాదు
లక్షతీర్థంబు లాడిన మోక్షలక్ష్మి.

## శివశర్మోపాఖ్యానము.

వ. ఈయర్థంబు దేఁటపడనొక్కయితిహాసంబు చెప్పెదవినుఁ మధుర యనుపట్టణంబున శివశర్మ యనువిప్రోత్తముఁడు లండు. అతండు వేదంబులుసదివి, తదర్థంబు లెఱింగి, శాస్త్రంబులు పఠించి, పురాణంబులధిగమించి, యంగ లభ్యసించి, తర్కంబు లాలోడించి, మీమాంసాద్వ బాలోకించి, ధనుర్వేదం బవగాహించి, యాయుర్వేద విచారించి, నాట్యవేదంబు గ్రహించి, యర్థశాస్త్రం ప్రాపించి, మంత్రశాస్త్రంబులు దెలిసి, భాషలు గ లిపులు నేర్చి, యర్థంబు లుపార్జించి, ధర్మంబులు చే భాగ్యంబులనుభవించి, పుత్త్రులనుత్పాదించి, వారి క విభజించియిచ్చి, యౌవనంబుపోకకు ముదిమిరాకకు చి వ్యాకులుం డయి నిజాంతర్గతంబున.

శా. నానాశాస్త్రము లభ్యసింపఁగ ననంతద్రవ్య మార్జింప సం
తానంబుం బడయంగఁ బుత్త్రులకు నర్థంబుల్విభాగించి యీఁ
బౌనగపున్యమునర్ సుఖంబనుభవింపంబోయెఁ గాలంబు గౌ
రీనాథుర్ భజియింప నేర నయితిర్ శ్రీకాళికావల్లభుర్.

సీ. కొలువంగ లేనైతి గోపాలకృష్ణుని
నర్చింప లేనైతి హస్తివదను
మ్రొక్కంగ లేనైతి మునిజనశ్రేణికి
సేవింప లేనైతిఁ జిత్రభాను
యజియింప లేనైతి నమరసంఘాతంబు
బూజింప లేనైతి భూదివిజులఁ
గట్టింప లేనైతిఁ గమలకాసారంబు
నిలుపంగ లేనైతిఁ దులసివనము

తే. పేరటాండ్ర నర్చింపంగ నేర నైతి
సలిలసత్రంబు సాగింపఁ జాల నైతి
నాజ్యతిలహోమవిధులు మంత్రాన్వితముగ
హుతవహునియందుఁ జేయంగ నోప నైతి. 81

తే. పురుషసూక్తము శ్రీసూక్తమును జపింపఁ
బావమాని జపింపఁ దత్పరత మీఱ
నర్థి శతరుద్రియంబు పంచాక్షరంబు
ప్రణవమంత్రంబు జపియింపఁ బ్రతిదినంబు. 82

క. ఈహర్మ్యము లీతురగము
లీహేమము లీభుజిష్య లీధాన్యము లీ
దేహము నాతో వచ్చునె?
యూహింపఁగఁ బుణ్యకర్మ మొక్కటి దక్కన్. 83

సీ. పొడిదగ్గు కంఠంబుఁ బొరివుచ్చకయమున్న
తల ప్రకంపంబుఁ బొందకయమున్న
బొమలు కన్నులమీఁద బొదివి వ్రాలకమున్న
పొర నేత్రముల కడ్డు చొరకమున్న
శ్రుతిపుటంబుల శక్తి సురిఁగి పోవకమున్న
వళు లాననమునఁ బర్వకయమున్న
హృదయంబులో జాగ పదను దప్పకమున్న
గాత్రంబు శిథిలంబు గాకమున్న
తే. పండ్లు వేర్వాసి కదలుచూపకయమున్న
కాకికడకంటిపై చూపు రాకమున్న
కాలు నేయాడుతఱియంద కదలవలయుఁ
దీర్ఘసేవకు దేహ మస్థిరము గాన.

వ. అని తీర్థయాత్రాపరుం డై యిల్లు వెడలి రెండుమూ
పయనంబులకొలఁది తెరవున నొకవటవృక్షంబుక్రిందఁ
శ్రమాపనోదార్థంబు విశ్రమించి యంతరంగంబున
వితర్కించె.

మ. కరికర్ణాంతవిలోల మాయువు శరత్కాదంబినీచంచల
రళంబాత్మపయస్తరంగచలముల్ తారుణ్యముల్ తీర్థముల్
రిపాటిం జతురంతధాత్రిఁ జరియింపన్వచ్చు నే యైన నే
ముల్ నాలుగుమూఁడుముక్తిజనకంబుల్ మున్ను వీక్షించె

సప్తపురీప్రశంస.

తే. ఉజ్జయిని కాశి మాయ యయోధ్య కాంచి
మధుర ద్వారక యనెడినామములు గలిగి
పట్టణము లేడుఁ గీర్తిసంపద వహించు
మహితకైవల్యలక్ష్మికి మందిరములు.

వ. అని నిశ్చయించి. 88

సీ. సాకేతమున కేగి సరయూతరంగిణి
నభిషేక మొనరించి యధికభక్తి
నల్పుఁ దెల్పును నైననదులకూటము ప్రయా
గాఖ్యంబునందు దేహంబు దోఁచి
గంగలో మణికర్ణికాతీర్థమునయందు
సంకల్పపూర్వంబు గ్రుంకువెట్టి
కైవల్యకల్యాణఘంటాపథం బైన
యానందవిపినంబు నాశ్రయించి

తే. తీర్థదైవతకోటిఁ బ్రార్థించి పలికి
యఖిలమును నాచరించి తీర్థాంగకములఁ
దీర్థములయందు శ్రీమహాదేవుఁ గొలిచెఁ
బావనాచారనిరతుండు బ్రాహ్మణుండు. 89

సీ. బ్రహ్మలోకోన్నతప్రాసాదనిశ్శ్రేణి
యాజవంజవభీతి కభయపాణి
కలుషకంఠచ్ఛేదకాలాయసకృపాణి
కైవల్యనవమౌక్తికమున కాణి
ధీరావనీసమధిష్ఠితాంతర్వాణి
చతురుత్సవగంధసారసరణి
చేతగప్రసాదలక్ష్మీవిహారక్షోణి
కల్పాంతకాలంబు గలపురాణి

తే. పరమకల్యాణి యాపగాంభస్త్రివేణి
రాజరేఖావతంసుగౌరాపురాణి

సమధికప్రీతిఁ దేలి యాసత్యవాణి
సేవలత్వాశుభశ్రేణి గ్రేణివట్టె.

తే. అఖిలతీర్థంబులును నాఁడి యవనిసురుఁడుఁ
గోర్కి మైఁ బుణ్యలక్ష్ములఁ గొల్లవెట్టె
నటు విశేషించి గంగాప్రయాగతీర్థ
మధికతాత్పర్యనిష్ఠతో నాఁడఁదొడఁగె.

సీ. వైకుంఠముననుండి వచ్చి వైకుంఠుండు
దేవీసహాయుఁడై తీర్థమాడు
గోలోకమున నుండి గోమాతృకలు వచ్చి
తీర్థ మాడుదు రతిస్థిరమనీషఁ
గాశికాపురినుండి కాలకంఠుఁడు వచ్చి
దివసంబుదివసంబు తీర్థ మాడు
వరుస దిక్కులనుండి వచ్చి దిక్పాలురు
త్రిదశేశ్వరాదు లాడుదురు తీర్థ

తే. మమరగంధర్వసిద్ధవిద్యాధరర్షి
గరుడకిన్నరయక్షరాక్షసపిశాచ
భూతములు దీర్థమాడు వేఁబోకచివరఁ
బూష మకరస్థుఁడైనయప్పుడు ప్రయాగ.

వ. అది ప్రజాపతిక్షేత్రంబు. యాగంబులకంటెను బ్రక్ష
బగుటం జేసి దానికిఁ బ్రయాగసమాహ్వాయం బన్వర్థ
యుండు. మార్తాండుండు మకరరాశిస్థుం డై యుండ మ
మాసంబున మఘువమణిశిలాశకలవిసరవిస్ఫురకిరణ
హాసం దేహదానదీక్షాధురంధరంబులగు కాళిందీసింధు
ధంబులతో సంబంధించి కర్పూరగంధసారతారహార

హారనీహారక్షీరధారాశ్రేణి పాణింధమంబైనసౌరసైంధవధ
వళవాఃప్రవాహంబు ప్రవహింప సితాసితచ్ఛాయాచ్ఛటా
గుళుచ్ఛవ్యతికరంబునం జేసి మోక్షలక్ష్మీకటాక్షవీక్షణంబు
నుం బోనియమ్మహాతీర్థరాజంబునం గ్రుంకి బ్రాహ్మణుండు
కృతార్థుండై వెండియు. 93

గీ. కాశి కేతెంచు మఱేఁ బ్రయాగమున కేగుఁ
గాశి కేతెంచు మఱేఁ బ్రయాగమున కేగు
మునుఁగు మణికర్ణికాతీర్థమునను మఱియు
మునుఁగు మణికర్ణికాతీర్థమునను మఱియు. 94

శా. కింకుర్వాణపురందరాదికమహాగీర్వాణకోటీకిరీ
టాంకస్థాపితనూత్న రత్నరుచిధారాశ్లేషకిమ్మీరప
త్పంకేజుండుహరుండుజంతువులకుంబ్రాణాంతకాలంబునం
దోంకారాక్షరమంత్రరాజముఁ జెవిన్ యోజించుఁ గాశీ
[స్థలిన్.

గీ. కర్ణికాంతము సేరి యేకతమ శివుఁడు
మునుపు మోక్షచింతామణి జనున కిచ్చుఁ
గాన మణికర్ణికాసమాఖ్యత వహించె
నమ్మహాతీర్థ మమరగంగాతటమున. 96

క. ఉద్భిజ్జములు జరాయు
ప్రోద్భూతము లండజాతములు స్వేదజముల్
తద్భూమండలిఁ జచ్చి మ
హాద్భుతముగఁ బుట్టు హాలహాలకంధరులై. 97

గీ. ఎడమప్రక్కయి కాశిలో నీల్గునట్టి
మశకశిశువున కోంకారమంత్రరాజ
మభవుఁ డుపదేశ మొనరింప నమరకోటి
సిగ్గువడుచుండుఁ దమపృథాజీవములకు. 98

చ. కటకట! కాశికాపురి నొకానొకనిద్దురఁ గన్నుమోడ్చి
ప్పుటఁ గనువిచ్చునప్పుకుడిభాగముఁగన్గొనిచోద్యమందు
పటిదెసఁజూచి యచ్చెరువుపాటు వహించు మనస్సరో
పుటమునవాఁడుబాగుమగపోడిమియుంగలజంతుసంతతు
మ. గృహమేధిప్రవరుండువిప్రుఁడమృతక్షేత్రంబువారాణ
ద్రుహిణక్షేత్రమువాసిపోవఁదలఁచెన్దూరంబుగావెండి
న్మహిఁగైవల్యదతీర్థముల్ గలిమి సంభావించి శాస్త్రజ్ఞ
బహుధావిప్రతిపత్తిధీవిషయముల్ పాడైనశాస్త్రార్థము
సీ. ఆనందవిపినపుణ్యానుభావాధిక్య
మెఱుఁగఁడా తా నేమి యెల్లదియును?
దెలియఁడా తా నేమి దేవలోకారోహ
నిశ్శ్రేణి యగుగంగనిత్యమహిమ?
మణికర్ణికాతీర్థమాహాత్మ్యవిభవంబుఁ
జూడఁడా తా నేమి సూక్ష్మదృష్టి?
నరయఁడా తా నేమి యామ్నాయములఁ బురా
ణేతిహాసముల విశ్వేశుగరిమ?
గీ. నకట! నానాప్రయాణాంతరానువృత్తి
నుదక మున్నతభూమిపై నుండలేక
పల్లమున కోడిగిల్లినపగిది నతఁడు
కదలెఁ దీర్థాంతరమునకుఁ గాశినుండి.
వ. కదలి కతిపయప్రయాణంబుల.
సీ. ఏవీటిశృంగార మెలదోఁటలోనుండుఁ
గదల కెప్పుడు నీలకంధరుండు
ప్రతియుగంబునను నేపట్టణంబునకును
దివ్యాభిధానంబు దిరుగుచుండు

జేనంటఁ జేనంట శివలింగములు గోటి
సంఖ్య నేపురమునఁ జాల నొప్పుఁ
గల్పాంతవేళ నేకటకంబు మునుఁగదు
నింగితో రాయుమున్నీటివెల్లి

గీ. నట్టిమహిమలయుజ్జని కరుగుదెంచి
కాళి దర్శించి శ్రీమహాకాళుఁ గొలిచి
యుండె శివశర్మ హఠరాజయోగపరత
నిఖిలముక్తుల కచ్చోటు నెలవు గాన. 103

ఆ. హాటకేశ్వరుఁడు మహాకాళనాథుఁడు
దారకేశ్వరుండు తలిరుఁబోఁడి!
యుబ్బి లింగము లయియున్నారు పాతాళ
మర్త్యనాకభువనమండలముల. 104

ఉ. కందవు గాజుపాఱవు వికారము నొందవు పూతిగంధముం
జెందవు వాడ వప్పురముసీమల నెల్లెడ వామకర్ణముల్
క్రిందుగ దీర్ఘనిద్రల ధరిత్రిశయించినజంతుదేహముల్
సుందరి! ఇట్టిచోద్యములు చూడముతక్కిన తీర్థభూములన్.

క. లీల మహాకాల! మహా
కాల! మహాకాల! యనుచుఁ గడుభక్తి మహా
కాలస్థానాధీశ్వరుఁ
గాలగళుఁ సంస్మరింపఁ గాంతురు ముక్తుల్. 106

గీ. భవు మహాకాళు సేవించి బ్రాహ్మణుండు
గదలెఁ గాంచికి నక్కాంచికాపురమునఁ
గలికి వేడుకకత్తె శ్రీకామకోటి
గవయుఁ నేకామ్రనాథునిఁ గరిగిరీశు. 107

ఉ. కాంచికిఁ బోయి బ్రాహ్మణుఁడు గాంచె మదావళభూమిభృ
కాంచనకంధరానిలయుఁ గైటభమర్దనుఁ గామకోటి
ర్నించె భజించె బాలశశిశేఖరు నేకరసాలనాయక
న్దంచె నతం డనేకజననంబులఁ జేసినపాతకౌఘముల్.

సీ. ముడువంగ నేర్తురు మూల దాపటికి రాఁ
జికురబంధము లీఁగ జీరువాఱఁ
బొన్నపువ్వులఁ బోలుపొక్కిళ్లు బయలుగాఁ
గట్ట నేర్తురు చీర కటిభరమునఁ
దొడువంగ నేర్తురు నిడుప్రేలుఁ జెవులందు
నవతంసకంబుగా నల్లిపువ్వు
పచరింప నేర్తురు పదియాఱువన్నియ
పసిఁడి పాదంబులఁ బట్టుచేల

గీ. పయ్యెదయు నిగ్గుఁబాలిండ్లఁ బ్రాకనీక
తఱచు పూయుదు రొడల గంధంబుఁ బసుపు
బందికత్తెలు సురతప్రపంచవేళఁ
గంచియఱవత లసమాస్త్రఖడ్గలతలు.

గీ. కాంతి యందురు గొంద ఱక్కాంచిపేరు
కమ్రకురువిందరత్నసకాంతికలిమి
నప్పురంబున నేడునాళ్లధివసించి
బ్రాహ్మణుఁడు సర్వదేవతాప్రతతిఁ గొలిచె.

వ. అందుండి ప్రభాసక్షేత్రంబుమీఁదుగాఁ జని.

క. ద్వారవతీనగరంబునఁ
గోరిక శివశర్మ యుండి కొన్నిదినంబుల్
నారాయణపుణ్యకథా
పారాయణుఁ డయ్యెఁ బరమభాగవతులతోన్.

గీ. ధవళలోచన! యొక్కచోద్యంబు వినుము
ద్వారవతియందుఁ జచ్చినవారియొడలి
యస్థిశకలంబులం దంతరాంతరములఁ
దనరు శ్రీపాంచజన్యసుదర్శనములు. 113

ఉ. కాంచనకేతకీకుసుమగర్భదళోదరసోదరప్రభా
భ్యంచిత మై పటీరఘుసృణాగురుసౌరభలక్ష్మితోఁ బిసా
ళించుచుఁ గమ్మ నై పరిమళించుసముజ్జ్వలగోపిచందనం
బించినవేడ్కతోడ ధరియింతురు భాగవతోత్తముల్పురిన్.

గీ. రమణి! ధరియింతు రూర్ధ్వపుండ్రములు మెఱయ
ఫాలతలమున నవ్వీటిభాగవతులు
కఠినపాపపరంపరీకంఠనాళ
ఖండనప్రక్రియాక్రూరఖడ్గలతలు. 115

సీ. కమనీయగోపికాగంధసారంబున
నూర్ధ్వపుండ్రములు బాగొప్పఁ దీర్చి
వక్షస్స్థలంబుల వనజాక్షమాలికా
చారునైపథ్యంబు సంతరించి
దక్షిణశ్రవణరంధ్రములఁ గోమలకృష్ణ
తులసీప్రవాళంబు లలవరించి
నలినలోచనదివ్యనామసంకీర్తన
భంగికి జిహ్వాలు పాలువెట్టి

గీ. ద్వారవతియందు ముక్తికాంతావిహార
మంటపమునందు నుండ్రు నిర్మలవివేక
నిరభిసంధికృపాగుణనిర్ణిరోధ
పరమభాగ్యాన్వితులు మహాభాగవతులు. 116

గీ. ప్రతియుగంబున ద్వారకాపట్టణంబు
ముంచి రత్నంబులెల్లను ముచ్చిలించి
కొంచుఁ బోయెడుకతమునఁ గువలయాక్షి!
యబ్ధి కొడఁగూడె రత్నాకరాహ్వయంబు. 117
సీ. కట్టు రింగులువారఁ గటిభాగమునయందుఁ
బసిఁడికమ్ములపచ్చపట్టుచేల
వక్షస్థ్సలంబున వనమాల ధరియించుఁ
గౌస్తుభగ్రైవేయకమునఁ గూర్చి
నేసకొప్పునఁ జుట్టు శిఖిపింఛరింఛోళి
మక్కళించినజిల్గుమడుఁగుపాగ
గొజ్జంగిపూఁదేనె కులికి మేదించిన
కమ్మకస్తురి మేనఁ గలయ నలఁదు
గీ. ద్వారకాపట్టణముపొలిమేరసీమఁ
గాలవశమున నీల్గి తత్క్షణమునందుఁ
గైటభారాతిసారూప్యగరిమఁ గన్న
కీటపక్షిసరీసృపక్రిమికులంబు. 118
ఉ. ఆపృథివీసుపర్వుఁడు ప్రియంబున ద్వారకయందుఁ దీర్ఘసే
వాపరతంత్రుఁడై యయిదువాసరముల్వసియించిపోయెమా
యాపురి కమ్మహానగర మంబుజపత్రవిశాలనేత్ర! దు
ష్ప్రాపము పూర్వజన్మమునఁ బాపము నేసినమర్త్యకోటికిన్.
వ. ఆనగరంబును గొందఱు హరిద్వారంబండ్రు. కొందఱు
మోక్షద్వారం బండ్రు. కొందఱు గంగాద్వారంబండ్రు.
అవ్వలనన నిర్గమించికదా భాగీరథి భువనపావనిభవజటా
జూటాటవీవాటికాకుటజకోరకంబు మున్నీటం బెక్కు 120
ముఖంబులంగలసె. అట్టిమాయాపురంబునందు.

సీ. తీర్థోపవాసంబుఁ దీర్చి జాగర ముండి
 తెల్లవాఱఁగ నేటఁ దీర్థమాడి
పితృతర్పణముఁ జేసి పిండప్రదానంబు
 యవసక్తుచరువున నాచరించి
యగ్నికార్యముఁ దీర్చి హరుని నభ్యర్చించి
 ములుమోదుగాకులఁ బులియఁ గుట్టి
రాగిలోహండి నన్నాబ్రియి లే కుండంగ
 వండి దించినయిపుర్వ్వంటకంబు
గీ. కుడువఁ గూర్చుండి వడ్డించుకొనఁ దలంచు
నంతలోన శిరస్తోద మావహిల్లె
మేను గఱుదాల్చెఁ జలి వచ్చె మెడలు నొచ్చె
వేఁకి దలచూపె దాహ మావిర్భవించె. 121
వ. అంత శివశర్మ నిజాంతర్గతంబున. 122
గీ. బ్రతుకుమీఁదియాస పాయంగఁ బెట్టితిఁ
జిచ్చువంటివేఁకి వచ్చినపుడ
జలధినట్టనడుమ సాంయాత్రికుఁడు గలం
బవిసినపుడు ధనమునాశవోలె. 123
సీ. ప్రతివాసరము గృహారామసస్యక్షేత్ర
 పశువీక్షణము సేయఁ బ్రాపుఁ డెవ్వఁ?
డిటమీఁద నేభంగి నిందుబింబానన
 విపులసంసారంబు వెడలఁద్రోయుఁ?
దనయు లిం కేభంగి ధనవిభాగములకై
 పోరితంబులు లేక పొసఁగియుందు?
రఖిలపురాణేతిహాసశాస్త్రాగమ
 గ్రంథసంరక్ష యెక్కడిది యింక?

గీ. నకట! మిన్నులువడ్డచో ననద వోలె
దిక్కుమాలినప్రేత నై తీఱవలసె
శిరసుపై మృత్యు వాడెడు జేనెఁడంత
చావు నిక్కంబు బ్రతుకుట సంశయంబు. 124

శా. సంతాపంబునఁ బొంద నేమిటికి నీసంసారయాత్రావృథా
చింతాభారము పూని జూర్తిదహనార్చిర్దాహముల్నాలవే
చింతింతు న్మది విశ్వనాయకు శివున్ శ్రీకాశికాధీశ్వరుం
జింతింతున్ సరసీరుహాక్షుని హరిన్ శ్రీద్వారకావల్లభున్.

గీ. ఏల చింతింప నిహమునం దెల్లసుఖముఁ
లనుభవించితి మధురామహాపురమునఁ
బరమునందు విముక్తిసంపదయుఁ గలిగె
నేడుపురములఁ దీర్థంబు లాడఁ గనుట. 126

వ. అని వితర్కించుచుండ. 127

శా. పాటిల్లెం ధరణీసురోత్తమున కప్పాటన్ విదాహజ్వరో
ష్ణాటోపంబున నత్యుపద్రవము మైనాపాదమస్తంబుగాఁ
గోటీవృశ్చికకీటపుచ్ఛలతికాకోటీశిఖాకంటక
త్రోటీకుట్టనసంప్రభూతవిషధూర్దుర్వారదాహోద్ధతిన్. 128

క. తన్నెఱుఁగ కెదిరి నెఱుఁగక
కన్నులు దెఱవంగ నెఱుఁగక వసుంధరపైఁ
గొన్నిదినంబులు బ్రాహ్మణుఁ
డున్నట్లన యుండె నొంటి యూరుపుతోడన్. 129

క. ఇటు బహువిధములఁ గడుసం
కటపడి మాయాపురోపకంఠమున మరు
త్తటినీతటనికటమునం
దటుకున శివశరణ్యకాలధరము నొందెన్. 130

131
వ. అంత.
మ. అసితాంభోధరనీలవర్ణు లురుభద్రాకారు లాజానుదీ
ర్ఘసముత్తుంగభుజాచతుష్టయు లలంకారాన్వితు ల్పుణ్యశీ
లసుశీలాఖ్యులు విష్ణుకింకరులు లీలం బక్షిరాట్కేతనో
ల్లసితం బైనరథంబుఁ దెచ్చిరి రుచుల్పర్దిక్కులంబర్వఁగన్.
సీ. వెలిదామరలఁ బోలువెడదకన్నులతోడఁ
గౌస్తుభగ్రైవేయకంబుతోడఁ
బసిఁడికమ్ములపచ్చపట్టుఁబుట్టంబుతో
మెఱుఁగుఁజామనచాయమేనితోడఁ
గీలుకొప్పుపసిండిగేదంగిరేకుతోఁ
గస్తూరికాంగరాగంబుతోడ
నటవీమయూరపింఛావతంసంబుతోఁ
జిగురొత్తుమొలకలేనగవుతోడ
గీ. నపుడ సాక్షాత్కరించినహరియుఁ బోలె
నెక్కె శివశర్మ గాంభీర్య మెసక మెసఁగఁ
గింకిణీజాలమాలికాలంకృతంబు
గరుడకేతనసహితంబు గనకరథము. 133
వ. ఇట్లు విమానారోహణంబొనర్చి శివశర్మ విష్ణుకింకరులఁజూచి
యి ట్లనియె. 134
గీ. విష్ణుభక్తులు చెప్పంగ విందు నెపుడు
నేఁ బురాణేతిహాససంహితలయందుఁ
బుణ్యశీలసుశీలు రక్షాపుణ్యపురుషు
లచ్యుతునిసమ్ముఖమున నుండ్రధికు లనుచు. 135
గీ. వారలేకద మీరలు వనజనేత్రు
లంబుధరనీలవర్ణులు కంబుగళులు

భద్రదివ్యాకృతులు చతుర్బాహుదండు
లసితతులసీపలాశమాల్యాభరణులు? 136

వ. అనిన వారు మహాత్మా! నీయట్టిమహానుభావు లెఱుంగనియ
ర్థంబులు గలవె? ఏము నీవు పెద్దలవలనం బురాణేతిహాసు
హితాముఖంబుల విన్న పుణ్యశీలసుశీలుర మగుదుము. అనే
కలోకంబులు గడచికాని వైకుంఠపురంబునకుం బోవరాదు.
అయ్యయిలోకంబులవిశేషంబులు నీకుం జెప్పెదము. సావ
ధానమతి వై యవధరింపుము. ఈవును నడుగవలసినయర్థం
బు లడుగు మనిన నట్లకాక యని చనువాఁడు ముందట. 137

విష్ణుదూతలు శివశర్మకు సంయమనీస్వరూపంబుఁ దెల్పుట.

సీ. కఱకు లై వీడినకుఱుచజుంజులువెంద్రు
కలును గండెనచాయకాయములును
గలివోసి నాన్చినగ్రచ్చకాయలభంగిఁ
గోఱమాలినట్టిదృగ్గోళకములు
తోట్టవాతెఱలపై దూరంబు సాగిన
గొగ్గిపండులతోడికుముఖములును
గూనివీఁపులమీఁద గోడిరైు బోటెత్తి
తఱివడ్డకంకాళతండములును

గీ. రాసభక్రూరకంఠనిర్హ్రాదకలిన
ఘర్ఘరావ్యక్తభాషితోద్గారములును
గలిగి యిదె కొంద ఱున్నారు గగనవీథి
నోరిమెఁ గెడఁగూడుకొని యెవ్వారొక్కొ వీరు? 138

వ. అనిన నద్దివ్యపురుషు లతని కిట్లనిరి. 139

ఆ. ఇది పిశాచలోక మీధూమ్రవర్ణులు
విను పిశాచరాజు లనఘ! వీరు

చంద్రశేఖరుని బ్రసంగవశంబునఁ
గొలిచినారు భక్తిఁ గొంచియంబు. 140
వ. అనియిట్లు క్రమంబునఁబ్రశ్నోత్తరరూపంబునఁ గర్మానురూపంబు లగుఫలంబు లనుభవించుచు నుందు రనిన నమర భావంబుల నుత్తరోత్తరాభ్యున్నతంబు లగునాయాయిలోకంబుల వసియించియున్నపుణ్యపురుషులం గనుంగొనుచు శివశర్మ గుహ్యకలోకంబును గంధర్వలోకంబును విద్యాధరలోకంబును నతిక్రమించి యప్సరోలోకంబునకుం బోవు నవసరంబున. 141
చ. ఎదురుగవచ్చె హేమరథమెక్కికృతాంతుఁడు సౌమ్యమూర్తియై,పదురునిజాప్తకింకరులుపార్శ్వయుగంబునభక్తిఁగొల్చిరా ముదిరనినాదముం జఱచిముందటిచక్కటిదివ్యదుందుభుల్, మృదులగరభీనాదములుమిన్నులుముట్టఁజెలంగుచుండఁగన్.
గీ. ఎదురుగా వచ్చి దక్షిణం బేలురాజు
ధర్మరాజు గరంబు సంతస మెలర్ప
సాధు! సాధు! మహాబుద్ధిబోధమహిత!
మేలుమే! లని శివశర్మ మెచ్చి పొగడె. 143
సీ. అభ్యసించితి వేద మాఱంగములతోడఁ
బరిచర్య చేసితి గురుజనులకు
నాదిపురాణేతిహాసంబులును ధర్మ
శాస్త్రంబు సదివితి సారధిషణ
సమబుద్ధివై మహేశ్వరుఁ బుండరీకాక్షు
సేవించి తేకాంతశీలమునను
గైవల్యకల్యాణ ఘంటాపథము లైన
తీర్థంబు లాడితి తిరిగియేడు

గీ. నసఘ! నీభాగ్యమునకు నియతము గలదె?
చూడుమా! యెంతటిదియొ నీసుకృతగరిమ?
భూసురోత్తమ! మాయంత లేసివారి
చే నమస్కారములు గొనఁ జెల్లె నీకు. 144

వ. అని ధర్ముండు శివశర్మ నభినందించి నిజనివాసంబునకుం
బోయెఁ దదనంతరంబ. 145

గీ. విప్రకులముఖ్యుఁ డత్యంతవినయపరత
నిటుల ననియె హృషీకేశుహితులఁ జూచి
యనఘులార! యతిక్రూరుఁ డంద్రు యముని
సౌమ్యుఁ డై యున్నవాఁ డెట్టిచంద మొకో? 146

గీ. యమునిరూపంబు వర్ణింతు రనఘ! జనులు
గుండె ఝల్లనునట్లుగా ఘోరలీల
జమునిఁ జూడఁగఁ గన్నులు చల్లనయ్యె
నిప్పు డారౌద్రరసరేఖ యెందుఁ బోయె? 147

గీ. ఇదియ రూపంబొ? యీతని కింక నొక్క
రూప మున్నదియో? మహాక్రోధమునకు
నెఱుఁగ నానతియిండు నా కీరహస్య
మనఘమతులార! సందేహ మావహిల్లె. 148

వ. అనిన వార లిట్లనిరి. 149

క. నినుబోఁటిపుణ్యవంతుల
కనఘా! శమనుండు సౌమ్య మగునాకారం
బున నుండు దుర్జనుల కీ
యన రౌద్రాకారుఁడై యుదగ్రత చూపున్. 150

వ. ఈదండధరుండు దంష్ట్రాకరాళవదనుండును, క్రోధరక్తాంత
లోచనుండును, నూర్ధ్వకేశుండును, గృష్ణాంగుండును, బ్ర

యాంబుదనిస్వనుండును, బరిభ్రమద్భ్రుకుటీకుటిలనిటలతట
విటంకుండును, విశంకటవికటాకారుండు నై దుర్వృత్తుల
నిట్లని శాసించు. 151

సీ. పాదంబు లిరుచేతఁ బట్టి గుంజుండు జ
ర్జరితంబుగా వీనిఁ జట్టుజాత
మెడ మెట్టి గోర్గొండి మెఱికి పుచ్చుఁడు వీని
గ్రుడ్లు చెక్కుల నెత్తురులు స్రవింపఁ
గడికండలుగ వీనికంఠంబు వ్రేయుండు
గరసానఁ బట్టినఖడ్గధార
బలుత్రాళ్ల బంధించి తలక్రిందుగా వ్రేలఁ
గట్టుఁడు వీని వృక్షంబుకొమ్మ
గీ. అంపమున వీనికంఠంబుఁ ద్రెంపి విడుఁడు
మడమతాఁపుల వీనిమర్మముల నొంపుఁ
డెట్టిఁగా నగ్నిఁ గాఁగినయినుపయిసుకఁ
గులికి పోయుఁడు వీనిముక్కునను జెవుల. 152

గీ. పరకళత్రంబుకుచకుంభపాళియందు
నఖముఁ దివిచినపాపాత్మునఖమునందు
నెట్టిఁగా నగ్నిఁ గాఁచినయినుపసూదు
లుగ్రదృష్టిని జొన్పుఁడత్యాగ్రహమున. 153

వ. పరదారముఖాఘ్రాణంబు చేసినపాపిష్ఠువదనంబున నిష్ఠుర
నిష్ఠీవనం బొనర్పుఁడు. పరదారభవనగమనం బొనర్చినకర్మ
చండాలునిపాదంబులు ప్రచండఖడ్గంబున ఖండింపుఁడు.
పరదారాధరోష్ఠబింబంబు చుంబించునయ్యసంబంధుమూ
ర్ధం బుద్ధతచపేటంబునం దాటింపుఁడు. పరాపవాదపరుని

వక్షంబు లక్ష్యంబు సేసి తీక్ష్ణముఖనిశితక్షురప్రంబున నేయుండు. పరసంతాపకారి కటుకవచనుం డగుకుటిల బుద్ధిని నిగలంబునం గాఁగినమంగలంబున వేల్చుఁడు. పరునియందు మిథ్యాదోషం బారోపించునిర్దయుఁ బ్రత్యగ్ర నపూయశోణితకర్దమంబున ముంపుఁడు. గురునిందాకర్ణను గుధూర్తునోర సంవర్తితతప్తలోహంబు పోయుండు. పరక శంకప్రకాశకుం డగుసంకుసుకు చెవులనిశ్శంకకాలాయసశం కువులు గూర్పుఁడని దండధరుండు ప్రచండకోపాటోపం బునఁ గింకరులం బలుకు వెండియు. 154

గీ. రౌరవం బనఁగను మహారౌరవ మనఁ
గాలసూత్రంబు గుంభపాకం బనంగ
నంధతామిస్ర మనఁగ సంహార మనఁగ
నారకంబులు మఱియు నెన్నంగఁ గలవు. 155

వ. ఈ నరకంబులయందు దేవస్వభోక్తల బ్రాహ్మణస్వభుజుల శిశుహంతలఁ గృతఘ్నుల గురుతల్పగుల గోఘ్న స్త్రీఘ్నమి త్రఘ్నులఁ బరక్షేత్రపరాలయాపహర్తలఁ గూటసాక్షుల గర్భఘ్నులఁ బ్రజాపీడాకరుల సురాపులఁ గూటశాల్మలిం బ్రాకించియుఁ బట్టుగార్లం బట్టించియుఁ దలక్రిందుగాఁ బ్రేలఁ గట్టించియు నిఱుయంత్రములఁ బీడించియు నంధకూప బునం ద్రోపించియు నినుపముక్కులకాకులం గఱపించియు యమకింకరులు పెక్కువిధంబుల బాధపెట్టుదురు. 156

క. హరినామకీర్తనంబును
హరినామజపంబు నెవ్వఁ డావర్తించుఁ
నరకగుహావేదన య
న్నరునకుఁ బ్రాపింప కుండు నయతత్త్వనిధీ! 157

వ. ఈయర్థంబు నీకుఁ దెల్లంబు గావించెదము· ఆకర్ణింపుము.
ఆదికాలంబునం గృతాంతుండు నిజకింకరులతో ని ట్లనియె.

సీ. గోవింద! భూతేశ! గోప! గంగాధర!
చాణూరమర్దన! చండికేశ!
కంసప్రణాశన! కర్పూరగౌర! గో
పీపతి! శంకర! పీతవసన!
గిరిశ! గోవర్ధనోద్ధరణ! బాలమృగాంక
వర్ణ! మాధవ! భవ! వాసుదేవ!
విషమేక్షణ! మురారి! వృషభధ్వజ! హృషీక
పతి! భూతపతి! శౌరి! ఫాలనేత్ర!
గీ. కృష్ణ! హర! గరుడధ్వజ! కృత్తివసన!
కల్మషారి! గౌరీపతి! కమఠ! శూలి!
యనుచుఁ బఠియింతు రెవ్వ రాఘనులు మీకు
వందనీయులు చెనకంగ వలదు వారి. 159

సీ. హరి! రజనీశకళావతంస! రమేశ్వ
ర! పినాకపాణి! శ్రీరామ! భర్గ!
యనిరుద్ధ! శూలపాణి! నృసింహ! త్రిపథగా
ర్ద్రజటాకలాప! మురహర! యీశ!
రాఘవ! యురగాభరణ! పద్మనాభ! యు
గ్ర! మధుసూదన! పినాకపతి! యాద్య!
ప్రమథాధినాథ! నారాయణ! మృత్యుంజ
య! పురుషోత్తమ! త్రిదశైకనాథ!
గీ. యచ్యుతా! కామశత్రువ! యబ్జపాణి!
దిగ్వసన! చక్రపాణి! భూతియుత! యనుచుఁ

దలతు రెవ్వారు వార లుత్తములు భువన
పావనాత్మకు లందఱు ప్రభులు మీకు. 160

సీ. బ్రహ్మణ్యదేవ! శర్వ! ముకుంద! విశ్వేశ్వ
ర! సనాతన! త్రిణేత్ర! రావణారి!
శ్రీకంఠ! ధర్మధురీణ! శంభువ! కమ
లాకర! యీశాన! యదుపతి! మృడ!
ధరణీధర! హర! యంధకహర ! శార్ఙ్గపా
ణి! పురారి! విష్ణువ! నీలకంఠ!
వైకుంఠ! దేవదేవ! మధురిపుఁడ! త్రిలో
చన! కైటభరిపుండ! చంద్రజూట!

గీ. కేశినాశ! గిరీశ! లక్ష్మీపతి! త్రిపు
రారి! వసుదేవసూనుఁడ! త్ర్యక్ష! యనుచు
జపము సేయుదు రెవ్వ రీవిపులపుణ్యా
ఘనులఁ గదిసినప్పుడ మీకుఁ గల్ల వచ్చు. 161

వ. మఱియు వినుండు. శ్రీకాంత!శివ! యసురనిబర్హణ! మన్మథ
రిపుఁడ! జనార్దన! ఖండపరశుఁడ! శంఖపాణి! శశిశేఖర! దా
మోదర! త్రిపురసూదన! యంబుదనీల! స్థాణువ! యానంద
కంద! సర్వేశ్వర! యనునీదివ్యనామంబులు భావించుకృ
తార్థులు మీకు మాననీయులు సుండి యనియివ్విధంబున
నంతకుండు గింకరవర్గంబు ననుశాసించె. ఈహరిహరనా
మంబులయష్టోత్తరశతంబు విన్ననుఁ బఠించిన జనులకు నా
రోగ్యైశ్వర్యంబులు సంభవించు. 162

చ. శమనునిరాజధాని యగుసంయమనీనగరంబునం గరం
దమకురుధర్మసేనదృఢధన్వజయద్రథు లాదిగా నృపో

త్తములు నితాంతనిర్మలినధర్మధురంధరు లుంద్రు నిర్వ్యపా
యమున ననర్ఘ్యరత్నమయవహారిహిరణ్మయహర్మ్యవీథులన్.
వ. అని ఇవ్విధంబున. 164

అప్సరోలోకవృత్తాంతము.

తే. శమనలోకాభివర్ణనశ్రవణపరత
నుబుసుపోవంగ శివశర్మ యొయ్యఁజేరె
నప్సరోలోక మది ప్రసూనాశుగునకు
లోకవిజయైకపట్టాభిషేకభూమి. 165
వ. అప్పుడు శివశర్మ *విష్ణుశీలసుశీలుర కి ట్లనియె. 166
తే. ఎవ్వరొకొ? వీరు విమలపూర్ణేందుముఖులు
దివ్యభూషామహారత్నదీప్తిజాల
పరిధిచక్రావరణమధ్యభావ్యమాన
భువనమోహనమూర్తు లిప్పురమునందు. 167
వ. అనిన వార లి ట్లనిరి. 168
సీ. ఏయిందుబింబాస్య లిక్షుకోదండుని
త్రైలోక్యరాజ్యాధిదైవతంబు
లేయింతులకుఁ బుట్టినిల్లు దుగ్ధాంభోధి
మధుకైటభారాతిమడుఁగుఁబాన్పు
ఏచకోరాక్షుల కింద్రచంద్రజయంత
నలకూబరాదులు ననుపుమిండ
లేపువ్వుఁబోఁడులయిసిఱెంతచూపుల
ఋషులగట్టిమనంబు లిగురువెట్టు
తే. మహితభక్తి నేభామలమసుమరాంద్ర
దక్షిణానందవనమహాస్థానసలికి

* పుణ్యశీల పాఠాం.

భీమనాథేశ్వరునకు సుత్రాముఁ డిచ్చె
ననఘ! వీరు సు మ్మయ్య! యయ్యప్సరసలు. 169

వ. ఊర్వశి, మేనక, రంభ, చంద్రరేఖ, తిలోత్తమ, వపుష్మతి, కాంతిమతి, లీలావతి, యుత్పలావతి, యలంబుస, గుణవతి, స్థూలకేశి, కళావతి, కలానిధి, గుణనిధి, కర్పూరతిలక, యుర్వర, యనంగలతిక, మదనమోహిని, చకోరాక్షి, చంద్రకళ, మునిమనోహర, చారునాస, సుకర్ణిక, దా సంజీవని, క్రతుశుల్క, శుభానన, తపశ్శుల్క, తీర్థశుల్క, దానశుల్క, హిమావతి, పంచాశ్వమేధిక, రాజసూయార్థిని వీరుమొదలుగా నఱువదివేలు దివ్యాప్సర లీలోక బునం దధివసింతురు.

సీ. బ్రహ్మచర్యం బొక్కరాత్రి దైవికమున
 మఱచి తప్పినయట్టిమాచకమ్మ
కలకాల మెల్లను గామికవ్రతములు
 సలిపినట్టిచకోరశాబనయన
బలిమి నొక్కనికి లోఁబడి వాని నవ్వేళఁ
 బతిఁ గాఁ దలంచినపద్మగంధి
పురుషుఁడు లేనియప్పుడు ప్రమాదంబున
 మోసపోయినయట్టిముద్దరాలు
తే. భోగదానవ్రతంబులు పూని యెపుడు
మకరకేతను నర్చించుమాఁటినంగ
కన్నెవయసునఁ గన్నెఱికంబుఁ దప్పి
పిదపఁ బతిభక్త యగునాతి త్రిదశవేశ్య. 17

తే. మాంత్రికుం డైన యొకసిద్ధమాని నొండె
నొక్కవేలుపు నొండెఁ బ్రియుండు వనుప

పుత్త్రసంతానలబ్ధికై పొందినట్టి
లోలలోచన కప్సరోలోకవసతి. 172

సూర్యలోకవర్ణనము.

వ. అని చెప్పిన నప్సరోలోకంబుఁ గనుంగొనుచు భాస్కర
లోకంబు సేరం జని యేకచక్రంబును సప్తసప్తియు ననూరు
సారథికంబును నప్సరోమునిగంధర్వగ్రామణీసమన్వితంబును
నగు రథంబుమీఁదఁ గరధృతారవిందద్వయుం డయి నభో
మార్గంబునం జను కమలబాంధవునిం జూపి విష్ణుకింకరు
లి ట్లనిరి. 173

సీ. సిద్ధాంతసంశుద్ధి సిద్ధసంఘాతంబు
విధ్యుక్తపరిపాటి విబుధకోటి
చాటుధారాప్రౌఢిఁ జారణవ్యూహంబు
కిన్నరవ్రాతంబు గీతసరణి
ఖచరసంఘము విశృంఖలవచోవైచిత్రి
యాతుధానశ్రేణి యధికభక్తి
గరుడలోకము నమస్కారవాక్యంబున
నేకాగ్రమతి దందశూకసమితి
తే. ప్రతిదినంబును బ్రాతరారంభవేళ
నిర్నిబంధననిరుపాధినిరవగాధ
నిర్నిరోధనిరాఘాటనిరుపమాన
భక్తి సంభజియింతు రీపద్మబంధు. 174

సీ. సంచారలోలుఁ డౌ జగదుపక్రియకు నై
సమధికస్థైర్యంబు జరుపుఁగాని
జనులదృష్టికి వెక్కసం బై విభాసిల్లు
లోన శైత్యంబు నీనుఁ గాని

సంతాపహేతు వౌ సంయమిశ్రేణికి
నిర్వాణలీల యీ నేర్చుఁ గాని
ఖరరుచిత్వముఁ బూనుఁ గాలక్రమంబున
శీతలామృతము వర్షించుఁ గాని

తే. ప్రాగవస్థాభ్యధికతరోపర్యవస్థ
నతిశయిల్లుచు భువనంబు లఖిలములును
వారక కత్యంతసత్కృపావైభవమున
ననఘ! రక్షించుచుండు నీయబ్జహితుఁడు. 175

వ. అనిన నప్పుడు శివశర్మ దా నొనర్చునమస్కారంబు లంగీ
రించుచు నిమేషార్ధమాత్రంబున రెండువేలు నిమ్నో
రెండుయోజనంబు లతిక్రమించినం గాంచి యాశ్చర్య
బంది గోవిందకింకరుల కి ట్లనియె. 176

తే. అనఘులార! ఖరాంశుబింబాంతరమునఁ
బురుషు నొక్కని నుండఁ జెప్పుదురు బుధులు
పరమతాత్పర్యగరిమ నప్పురుషు నెట్లు
సేవ సేయుదు రొక్కొ సంసిద్ధిపరులు? 177

వ. అనిన వార లి ట్లనిరి. 178

సీ. ఆకాశమధ్యస్థ మగుభానుబింబంబు
విను లక్షయోజనవిస్తృతంబు
తన్మధ్యమునయందు ధవళాంశుశేఖరు
నుద్గీతవిద్యాప్రయోగసరణి
హైమరూపుఁడు హిరణ్యశ్మశ్రుకేశుండు
హస్తప్రముఖహిరణ్యానయవుఁడు
గా విభావించి యాకప్యాసలోచను
వర్తద దే నని సదా ధ్యానపరత

తే. విమలమానసుఁ డగుచు భావింపవలయు
బ్రహ్మవిద్వాంసుఁ డగువాఁడు ప్రాహ్ణవేళ
నర్కునర్ఘోదయమున గాయత్రిఁ గూర్చి
యర్ఘ్య మెత్తినయాసమయంబునందు. 179

వ. కాలలోపంబు సేయవలదు. కాలంబు ప్రతీక్షించునది. కా
లంబునం గదా యోషధులు ఫలించు. కాలంబునం గాక
పాదపంబులు పూచునెట్లు? కాలంబుననే మేఘంబులు
వర్షించు. మందేహదేహనాశార్థం బుదయాస్తమయంబుల
బ్రాహ్మణోత్సృష్టం బగుగాయత్రీమంత్రతోయాంజలిత్ర
యంబు చిత్రభానుం డపేక్షించుచుండు. కాలంబు దప్ప
కుండ సముపాస్యమానుండయి భానుం డాయురారోగ్యై
శ్వర్యంబులు ప్రసాదించు. 180

సీ. మేలైనరెండుతొమ్మిదులువిద్యలలోన
మహనీయ మగుచు మీమాంస వెలయు
మీమాంసకంటెను మేలుప్రాభవమునఁ
దర్కశాస్త్రము శుభోదర్కగరిమ
తర్కశాస్త్రముకంటెఁ దా సమభ్యధికంబు
వివరించి చూడంగ వేదరాశి
యామ్నాయములకంటె నభ్యర్హితంబులు
చర్చింప నుపనిషత్సముదయములు

తే. నుపనిషత్తులకంటెను నూర్ధ్వపదవి
మంత్రరాజంబు గాయత్రి మహిమఁ గాంచుఁ
బ్రణవ మనుక్రేపుతోఁ గూడి పాఁడిఁ బిదుకు
నవనిసురులకు గాయత్రి యనెడిసురభి. 181

తే. మంత్రములలోన గాయత్రి మహిమఁ గాంచు

నగరములలోనఁ గాశి యున్నతి వహించు
దైవతంబులలో సుధాధామమౌళి
విశ్వనాథుండు ప్రాధాన్యవిభవ మొందు. 132

స్రగ్ధర. గాతారం త్రాయతే నాఁ గలిగిన తెలివిన్
గల్గె గాయత్రి కర్థా
న్వితం బై నామధేయం బితరమనువులం
దీప్రభావంబు లే దీ
ప్రాతర్మధ్యాహ్నసాయోపగమములఁ బర
బ్రహ్మమీమాంసు లార్యుల్
జ్యోతిర్మూర్తిన్ భజింతు రసురగణవినుతున్
సూర్యునిన్ సిద్ధవిద్యున్. 133

క. గాయత్రి పరబ్రహ్మము
గాయత్రి కధీశ్వరుండు కమలాప్తుఁడు శ్రీ
గాయత్రీమంత్రమునకు
నేయవియును సాటి వచ్చునే మంత్రమ్ముల్?. 134

వ. ఈవేదమూర్తి హంసుండు, భానుండు, సహస్రాంశుండు, తప
నుండు, తాపసుండు, రవి, వికర్తనుండు, వివస్వంతుండు
విశ్వకర్మ, విభావసుండు, విశ్వరూపుండు, విశ్వకర్త
మార్తాండుండు, మిహిరుం, డంశుమంతుఁ, డాదిత్యుఁ
డుష్ణగుండు, సూర్యుం, డర్యముండు, బ్రధ్నుండు, దివా
కరుండు, ద్వాదశాత్ముండు, సప్తహయుండు, భాస్కరుం
డహస్కరుండు, ఖగుండు, సూరుండు, ప్రభాకరుండు
శ్రీమంతుండు, లోకచక్షువు, గ్రహేశ్వరుండు, త్రిలో
కేశ్వరుండు, లోకసాక్షి, తమోరి, శాశ్వతుండు, శుచి,
గభస్తిహస్తుండు, తీవ్రాంశుండు, తరణి, కళిందుండు

తార్క్ష్యవాహనుండు, దిక్పతి, పద్మినీనాయకుండు, కుశేశయకరుండు, హరి, మహోరణి, ద్యుమణి, హరిదశ్వుం, డర్కుండు, భానుమంతుండు, భయనాశకుండు, ఛందోశ్వుండు, వేదవేద్యుండు, భాస్వంతుండు, పూష, వృషాకపి,యేకచక్రరథుండు, మిత్త్రుండు, మందేహారి,తమిస్రహుండు,దైత్యహుండు,పాపహర్త, ధర్ముఁడు, ధర్మప్రకాశకుండు, హేళి,చిత్రభానుండు,ఘర్మరశ్మి,దుర్నిరీక్షుండు,అరుణుండు, కశ్యపాత్మజుం డనునీడెబ్బదినామంబులు గలిగియుండు.

సీ. మోఁకాళ్లు భూమిపై మోపి హస్తాంబుజ
ద్వయమునఁ దామ్రపాత్రము ధరించి
యర్ఘ్యోదకంబులయందు దూర్వాంకురా
క్షతములు నవరక్తచందనంబు
కరవీరముఖ్యరక్తప్రసూనంబులు
వైచి యొక్కొక పేరు వరుసతో న
మోంతంబుగాఁ జతుర్థ్యంతంబుగాఁ బ్రణ
వాదిగాఁ బఠియించు చర్ఘ్యపాత్ర
తే. మౌళిపర్యంత మెత్తుచు మాటిమాటి
కర్ఘ్య మిచ్చినఁ బ్రీతుఁడై యర్కుఁ డొసఁగు
సేవకున కాయురారోగ్యధీవివేక
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు. 186
సీ. అతిగుహ్యమై యకారాదిక్షకారాంత
పంచాశదక్షరప్రకృతి యైన
మాతృకయే మహామంత్రరాజంబు నై
దవయవంబులఁ బుట్టె నందకార
మునకును నోంకారమునకు నుకారంబు

నకు బిందువునకును నాదమునకుఁ
బ్రత్యేకమ పదేసిపదియేసివర్ణంబు
లనఘ! జన్యంబు లై యతిశయిల్లు
తే. నట్టి ప్రణవంబు హేమసింహాసనముగ
భాస్కరుం డనుమాణిక్యపదకభూష
యలుత ధరియించి దేవి గాయత్రి యొప్పుఁ
గడుపుచల్లంగ వేదాలఁ గన్నతల్లి. 187
క. సంశితవిజ్ఞానచతు
ర్వింశతితత్త్వంబులకు నివేశన మగునీ
యంశుమదధిపతిమంత్ర మ
సంశయముగ నెపుడు మన కొసఁగు నభిమతముల్. 188
సీ. మూఁడు వేదంబులు మూఁడుపాదంబులు
నాభి యాదిమపురాణవ్రజంబు
క్రిందు మీఁదును జతుర్దిశలు నాల్గతులు
భువనంబు దేహంబు దివి యుదరము
ధర్మశాస్త్రంబు హృత్సరసిజముకుళంబు
ఛందోవితతి కుచస్తబకయుగము
సాంఖ్యశాస్త్రంబులు శ్రవణపాశంబులు
జాతవేదుఁడు వక్త్రచంద్రబింబ
తే. మైదుతలలును శిక్షాదికాంగకములు
చేష్ట యాథర్వణశ్రుతి శిఖ శివుండు
బ్రహ్మ మూర్ధంబు హరి యాత్మ భావలక్ష
ణములు మీమాంస సావిత్రి కమలచరిత! 189
క. వ్యాహృతులతోడఁ బ్రణవో
ద్గారిహాముతో శిరముతోడఁ గమలా క్షమనగ

ప్రాహుణికం బై యీమను
వాహుతిఁ గొనుఁ బాతకమును నగ్నియుఁ బోలెన్. 190

మ. క్షితిదేవోత్తమ! బ్రాహ్మణుండు వెలిగా జిహ్మాభిచారక్రియా
క్రతుతంత్రంబునశాత్రవుల్ గుఱిచియీగాయత్రివర్ణావళిన్
బ్రతిలోమంబుననుచ్చరించివిడువన్ బ్రహ్మాస్త్రమైతాఁకియా
ప్రతిపక్షుం దెగటార్చునంగుళిశిఖాప్రస్ఫోటమాత్రంబునన్.

సీ. గాయత్రి విష్ణుండు గాయత్రి శంభుండు
గాయత్రి పరమేష్ఠి కర్మనిష్ఠ
గాయత్రి విధివిష్ణుకమలసంభవమూర్తి
యైనమార్తాండుండు మానివర్య!
గాయత్రిజపియించి గాయత్రిఁ గొనియాడి
కాంచు విప్రుఁడు ముక్తి కలితపుణ్య!
గాయత్రి సేవించుకాలంబు గాలంబు
మంత్రతంత్రములు నిర్మలవివేక!
తే. యనఘ! సావిత్రి యనఁగ గాయత్రి యనఁగ
విశ్వజనయిత్రి యనఁ జతుర్వేదమాత
యనఁ బరాపరబ్రహ్మాద్వయం బనంగ
నమ్మహాదేవిక సమాహ్వయాంతరములు. 192

వ. అని పుణ్యశీలసుశీలురు సూర్యలోకమాహాత్మ్యం బభివర్ణింప
నాకర్ణించుచు శివశర్మ ముందట నయనానందసందోహాసం
ధాయి యగునొక్కపట్టణంబుఁ గనుంగొని యవ్విష్ణుగణం
బుల కిట్లనియె. 193

తే. పుండరీకాక్షులార! యీపురవరంబు
నెఱియ సుత్సవ మొనరించె నేత్రములకు

నెఱుఁగఁ జెప్పుఁడు నా కది యేభువనము?
శోభితం బగుకారుణ్యవైభవమున. 194

స్వర్గలోకవర్ణనము.

తే. అనిన వా రిది సముచిమర్దనునివీడు
కనకగోపురకనకాట్టకనకసౌధ
కనకకుట్టిమవేదికాకనకభిత్తి
కనకరాజీవసరసీప్రకాశితంబు. 195
సీ. చికిలించుకయుండుఁ జిగురుతెప్పలలోనఁ
గుసుమసాయకవైరినొసలికన్ను
పద్మనాభునికౌస్తుభముకాంతి పాలివోయెఁ
బద్మచన్నులమీఁదిపసుపు దాఁకి
ధళధళుక్కుల నింగిఁ దాటించి చనుఁ గాని
నిలువనేరదు ప్రోదినీప్రకాశ
మస్తినాస్తిప్రకాశానుసారంబున
మినుమిన్కుమను చుండు ననలుదీప్తి
తే. పగలు వగ లయ్యె శశివిభాప్రసరమునకుఁ
దాన పో దిక్కు దీప్తిసంతానమునకు
నసఁగ బోగడొందుకనకవర్ణాభుఁ డైన
భానుఁ డిప్పురవరసమీపమున నడచు. 196
చ. అమవసలందుఁ దా సరసిజాప్తునిగర్భము దూఱిఁ బోవునా
సమయమునన్ స్వకీయయగుచంద్రిక నిల్లడవెట్టెనో సుమీ
యమృతమయూఖుఁడీనెలవునందనుసంశయమావహించెను
త్తమకుల! చూడు మిప్పురిసుధాధవళోన్నతసౌధవీథికల్.
శా. పౌనఃపున్యమునంఘటింపఁదొడఁగెన్ బ్రహ్మాన్వయోత్తంస
గోష్ఠీనాగ్రంబున లేఁగపెయ్య యదెకంటే కామధేనువ్వు

వం, బానందంబున డెందముబ్బఁగ జనన్యాపీనవాపీసుధా, పా
నోత్పుచ్ఛవనూనమౌచటులరుఘుంపా తాండవాటోపమున్.
శా. కంటే స్వర్గకరికంఠపీఠవిలుఠద్గ్రైవేయమోహార్గళా
ఘంటాతాంకృతిఁ దారసౌధవలభీగర్భంబునం దారొ్కనం
ఘంటావీథిఁ జరించుచున్నది పురిం గారాము వాటించి వె
న్వెంటన్ దివ్యకరేణువభ్ర ముఃషథావింపంగ దరోఽద్ధతిన్?.
క. నందనవన మదె ధరణీ
బృందారక ! యల్ల పెద్దపృథివీరుహముల్
మందారకల్పతరుహరి
చందనసంతానపారిజాతాహ్వయముల్. 200
మ. దివిజాధీశసుధర్మయన్ సభసముద్వీక్షింప భూదేవ! రెం
డవకైలాసమువోలె నున్నయది బ్రహ్మాండంబుతో రాయు
చున్, ధవళాభీలతరాట్టహాసవిమలద్రాఘిష్ఠశృంగాగ్ర మై
యవదాతధ్వజశాటికాంచలచపేటాధూతజీమూతమై. 201
సీ. చెఱువు లేటికి రేలు శిశిరాంశుకరముల
గరఁగుచంద్రోపలగిరులు గలుగఁ?
గల్పవృక్షంబులు గలుగంగ నేటికి
వలువలకై తంతువాయసమితి?
గణకు లేమిటికి సంకల్పార్థచింతకుఁ
జింతామణీశిలాశ్రేణి గలుగఁ?
గామధేనువులు గల్గఁగ నేమిటికి మఱి
మోదనంబునకు నై యాదనికులు?
తే. నాఁగ సర్వపదార్థజన్మస్థలంబు
భూరికల్యాణవై భవకారణంబు

విశ్వభువనైకవినుతంబు విబుధరాజ
పట్టణం బది పంకజప్రభవవంశ్య! 202

శా. క్షీరాంభోనిధి సంభవించినఘృతాచీమేనకామంజుఘో
షారంభాహరిణీతిలోత్తములు విశ్వాచీచకోరాక్షులుఁ
స్వారాజప్రియవారభామినులు నానాభూషణాలంకృతల్
గారా మారఁగఁ జూచెద ర్మనలనీకంజాక్షులంజూడుమీ!

వ. ఈయింద్రలోకంబునందుఁ దరురత్నంబు పారిజాతంబు,గాం తారత్నం బూర్వశి, వనరత్నంబు నందనంబు, తురగరత్నం బుచ్చైశ్శ్రవంబు, గజరత్నం బైరావతంబు, రత్నరత్నంబు చింతామణి, సప్తార్చిఃప్రభృతు లగుసప్తలోకపాలురు, నారదాదు లగుమునులు,దనుజమనుజదైత్యులు, గంధర్వయక్ష కిన్నరకింపురుషులు, సగరనలనహుషమాంధాతృదుందుమారాదివసుంధరాధిపతులు, జ్యోతిష్టోమాది యాగంబులు చేసినసోమయాజులుం, దులాపూరుషాదిమహాదానంబులొనర్చినదాతలు, సంగ్రామమందునపరాఙ్ముఖులై యక్షీణాదులై యీల్గినవీరులు వసియింతు రని యనంతరంబ యగ్నిలోకంబున నర్చిష్మతీపురంబు చేరం గొనిపోయి శివశర్మకుఁ బుణ్యశీలసుశీలు రిట్లనిరి. 204

సీ. అమరావతీపురం బమరవిభుం డేలు
నర్చిష్మతీపురం బనలుఁ డేలు
శ్రాద్ధదేవుం డేలు సంయమనీపురం
బసురనాయకుఁడు పుణ్యావతి నేలు
నమలావతీపురం బంబునాయకుఁ డేలు
వాయు వేలును గంధవతిపురంబు

నలకాపురంబు యక్షాధీశ్వరుం డేలు
 నైశాని యేలుఁ జన్ద్రార్ధమౌళి
తే. యనిరి దిక్పాలపురములం దవనిసురుఁడు
రెండవపురంబు నీక్షించి ప్రీతి నుండె
నవుడు వర్ణింపఁ దొడఁగి రయ్యగ్నిలోక
మహిమసంపద గోవిందమాన్యహితులు. 205
సీ. శిఖికర్మఠులకు నిశ్శ్రేయసశ్రీదాత
 ధరణీసురులకుఁ దీర్థంబు వహ్ని
యాశుశుక్షణి గురుం డవనినిర్జరులకు
 నగ్రవర్ణుల కగ్ని యాశ్రమంబు
దహనుఁ డేడ్గడయు నుత్తమవర్ణభవులకుఁ
 బావకుం డీశుండు బ్రాహ్మణులకుఁ
బ్రత్యయంబు తనూనపాత్తు బాడబులకు
 బాలుల కనలుండు పారిజాత
తే. మాశ్రయాశుండు ప్రాణుల కంతరాత్మ
చంద్రశేఖరమూర్తి యుషర్బుధుండు
సకలజగదుద్భవస్థితిసంహృతులకుఁ
గేవలము హేతుభూతుండు కృష్ణవర్త్మ. 206
మ. వివిధాజ్యాహుతిధూపదీపములునై వేద్యంబునీయగ్నిమూ
జవి గోఁ బిమ్మట భుక్తిముక్తులు నవశ్యప్రీతి గా నెప్పుడూ
జవి గొం డ్రంబురుహాసనాచ్యుతమహేశానాదిబృందారక
ప్రవరు ల్సర్వహృషీకతర్పణముగా బ్రహ్మార్థపారంగతా! 207
వ. అనిన విని శివశర్మ వైశ్వానరుం డనంగ నెవ్వాఁ? డెవ్వనిత
నూజుం? డేప్రకారంబున నాగ్నేయం బైన తేజం బతనికి
సంభవించె మహాత్ములారా! యెఱింగింపుండనిన వారు వై

శ్వానరమాహాత్మ్యంబు వివరింపఁ దొడఁగి యిట్లనిరి. 20

## వైశ్వానరమాహాత్మ్యము.

సీ. విశ్వానరుండు నా నీశ్వరభక్తుండు
 శాండిల్యగోత్రసంజాతుఁ డనఘుఁ
డభినుతబ్రహ్మచర్యాశ్రమనిష్ఠుఁ డై
 బ్రహ్మయజ్ఞములు తప్పక యొనర్చు
నియతుఁ డై విజ్ఞాతనిఖిలశాస్త్రార్థుఁ డై
 లోకతత్త్వజ్ఞుఁ డై యేకతమున
నొకనాఁడు చింతించు చుండె నేయాశ్రమం
 బొక్కొ నాల్గింటిలో నుత్తమంబు ?
తే. భక్తి నేయాశ్రమంబు చేపట్టినప్పు
 డైహికాముష్మికసుఖంబు లందవచ్చు?
నిదియ మే లన్నయ ట్లుండు నిదియ లెస్స
యన్నయ ట్లుండు నొక్కొక్కయాశ్రమంబు. 21

వ. అది యెట్లనిన వర్ణాశ్రమాచారంబు శివప్రసాదద్వారంబున జ్ఞానసాధనంబు. అందు వర్ణధర్మంబులు బ్రాహ్మణుండు బృహ స్పతిసవనంబునను, రాజు రాజసూయంబునను, వైశ్యుం వైశ్యసోమంబునను యజియింతురు. ఇదియాదిగాఁగలయవి మఱి యాశ్రమధర్మంబు, లధ్యయనాదులు బ్రహ్మచారి ర్మంబులు, గృహస్థధర్మంబు లగ్న్యాధానాదులు, వానప్రస్థ ర్మంబు లరణ్యావాసాదులు, యతిధర్మంబులు శ్రవణాదులు. బ్రహ్మచారిగృహస్థవానప్రస్థభిక్షుకులయాశ్రమంబులుత్తరో త్తరంబు లుత్కృష్టంబు, లీచతురాశ్రమంబులవారును ని ధర్మానుష్ఠానంబులుదప్పక యీశ్వరపూజాతత్పరులై సుస్థి పడయుదురు. నాకుం జూడ నన్ని యాశ్రమంబులకు నాథా

భూతం బైనగృహస్థధర్మంబు ముక్తిసాధనం బై తోఁచు చున్నది. సర్వాశ్రమంబులకుస్వరూపలాభంబుగృహస్థాశ్ర మనిబంధనంబు.కొందఱు 'వర్ణాశ్రమాచారనిష్ఠునకు బ్రహ్మ నిష్ఠ సిద్ధింపదు. బ్రహ్మనిష్ఠ యన సర్వవ్యాపారపరిత్యాగం బున ననన్యచిత్తంబునం జేసి బ్రహ్మంబు నెఱుంగుట, అది కర్మానుష్ఠానకర్మత్యాగంబులకుఁ బరస్పరవిరోధంబుగావునఁ గర్మఠునియందు సంభవింప' దండ్రు. వర్ణాశ్రమకర్మాను ష్ఠానవంతునకు యథావకాశంబున బ్రహ్మనిష్ఠాతాత్పర్యంబు సుకరంబుగావునఁ గర్మపరుండు బ్రహ్మంబు నెఱుంగండను నిషేధోక్తికిం బని లేదు. పరదారపరిత్యాగంబున నాత్మదార పరితోషంబునబుతుకాలాభిగమనంబునను బ్రహ్మచారియు, రాగద్వేషకామక్రోధవర్జనంబున వానప్రస్థుండును, నయా చితోపస్థితదేహయాత్రామాత్రంబున భిక్షుకుండు నై గృ హస్థుం డఖిలాశ్రమంబులు దాన కైకొను. దేవయజ్ఞంబు, పితృయజ్ఞంబు, భూతయజ్ఞంబు, మనుష్యయజ్ఞంబు, బ్రహ్మ యజ్ఞం బనుపంచమహాయజ్ఞంబులుం జేసి వివిధిపాముఖంబున గృహస్థుండు ముక్తుం డగు. కావున గార్హస్థ్యం బగుధర్మం బునం గైవల్యంబు వడసెద. 210

మ. అని యత్యుత్తమవంశసంభవ వివాహం బయ్యెశాస్త్రోక్తవి
ధ్యనురూపంబుగ భాగ్యలక్ష్మి నతికల్యాణిఁ గుణాన్వితశో
భనపుణ్యాకృతి విప్రకన్యక మహాభాగుండు విశ్వానరుం
డనుకూలస్థిరపుణ్యలగ్నమున వంశానందసంధాయియై. 211

ఉ. చేడియనామధేయము శుచిష్మతి యాచిగురాకుఁబోఁడికిన్
బ్రీడయుఁ గేశభారమునువృత్తపయోధరముల్నితంబమున్
బాడబునెమ్మనంబు రతిభావముతోడన నాఁడునాఁటికిన్

వీడఁగఁ జొచ్చె బాల్యమును వీడఁగఁ జొచ్చెఁ దదీయ
చింతతోన్. 212

సీ. అనుదినంబును బ్రాతరారంభ వేళల
నోలగందంబుతో నుదకమాడి
యంచవన్నియతోడ నంద మైనమడుంగు
నిద్దంపుఁబుట్టంబు నెఱిక గట్టి
నెఱియంగఁ గూడిననెఱికూఁకటులు దాఁచి
పొంకంబుగాఁ గమ్మపూలు దుఱిమి
కాశ్మీరతిలక రేఖామధ్యమునయందుఁ
బుణ్యంపుఁజిటిబొట్టు పొందుపఱిచి

తే. విసువు లే కగ్నిహోత్రంబు వేల్వఁ బెట్టు
దీపధూపంబు లొడఁగూర్చు దేవపూజ
కోగిరంబులు గావించు నొప్పుగాఁగ
బాల ప్రాణేశుహృదయంబు పల్లవింప. 213

వ. అనంతరంబ యౌవనారంభంబున నారంభోరువు వినయ
వతియు, వివేకవతియు, విలాసవతియు, విభ్రమవతియు,
శాంతిమతియు, సౌజన్యవతియు, సౌహార్దవతియు నై
శుశ్రూషాతాత్పర్యంబునం బతిడెందంబున కానందంబు
సంపాదించుచుండం బెద్దకాలం బరిగిన. 214

తే. కానరా దయ్యెఁ బుత్రసంతానలక్ష్మి
యెన్ని నోములు నోఁచిన నిందుముఖికి
నంత నొకనాఁడు తరుణి యేకాంతవేళ
విభునిపాదంబులకు మ్రొక్కి విన్నవించె. 215

ఉ. కట్టితిఁ బట్టుఁబుట్టములు కాంచనభూషణముల్ ధరించితిం
బెట్టితి బంధుకోటికి నభీష్టితవస్తుచయంబు గీర్తి చే

పట్టితి నీపదాబ్జములు పాయక నిచ్చలు సేవసేయఁ గాఁ
బట్టి వసుంధరం గలరె భామలు నాసరి భాగ్యసంపదన్?.

క. సకలైశ్వర్యసమృద్ధులు
నాకతల సంతానలాభ మొకతల యది యే
టికిఁ దడసె? నిందురేఖా
మకుటునికృప యేల లేదు మన కిప్పాటన్? 217

క. చింతించి చూడవచ్చిన
సంతానము వంశమునకు సకలంబునకున్
సంతానము సురధేనువు
చింతామణి సిద్ధరసము! చిరతరపుణ్యా! 218

వ. సంతానంబు గలుగునట్టియుపాయంబు విచారింపు మని
ప్రార్థించిన. 219

ఉ. ఇంతవిచార మేమిటికి నిందునిభానన! నెమ్మనంబులో
సంతతిలబ్ధికై విడువు శంక శశాంకకళాకిరీటుఁ గా
లాంతకుఁ గాశికానగరహాటకనిర్మలహర్మ్యమాలికా
భ్యంతరవర్తి విశ్వపతి నాశ్రితవత్సలు నాశ్రయించెదన్.

వ. అనిన విని శుచిష్మతీ దేవి యర్చిష్మత్ప్రభావుం డగుభర్తకు
వెండియుం బ్రణమిల్లి పాణిపల్లవంబులు మొగిడ్చి వినయ
వినమితోత్తమాంగ యై యార్యపుత్రా! పుత్రసంతానలా
భంబు నాయందుం బడయ నభిమతంబ యేని నేనుం
బ్రసాదభాజనం బగుదు నేని నిందుశేఖరసదృశుం డైన
నందనుం బ్రసాదింపు మనుటయు. 221

తే. ధర్మగేహినిపైఁ గలకూర్మి పేర్మి
సంశితవ్రతుఁ డైనవిశ్వానరుండు

వనరుహాయతనేత్ర కోరినవరంబు
మునికులశ్రేష్ఠుఁ డిచ్చితి ననుచుఁ బలికె. 222

సీ. ఇది మనోరథవీథి నెట్లు చొరఁగ వచ్చు?
నేయింతి పతి వేఁడె నిట్టివరము?
వరము వేఁడిన వేఁడవచ్చుఁ గా కిబ్భంగి
నీ నేరవచ్చు నే యీప్సితార్థ?
మాగమంబులు సమానాధికరహితుఁ గా
శశిరాంశుశేఖరుఁ జెప్పుచుండు
నతఁడ లీలావతారార్థ మీచపలాక్షిఁ
దనకుఁ గారణముఁ గాఁ దలఁచె నొక్కొ?

తే. కానినాఁ డిట్టితలఁ పెట్లు గలుగనేర్చుఁ
దరుణి? కంచు వితర్కించి తరతరంబ
యొకముహూర్తంబునేపు నైష్ఠికతఁ బూనె
శంభుభక్తిపరుండు విశ్వానరుండు. 223

వ. అనంతరంబ యమ్మునీశ్వరుండు తపఃప్రభావంబున భవ్య
ఫాలలోచను భర్గు భాగీరథీతీరభవను భక్తనిధి భావనా
సులభస్వభావు భజింతుం గాక యని భవభయోదన్వదు
త్తారయానపాత్రంబైనకాశీక్షేత్రంబునకుం జని. 224

సీ. మందాకినీవారి మణికర్ణికాంబువు
వాపికాకూపపల్వలజలంబు
కుండికాసలిలంబు గుల్యాప్రపూరంబు
సెలయేటిపాథస్సు చెలమనీరు
ధారాకృపీటంబు దమ్మివాపిపయస్సు
కాసారనీరంబు గ్రయ్యతోయ

మూటకాండము బుగ్గయుదకంబు జలపుష్క-
రము నదప్రాదశాంబరంబు లివియు
తే. మొదలుగా సర్వసర్వతోముఖము గాశి
తీర్థరాజంబులుగ సమర్థించు శ్రుతులు
గాన నిన్నింటియందు విశ్వానరుండు
దేవసంకాశుఁ డతిభక్తిఁ దీర్థ మాడె. 225
తే. అవని దివిజుండు మణికర్ణి కాదిపుణ్య
తీర్థములయందు దేహంబుఁ దేల్చి తేల్చి
శాంతిఁ బొందించెఁ బ్రాగ్జనుశ్శతసహస్ర
పరిచితం బైనబహులతాపత్రయంబు. 226
సీ. భద్రేభముఖులకు భద్రకాళికలకుఁ
గాలభైరవులకు గణములకును
నాదికేశవముఖ్యు లైనకేశవులకు
లోలార్కముఖు లైనహేళులకును
బ్రణమిల్లి సురధునీమణికర్ణికాదితీ
ర్థములఁ బిండప్రదానములఁ బెట్టి
పాయసాపూపాదిబహువిధాన్నంబుల
జగతీమరుత్సహస్రంబుఁ దనిపి
తే. కానవచ్చినయబ్బులింగంబులకును
కానరానినిగూఢలింగంబులకును
బుణ్యవాసరముల మహాపూజ చేసి
యాతఁ డిట్లు వితర్కించె నాత్మలోన. 227
వ. ఓంకారేశ్వరుండు, గృత్తివాసేశ్వరుండు, కాళేశ్వరుండు,
వృద్ధకాళేశ్వరుండు, కలశేశ్వరుండు, కేదారేశ్వరుండు,
కామేశ్వరుండు, చంద్రేశ్వరుండు, త్రిలోచనుండు, జ్యేష్ఠే

శ్వరుండు, జంబుకేశ్వరుండు, జైగిషవ్యేశ్వరుండు, దశాశ్వమేధేశ్వరుండు, ద్రుమిచండేశ్వరుండు, దృక్కేశ్వరుండు, గరుడేశ్వరుండు, గోకర్ణేశ్వరుండు, గణేశ్వరుండు, ఢుండేశ్వరుండు, గజసిద్ధేశ్వరుండు, ధర్మేశ్వరుండు, తారకేశ్వరుండు, చండికేశ్వరుండు, మోక్షేశ్వరుండు, గంగేశ్వరుండు, షత్రేశ్వరుండు, త్రిపురేశ్వరుండు, మార్కండేశ్వరుండు, మణికర్ణేశ్వరుండు, యమునేశ్వరుండు, లాంగలేశ్వరుండు, శ్రీవిశ్వేశ్వరుండు, అవిముక్తేశ్వరుండు, విశాలాక్షీశుండు, వ్యాఘ్రేశ్వరుండు, వారాహేశ్వరుండు, వ్యాసేశ్వరుడు వృషభధ్వజుండు, వరుణేశ్వరుండు, విధీశ్వరుండు, వాసిష్ఠేశ్వరుండు, సోమేశ్వరుం, డింద్రేశ్వరుండు, సంగమేశ్వరుండు, హరిశ్చంద్రేశ్వరుండు, త్రిసంధేశ్వరుండు, భవానీశ్వరుండు, కందుకేశ్వరుండు, మఖేశ్వరుండు, మిత్రావరుణేశ్వరుండునన సిద్ధామృతజ్యోతిర్లింగాదు లగుమహేశ్వరులు శతసహస్రసంఖ్యలం గలరు. ఈమహేశ్వరులస్థానంబుల నెందేని దివ్యస్థానంబునం దపం బాచరించి శీఘ్ర సంతానలాభంబునొందుదు. 235

తే. అహహ! తెలిసితి విస్మృతం బైనయర్థ
మేల సందేహ మందంగ హృదయవీథి?
సిద్ధసంసేవితము సర్వసిద్ధికరము
దర్శనస్పర్శనములం దీర్థములరాజు. 239

సీ. ఉద్ఘాటితంబు లైయుండు రేలువగళ్లు
గవనితల్పులు నాకకటకమునకు
సర్వజంతువులకు సంసిద్ధిసంపద
గరతలామలక మై కానవచ్చు

వికటామహాదేవి విశ్వనాథునిభామ
పర్వతాధిపపుత్రి పాయ దెపుడు
సిద్ధివినాయక క్షేత్రపాలకు లుంద్రు
పరిరక్షణైకతత్పరతఁ బూని
తే. భూమి తిలమాత్రమును వృథవోవ కుండ
నమృతలింగంబు లర్బుదన్యర్బుదములు
గలవు తీర్థరాజంబులు గాశియందు
మహిమ కావాస మవిముక్తమంటపంబు. 230

క. ఎందుండును విశ్వేశ్వరుఁ
డిందుకళాధరుఁడు గిరిదుహితృసహితుం డై
యెందుండు భుక్తిముక్తులు
సందేహము లేదు తప మచట నొనరింతున్. 231

సీ. అప్సరోంగన లెల్ల నాటపాటలవెంటఁ
బ్రాపించిరి మనోరథార్థసిద్ధి
గంధర్వుఁ డొక్కఁడు గానవిద్యాప్రౌఢి
శీఘ్రంబునంద సంసిద్ధిఁ గాంచె
యక్షపుంగవుఁడు విద్యాధరశ్రేష్ఠుండు
కోకిలాలాప యకోమలియును
శతరుద్ర్యమంత్రైకజపపరాయణుఁ డైన
వేదశిరుం డనువిప్రవరుఁడు
తే. చంద్రమౌళి భరద్వాజసంయములును
హంసపది యనునొకకిన్నరాంగనయును
నాప్రవాళోష్ఠిమగఁడు వేణుప్రియుండు
సిద్ధిఁ బొందిరి యవిముక్తసీమయందు. 232

క. సిద్ధమరుత్సాధ్యాదులు
సిద్ధిం బ్రాపింతు రం దచిర కాలమునన్
సిద్ధ మిది యగుట శంభుం
డద్ధరణిని సిద్ధలింగ మనఁగా వెలయున్. 233

వీరేశ్వర ప్రభావవర్ణనము.

వ. అమ్మహాజ్యోతిర్లింగమూర్తి వీరేశ్వరుఁడనం బ్రసిద్ధివహించె. అమ్మహేశ్వరుండు జయద్రథునకు, విదూరథునకు, మగధాధిపతికి, వసుదత్తునకు, మనోరథార్థంబులచిర కాలంబునఁ బ్రసాదించె. నేనును వీరేశ్వరమహాదేవు నారాధించి యభిమతార్థంబులు వడసెదం గాక యని చంద్రకూపంబున నభిషేకంబాచరించి సంకల్పపూర్వకంబుగా నియమంబు వహించి యొక్కమాసం బేకాహారుండును, నొక్కమాసంబు నక్తాశనుండును, నొక్కమాసం బయాచితాశనుండును, నొక్కమాసంబు నిరశనుండును, నొక్కమాసంబు పయోవ్రతుండును, నొక్కమాసంబు శాకఫలాశనుండును, నొక్కమాసంబు ముష్టితిలాహారుండును, నొక్కమాసంబు పానీయభోజనుండును, నొక్కమాసంబు పంచగవ్యాశనుండును, నొక్కమాసంబు చాంద్రాయణవ్రతుండును, నొక్కమాసంబు కుశాగ్రజలపాయియు, నొక్కమాసంబు వాయుభక్షుండును నై వత్సరంబు గడపి త్రయోదశమాసంబునం బ్రథమదివసంబున. 234

సీ. హారు లేదు నేడుకత్త్యాంతరంబులు గాఁగ
నియమంబుమై నాజ్ఞ నిలుపువాఁడు
వెండికట్టులతోడి వేత్రంబుమాలుగా
బంగారుమునకోల పట్టువాఁడు

ఝంకించి పరపృథగ్జనకోటిచందానఁ
గలకుచీఁకటివెన్నఁ సలుచువాఁడు
వసుమతీభృచ్ఛ్రేణి వరుసతో గుఱి చూపి
యొండొండఁ గాన్పించుచుండువాఁడు

తే. త్రిభువనస్థానపతి యైనదివసకరుని
ప్రాక్ప్రతీహారపాలుండు ప్రాచినొసలి
ఘుసృణలీలాలలామంబు బిసరుహాప్తు
తేరిసారథి యెఱ్ఱ నై తీఁడిరించె. 235

సీ. ప్రథమసంధ్యాకాలబలిశంఖనినదంబు
ప్రభవించె శ్రీవిశ్వభర్తనగరఁ
గదిసె నంగుళియుగ్మకం బంతరము గాఁగ
గగనగంగారథాంగద్వయంబు
నెఱయంగఁ గైసేసి నిలువుటద్దము చూచె
నవిముక్తమున విశాలాక్షి గౌరి
కొక్కొరొకో యని కుక్కుటంబులు గూసెఁ
గడఁగి కుక్కుటచతుష్కంబునడుమఁ

తే. బ్రహరిఁ దిరుగుట చాలించి భైరవుండు
గవనిమొగసాలయరుఁగుపైఁ గన్ను మొగిచె
ఢుంఠివిఘ్నేశ్వరుండు గండూష సేసి
యుమిసె వినువీథిఁ జంద్రకుండోదకములు. 236

సీ. ముక్తిప్రయోజనంబునఁ గుటీచకకోటి
సావిత్రితత్త్వంబు సంగ్రహించెఁ
బరమహంసలు పరబ్రహ్మార్థమీమాంస
శోధించి రుపనిషద్వీథులందు

నిగమాంతవాసనానిర్వృతస్వాంతులై
హంసు లుండిరి దృష్టైకాంతపరతఁ
బ్రత్యగ్రగోజాలరజ్జుసంబంధంబు
దండంబులు బహూదకుండు దాల్చె
గీ. భసిత ముద్ధూళనము చేసి పాశుపతుఁడు
దీర్ఘపాటలజటల బంధించె మౌళిఁ
గలుమతంబులమీఁద శ్రీకాశినడుమఁ
గొక్కొరోకో యనుచుఁ గోడికూయుటయును. 237
వ. అంత సూర్యోదయంబున. 238
సీ. ధరణీధరములందు ధాతుపాషాణంబు
పాదపంబులయందుఁ బల్లవంబు
పాథోనిధులయందుఁ బవడంపు లేఁదీఁగ
కాలాభ్రములయందుఁ గోలమెఱుపు
హరిదంతనాగంబులందు సిందూరంబు
భూమిమొదలియందు హేమభూష
యాకాశవీథియం దవతంసరత్నంబు
నబ్జజాండగృహంబునందు దివియ
గీ. యగుచుబాలాతపము జగం బాక్రమింప
నంధకారము దిక్కుల నస్తమింప
భానుబింబంబు వొడిచెఁ బ్రభాతలక్ష్మి
కబరిభారంబుమీఁది చెంగలువకచ్చు. 239
వ. అయ్యవసరంబున విశ్వానరుండు సకలకలికలుషవిషభంగ జాంగలికం బగుగగనగంగాప్రవాహంబున నఘమర్షణ స్నానం బాచరించి, వైదికానలసంభవం బైనభస్మంబున సర్వాంగోద్ధూళనం బొనర్చి, తిర్యక్పుండ్రంబులు శిరోభా

షుమూలంబుల ధరియించి, రుద్రాక్షమాలికాధరుండయి సరస్వతీస్కందవిఘ్నేశ్వరులకు నాదిత్యానిలాగ్నులకు మ్రొక్కి, పుండరీకచర్మాసనంబునం బ్రాఙ్ముఖుండై దక్షిణజానూరుమధ్యంబున వామపాదంబును వామజానూరుమధ్యంబునదక్షిణపాదతలంబును విన్యసించి, సమగ్రీవామూర్ధకాయుండును, సంవృతాస్యుండును, నిశ్చలుండును నై నాసాగ్రంబున సుధాధారాబిందునిష్యందంబునందు నిందుబింబంబున వీక్షించుచుం బ్రాణాయామంబు నేసి, ప్రాణాయామంబునఁ జిత్తశుద్ధి వడసి, చిత్తశుద్ధివలన వేదాంతజ్ఞానంబు విశదీకరించి, విశుద్ధవేదాంతజ్ఞానవాసనావశంబున శ్రోతవ్యుండును, మంతవ్యుండును, నిధిధ్యాసితవ్యుండును, నిరస్తసమస్తోపాధిక స్వప్రతిష్ఠాఖండసచ్చిదానందైకరసాద్వితీయస్వరూపుండును, పరమశివపరంజ్యోతిర్లింగమూర్తియు నైన యవిముక్తవిశ్వేశ్వర శ్రీమన్మహాదేవునందు భావించి భావించి చూచుచుండం బ్రాచీనంబై పచేళిమంబై భవ్యంబైనభాగ్యాతిశయంబున. 240

సీ. శ్రీపాదములఁ బైఁడిచిఱుగజ్జియలతోడ
తవణిల్లుగండపెండార మమర
వెలిదామరలఁ బోలువెడఁదకన్నులు
మద్దికాయలతోడ నుద్దివడయ
మొలకనూఁకటిఁ గ్రాలుముత్యాలరవిరేక
భసితంపుబొట్టుతో బాదరింపఁ
బాలబుగ్గలకాంతిపల్లవంబులతోడఁ
జిన్నిలేనగవులు చెలిమి సేయ

గీ. లజ్జ యెఱుఁగనికటిమండలంబుమీఁద
వలుదవజ్రాల కమరుగర్వంబు సూఁప
దివ్యబాలకుఁ డొక్కఁడు దేజరిల్లెఁ
గాశివీరేశశంభులింగంబునడుమ. 241

చ. ప్రవిశదభంగిదివ్యశిశురత్నముసప్రణవాక్షరంబుగా, శ్రవణ
మనోహరంబుగఁ బ్రసన్నముగాఁ బఠియింపఁజొచ్చె మూఁ
డవసవనంబునన్ శ్రుతిసమభ్యధికంబుగఁ దత్ప్రతిస్వనం
బవిరతలీల గర్భభవనాంతరభూముల నుద్భవింపఁగాన్. 242

వ. అప్పుడు విశ్వానరుం డానందాశ్రుపూర్ణలోచనుండును, రోమాంచకంచుకితాఖిలావయవుండును, గద్గదికానిరుద్ధ కంఠధ్వనియు నయి యంజలీపుటంబు లలాటంబున ఘటియించి యేకంబు బ్రహ్మం బద్వితీయంబు సత్యం బొక్కరుండ రుద్రుం డొక్కరుండ కర్తయెవ్వం డట్టినీకునమస్కారంబు. రజ్జువందు సర్పంబును, శుక్తియందు రౌప్యంబును, మరుమరీచికయందు సలిలంబునుం బోలె నెవ్వానియందుఁ బ్రపంచంబు గానంబడు నట్టినీకు నమస్కారంబు. తోయంబునందు శైత్యంబును, వహ్నియందు దాహకత్వంబును, దపనునందుఁ దాపంబును, జంద్రునందుఁ బ్రసాదంబును, బుష్పంబునందు గంధంబును, దుగ్ధంబునందు ఘృతంబునుంబోలె సర్వంబునం దెవ్వం డంతరాత్ముఁ డై యుండు నట్టినీకు నమస్కారంబు. శబ్దంబు గ్రహించు నశ్రవణుండు, గంధం బాఘ్రాణించు నఘ్రాణుండు, దూరంబు నడచు ననంఘ్రి, చూచు ననలోచనుండు, రసంబుఁ గొనునరసజ్ఞుం డెవ్వం డట్టినీకు నమస్కారంబు. నిజభక్తుండుదక్క విష్ణువిరించిపురందరాదిబృందారకు లెవ్వానికందువ యెఱుంగ రట్టినీకు నమస్కారంబు.

గోత్రంబు, జన్మంబు, నామంబు, రూపంబు, శీలంబుఁ దెలియ రాకుండియుభక్తులకునభీప్సితంబులొసంగు నెవ్వాం డట్టినీకు నమస్కారంబు. ఎవ్వానివలన సర్వంబును నెవ్వాండు సర్వం బును గనుంగొను,నెవ్వాఁడు సంపన్నుం, డెవ్వాఁడు దరిద్రుఁ, డెవ్వాండువృద్ధుం, డెవ్వాండు యువ, యెవ్వాండు బాలుం డట్టి నీకు నమస్కారంబు. అని సంస్తుతించి సాష్టాంగదండప్ర ణామంబుచేసిన నతనిం గరుణాతరంగితంబగునపాంగవీక్ష ణంబునం గనుంగొని వృద్ధవృద్ధుం డగునబ్బాలుండు ముగ్ధ స్మితజ్యోత్స్న చిన్నిబుగ్గలం జిగురొత్త నిట్లని యానతిచ్చె.

మ. క్షితిదేవోత్తమ! నీమనోరథము సంసిద్ధిన్ వహింపన్ బతి
వ్రతకున్ శోభనపుణ్యలక్షణకు విశ్వస్తుత్యచారిత్రకు
ప్రతిమప్రాభవభాగ్యవైభవకళాపారీణకున్ మీశుచి
ష్మతికిం బుట్టెదఁ గాశికాపురతపశ్చర్యాఫలం బల్పమే?.244

గీ. అచిరకాలంబునంద యే నవతరింతుఁ
బరమపావని యైననీభార్యయందుఁ
జను నిజాశ్రయమునకు సంశయము మాని
విమలపుణ్యా! విశ్వానర విప్రముఖ్య! 245

వ. అని చూడం జూడనయ్యెందుచూడుం డానందక్రీడావాటి కాక్రోడక్రీడావిహారహేలాచిక్రోడంబద్దంబులోనినీడయుం బోలెఁ బొడచూపి యవిముక్తక్షేత్రాపీడంబగువీరేశ్వరలిం గంబునందుఁ గుడుంగంబునందునుం బోలె డాగియుండె. విశ్వానరుండును విశ్వాసభక్తితాత్పర్యంబు మనంబునం బెనఁగొన నయ్యనంగమథనుందలంచి శుచిష్మతియుందాను నంజలిపుటంబు లలాటంబునంఘటియించి ప్రస్తుతించుచుం బ్రమోదించుచు నిజనివాసంబునకుం జనె ననిన విని నైమి

శారణ్యావాసు లీశ్వరుం డెబ్భంగి శుచిష్మతికిం జన్మించె నని
యడిగిన. 246

ఆశ్వాసాంతము.

శా. కర్ణాటోత్కలపారసీకనృపసఖ్యా! ప్రాభవశ్రీనిధీ!
యర్ణోరాశిపరీతభూభువనమధ్యాంధ్రక్షమాధీశ్వరా!
కర్ణాభ్యర్ణవిశాలనేత్ర! జగదేకప్రాజ్యసామ్రాజ్య! దృ
క్కర్ణాధీశ్వరహారభక్తినిరతక్ష్మాపాలచూడామణీ! 247

క. పంచారామవధూటీ
పాంచాల! కళింగరాజపరమేశ్వర! య
భ్యంచితదయాధురంధర!
చెంచూమలచూరకార! చిరపుణ్యనిధీ! 248

భుజంగప్రయాతము.
త్రిలోకీనకార్యప్రదీపప్రతాపా!
కలాభోజ! యౌదార్యకల్పావనీజా
నలేక్ష్వాకుదుష్యంతనాభాగలీలా
కలా! రెడ్డిభూపాల! కల్పాంతకాలా! 249

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్య
పుత్త్రసుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ
ప్రణీతం బైన కాశీఖండం బనుమహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# చ తు ర్థా శ్వా స ము.


కంఠచరణసేవా
వైకుంఠ! యకుంఠశౌర్యవైభవ! లోకా
లోకగిరిప్రాచీన
క్ష్మాకల్పయశఃప్రసార! యల్లయవీరా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. నంతఁ
గొంత కాలంబున. 2

## వైశ్వానరజననము.

క. నెల మసలె నిందువదనకు
జలజాక్షికి నల్ల నయ్యెఁ జన్నులముక్కుల్
తలిరుంబోఁడికి లవలీ
దళపాండువు లయ్యె గండదర్పణతలముల్. 3

గీ. గర్భగోళస్థితుం డైన కాలకంఠు
కంఠహాలహాలచ్ఛాయ కాళిమంబు
నాభిబిలమున వెడలి కన్పట్టినట్లు
కమలపత్త్రేక్షణకు నారు గారుకొనియె. 4

సీ. సరసిజానన యహర్విరతి సంధ్యాకాల
మానందతాండవం బాడఁ దలఁచె
జంతుకోటికి ముమూర్షావేళఁ గాశిలో
నోంకార మాన తీ నువిద గోరెఁ
బసిఁడికమ్ములతోడిపచ్చియేనికతోలు
పచ్చడంబు ధరింప భామ దివిరె
నతివ యువ్విళ్లూరె నారకూటపిశంగ
మకుటాగ్రమునఁ జందమామఁ దుఱుమ
గీ. ముదిత కాంక్షించె నేనికమోముకొడుకు
నంకపీఠమునం దుంచి యాదరింప
నహరహంబును గర్భంబునందుఁ బెరుగు
కాలకంఠునియనుభావగౌరవమున.

వ. వెండియు.

శా. ఆచంద్రానన యధ్వరంబులఁ బురోడాశంబుతో మంత్ర
ధ్రీచీనంబుగ యాయజూకులుసమర్పింపంగనాజ్యాహుతుల్
ప్రాచుర్యస్థితి నారగింపఁ దలఁచున్ బ్రాగ్వంశమధ్యంబునన్
శోచిష్కేశుఁడుగర్భగోళమునఁదొల్పొల్చలున్న తింబొందఁగాన్.

వ. అనంతరంబ యాహంసగమనకుఁ బుంసవనసీమంతంబుల
గృహ్యోక్తప్రకారంబున నిర్వర్తించిన.

మ. నవమాసంబులు నిండఁగాగురుఁడు కేంద్రస్థాయియైయుండఁ
గా, శివలగ్నంబున నుద్భవించె సుతుఁ డర్చిష్మంతునంశఁ
నన్, ధవళాంభోరుహపత్ర నేత్రకవిముక్తస్థానవీ శేశఁ
భ్యవతారాంతర మప్రధృష్యతరదివ్యాకార తేజంబునన్.

వ. అప్పుడు గంధవాహంబులు దివ్యగంధంబులు వహించె
ఘనాఘనంబులు పుష్పవర్షంబులు గురిసె. దేవదుందుభుల

మొరసె. దిఙ్ముఖంబులు ప్రసన్నంబు లయ్యె. వాహినులు
విమలసలిలప్రవాహంబులయ్యె. సకలభూతంబులమనంబులు
దెలివిం బొందె. విద్యాధరయక్షగంధర్వులు వసిష్ఠవాలఖి
ల్యాదిమునులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులుఁగుమారావలో
కనకౌతూహలాయత్తచిత్తు లయి యేగుదెంచి రాసమయం
బున. 10

క. ద్రుహిణుండు గైటభారియు
నహికటకుఁడు గూడి యిచ్చి రక్కొడుకునకుఁ
గృహపతి యనియెడునామము
మహనీయకృపావిధేయమానసు లగుచున్. 11

వ. పదునొకండవదివసంబున నామకరణంబు గల్పించి వేల్పులు
చన్నపిమ్మట గురుజనంబులు గ్రమంబున. 12

సీ. గృహనిష్క్రమంబు సాగించిరి నాల్గవ
మాసంబునందుఁ గుమారునకును
వత్సరార్ధమునందు వాలాయముగఁ జేసి
రన్నసంప్రాశనం బర్భకునకు
నంతఁ జూడాకర్మ మాచరించిరి బిడ్డ
నికి గృహ్యాసంప్రోక్తనియమపరత
దతితోడఁ గర్ణవేధంబు గల్పించిరి
శ్రవణర్క్షమున నాత్మసంభవునకు

గీ. బ్రహ్మతేజోభివృద్ధికై పంచమాబ్ద
వేళ సల్పి రుపాకర్మవిధి సుతునకుఁ
జదువఁ బెట్టిరి వేదంబు పదముఁ గ్రమము
సాంగముగ బాలకుని నుపాధ్యాయునొద్ద. 13

వ. అంతనొక్కనాఁడు నారదుండు యదృచ్ఛాగతుండై యతిథి
సత్కారంబువడసి తనకు నమస్కరించిన గృహపతిం గను
గొని దంపతుల కిట్లనియె. 14

గీ. ఓయి! విశ్వానరుండ! విశ్వోపకారి!
యో శుచిష్మతి! పరమపుణ్యోజ్జ్వలాత్మ!
బాలుఁ డీతండు మీమీఁద భక్తిగలఁడె?
చేయునా వీఁడు సులభుఁడై చెప్పినట్లు? 15

గీ. తల్లిదండ్రులయాజ్ఞ యథగికరింప
కుండుటయ చూవె! ధర్మ మత్యుత్తమంబు
దైవ మనఁగ గురుండు నా ధర్మ మనఁగ
నర్థ మనఁ దలిదండ్రులె యాత్మజునకు. 16

క. జననీజనకులఁ గొలుచుట
తనయునకును ముఖ్యమైనధర్మము జననీ
జనకులఁ గొల్చుటకంటెను
దనయున కభ్యధిక మైనధర్మము గలదే! 17

సీ. నవదరించుట యెట్లు జఠరగోళంబున
నవమమాసావసానంబు దాఁక?
వ్రేఁక నైన ప్రసూతివేళాసముద్భూత
సంకటం బోర్వంగఁ జాలు టెట్లు?
కుత్సింపకుం డెట్టు లుత్సర్గవిణ్మూత్ర
లాలాద్రవశ్లేష్మజాలమునకు?
నందంద వక్షోరుహాములు దింపులువోవఁ
దొడుక నిచ్చుట యెట్లు దుగ్ధరసము?

గీ. పంచకరపాట్లు వడి తన్నుఁ బెంచి విసికి
యాపదలఁ బాపి రక్షించినట్టితల్లి

దేవతాబుద్ధి భావించి తెలియవలయుఁ
గొడుకు వంశాభిసంవృద్ధి కొనలు సాఁగ. 18

క. రేపాడిఁ గొడుకు జననీ
శ్రీపాదములకు నమస్కరింపఁగఁ దగుఁ ద
చ్ఛ్రీపాదక్షాళనసలి
లాపోశన మెపుడు సుతుల కాయుష్య మగున్. 19

గీ. సర్వతీర్థాంబువులకంటె సమధికంబు
పావనం బైనజనయిత్రిపాదజలము
వరతనూజుల కఖిలదేవతలకంటె
జనని యెక్కుడు సన్నుతాచారనిరత! 20

వ. అని నారదుండు గృహపతిం జూచి యన్న ! వైశ్వానర !
ఇటు రమ్మని చేరం దిగిచి తొడలమీఁదఁ గూర్చుండఁబెట్టు
కొని దక్షిణహస్తంబు చూచి లక్షణంబులు పరీక్షించి యం
తం బోవక. 21

సీ. ఆపాదమస్తకం బంగకములు నుపాం
గకములుఁ బ్రత్యంగకములు వరుసఁ
దను వైనకార్పాసతంతుసూత్రమునఁ గుం
కుమరసాక్తంబునఁ గొలిచి కొలిచి
తప్ప కయ్యయిచోట్లు దర్శించి దర్శించి
యంగులీముఖమున నంటి యంటి.
నడిపించి నిలిచియుండఁగఁ బెట్టి కూర్చుండ
నియమించె పరికించి నిశ్చయించె

గీ. లక్షణములు శుభాశుభాలంబనంబు
లంబుజహాసూతిసుతుఁడు సంయమివరుండు

సకలసాముద్రికాగమజ్ఞానశాలి
నారదుఁడు సర్వవిద్యావిశారదుండు. 22

వ. ఇట్లు నిశ్చయించి. 23

గీ. తిర్యగూర్ధ్వంబు గొలువంగ దేహయష్టి
యెవ్వనికి ప్రేళ్లు నూఱును నెనిమిది యగు
మానమున వాఁడు ధరణిసామ్రాజ్యపట్ట
బంధయోగ్యుఁడు భాగ్యవైభవముకలిమి. 24

గీ. ముక్కు భుజములు లోచనంబులును జాను
హనువులును నైదుదీర్ఘంబు లగుట మేలు
మెడయు జంఘాయుగంబును మేహనంబు
హ్రస్వములు గాఁగ వలయు భాగ్యాన్వితునకు. 25

గీ. నాభిరంధ్రంబు సత్త్వకంఠస్వరములు
మూఁడు నత్యంతగంభీరములుగ వలయు
నంగుళీదేశజత్రుత్వగంఘ్రిగుల్ఫ
పంచకము సూక్ష్మమై యుండు భాగ్యనిధికి. 26

గీ. కరములును గుత్తియును గటిస్కంధములును
ఫాలమును మోము నున్నతి వడయవలయు
హస్తరేఖాదృగంత జిహ్వాధరోష్ఠ
తాలునఖములు గెంపైన ధన్యుఁ డతఁడు. 27

గీ. కటియు వక్షస్స్థలంబును నిటలతటము
విస్తృతము లెవ్వనికి వాఁడు విభుతఁ గాంచుఁ
బదము గోమల మయ్యును బాణి కఠిన
మయ్యు నైశ్వర్య మొసఁగు మహానుభావ! 28

గీ. తాల్చు నెవ్వఁడు భ్రూలతాంతరమునందు
వర్తులం బైనదక్షిణావర్తరేఖ

ధ్యాతఁ డేకాతపత్త్ర మౌనట్లుగాఁగ
ధరణిరాజ్యంబుఁ బాలించు ధన్యచరిత! 29

క. కమలోదరారుణము లై
సమగుల్భము లై మృదుత్వసంయుక్తము లై
విమలారుణనఖరము లై
చెమరింపనియడుగు లొసఁగు సిరి మనుజులకున్. 30

సీ. లింగంబు గృశ మైన లెస్స మూత్రము దక్షి
ణావర్తనిస్సృతం బైన మేలు
మధుగంధ మైనను మత్స్యగంధం బైన
నింద్రియంబు శుభంబు నీనఁ జాలుఁ
గంతనిర్హ్రాదంబు క్రౌంచదుందుభిఘోష
గంభీర మగుట సౌఖ్యప్రదంబు
చతుర్కనీనిక సరఘామధుచ్ఛాయఁ
బింగళం బై యిచ్చు మంగళంబు

గీ. నైదురేఖలనొసలివాఁ డయయుతుండు
భాగ్యనిధి ముప్పదియు రెండుపండ్లవాఁడు
కంబునిభ మైనమెడవాఁ డఖండకీర్తి
నూర్ధ్వరేఖలపదమువాఁ డుత్తముండు. 31

గీ. హస్త మిఱియించిపట్టినయపుడు కదిసి
యంగుళులు రంధ్రహీనంబు లయ్యె నేని
నతనిఁ గల్యాణలక్షణాన్వితునిఁ గాఁగఁ
జెప్పు సాముద్రికజ్ఞానసిద్ధబుద్ధి. 32

వ. ఏను చెప్పినయీభాగ్యలక్షణంబులెన్ని గలవన్నియు నిక్కు
మారునియందు సంపన్నంబు లై యున్నయవి. 33

గీ. ఇన్నిగుణములు గలిగినయన్నరునకు
నన్నిగుణములు నౌ బలే! యవగుణంబు
లకట! యత్యంతనిర్దయుం డగువిధాత
యచ్చలమునఁ బరాఙ్ముఖుం డయ్యె నేని. 34

గీ. చెప్ప నోరాడ దేమని చెప్పవాఁడ?
నెఱిఁగినర్థంబు చెప్పక యె ట్లడంతు?
బదియు రెండవయేఁట నీబాలకునకు
గండ మొక్కటి దంభోళికారణముగ. 35

వ. అని చెప్పి నారదుం డరిగిన శుచిష్మతియు విశ్వానరుండు
నశనిపాతదారుణం బైనయమ్మునిభాషితంబునకు భయ
బంది హాహాకారంబొనర్చి మూర్ఛాంధకారంబున మునిఁగి
యెట్టకేలకుం దెలిసి బహుప్రకారంబుల విలపించుచుండ
రాసమయంబునఁ దల్లిదండ్రులకు వైశ్వానరుం డిట్లనియె.

సీ. ఓయమ్మ! యేలమ్మ! యుపతాప మందెద!
వోతండ్రి! యేలయ్య! భీతిఁ బొందె?
దస్మన్నిమిత్తమైయకట! మీశ్రీచర
ణాంభోజధూళి నా కహరహంబు
సర్వాంగరక్షయై సంధిల్లు చుండంగ
మృత్యు వెబ్భంగి నామీఁదఁ గవయుఁ
గవిసె నేనిఁ గఠోరకంఠహుంకారంబు
నొనరించి మీయాన వోడుచువాఁడ

గీ. నానయును ద్రోచి వచ్చెనే నాగ్రహమున
దీర్ఘనిర్ఘాతసంపాతనిర్ఘృణోగ్ర
కఠినతరవామపదపార్ష్ణిఘట్టనమున 37
దానిం [illegible]

మ. వినుఁడీనాధుప్రతిజ్ఞ మీరుహృదయోద్వేగంబువర్జించియో
జనయిత్రీ జనకుల్! గురుల్! భవదనుజ్ఞాముద్రచేపట్టి యేఁ
జనికాశీపతివిశ్వనాయకుశివుంజంద్రార్ధచూడావతం,సునిమృ
త్యుంజయునాశ్రయించివిగతాసుఁ జేసెదఁ మృత్యువున్.

వ. అనిన విని దంపతు లపయోధరంబైనవర్షంబును, నదుగ్ధాబ్ధి
యైనశుద్ధోదకంబును, ననిందుబింబం బైనచంద్రికాలోకం
బును నైనయామాటకుఁ బరితోషంబు నొంది యెట్టెట్టని
క్రమ్మఱ నడుగుచు సుతున కి ట్లనిరి. 39

సీ. కావఁడే యాభీలకాలపాశనిబద్ధు
శ్వేతకేతునిఁ బ్రాణవిగమభీతు?
రక్షింపఁడే కాళరాత్రిపాల్పడకుండ
నెనిమిదేఁడులశిలాదునితనూజుఁ?
బాలింపఁడే విష్టపంబు లిరేడును
గాలకూటాగ్నిచేఁ గాలకుండ?
మనుపఁడే యాయుఃప్రమాణంబు నిండినఁ
గారుణ్యబుద్ధి మృకండుతనయు?

గీ. నంధకాసురవ్యాఘ్రజలంధరేభ
దక్షమఘపుష్పశరపురధ్వంసకునకు
విశ్వభర్తకుఁ గాశికాధీశ్వరునకు 40
నిందుమౌళికి నినుఁ గాఁచు టెంతభరము.

వ. అని శుచిష్మతియు విశ్వానరుండును గొడుకు నాశీర్వదించి
యనిచిన నతండును గాశి కరిగి మణికర్ణికందీర్థమాడి విశ్వ
నాథు దర్శించి తద్దివ్యజ్యోతిర్లింగంబుఁ గనుంగొని పరమా
నందకందంబనియును,బిండభూతంబైనత్రైలోక్యసారసర్వ
స్వం బనియును, దుగ్ధాబ్ధిసముద్భవం బగుసుధాపిండం బని

యును, స్వాత్మావబోధపాదపంబునకుఁ బ్రథమాంకురం
బనియును, బ్రహ్మరసాయనం బనియును, లింగరూపంబున
నాకారంబు భజించిన యనాకారతత్త్వం బనియును,
నానారత్నప్రపూరితం బైనబ్రహ్మాండభాండం బనియును,
మోక్షవృక్షఫలం బనియును, బుష్పగర్భం బైననిర్వాణ
లక్ష్మీకేశపాశంబనియును,కైవల్యమల్లీవల్లీమతల్లీస్తబకంబని
యును, నిశ్శ్రేయసశ్రీకరక్రీడాకందుకంబనియును, సప
వర్గోదయాద్రిసుధాకరబింబం బనియును, సంసారమోహ
వ్యూహగాఢాంధకారవిధ్వంసనబ్రధ్నమండలం బనియును
నమృతకల్యాణశ్రేణిరమణీశృంగారలీలాదర్పణంబనియును
భావించి భావించి వితర్కించి నమస్కరించి యొక్కపుణ్యా
శ్రమంబున శుభవాసరంబున లింగస్థాపనంబుచేసి తత్స
మీపంబున వత్సరద్వయంబు ఘోరం బైనతపంబు చేసె
నంత నొక్కనాఁడు. 41

శా. ఆవిర్భావము నొందె నిర్జరవిభుం డైరావణారూఢుఁ డై
యావైశ్వానరుచక్కఁ గట్టెదుర బాహాస్తంభదంభోళి
యుఁ, గ్రీవాలంకృతతారహారలతికారించోళికేళీసఖ
గ్రైవేయాభరణాభిశోభియును నై కాశీప్రదేశంబునన్.

గీ. జంభదైత్యవిరోధి సాక్షాత్కరించి
వరము వేఁడుము నీతపోవైభవమున
కనఘ! మెచ్చితి నముచిసూదనుఁడ నేను
నావు డను నాశుచిష్మతీనందనుండు. 43

క. ఏవరము వేఁడ నిన్నును
దేవేంద్రా! వినుము నాకు ... దగుకా

శ్రీవిశ్వనాయకమహా
దేవుని నర్థింతు వర మధికతరభక్తిన్. 44

వ. అనుటయు. 45

గీ. శ్రీమహాదేవుఁ డనఁగఁ గాశీపతి యన
విశ్వనాయకుఁ డన నొకవేల్పు గలఁడె?
యేను పాలింపఁ దై్రలోక్య? మేను నఖిల
దేవతాచక్రవర్తి సందియము లేదు. 46

క. నాకంటె నధికుఁ డెవ్వఁడు
లోకత్రయమున? మనంబులో విశ్వాస
స్వీకార మేల వదలెద?
వాకాంక్షింపంగ రాదె యభిమతవరముల్? 47

వ. అనుటయు. 48

క. ఏలా యీమాటలఁ బని?
పౌలోమీవరుఁడ! నీప్రభావము కంటే
కాలునిప్రభావమును నీ
త్రైలోక్యం బెఱుఁగు వలదు తగవఱెపలుకుల్. 49

మ. అడుగన్నిన్ను వరంబు వేగమ యహల్యాజార!విచ్చేయునా
కుడురాజార్ధవిభూషణుండువరమీనున్నాఁడుయుష్మాదృశుల్
బ్బడుగుల్వాంఛితమీసమర్థులె? వృథాలాపప్రబంధంబులన్
జడివెట్టం బనిలేదు మిన్నక తపశ్చర్యావిరోధంబు గాన్.

వ. అని యుల్లసం బాడినం గటకటం బడి బిడౌజుం డుద్దీర్ణ
సురాయుధంబువిబుధవిరోధివధూవైధవ్యదీక్షాదానదేశికం
బును, నిర్ధూమధూమకేతనజ్వాలాజాలజటిలంబును నగు
వజ్రంబు గేలం బూనివైశ్వానరుముందఱ ఝుళిపించిన. 51

శా. దంభోళిజ్వలనాభిఘట్టనమునన్ ధైర్యంబు పోనాడియున్
గంభీరస్థిరభక్తివైభవమునం గాశీపురాధీశ్వరున్
శంభున్ శంకరునీలలోహితునుమానాథున్ విరూపాక్షువి
భంబొప్పందలంచుచుండ్విజుండు మూర్ఛంబొందెఁదీవ్రవ్యథన్.

వ. ఆసమయంబున.

సీ. వికటపాటలజటామకుటకోటిపినద్ధ
ముగ్ధచంద్రుఁడు జగన్మోహనుండు
గంతమూలకఠోరకాలకూటకళంక
కజ్జలుం డర్థార్థికల్పతరువు
కుటిలకుండలిరాజకుండలాలంకార
మండితుం డానతాఖండలుండు
భసితధూళిచ్ఛటాపాళిసముద్ధూళి
తాఖిలాంగుండు విశ్వాధికుండు

గీ. విశ్వనాథుండు గాశికాధీశ్వరుండు
లీలఁ బ్రత్యక్షమై వచ్చి లెమ్ము వత్స!
యనినఁ జైతన్యమంది దిగ్గనఁగ లేచె
శంభుభక్తిపరుండు వైశ్వానరుండు.

వ. ఈశ్వరుండును వైశ్వానరు నాదరించి విశ్వోత్తరం బైన యాయగ్నిలోకంబునక ధీశ్వరునిఁ జేసి యంతర్హితుండయ్యె గృహపతి పరమేశ్వరానుగ్రహంబున దీర్ఘాయుష్మంతుఁడును దిక్పతియు నై చరితార్థత్వంబు నొంది నిజవాసంబునకు వచ్చె. ఇది వైశ్వానరువృత్తాంతంబు.

## నిరృతిలోకవృత్తాంతము.

గీ. అనినఁ బ్రియమంది శివశర్మ యంబుజాక్షు
కింకరుల కిట్లు లనియె వక్షీణభక్తి

నిర్మతిలోకంబు మొదలైననిఖిలలోక
ములును చూపుఁ డనుక్రమంబునను నాకు. 56

వ. వైవస్వతలోకంబు మున్నెఱింగితి. అటమీఁదిలోకంబు నెఱుంగవలసియుండు ననిన వారు మహాత్మా! సంయమనీపురంబున కవ్వల జాతిమాత్రంబున రాక్షసులై యనుష్ఠితశ్రుతిమార్గులు నపరద్రోహులు దీర్ఘస్నానపరులు దేవపూజాపరాయణులుదానదయాక్షాంతిదాంత్యస్తేయసత్యాహింసానిరతులు సర్వభోగసములు నైనపుణ్యజనులకు నివాసం బై నిర్మతిలోకం బొప్పుచుండు. 57

గీ. తీర్థములయందు విధి మూఁడి తెగినపుణ్యు
లనఘ! యీలోకమున నుందు రాత్మహనన
మొక్క కాశీపురంబునఁ దక్క నొండు
తీర్థములయందుఁ బాపంబు దెచ్చు నండ్రు. 58

వ. ఈలోకంబున కధీశ్వరుం డైనదిక్పతిచరిత్రంబు చెప్పెదము సావధానమతి వై యాకర్ణింపుము. 59

సీ. వింధ్యాద్రినడుమ నిర్వింధ్యాతటంబునఁ
గానలో నొక్కపక్కణము గలదు
పింగాక్షుఁ డనియెడు పేరివాఁ డావెంటఁ
బల్లె యేలెడుభిల్లపరివృఢుండు
క్రూరకర్మపరాఙ్ముఖుం డక్కిరాతుండు
వ్యాఘ్రాదిదుష్టసత్త్వములఁ దక్క
దండింపఁ డితరసత్త్వముల నేణాదుల
నాఖేటమార్గంబునందఁ బ్రతుకు

గీ. విశ్వసించిన నీరు త్రావినను నిద్ర
పోయినను జాలుకొన్నను బొర్లుచున్న

దెవులువడ్డను గుంపైన దిట్టచెడినఁ
జంపఁ డనుకంప నెట్టిహింస్రంబు నైన. 60
సీ. ఫలమూలముల నామపక్వాశనంబుల
దధిపయశ్శౌద్రాజ్యతక్రములను
శిశిరాంబువులఁ దృప్తి సేయు సంబడ మిచ్చుఁ
బాదరక్షలు నాతపత్త్రములును
దాళవృంతములు వస్త్రములు గోవణములు
నొసఁగు రోగార్తుల నుపచరించుఁ
దస్కరబాధ నొందక యుండ నెడ రైన
యటవీస్థలంబున ననుపుఁ బెట్టుఁ
గీ. తీర్థములు పోవువారికి దివసదివస
మటు విశేషించి కాశికి నరుగునట్టి
పుణ్యులకుఁ జేయు సత్కారములు నెరవుగఁ
బింగళాక్షుండు శబరరాట్పుంగవుండు. 61
గీ. సంతతంబును నాశీర్వదింతు రతనిఁ
దీర్థముల కేగువారు సంతృప్తినొంది
యగ్నిహోత్రాంతములను జపాంతములను
భోజనాంతములను దృప్తిపూర్వకముగ. 62
క. దక్షత నిర్వ్యధమునఁ బిం
గాక్షుఁడు సంతతము తీర్థయాత్రాపరులన్
రక్షింప నటవి నగరస
దృక్షం బై యుండెఁ గొన్నిదినములు పేర్మిన్. 63
వ. అంత నొక్కనాఁ డతనిపితృవ్యుండు దారకుం డనులుబ్ధకుం
డు దెరువు గట్టి తీర్థయాత్రాపరు లైన కార్పటికుల దోఁచి
కొనియె.అప్పు డప్పరుస వారుగలంగంబాఱి మొరయుచుం

గూఁతయునుం బెట్టిరి. ఇట్టు వడి బిట్టుఁగల్పారంభసమయ సముజ్జృంభమాణ కపటకిటికైటభారాతికంఠనాళకఠోరఘు ర్ఘురధ్వానఘర్ఘరంబై నయానిర్ఘోషంబాకర్ణించి యటమున్న దైవయోగంబునం దోరంపువేఁటకు వెడలి నికటప్రదేశం బున నున్న పింగాక్షుం డుచ్చైస్స్వనంబుననోహో! వెఱవకుం డుఁడు. ఏను గలుగ మీకు భయం బేల? యని పేరువాడి క్రీడి కురుబలంబులపైఁ గవయుచందంబునం గవసి పుంఖా నుపుంఖంబుగాఁ దీవ్రమార్గణంబులు నిగుడించి లుంటా కులం దోలి యోట వడకుండ సార్థవాహులం గడపిపుచ్చి విమతశబరవరసుభటకఠిన తరభుజపరిఘువలయవలయితప్ర థులధనురుదితనిశితశరశతఖచితసకలశరీరుండై వెదురు పెరి గినయందంబున వీరశయనంబున శయనించి విగతప్రాణుం డై పరోపకారపుణ్యానురూపఫలంబున దిగీశ్వరత్వంబు నొంది నిరృతి యయ్యె. ఇది నిరృతిలోకవృత్తాంతంబు. ఈ నిరృతిలోకంబున కుత్తరంబున. 64

## వరుణలోకవృత్తాంతము.

గీ. వరుణదేవునిలోకంబు ధరణిదేవ
ఇందు నుండెడుపుణ్యాత్ము లెవ్వ రనిన
వాపికాకూపకాసారవారిపద్మ
వాటికోద్యానకల్పనావ్యాప్తిపరులు. ౬౫

సీ. తరుణేందుమౌళిపై ధారాంబుకుంభంబు
నియమవ్రతంబుగా నిలిపినారు
తనియఁ దియ్యనిపంచదారపానకములు
భూసురోత్తములకుఁ బోసినారు

చల్లఁగా నెడరుచోఁ జలిపందిరులు వెట్టి
యధ్వనీనులదప్పి యార్చినారు
దీర్ఘయాత్రాపరాధీనమానసులకు
నుదకుంభ్యుపానత్తు లొసఁగినారు
గీ. వెల్లిలో నేయుపాయంబువెంట నైన
మునుఁగ కుండంగ జంతువు మనిచినారు
గారవంబున వరుణలోకంబునందు
నిండువేడుక సుఖయించుచుండువారు. 66
గీ. పుణ్యతటినుల కవతారభూములందు
శిలల సోపానపంక్తులు చేర్చినారు
జనులసంకిళ్లు విడిపించి పనిచినారు
వరుణలోకంబునం దున్న వార లనఘ. 67

వరుణోత్పత్తి.

వ. ఈలోకం బేలుదిక్పాలకుండు వరుణుండు. జలాశయాధిపతి, యాదగపతి, సర్వకర్మసాక్షి. యితనియుత్పత్తియాకర్ణింపుము. కర్దమప్రజాపతినందనుండు శుచిష్మంతుం డనువాఁడు ధైర్యమాధుర్యవైశారద్యాదిశోభనగుణసంపన్నుండు. అతఁడుబిలుతవయసున సంగడీలయినబాలకులతోడంగూడియచ్ఛోదం బనుకొలన సలిలక్రీడలుసలుపుచు శింశుమారంబుచేతం బట్టువడియె. తోడిబాలకులు భయభ్రాంతస్వాంతులై యేతెంచి దేవార్చనాసమయంబున సమాధినిష్ఠుండైన యాతనితండ్రి కత్తెఱంగు విన్నవించిరి. విజ్ఞాతసుతవిపత్తియయ్యును జిత్తంబు చలింపనీక యత్తపోధనసత్తముండభిధ్యానమార్గమున బ్రహ్మాండంబుల, భువనంబులభూతంబులఁ, జంద్రసూర్యగ్రహతారకంబులఁ, బర్వతంబుల, వనంబుల, నదుల

సముద్రంబుల, నంతరీపంబుల, నానా దేవ యోనులం, దదీయ స్థానంబుల, వాపీకూపతటాక కుల్యాపుష్కరిణులంజూచియం దొక్క కెందమ్మికొలన మునికుమారులతోడం గూడి నిమజ్జ నోన్మజ్జనంబుల రంజిలం గరయంత్రనిర్ముక్తసలిలధారాభిషే చనంబులసముద్దమర కాండమడ్డుడిండిమధిమధి మధ్వానంబు ల దారకుండు విహారంబు సలుపుటయు, నప్పూర్ణేందుబింబ వదను నిందుబింబంబుం బట్టం బఱతెంచు రాహువుంబోలె నొక్క మహాగ్రాహంబు సమగ్రాగ్రహంబునం బఱతెంచి ప ట్టుటయు, నమ్మొసలి సరసబిసకిసలయ కుసుమసుకుమార దే హుండగునక్కుమారునుక్కుదండసంబులువోలెం దన రెం డుకోఱలం బిట్టూఁదికఱకమెయి మెయింగబళించికసుగం దకుండజలాధి దేవతాసమీపంబునకుం దెచ్చుటయు, నచ్చి గురాకుం బోఁడియతనిసరిత్పతిసమ్ముఖంబునం బెట్టుటయు,నం తలోనంగ్రోధరక్తాంతలోచనుండును ద్రిశూలపాణియు నగు నొక్క దివ్యపురుషుండుపరుషదృష్టివీక్షించిసలిలాధ్యక్షు నధి క్షేపించి,యోయివరుణాలయా!కరుణారహితుండవై కర్దమ ప్రజాపతితనయు శివభక్తు శిశువు నక్రంబునం బంచి దం ష్ట్రాక్రకచంబులం గఱపించి తెప్పించితి! మేలు గా కేమి? నీలలోహితునిప్రభావంబు నీ కెఱుంగవచ్చునే?యని ఝం కించి పలుకుటయు, నాతంకంబు నొంది యుదన్వంతుం డా డింభు నలంకరించి శంభుకింకరున కిచ్చి పాశనిబద్ధం బగునమ్మ కరంబు నతని కొప్పనంబుచేసి తత్సమేతుండై పరమేశ్వరుని సన్నిధికిం జని బహుప్రకారంబుల నుతియించి యపరా ధంబువలన విముక్తుం డగుటయు, నద్దేవుండు వనుపం బ్రమ థుండు జలగ్రాహంబుతోడంగూడం గుమారుని దనవద్దకుం

గొనివచ్చుటయుం గాంచె. అదియ ప్రణిధానావసానంబయ్యె
నేత్రోన్మీలనం బాచరించి యప్పరమమాహేశ్వరుండు. 68

సీ. గ్రాహదంష్ట్రాగ్రటంకికాశిఖాగ్రము సోఁకి
కందినజఘనభాగంబుతోడ
నుదకబిందుకలాప ముట్టి యుట్టిపడంగఁ
గర మొప్పు ముద్దుమోఁకట్లతోడ
నరుణాంచలంబు లై యరవిందగర్భప
త్త్రములఁ బోలువిలోచనములతోడ
బహులయాతాయాతపరిపాటిఁ బాటిల్లు
గలువంపునిట్టూర్పుగాడ్పుతోడ

గీ. సంభ్రమంబున నచ్ఛోదసరసి వెడలి
మేటినక్రంబు సందిట త్రాటఁ బట్టి
వచ్చి తనకట్టెదుర నున్నవానిఁ బుత్త్రుఁ
గాంచె దుర్ధమతేజుండు కర్దముండు. 69

వ. అట్లు గాంచి. 70

క. చరణాంభోరుహయుగళీ
పరిసరమునఁ జక్క సాఁగి ప్రణతి యొనర్పన్
గురుఁడు ప్రమోదం బారఁగఁ
బరిరంభము చేసెఁ జచ్చి బ్రతికినకొడుకున్. 71

గీ. అనఘ! శివశర్మ! యిట్టిచోద్యంబు గలదె?
యభవు నర్చించువేళ సమాధి నుండి
కొడుకుదెస నైనయన్ని పోకులును జూడఁ
గడచె నూఱును నై దేండ్లు కర్దమునకు. 72

వ. కర్దముండును నతిక్రాంతం బైనయద్దీర్ఘకాలంబు మహాకాళ
ధ్యానతాత్పర్యనిష్ఠాతిశయంబున ముహూర్తమాత్త్రంబు

నుంబోలెఁ గడపె. అనంతరంబు శుచిష్మంతుండును సము
చితప్రకారంబునఁ దండ్రియనుజ్ఞ వడసి వారణాసీపురం
బున కరిగి లింగస్థాపనంబు సేసి పంచవర్షసహస్రంబు
దపం బాచరించి ప్రత్యక్షం బైనపరమేశ్వరునివలన వరుణ
పదంబు వరంబుగాఁ బడసి రత్నాకరరత్నసరిత్సరగపల్వలం
బులకువాపీకూపతటాకంబులకుఁ బడమటిదిక్కునకునధీశ్వ
రుండయ్యె. కాశియందుఁ గార్గమిప్రతిష్ఠితం బైనమణికర్ణే
శ్వరలింగంబునకు నిరృతిభాగంబున వరుణేశ్వరాహ్వాయం
బైనశంభులింగంబు సుప్రసిద్ధం బైయుండు. ఆలింగంబు
సేవించినవారికిసంతాపభయంబును నపాయమరణభయంబు
లును జలోదరభయంబును మొదలైనభయంబులు పుట్ట
కుండు. ఇది వరుణలోకవృత్తాంతంబు. 73

## గంధవతీవృత్తాంతము.

సీ. అదె గంధవతిఁ జూడు మవనీసురోత్తమ!
వరుణలోకమున కుత్తరమునందు
నిమ్మహాపట్టణం బేలు గంధవహుండు
భవకృప నీతఁ డీపదముఁ గాంచె
నాదిఁ గశ్యపునిదాయాదుండు పూతాత్ముఁ
డను పేరిబ్రాహ్మణుం డనఘ! యితఁడు
తరుణేందుధరురాజధాని వారాణసి
నయుతాబ్దములు తపం బాచరించి
గీ. లింగసంస్థాపనంబు గల్పించి లింగ
మధ్యమునయందుఁ గందర్పమదనుఁ గాంచి
జ్యోతిరభ్యంతరస్థు నావ్యోమకేశు
నుస్తుతించె నతండు విస్పష్టఫణితి. 74.

వ. దేవదేవ! మహాదేవ! దేవా! యభయప్రద! నారాయణేం ద్రాదిసర్వవదేవరప్రద! సుస్తుత్యుండవు, స్తోతవు, స్తుతివి, సగుణుండవు,నిర్గుణుండవు,నామరూపవివర్జితుండవు, ఇచ్ఛా జ్ఞానక్రియాశక్తులు నీయవి. ఒక్కరుండవయ్యును శివశక్తి భేదంబునను ద్వైతంబు భజియింతువు. నీదక్షిణాంగంబు బ్రహ్మ నీవామాంగం బచ్యుతుండు. చంద్రసూర్యాగ్ను లునీనేత్రంబులు. నీనిశ్వాసంబు శ్రుతులు నీప్రస్వేదాంబు వులు నదులు. నీశ్రోత్రంబును సమీరంబు. నీభుజంబులు దిక్కులు నీముఖంబులుబ్రాహ్మణులు. నీబాహువులురాజన్యు లు. నీయూరువులు వైశ్యులు. నీపదంబులు శూద్రులు. నీకే శంబు లంబుదంబులు. నీవు ప్రకృతరూపంబున బ్రహ్మాండంబు సృజియింతు. నీయంద సర్వభూతంబులు. నీవ సర్వభూతము యుండ వనియనేకప్రకారంబులం బూతాత్ముండు సుస్తుతిం పం బ్రసన్నుం డై పరమేశ్వరుండతని కోరనదిక్పాలపదం బిచ్చి తనమూర్తులయందు నంశంబు ప్రసాదించి సర్వగత్వం బును,సర్వసత్త్వావబోధకత్త్వంబుc,బ్రాణాపానాదిపంచమూ ర్తిత్వంబు నొసంగె. అతండు కాశీక్షేత్రంబున జ్యేష్ఠేశ్వరుని పశ్చిమభాగంబున వాయుకుండంబు నుత్తరంబునc బ్రతిష్ఠిం చిన పవమానేశ్వరునకు నవ్యాక్షేపంబున భోగమోక్ష ప్రదత్వంబు సమర్థించి యంతర్హితుం డయ్యె. ఇది గంధ వతివృత్తాంతంబు. 75

## కుబేరవృత్తాంతము.

క. నిగమజ్ఞా! గంధవతీ
నగరమునకుc దూర్పుదిక్కున గుణోదారం

బగుపట్టణ మదె యలకా
నగరం బది యేలు యక్షనాథుఁడు గరిమన్. 76

వ. అక్కుబేరునిచరితంబు వివరించెద నాకర్ణింపుము. 77

తే. భూసురోత్తమ! కాంపిల్యపురమునందు
యజ్ఞదత్తాఖ్యుఁ డొక్కబ్రాహ్మణుఁడు గలఁడు
వేదవేదాంగ వేదార్థవిత్తముండు
యజ్ఞవిద్యావిశారదుం డాద్విజుండు. 78

తే. అతనిపుత్త్రుండు గుణనిధి యనెడివాఁడు
దర్పకునితోడిజోడు సౌందర్యరేఖ
నెయ్య మలరంగ గురు లుపనీతుఁ జేసి
చదువఁ బెట్టిరి వాని నాచార్యునొద్ద. 79

క. ద్యూతక్రీడారతుఁడై
యాతఁడు కితవులును దాను నాసాయం బా
ప్రాతస్సమయము దిరుగు న
వేతనిజాచారుఁ డగుచు నెల్లెడ వీటన్. 80

సీ. బ్రాహ్మణాచారంబు పరిహాసకము సేయు
నగ్నిహోత్రవిధాన మన్న నలుగు
సంధ్యాభివందనశ్రద్ధ యుజ్జన సేయు
గీతవాద్యవినోదకేలిఁ దగులుఁ
బాషండభండదుర్భాష లావర్తించు
ద్యూతకారులతోడి యుద్ధి వడయు
ధాతువాదులమీఁదఁ దాత్పర్య మొనరించుఁ
జెలిమి వాటించు నాస్తికులతోడ

తే. నటుల మన్నించు హర్షించు విటులఁ జూచి
పీఠమర్దుల కొనరించుఁ బెద్దఱికము
కౌలటేయులఁ బాటించు గారవించుఁ
జేటకుల దీక్షితునిపట్టి సిగ్గు విడిచి. 81

వ. సజీవనిర్జీవద్యూతంబుల నోడినధనంబులు గితవులకుం దల్లి మేనిరవణంబుల నమ్మి పెట్టుచుండు. 82

తే. తల్లి బోధించుఁ దత్పరత్వంబు గలిగి
యన్న! మీయన్న చెప్పినయట్ల చేయు
ధూర్తసంగతి విడువు సాధువులతోడఁ
బరిచయము సేయు మని పుత్త్రు ననుదినంబు. 83

వ. దీక్షితుండును గృహకార్యాంతరవ్యగ్రుండై కొడుకువర్తనంబుఁ బరామర్శింపక యుండె. 84

తే. ఎడపఁ దడపఁ దనూభవుం డెచట నుండు
గానరాఁ డని గృహభర్త కాంత నడుగ
నింతదడవును నాయొద్ద నిచట నుండి
యరిగెఁ జదువంగ నని భర్త కతివ మొఱఁగు. 85

తే. స్నాన మాడెనె? వార్చెనే సంధ్య? యగ్ని
హోత్ర మొనరించెనే? యింతి! పుత్త్రుఁ డనిన
స్నాన మాడెను వార్చెను సంధ్య యగ్ని
హోత్ర మొనరించె ననుచును నువిద మొఱఁగు. 86

ఆ. గొడ్డుపీఁగి కన్నబిడ్డండు కావున
నొక్కరుండ కాన నుత్పలాక్షి.
ధూర్తుఁ డైనవానిదుశ్చేష్టితము లెల్ల
నధిపు నెఱుఁగనీక యడఁచుచుండు. 87

వ. చూడాకర్మానంతరంబున షోడశవర్షంబున గృహ్యోక్తప్రకారంబున నతనికి వివాహంబు చేసి ప్రత్యహంబును. 88

క. స్నేహార్ద్రహృదయ యై యతి
సాహసకృత్యములు మాన్ప సమకొల్పుట కై
యూహాపోహవిచారస
మాహితగతిఁ దల్లి సుతుని మఱి బోధించున్. 89

తే. అన్న! మీతండ్రి కోపగాఁ డౌనొ కాఁడొ?
యీవు వొనరించుదుర్వృత్త మెఱిఁగె నేనిఁ
గల్లతనములు పలుమాఱు గప్పి పుచ్చు
నట్టినామీఁదఁ జంపంగ నలుగ కున్నె? 90

సీ. సచ్ఛ్రోత్రియులు సనూచానులు సోమపీ
థులు నై నకులము పెద్దలఁ దలంచి
రాజమాన్యుఁడు సత్యరతుఁడు వినిర్మలా
చారవంతుం డై నజనకుఁ దలఁచి
భాగ్యసంపదఁ బుణ్యాపతిదేవతలలోన
నెన్నంగఁ దగియెడునన్నుఁ దలఁచి
వేదశాస్త్రపురాణవిద్యానిరూఢు లై
వాసికెక్కినతోడివారిఁ దలఁచి

తే. చెడ్డయింటిచెదార మై శివునికరుణ
నివ్వటిలునిర్వదేనేండ్లనిన్నుఁ దలఁచి
పదియునార్వత్సరంబులభార్యఁ దలఁచి
గోరతనములు మానురా! కొడుకుఁ గుఱ్ఱ! 91

తే. అఖిలకల్యాణగుణగణాయత్త యత్త
మామ యౌదార్యతేజఃక్షమామహితుఁడు

మాతులుండు యశోమహిమాతులుండు
తనయ! యేలయ్య కైకోవు వినయగరిమ? 92

చ. విడువక నీవు పట్టణమువీథులవీథుల వెఱ్ఱివాఁడవై
చెడుగులఁగూడి ధౌర్త్యములు సేయమహీరమణుండెఱింగనే
విడుచును సోమయాజి మనువృత్తులు చేకొను నెల్లవెంటలన్
జెడుదుము గాదె నీకతనఁ జీరయుఁ గూడును లేక? పుత్త్రకా

తే. పట్టణములోన నీవు దర్పమునఁ జేయు
కొంటెతనములు వీక్షించి కూర్మితనయ!
నవ్వుదురు నిన్ను మొదల నానావిధముల
నవ్వుదురు దీక్షితుని ననంతరమ జనులు. 94

వ. అని యంత నిలువక. 95

తే. తల్లిబడి కొల్లిచ ట్టను చుల్లసంబు
నాడుదురు నిన్నుఁ గూర్చి న న్నహరహంబు
దుర్ణయం బెల్ల నామీఁదఁ ద్రోచి జనులు
డబ్బఱలు పల్కువారి కడ్డంబు గలదె? 96

క. అవినయనిధాన మగునీ
నవయౌవనశైశవముల నడిమివయస్సం
గవిసినవ్యసనోద్రేకం
బవగాఢము దీని మానవయ్య తనూజా! 97

వ. అని యనేకప్రకారంబుల బోధించినతల్లిమాటలు చెవులు
సోఁక నీక యిట్టట్టనక యూరకుండె. మృగయామద్యపైశున్య
వేశ్యాచౌర్యదురోదరపరదారాభిలాషంబు లనుదోషం
బులు నవయౌవనారంభంబున సంభవించెనేని వానిం బరా
వర్తింప నెవ్వారు నేర్తురు? గురువచనం బతినిర్మలంబయ్యు
సలిలంబునుంబోలె శ్రవణస్థితంబై యభవ్యునికి శూల పుట్టిం

చ. యథార్థనామధేయుం డగునగ్గుణనిధి యథాపూర్వంబు
దుర్వ్యర్తనంబులఁ దిరుగుచుండ నొక్కనాఁడు. 98

సీ. దర్శనం బిచ్చె నెద్దానిఁ గోమటి క్రొత్త
పాడచూప నేతెంచి భూభుజునకుఁ
దన కిచ్చె నెద్దాని ధారాంబుపూర్వంబు
పుణ్యకాలమునందు భూమిభర్త
దా నిచ్చె నెద్దాని ధర్మగేహిని యైన
సోమిదమ్మకు మనఃప్రేమ మలరఁ
దటి చూచి యిచ్చె నెద్దానిఁ బట్టికిఁ దల్లి
జూద మాడినపైఁడి సుట్టికొనిన

తే. నట్టినవరత్నమయ మైనయంగులీయ
కంబు యజ్ఞావభృథపుణ్యకర్మసాక్షి
వీటిలో నొక్కజూదరివ్రేల నున్నఁ
జూచెఁ గనుఱెప్ప వేయక సోమయాజి. 99

వ. చూచి తనసామ్మాట యెఱింగి దీక్షితుం డక్షక్రీడాజీవనుం
గదిసి కేలువట్టి యెత్తి యీయంగులీయకంబు నీకెట్లు గలి
గె? ఉన్నరూపు చెప్పు. తప్పఁ జెప్పి తేని భూపాలుసన్నిధిం
బెట్టి నిజంబు దెలిపి దండింపింతు ననిన జూదరినీతనయుండు
గుణనిధి నెత్తంబున నోడినవిత్తంబునకై యీయంగులీయ
కంబు నాకిచ్చె. మఱి బంగారుభృంగారుకర్కరీకలాచికలు,
తళియలు, పళ్లెరంబులు, తామ్రపాత్రంబు, లారకూటఘ
టంబు లన్నియుం దాకట్టువెట్టియు దురోదరక్రీడాపరాయ
ణుం డై పట్టణంబులోనం జరియించుచున్నవాఁడు. 100

తే. అక్షధూర్తులలోన నీయనుఁగుఁగొడుకు
దొరయునంతటియక్షధూర్తుండు లేఁడు

క్షితితలంబున యాగదీక్షితులలోనఁ
గీర్తి నీయట్టియాగదీక్షితుఁడు లేఁడు. 101

వ. అనిన విని లజ్జాక్రోధంబులు మనంబున ముప్పిరిగొన యజ్ఞదత్తుం డర్ధముండితం బైనమూర్ధంబున నీర్కావిదోవతినటి ముటేఁ జుట్టుకొని యింటికి కేతెంచి మొగంబు గంటువెట్టుకొని సోమిదమ్మ! ఏమి సేయుచున్నదాన! విటురమ్ము! నీకొడుకెక్కడం బోయెఁ? బోవుఁ గాకేమి! వినుము. 102

శా. అంగోద్వర్తనవేళ నీవు దరహాసాంకూరముల్లోచనా
పాంగప్రాంతములందిగుర్ప నొకసయ్యాటంబుఁ గల్పించినా
యంగుళ్యాభరణంబుపుచ్చుకొనవా? యాయుంగరంబిప్పుడే
శృంగారింపని చేతఁ బావకునకుఁ జేయఁగ హావిర్దానమున్.

వ. అనిన నద్దీక్షితాయిని దీక్షితున కిట్లనియె. 104

సీ. మధ్యాహ్నసంధ్యాసమాగమం బిది తీర్థ
మవధరింపుము సంధ్య యాచరింపు
మగ్నికార్యముఁ దీర్పు మభవుఁ బూజింపుము
పంచమహాయజ్ఞపరుఁడ వగుము
మొగసాల నున్నారు జగతీసుపర్వులు
గ్రాసార్థు లగుచుఁ బెక్కండ్రతిథులు
పక్వాన్నములు శాకపాకాదికంబులు
చల్ల నాఱినయేని జవులు దప్పుఁ

తే. బదిలముగ మందసమునందు బరిణలోన
నునిచి దాఁచినదాన మీయుంగరంబు
దీర దిప్పుడు పెట్టె శోధించి చూడ
నారగింపవిపుడు నేనఘ! కొత్త 105

తే. అనిన విని సోమయాజి కోపాగ్రహమునఁ
దత్తరించుచు వడి సోమిదమ్మఁ బలికె
నౌనె సత్పుత్త్రజనయిత్రి! యౌనె సాధ్వి!
యౌనె సూనృతభాషిణి! యౌనె దేవి! 106

సీ. స్వాధ్యాయ మెన్నండుఁ జదువంగఁ బోకుండఁ
బోలునే చదువంగఁ బోయె ననుట?
తెల్లవాఱఁగ నేటఁ దీర్థమాడక యుండ
ననురూపమే తీర్థ మాడె ననుట?
సమయానుకూలత సంధ్య వార్వక యుండ
వైదగ్ధియే సంధ్య వార్చె ననుట?
తటితోడ నగ్నిహోత్రము వేల్వ కుండంగ
విజ్ఞానసరణియే వేల్చె ననుట?
తే. కల్లలాడంగ ఫల మేమి గలిగె నీకు?
మాటి మాటికి నేను నీమాట నమ్మి
యరసి రక్షింప నేరక యనుఁగుఁగొడుకు
భ్రష్టుఁ జేసితి నేమి చెప్పంగఁ గలదు?. 107

సీ. ఏడఁ బోయెనొ కదా మేడలో మంజిష్టి!
పెనుబండువునఁ బైటఁ బెట్టఁ జాలఁ
దాకట్టు వడదె యింతకు వైశ్యగృహమున
ఘనపుబంగారుభృంగారుకంబు!
పట్టసూత్రమయంబు పసిఁడియొడ్డాణ మే
యిగురుఁబోఁడికటీర మెక్కె నొక్కొ!
శశికాంతదీపికాస్తంభలీలారత్న
సాలభంజిక యెందు సాఁగె నొక్కొ!

తే. ఎచట నున్నదియో రత్నఖచిత మైన
హంసతూలిక డోలావిహారతల్ప
మూఁచముట్టుగ నీవు నీయొంటికొడుకుఁ
బాడుచేసితి గృహము నిర్భాగ్యురాల! 108

తే. చాలు నింక నాపాలికిఁ జచ్చినాఁడు
కొడుకు గుణనిధి యనువాఁడు కులవిషంబు
తిలలు దర్భయు నుదకంబు దెత్తుగాఁక
యే నివాపాంజలుల వాని కిత్తు నిపుడు. 109

వ. కుపుత్రత్వంబుకంటె నపుత్రత్వంబు మేలు. కులపాంసను
డైనవాని నొక్కనిం ద్యజించి కులంబు రక్షించుట నీతియ
కదా! యని పలికి కోపావేశంబునఁ బెదవు లదరఁ గటతటం
బులు చిటుల భ్రూకుటి నిటలంబున నటింపఁ గటాక్షం
బులం గెంపు గదురం గటకటం బడుచు నాహ్నికం బైన
క్రియాకలాపంబు నిర్వర్తించి యాగ్రహంబు గృతార్థత్వం
బు నొందఁ గొన్ని దివసంబులకు నొక్క శ్రోత్రియునిపుత్త్రిం
బెండ్లియాడి యజ్ఞదత్తుండు గృహస్థధర్మంబు నిర్వర్తించు
చుండె. అంతకమున్న గుణనిధి తండ్రి కోపం బెఱింగి యిం
టికిం బోవకుండి యెక్కడేనియుం జనువాఁడనని మనంబున
నిట్లని వితర్కించె. 110

తే. ఏమి సేయుదు? నెక్కడి కేఁగువాఁడ?
ధనము నిప్పచ్చరంబు విద్యయు హుళిక్కి
పెట్టి సాఁగెడునా చేయి భిక్ష సేయ
నెట్టు నేరుచు? దైవంబ యెఱుఁగు నింక. 111

తే. ఏభయంబును నెచ్చోట నెనయ లేదు
నరున కెప్పాట విద్యాధనంబు ధనము

చోరబాధాదికములచేఁ జూఱవోవు
ధనము ధన మౌనె యెన్నిచందములఁ దలఁప? 112
గీ. అక్కటకట! దురోదరవ్యసన మెట్లు?
యాయజూకవిశిష్టాన్వవాయ మెట్లు?
యెట్లు చేసినఁ జేయుఁ గా కేమనంగ
నేర్చువారము? విధి దయానిస్పృహ్హృదయి. 113
చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడ తేర గిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిం దెలునుం గుడువంగఁ బెట్టుని
ర్భరకరుణాధురీణ యగుప్రాణముప్రాణము తల్లి యున్న దే?
హరహర! యెవ్వరింకఁ గడు పారసి పెట్టెద రీప్సితార్థముల్. 115
వ. అనుచు నెందేనియుం జనియె నంత.
మాలిని.—
ఘుసృణకుసుమమాలాకోటిపాటల్యలీలన్
గిసలయములచాయం గీరచంచూపుటశ్రీ
విసృమరసృమరోర్ణావిభ్రమప్రౌఢి మింటన్
బిసరుహహితుదీప్తుల్ పింగళత్వంబు నొందెన్. 116
తే. పాటలాంశుజటాభారభాసురుండు
భార్గవుఁడు వోలె నొలాడె భాస్కరుండు
రాగరక్తచ్ఛటానిర్ఝరప్రపూర్ణ
చరమసంధ్యాశమంతపంచకనదముల. 117
వ. వెండియు ధాతారకూటపాటలకోమలాతపంబై వాసరంబు పలుకం బాఱె అస్త్రాద్రికిరీటకూటంబున దరవికచనిచులకుసుమమంజరీపుంజంబునుం బోలె మిహిరబింబంబు చూపట్టె. చరమధరాధరధాతుధారాప్రవాహంబునుం బోలె సంధ్యారాగంబు గగనచక్రంబు నాక్రమించె. చైత్యద్రుమం

బులు విద్రావణద్రోణకాక కాకాకార కాకలీకోలాహలకుల
కులాయంబు లయ్యె. అంధకరిపుకంధరామూల కాలకూట
చ్ఛాయాపాణింధమం బై యంధకారంబు బ్రహ్మాండమండ
లంబు నాచ్ఛాదించె. రజనీశుక్తిముక్తాఫలంబులు చుక్కలు
వొడిచె. భవిష్యద్వాసరకరకర ప్రరోహబీజాంకురంబులు
బోలెఁ బ్రదీపంబులు భవనాంతరంబుల వెలింగె. అప్పుడు
గుణనిధి పేరాఁకలి పేర్చు కార్చిచ్చునుంబోలెఁ బెచ్చు పెరిఁగి
యందంద కడుపు మండింప వంటకం బెక్కడఁ గలుగునో
యని చింతాక్రాంతుం డై యున్న యవసరంబున నద్దినంబు
రాత్రి శివరాత్రి యగుటం జేసి శైవుం డొక్కరుండునగరబా
హ్యప్రదేశంబున నొకశివలింగస్థానంబున జాగరంబుఁ జేసి
నాలుగుజాములునుపహారంబుసమర్పించువాఁడై నియమవ్ర
తంబుఁ బూని భక్తివిశ్వాసతాత్పర్యాతిశయంబున. 118

సీ. మరిచిధూళీపాళిపరిచితంబులు మాణి
బంధాశ్మలవణపాణింధమములు
బహుళసిద్ధార్థజంబాలకాండంబులు
పటురామఠామోదభావితములు
తింత్రిణీకరసోపదేశధూర్ధరములు
జంబీరనీరాభిచుంబితములు
హైయ్యంగవీనధారాభిషిక్తంబులు
లలితకుస్తుంబురూల్లంఘితములు

తే. శాకపాకరసావళీషాడబములు
భక్ష్యభోజ్యలేహ్యంబులు పానకములు
మున్నుగాఁ గల యోగిరంబులు సమృద్ధి
వెలయఁ గొనివచ్చె నొండొండ వివిధములను. 119

వ. అప్పుడు భూసుర ప్రవరుండు నాసికాపుటకుటీకుటుంబియగు పక్వాన్నగంధంబు గాలివెరవున నాఘ్రాణించి యాయన్నంబు నాకు నెబ్భంగిఁ గుడువ సమకూఁడునో యని యప్పరిమళంబుసవ పట్టుకొని పోయి శంభుభవనద్వారంబునం గూర్చుండి నృత్తగీతవాద్యంబులు ప్రవర్తిల్ల సరిప్రొద్దువోవునందాఁక జాగరంబు చేసి యంతంత సాగి ప్రజలు చొక్కుమడంగి యుండఁ దా నయ్యవసరంబున. 120

సీ. కట్టాయితంబుగాఁ గటిమండలంబునఁ
దీర్చి దట్టీచేల దిండు గట్టి
తలుపు గిట్టిన కుండఁ దరిమి కొంచెం బైన
మొరవాకిట దేహ మొయ్యఁ జొనిపి
మునివ్రేళు లొయ్యొయ్య మోపి చప్పుడు గాని
పరిపాటిపవనంబుఁ బట్టి నడచి
దీపాంకురచ్ఛాయఁ దెలివి చాలనియట్టి
కోనచీఁకటి లోని కొనరఁ జొచ్చి

తే. పళ్లెరములం దపూపసూపములతోడ
నఁటిపండులతోడ నాజ్యంబుతోడ
దధిపయస్స్ఖండబహుపదార్థములతోడ
ధవళకలమాన్న మీక్షించె ధరణిసురుఁడు. 121

తే. గర్భమంటపదీపికాకలిక యపుడు
దశ చెడఁగ గాలి నిర్వాణదశ వహింప
దీప్తిసంధుక్షణము చేసి తెలివి పడఁగ
నన్న మీక్షింపఁ దలఁచె బ్రాహ్మణకులుండు. 122

శా. గ్రుక్కిళ్ళింగుచునొక్క మోదనమహాకుంభంబువీక్షించివాఁడక్షోణంబున మందరశ్మియగుదీపాంకూరముల్ మీఁదికై

యెక్కఁ ద్రోచిఘృతంబునించినిజవస్త్రకాంతముంజించిచే
నొక్కఁడువత్తిగ నేఁడుద్రోఁచెనుశిఖనోజ్జ్వలించెవైశ్వానరున్.

సీ. పక్వాన్న పాత్రంబు పాణిఁ గైకొని బహి
ర్ద్వారభూమి భుజించువాంఛ నతఁడు
వెల్వడి వచ్చుచో విధివశంబున వాని
కాలిప్రే లొకనియంగంబు దాఁకెఁ
దాఁకిన వాఁడు దత్తఱపాటుతో మేలు
కని ముచ్చు ముచ్చంచుఁ గళవళించెఁ
గళవళింప గతానుగతికమార్గంబున
నాక్రోశ మొనరించి రఖిలజనులు
తే. నన్నపాత్రంబు విడువక యవనిసురుఁడు
పాఱె భయవిహ్వలుం డయి బయలువట్టి
వెంటఁ దగిలి తలారులు వెగడుపడఁగ
బాణముల నేసి చంపి రాబ్రహ్మకులుని. 124
తే. అతనిఁ గొనిపోవఁ బనిఁ బూని యమునిభటులు
వరుణపాశాగ్రహస్తులై వచ్చి రపుడు
వానిఁ గొనిపోవఁ బనిఁబూని వచ్చి రపుడు
త్ర్యంబకునికింకరులు విమానంబుఁ గొనుచు. 125
వ. అనంతరంబపట్టిసత్రిశూలఖట్వాంగప్రముఖబహువిధప్రహ
రణపాణు లగుపినాకపాణిభటులం జూచి భీతచిత్తులై కృ
తాంతకింకరులు కరపంకజంబులు మొగిడ్చి యి ట్లనిరి. 126
తే. అభవుకింకరులార! మహాత్ములార!
తగవు ధర్మంబు పాడి పంతంబు దెలియు
మీకు నడ్డంబు గలదె ముల్లోకములను?
నెంతవారము మేము మీరాయెదుర నిలువ? 127

వ. వీఁడుకులాచారహీనుండు,పితృవాక్యపరాఙ్ముఖుండు, సత్య
శౌచపరిభ్రష్టుండు, సంధ్యాస్నానవివర్జితుండు, శివనిర్మాల్య
హర్త. వీనియందొకధర్మంబు లేశంబు గలిగిన నానతిండు
వినియెదము. వీనిపుణ్యాపుణ్యవివేకంబునకు మీరప్ర
మాణం బనినఁ గృతాంతకింకరులవాక్యము లాకర్ణించి శివ
కింకరులు వారి కి ట్లనిరి. 128

క. శివధర్మం బతిసూక్ష్మము
శివధర్మము లేశమాత్ర సిద్ధించిన యే
వివిధమహాపాపోప
ద్రవములు చేరంగ రావు ధన్యుని నతనిన్. 129

తే. స్థూలదృష్టి వీక్షించినఁ దోఁపకుండు
సూక్ష్మదృష్టి వీక్షించినఁ జూడ్కి కందుఁ
గాన శివభక్తిధర్మంబుగాథమహిమ
కానవచ్చినయ ట్లుండుఁ గానరాదు. 130

క. ఆచారం బిది యనఁగ న
నాచారం బిది యనంగ నజునకు నైనన్
గోచరము గాదు శివధ
ర్మాచారము సూక్ష్మసూక్ష్మ మై వర్తిల్లున్. 131

వ. ఇతఁడు చేసినపుణ్యకర్మంబులు వినుండు. 132

సీ. అశన మబ్బక యున్న నైనను శివరాత్రి
యొరంత ప్రొద్దును నుపవసించె
నోగిరంబు హరింప నొన వెట్టుకొని యైన
వేగునంతకుఁ జేసె జాగరంబు
పాత్రావలోకనోపాయంబునకు నైన
వెల నైనదీపంబు వెలుఁగఁ జేసెఁ

జూడ నొల్లక యైనఁ జూచె నీశ్వరుమ్రాల్కిఁ
బరులు చేసినయట్టిప్రసవపూజఁ
తే. జచ్చె విధి మూఁడి యైనను జంద్రధరుని
నగరిమోసాలఁ బెంద్రోవనట్టనడుమ
సూక్ష్మదృష్టి విచారించి చూచినప్పు
డింతకంటెను ధర్మంబు లెవ్విగలవు? 133

వ. అని పారిషదులు యమదూతల వీడ్కొలిపి యతనిదివ్య
విమానారూఢుం జేసి శివలోకంబునకుం గొనిపోయి శివుని
సన్నిధిం బెట్టిరి. శివుండును బ్రదీపతేజస్సంధుక్షణాదిపుణ్యాను
రూపం బైన ఫలంబునం గళింగదేశాధిపతియైనయరిందము
నకుఁ దనయుండై దముం డను పేరనా దేశంబునకు రాజుగా
ననుగ్రహించి పుత్తెంచె. ఈశ్వరానుగ్రహంబునం బట్టాభి
షిక్తుండై. 134

క. చాటించెఁ గళింగేంద్రుఁడు
వీటను దేశమున శంభువేశ్మంబులలోఁ
బాటించె దీపకళికా
కోటు లసంఖ్యములు మెండుకొని యుండుటకున్. 135

క. ఇలువరుసఁ జంద్రశేఖరు
నిలయంబున దీపకళిక నిలుపనివారిఁ
దలఁ ద్రెవ్వఁగ వ్రేయుం డని
తలవరులం బంచె రాజు తనదేశమునన్. 136

వ. దీపికాదానపుణ్యప్రభావంబునఁ గళింగాధిపతిజన్మాంతరంబు
నం గుబేరుం డై యీశ్వరునకు సఖుం డయ్యె. ఆవృత్తాం
తంబు వినిపించెదము, సావధానమతి వై యాకర్ణింపుము.

సీ. పద్మకల్పమునందు బ్రహ్మమానససరో
జమునఁ బులస్త్యుండు సంభవించె
నాపులస్త్యునకు మహామునిప్రవరుఁ డా
విర్భావమునుఁ బొందె విశ్రవస్సు
విశ్రవస్సునకుఁ దపశ్శ్రీసనాథుండు
వైశ్రవణుఁడు సముద్భవము నొందె
వైశ్రవణుండు సర్వజ్ఞు నెచ్చెలికాఁడు
పాలించె నలక యను పట్టణంబు

తే. ఘనయశుఁడు మేఘవాహనకల్పవేళ
యాజ్ఞదత్తి ధనేశ్వరుం డయ్యెఁ బిదపఁ
జిత్ప్రకాశికఁ గాశికఁ జేర వచ్చి
శివుఁ బ్రతిష్ఠించె నవిముక్తసీమయందు. 138

మ. అవిముక్తంబున యాజ్ఞదత్తి శివు నీహారాద్రిరాట్కన్యకా
ధవు నిందప్పక చూచుచుండెనయుతాబ్దంబుల్ నిమేషక్రియా
వ్యవహారస్పృహ లేని నేత్రములఁ జర్మాస్థుల్సిరావల్లరీ
నివహంబుల్ పరిశుష్కముల్గనభివర్ణింపంగఁ ద్రైలోక్యమున్.

సీ. గజదైత్యదమనుండు కార్పాసఫలతూల
వర్తిప్రరోహభావము భజింప
పడఁకుగుబ్బలిరాచవారికూరిమికన్య
యాలంబనస్తంభయష్టి గాఁగఁ
బరమవిశ్వాసతాత్పర్యనిర్భరభక్తి
సంపద్విశేషంబు చమురు గాఁగఁ
బ్రవితతధ్యానధారాసముచ్ఛ్రాయంబు
సమధికోజ్జ్వలతరజ్వాల గాఁగఁ

తే. గామమును గ్రోధమును నాదిగాఁగఁ గలుగు
శాత్రవులు పాతకము లైనశలభములుగ
విమలవిజ్ఞానదీపంబు వెలుఁగఁ జేసె
నప్రతిమధైర్యసంపత్తి యాజ్ఞదత్తి. 140

తె. విమలవిజ్ఞానదీపంబు వెలుఁగుచుండ
శాంతిధారాజలంబుల జలక మార్చి
భవుని నర్చించె భావపుష్పముల భక్తి
నతివిశుద్ధమనోవృత్తి యాజ్ఞ దత్తి. 141

వ. ఇవ్విధంబున యాజ్ఞదత్తివిజాతీయప్రత్యయావ్యవహితసజాతీయప్రత్యయసంతానానువృత్తిరూపం బైననిదిధ్యాసనంబున నివాతనిష్కంపదీపంబునుం బోలెఁ బెద్దకాలంబు కాలకంఠు మంగళజ్యోతిర్లింగమూర్తి నంతరంగంబున నాలింగనంబు సేయు చుండె. ఆఖండేందుమౌళి ప్రసన్నుఁడై వత్స! వరంబు వేఁడు మనిన సమాధినిమీలితంబు లైనలోచనంబులు దెఱచి కనుంగొనునప్పుడు శతసహస్రకోటిసూర్యప్రభాభాసురం బైనతేజోమండలంబునడుమ ఫణికుండలుఁడును,దస్తారకూటపాటలజటాజూటకోటీపినద్ధముగ్ధేందుండును,దుగ్ధధారాధవళస్నిగ్ధభసితవిశుద్ధదేహుండు నయియద్దేవతామూర్ధాభిషిక్తుం డర్ధాంగలక్ష్మి యైనభవానితోడం గూడిపొడచూపినవిధూమధూమకేతనజ్వాలాజాలంబులో మేలంబాడునమ్మృడునొడలిదీప్తిమిఱుమిట్లుగొనుచు వెఱచి అవనఱిముఱింజఱిచినందూరఁదారుపోయియతనికన్నులశక్తి గడతేర నంధుం డై యంధకారాతి నందంద తలవకారఛాందోగ్యముండకైతరేయబృహదారణ్యకశ్వేతాశ్వతరాద్యుపనిషత్తులనుబంచబ్రహ్మపంచాక్షరప్రణవాదిమంత్రం

బుల నారాధించి యంజలిపుటంబు లలాటంబునఘటియించి నిర్ణిరోధనిరవగాధకరుణాసుధాపూరపూరితాంతఃకరణ! శరణు; దేవతాకోటి కోటీరకోటీఘటితమణిమయూఖరేఖా పుంజకింజల్కితంబులు, త్రయ్యంతవిద్యాసీమంతినీసీమంత సీమాసిందూరపరాగపాటలంబులు, కుటిలకృతాంతదంత తాడనక్రీడానిష్కృపంబు లగు మీశ్రీపాదపద్మంబులు దర్శించునట్టిసామర్థ్యంబుఁ గృపసేయవే! యిదియ నాకు వరంబనినఁ ద్ర్యంబకుండు బింబఫలారుణాధరంబునంజిఱు నవ్వు చిగురుకొనం దపస్వికి దివ్యదృష్టి యొసంగినం గృతార్థుండై యతండు. 142

చ. చులుకన మేలుకన్నతొలుచూపునఁ జూచెఁబినాకపాణిదా
పలిదెస షోడశాబ్దములప్రాయముమత్తచకోరనేత్ర ను
త్పలదళదామకోమలవిభాకమనీయమనోజ్ఞగాత్రిఁ గుం
డలకటకాంగదాదికకనద్బహురత్నవిభూషణోజ్జ్వలన్. 144

వ. అయ్యవసరంబున.

చ. వకుళఫలానుకారు లయి వక్త్రపవలై మెఱుఁగారుక్రొత్తమౌ
క్తికములవే రొకింత దులకింపఁగ నిర్మలహేమరత్నక
ర్ణికలు చలింప నందియలక్రేంకృతిఁ గంకణమేఖలాధ్వనిం
బ్రకటము సేయ మందగతి భాస్వరనవ్యవిలాస మేర్పడన్.

తే. అసమబాణపునర్జీవనౌషధంబు
రాగజలధివిధూదయారంభవేళ
సకలజగదేకసౌభాగ్యజన్మభూమి
శంభుఁ డాయంగ వచ్చె నాశైలతనయ. 146

వ. ఇవ్విధంబున డాయవచ్చి కామోన్మీలితశిరీషకుసుమకేసర మాలాసుకుమారంబు కస్తూరికాస్థానకముద్రాభిముద్రితం

బును నైనభుజంబు భుజగాభరణభూషితం బైనఫాలలో
చనుభుజం బొరయునట్లుగా నిలిచినం జూచి యాజ్ఞదత్తి
చిత్తంబునందు. 147

సీ. ఎవ్వతె యొక్కొ? యీయిందుబింబానన
జగదేకసౌభాగ్యజన్మభూమి!
కమలాయతాక్షి నాకంటె నగ్గలముగా
నెటు చేసె నొక్కొ? తా నీతపంబు!
పరమేశుఁ డీబింబఫలపాటలాధర
నను మీఱి మన్నించినాఁడు మేలె?
భాగ్యంబు గా కేమి? బాలేందుశేఖరు
కృపఁ గాంచె నీరాజకీరవాణి

తే. యనుచుఁ గ్రేగంట నీరసం బంకురింపఁ
గినుపుకిలికించితము నాత్మఁ గీలుకొనఁగ
సవతి వీక్షించుప్రౌఢయోషయును బోలె
బ్రాహ్మణుఁడు చూచెఁ బర్వతరాజతనయ. 148

వ. అప్పుడు. 149

సీ. కృత్యపంచకము సాగింపలేఁ డేయింతి
ప్రాపు లేక కృతాంతభంజనుండు
నిండుఁజందురుని జంద్రిక వోలె నేభామ
పంచబాణవిరోధిఁ బాయకుండు
నేలేమ శశిమౌళి కిచ్ఛాక్రియాజ్ఞాన
శక్తి యై కల్పించె సకలజగము
నేగంధగజయాన హృదయ ముప్పొంగ ఘూర్చి
భవునిపై [illegible]

తే. మహితహృల్లేఖికామహామంత్రమునకు
నేవరారోహ ముఖ్యాధిదైవతంబు
సకలజగదధిష్ఠాత్రి యాశైలపుత్రి
విభున కిట్లని మధురోక్తి విన్నవించె. 150

ఉ. త్ర్యంబక! యీతఁ డెక్కడిదురాత్మకుఁ? డీయవలక్షణంబహాం
గంబులనన్ను మాటికిని గన్గొనుచుం బహుభంగులన్వికా
రంబులు చూపెడుం దరతరంబ యబద్ధము లాడెదుర్ఘరహా
స్యంబున వీని కిట్టిచన వబ్బుట నీకృపపెంపునం జుమీ! 151

క. నారూపమునకు మదిలో
నీరసపడుచున్న వాఁడు హృదయేశ్వర! ని
ష్కారణమ వీనిచందం
బారసి యెఱుఁగంగవలయు నని పలుకుటయున్. 152

వ. మందస్మితసుందరవదనారవిందుం డై యిందుధరుండు ధరా
ధరపుత్త్రి కిట్లనియె. 153

చ. మనమునయందు నీనెగులు మానుము పర్వతపుత్త్రి! వీఁడునీ
తనయుఁడునందనుల్బహువిధంబులధౌర్త్యములాచరించినం
గినియునె తల్లి భావమునఁ? గీ ల్పరికించిన దేవతావలం
బనరతిభావ మై పరఁగుభావవిలాసము లీవికారముల్. 154

క. ఈకాశీక్షేత్రమున న
నేకాబ్దము లాచరించె నీతఁడు తప మ
స్తోకగుణా! యీపుణ్య
శ్లోకునిఁ గరుణార్ద్రదృష్టిఁ జూడఁగ వలయున్. 155

క. ఏ వర మిచ్చెద వీనికి
నీవును వర మిమ్ము నాకు నీకును భేదం

బావిష్కరింపవచ్చునె?
యేవారికి నైనఁ బర్వతేశ్వరతనయా!. 156

వ. అనిపలికి పరమేశ్వరుండాయాజ్ఞదత్తికి యక్షకిన్నరగుహ్యక లోకాధిపత్యంబును సఖ్యంబును నిచ్చె భవానియు. 157

సీ. ఎడమలోచనము గ్రుడ్డెగసి గవ్వయుఁ బోలె
నుబ్బూఁత లూఁగుచు నుండుఁ గాక
కుడికన్ను తారకాగోళంబు పల్లమై
యొండులోచనముతో నొరయుఁ గాక
యీశుండు గృప చేసి యిచ్చినట్టివరంబు
లట్ల యౌఁ గాకని యానతిచ్చె
నాయొప్పిదమున కసూయ నేసితి గాన
నభిధఁ గుబేరుండ వగుదు గాక

తే. కాశియం దీవు నిలిపిన కాలకంఠ
దివ్యలింగంబు సర్వసిద్ధిప్రదంబు
నఖిలలోకాభివర్ణనీయంబు నిఖిల
పాపహరమును నగుఁ గాక భవ్యచరిత!. 158

వ. అని పార్వతీదేవి యతని గారవించె నిది యాజ్ఞదత్తి పుణ్య చరితంబు. 159

మ. ధనవంతుండగు బుద్ధిమంతుఁడగు విద్యావంతుఁడౌ సాధుసం
దనవంతుండగు భ్రాతృవంతుఁడగుఁ గాంతావంతుఁడౌ నిత్యశో
భనవంతుండగుఁ గీర్తిమంతుఁడగు సత్పాత్రీధాన్యవంతుండగున్
ధనదాధీశ్వరు మానవోత్తముఁడు సందర్శించి కాశీస్థలిన్.

వ. విశ్వేశ్వర శ్రీమన్మహాదేవు దక్షిణభాగంబునఁ గుబేరేశ్వరస్థా
నంబునందుఁ గుబేరేశ్వరు సేవించిన వారికి నణిమాద్యష్టైశ్వ

ర్యంబులు సిద్ధించునని యిట్లు యాజ్ఞదత్తికి నభిమతంబులం బ్రసాదించి దేవుండు దేవీసహితుం డై వైశ్వేశ్వరం బైన పదంబు ప్రవేశించె. ఈప్రకారంబున శంభుతోఁ జెలికారంబు వడసి ధనదుండు. 161

సీ. ఏపట్టణమునకు నెలదోఁట నందనా
రామంబు చెలి చైత్రరథవనంబు
క్రీడావిహారదీర్ఘిక యేపురమునకు
మధురామృతాంబువు మానసంబు
మాణిక్యముకురబింబంబు కైలాస మే
నగరివారవధూజనప్రతతికి
నేవీటిపొలిమేర యింత యం తనరాని
దవ్వునం దున్నయుత్తరపుదిక్కు-
తే. పృథివితోడ వైనయప్పుట భేదనంబు
రాజధానిగఁ దారకారాజమౌళి
రాజితం బైనకృపపెంపు ప్రాపు గాఁగ
రాజరాజు పేరను నేలె రాజసమున. 162

వ. ఆరాజరాజు రాజీవభవహరిపురందరాదిబృందారకమకుటసందానితవికచమందార కుసుమమాలామకరందబిందు ధారాధౌతచరణారవిందుమందరాచల మంథాన మథ్యమాన దుగ్ధజలధిగర్భావిర్భూతకాలకూటకృపీటభవపిండగండూషాకళంకితకంఠమూలోపకంఠునకుం దో_ త్రిభువనరక్షాదాక్షిణ్య దాక్షాయణీకుచకలశపాళికేళి కస్తూరికామకరికాముద్రాభిముద్రితోరఃస్థలకవాటుఁ బశ్యల్లలాటుఁ గుటిలసుధామయూఖశకలవిచికిలకలితాకల్పితావతంసుఁ బాంసుక్రీడాపరిచయపేశలం బగుశైశవస్నేహానుబంధంబునంబోలె నిరభి

సంధిస్నేహబాంధవంబున భజియించు. ఇది యక్షాధిపలోక
స్వరూపంబు. ఈయాఖ్యానంబు సర్వపాపహరంబు. ఇంక
నీశానలోకస్వరూపంబు వివరించెద మాకర్ణింపుము. 163

ఈశానలోకవృత్తాంతము.

తే. అలకయవల మహోదయ మన్పురంబు
బ్రాహ్మణోత్తమ! యీశానురాజధాని
యందు నుందు రజైకపాదాదు లైన
పదియునొక్కండ్రు రుద్రులు పారిషదులు. 164

సీ. ఫాలభాగముల నంబకము లందఱికిని
నవతంసశశిరేఖ లందఱికిని
డమరుఖట్వాంగఖేటకము లందఱికిని
హస్తిచర్మపటంబు లందఱికిని
శ్యామకంఠప్రదేశమ్ము లందఱికిని
నౌపవాహ్యవృషంబు లందఱికిని
బవమానభుక్కలాపంబు లందఱికిని
నాపాండుదేహంబు లందఱికిని

తే. నందఱికి నగ్నితాపతప్తారకూట
పాటలచ్ఛాయఘనజటాబంధనములు
దేట గొనఁ జూడు మీశానుదిక్కునందు
బ్రాహ్మణోత్తమ! రుద్రులు పారిషదులు. 165

వ. ఇందఱు నానందకాననంబునందు నీశానదేవుదివ్యలింగం
బుఁ బ్రతిష్ఠించి యారాధించి తత్ప్రసాదంబున నీశానదిక్కు
నందు శాశ్వతం బైనయైశ్వర్యంబు నొందినారు. 166

తే. కాశి నీశానదేవు శ్రీకంఠుఁ గొలిచి
కాంచు మనుజుఁడు హృదయసంకల్పసిద్ధి

కాశికాక్షేత్ర మష్టదిక్పాలకులకుఁ
గామనావాప్తిసంకల్పకల్పతరువు. 167

వ. అనిన విని యనంతరంబ కొంతద వ్వరిగి శివశర్మ యిట్లనియె.

సీ. ఆవేశచూర్ణంబు లఖిలేంద్రియములకు
శృంగారరససముజ్జీవనములు
శంబరాంతకభుజాజయకీర్తిమహిమలు
కోకదంపతికి దృక్కూలశిఖలు
బ్రహ్మాండపురవీథిరత్నతోరణములు
యామినీకర్పూరహారలతలు
నీరదాథ్వాంభోజినీబిసాంకురములు
కుముదకాననముల కూర్మిచెలులు

తే. గరళకంఠాట్టహాసంబుగర్వరేఖ
కైటభారాతినవనాభికమలశోభ
చంద్రికలు గాయుచున్నవి సాంద్రలీల
భువన మిది యెద్ది ? పరమభాగవతులార!. 169

వ. అనినఁ బుణ్యశీలసుశీలు రిట్లనిరి. 170

చంద్రలోకవృత్తాంతము.

మ. మథురాపట్టణవిప్రముఖ్య!శివశర్మా! వేదశాస్త్రాగమాం,బుధి
చంద్రోదయ!చంద్రలోక మిది యీప్రోలేలుచుండుంగళా
నిధి యాత్మీయమయూఖకందళశిఖానిష్ఠ్యూతధారాసుధా
విధులన్ భానుగభస్తితప్తమగునీవిశ్వంబు రక్షించుచున్.

వ. సర్గాదియందు శతానందుండు, నేత్రంబులను మరీచి, హృద
యంబున భృగువు, శిరంబున నంగిరసు, నుదానంబునఁ
బులస్త్యు, వ్యానంబునఁ బులహు, నపానంబునఁ గ్రతువుఁ,
బ్రాణంబున దక్షు, శ్రోత్రంబున నత్రి, సమానంబున వసిష్ఠు,

సంకల్పంబున ధర్ము సృజియించె. అందు నత్రి యనుము
నీశ్వరుండు. 172

క. త్రిసహస్రదివ్యవర్షము
లసదృశధృతి నాచరించె నాతఁడు తపమ్ము
విసుమాన మతని తేజో
రసపూరము నెగసె బ్రహ్మరంధ్రము మోవన్. 173

సీ. బ్రహ్మరంధ్రము మోవఁ బాఱి యయ్యింద్రియ
ద్రవ మోడిగిల్లె నేత్రములలోన
నేత్రగోళంబులు నిండంగఁ బర్వి యా
వీర్యంబు గలధౌతవిమలకాంతిఁ
బదిధార లై పాఱెఁ బదిదిక్కులందును
నమరాపగానిర్ఝరమును బోలె
స్రవియించుచున్న యాచరమధాతురసంబు
ధరియించి చూ లయ్యె దశదిశలును
తే. నెలలు తొమ్మిది మోచి కాష్ఠలు గఠోర
గర్భ లై సూతిమాసంబు గదియుటయును
సత్త్వభారంబు భరియింప శక్తిలేక
వ్రాలె భూమండలంబుపై వడఁకి వడఁకి. 174

వ. ఆదిగ్దేవతలగర్భంబున నుద్భవించిన తేజం బేకీభవించి చందు
రుండై యఖిలజగద్ధితార్థంబయ్యరవిందభవునాజ్ఞ నతనిదివ్య
స్యందనం బెక్కి యష్టాదశద్వీపంబులం జరియించి తనకుం
దాన వృద్ధిఁ బొందె. అతని తేజోనిస్సరణంబున సకలజగదు
పకారంబగునదీనివహంబుద్భవించె. అట్లు వర్తించి యాసు
ధాకరుం డవిముక్తస్థానంబున నమృతలింగమయు నీశ్వరుం

జంద్రమౌళిఁ బ్రతిష్ఠించి యమృతోదం బనుకుండంబు నిర్మించి తత్సమీపంబున బహుదివ్యవృక్షంబులు దపంబు చేసి యద్దేవుని ప్రసాదంబున నోషధీతోయంబులకు నగ్రజన్ములకు రాజయ్యె. అమ్మహాదేవుననుగ్రహంబున వెండియు నాజైవాతృకుండు. 175

ఉ. ఏటికిఁ దానకం బయినయిక్షుశరాసనవైరిజూటికా
కోటికి మల్లికాకుసుమగుచ్ఛము లేవ వహించుఁ గైకొనుఁ
బాటలిమంబు మాసపరిపాకవినోదనవేళఁ బార్వతీ
పాటలగంధిచారుపదపద్మనఖంబుల క్రొత్తలత్తుకన్. 176

తే. రాజరాజయి పాలించె రాజసమున
వసుధ యెల్ల నేకాతపవారణముగఁ
గాశికాక్షేత్రమునఁ బెద్దగాల మేనిఁ
దపము చేసిన బహుళ ఖేదంబు వాయ. 177

వ. అతఁడు హిరణ్యగర్భాత్రిభృగువులు ఋత్విజులుగా హరి సదస్యుండుగా సినీకుహూద్యుతిపుష్టిప్రభావసుకీర్తిధృతిలక్ష్ములనం దొమ్మండ్రు ధర్మపత్నులతోడం గూడి యుమామహేశ్వరప్రీత్యర్థంబు రాజసూయాధ్వరంబు నొనర్చి యవార్యంబైనయౌదార్యంబున. 178

ఉ. దక్షిణ యిచ్చె ముజ్జగము దానగుణప్రవరుం డతండు ఫాలాక్షునిసన్నిధిన్ మఖసమాపనకాలమునందుఁ దారకాధ్యక్షుఁడు కాశికాపురమునందు సదస్యులకున్ బ్రసాదసంరక్షితసర్వవిష్టపుఁడు రాజు ప్రతాపవిరాజమానుఁడై.

తే. ఇంద్రకుండంబు కెలనఁ జంద్రేశునొద్దఁ
గాశిలోపల నవిము క్తకంఠసీమఁ

దపము చేసినచోటన ధవళకిరణుఁ
డాచరించెను రాజసూయాధ్వరంబు. 180

వ. ఇట్లు రాజసూయాధ్వరంబు చేసినసుధాకరునవభృథస్నా
నానంతరమున. 181

సీ. సకలలోకాహ్లాదసంధానహేతు వై
వెలయు నీకౌముదీవిభ్రమంబు
వర్తింతు నీవు నామూర్తిభేదంబులం
దొకమూర్తి వై సముద్రోదయమున
శ్రీకాశిలోఁ బ్రతిష్ఠించినాఁడవు నన్నుఁ
జంద్రేశ్వరుం డనుసంజ్ఞఁ గూర్చి
బ్రహ్మదత్తం బైనరథ మెక్కి యవలీలఁ
దిరిగి యష్టాదశద్వీపములను

తే. నాహరించితి రాజసూయాధ్వరంబుఁ
దత్పరత మీఱఁ ద్రైలోక్యదక్షిణముగఁ
జంద్ర! నీయట్టిధన్యుండు జగతిఁ గలఁడె?
యనుచు వర్ణించె రాజు ఖట్వాంగపాణి. 182

వ. ప్రతిమాసంబునఁ బూర్ణిమాదివసంబున జపహోమార్చన
ధ్యానదానబ్రాహ్మణభోజనంబులు చంద్రేశ్వరస్థానమునఁ
జేసిన ననంతఫలము నొసంగు ఎవ్వండేని మత్కాలంబునఁ
గుహూయోగంబునఁ జంద్రోదయవారి నభిషిక్తుం డై
చంద్రేశ్వరుని సందర్శించి వసురుద్రాదిత్యతర్పణం బొనర్చు
నన్నరుండు పితృప్రసాదంబువడయు. నతని పితృపితా
మహు లాస్ఫోటింతు రని వెండియు. 183

సీ. ప్రత్యష్టమీతిథిఁ బ్రతిచతుర్దశి సిద్ధ
యోగీశ్వరీదేవి యోగవీథి

కాధిరూఢభవాని నకఠోరశశిమౌళి
హాటకతాటంకహారకటక
కేయూరమేఖలాకింకిణికంకణా
ద్యఖిలదివ్యాభరణాభిరామఁ
బింగళాహ్వయ నమద్బృందారకశ్రేణి
నాదిభైరవశక్తి నఖిలజననిఁ
తే. గాళిఁ జంద్రేశదేవోపకంఠనిలయఁ
జంద్రకుండోదకంబున జలక మార్చి
గంధపుష్పపహారాదికల్పనముల
సేవ చేసిన విఘ్నంబు చేర కుండు. 184

వ. ఇది చంద్రలోకమాహాత్మ్యంబు. ఈయుపాఖ్యానంబు విన్న
ను బఠియించినను జనున కాయురారోగ్యైశ్వర్యంబులు
సమగ్రంబు లై సంభవించు ననిన విని శివశర్మ పుణ్యశీల
సుశీలుర కి ట్లనియె. 185

తే. భాగవతులార! భాగ్యసంపన్నులార !
యింత యొప్పునె యుడులోక మెట్టయెదుర
గగనలక్ష్మీలతాతన్వికబరిమీఁద
సంతరించిన ముత్యాలజల్లివోలె? 186

వ. ఈలోకవృత్తాంతంబు వినవలతుం జెప్పుం డనిన నతనికి
వార లి ట్లనిరి. 187

## నక్షత్రలోకవృత్తాంతము.

సీ. స్వర్గాదిఁ బరమేష్ఠిచరణంబు పెనువ్రేల
దక్షుండు పుట్టె నాతనికిఁ బుట్టి
రఱువండ్రు కన్యక లాకన్నియలు రూప
లావణ్యలీలావిలాసవతులు

రోహిణీప్రముఖ లారుక్మ గౌరాంగులు
శివుఁ గూర్చి యాచరించిరి తపంబుఁ
గాశిలో దివ్యలింగంబు నక్షత్రేశ
సంజ్ఞంబు నొకప్రదేశమున నిలిపి
తే. వరణదరియందు సంగమేశ్వరునియొద్ద
దివ్యవర్షసహస్రంబు త్రిపురవైరి
మెచ్చి పొడచూపి యడుగుఁడు మీరు వరము
లనిన వార లి ట్లనిరి కాలాంతకునకు. 188

క. నీయట్టివాఁడు పురుషుం
డాయెడు మా కభవ ! యనిన కెట్టెఁడ మీకున్
నాయకుఁ డయ్యెడు నని దా
క్షాయణులకు వరము నీలకంఠుం డొసఁగెన్. 189

వ. వెండియు సమస్తజ్యోతిశ్చక్రంబునందున గ్రగణ్యలయ్యెదరు.
మేషాదిరాసులకుం గారణంబులయ్యెదరు. ఓషధీశ్వరుండు
బ్రాహ్మణాధిపతి యైన తారకాపతికిం బత్నులయ్యెదరు. మీ
చేతం బ్రతిష్ఠితం బైననక్షత్రేశలింగంబు భజించువారలకు
భోగమోక్షప్రదం బయ్యెడు. మృగాంకలోకంబునకు మీ
లోకం బూర్ధ్వలోకంబు గాఁగలయది. సర్వతారకామధ్యం
బున మీరు మాన్య లయ్యెద రని యానతిచ్చి శివుం డం
తర్హితుం డయ్యె. ఇది తారకాలోకవృత్తాంతం బనిన విని 190
యనంతరంబ ముందట బుధలోకంబుఁ గనుంగొని.

— బుధలోకవృత్తాంతము. —

సీ. ప్రతిబింబమో కాని రజనివల్లభున క
[illegible]

వినిమయంబో కాని విధున కన్యాదేశ
మో కాని యత్రి నేత్రోద్భవునకు
వీప్సమో కాని పూవిలుకానిసఖునకు
నామ్రేడితమొ కాని యబ్ధిజునకు
నభిధాంతరమొ కాని యరవిందవైరికి
సారూప్యమో కాని చందురునకు
తే. ద్రుమిక యూడ్చినవాఁడు భర్గునికిరీట
కోటి కాభరణం బైనకువలయాప్తు
మిగులఁ జక్కనికోడు కంద్రు మింటినడుమ
గ్రహములం దీతఁ డెవ్వండు? గణములార!. 191
వ. ఈతఁ డీలోకంబు సంభ్రమమయంబు విలాసమయంబు రాగ
మయంబు శృంగారమయంబునుగావించుచుఁ జతురాకర్షణ
సిద్ధాంజనంబున మనోవశీకరణమంత్రంబున నింద్రియావేశ
చూర్ణంబునఁ గౌతుకంబునకు సంతోషంబును, సౌభాగ్యం
బునకు సిద్ధయోగంబును, మన్మథునకుజన్మాంతరంబును,యౌ
వనంబునకు సామ్రాజ్యంబును గల్పించుచున్న వాఁడు.
షోడశవర్ష దేశీయుం డీగ్రహగ్రామణి యెవ్వండనినఁ బుణ్య
శీలసుశీలురు శివశర్మ కిట్లనిరి. 192
చ. విను మధురామహానగరవిప్రకులోత్తమ!బ్రహ్మవంశవ, ర్ధన!
శివవర్మ! పుణ్యకథధర్మకథల్ పరిపాటిఁ జెప్పఁగా, విన నతి
మాత్రదూర మగువిష్ణుపదంబున కేగుచున్నచో, మనకుఁ
బథప్రయాసములు మానెడు విఘ్నములుం దొలంగెడున్. 194
వ. ఇది బుధలోకంబు.
సీ. రాజసూయమహాధ్వరం బెవ్వఁ డొనరించె
దైత్రిలోక్యహంత కార్యంబుగాఁగ

నెవ్వాని ప్రియభామ లిరువదేడ్వురు నల
  ధవళాయతాక్షులు దక్షసుతలు
మన్మథాంతకుజటామకుటకోటికి నెవ్వఁ
  డవతంసకుసుమమాల్యత వహించె
నెవ్వఁడు నలువతే రెక్కి యష్టాదశ
  ద్వీపాళి నసివాలు దిరిగె లీలఁ
తే. జంద్రికాపాండుకౌశేయశాటి యైన
యతనుజగజంపుగోడు గెవ్వఁ డవ్విభుండు
పెద్దకాలంబు ముత్యాలగద్దె యెక్కి
వసుధఁ బాలించె నేకోష్ణవారణముగ. 195

తే. శైశవంబున శాస్త్రంబుఁ జదువ వచ్చి
గురుని ప్రియభామ యని చేయుఁ బరమభక్తి
యెవ్వతెకు నట్టితార పూర్ణేందువదన
నాఁటనుండియుఁ గామించె నలినవైరి. 196

మ. జడచొల్లెంబును బట్టుదట్టియును రత్నహాటకాలంకృతుల్లె
డహారంబులు మట్టెవన్నె యగుచున్ లీలావిలాసంబు పెంపెస
రంజేయఁగ యామినీధవుఁడు విద్యాభ్యాసకాలంబున న్నిధు
వాల్గన్నులకుం బ్రమోద మొసఁగున్నిత్యంబునుం దారకున్.

సీ. ఆచార్యప్రియభామ యని కొన్ని దివసంబు
  లిచ్చగింపఁడు తెప్ప లెత్తి చూడ
నుల్ల ముప్పొంగార నొకకొన్ని దినములు
  వీక్షించుఁ జూడని వేళయందు
నొకకొన్ని తిథులు గరోక్తిభక్తిచాతుర్యంబు
  మెఱయ నేత్రాంతంబు మేలమాడు

నొకఁకొన్ని ఘస్రంబు లొక్కొక్కనెపమున
నంగాంగసంస్పర్శ మాచరించు
తే. వలచి పైఁబడు నొకఁకొన్ని వాసరములు
హృదయమున రాగసంపద లిగురుకొలిపి
కవయఁ దొడఁగినయది యాదిగాఁగ మునిచెఁ
జందురుఁడు తార శుద్ధాంతసదనభూమి. 198
తే. చదివె గురునొద్ద ధర్మశాస్త్రంబు తొలుతఁ
బరమవిశ్వాసతాత్పర్యభక్తిగరిమఁ
జదివెఁ జంద్రుండు కామశాస్త్రంబు పిదపఁ
దలిరుఁబోన్పున ననురక్తిఁ దారయొద్ద. 199
తే. ఆదిగర్భేశ్వరుం డౌట యనుచితంబు
మిగులఁ జక్కనివాఁ డౌట మేలు గాదు
పాప మభినవయౌవనోద్భాసి యగుట
యరయ మంచిగుణంబుల యవగుణములు. 200
వ. అవినయనిదానం బైనస్వాతంత్ర్యంబునను గుతూహల బహుళం బైనస్వభావంబునను ధైర్యప్రతిపక్షం బైనయౌవనారంభంబునను నెవ్వనికే మనోవికారంబు పుట్టకుండు నే? అదియునుం గాక. 201
సీ. ఘనతరాహంకార కాలకూటవిషాన
లాభీలములు గటాక్షాంచలములు
దుర్వారతరతీవ్రగర్వగళగ్రహా
కలితగాద్గద్యఘర్ఘరము మాట
యస్మితాసంప్రభూతస్మయాపస్మార
విస్తృతధైర్యంబు వినయగరిమ

యుద్ధామదర్పభారోష్ణదాహజ్వరా
రంభసంభృతవికారంబు మనసు
తే. చరణచంక్రమ మభిమానసన్నిపాత
జాతసర్వాంగభంగంబు జనపతులకు
భూభుజులతప్పె యది వారిఁ బొందియున్న
ధరణిసామ్రాజ్యభూతంబుతప్పు గాక?. 202
సీ. భువనైకధన్విచేఁ బుష్పాయుధునిచేతఁ
బ్రసవాస్త్రమున నేటు పడనివాఁడు
నతిగాఢ మైనక్రోధాంధకారంబునఁ
గన్నుల నంధుండు గానివాఁడు
నిర్నిబంధనలోభనిద్రాభరంబునఁ
బారవశ్యంబుచేఁ బడనివాఁడు
లక్ష్మీకటాక్షలీలాసీధుమదమున
మనములోపల నన్నుకొననివాఁడు
తే. లేఁడు భూపతి గలిగెనా వాఁడు నృపుఁడె
విశ్వధాత్రీజనులపాలివేల్పుగాక?
బాహ్యశత్రులఁ బరిహరింపంగ వచ్చు
నంతరరులను నిర్జింప నలవిగాదు. 203
వ. అది యట్లుండెఁ దదీయవృత్తాంతంబు విను మని యిట్లనియె.
తే. తాల్చె గర్భంబు దార సుధాకరునకుఁ
గువలయేక్షణ రాగంబు గొనలు సాఁగ
జంభరిపుదిక్కు ప్రత్యూషసమయమునను
తామరసబంధుగర్భంబు దాల్చినట్లు. 204
తే. గర్భసంస్థితుఁ డగుగ్రహాగ్రణి విశుద్ధ
సితమయూఖస్ఫూర్తి వెలిఁ బ్ర[illegible]

దారమైదీఁగ వికచలోధ్రప్రసూన
పాండురచ్ఛాయ నొయ్యొయ్యఁ బలుకఁ బాటె. 206

తే. గర్భసంస్థితసద్గుణగౌరవమునఁ
బోలె గాత్రంబు భరియింపఁ జాల దయ్యె
నమృతదారారసాస్వాదసముపజాత
తృప్తియును బోలె నాహారతృష్ణ వదలె. 207

శా. ప్రత్యుత్థానము సేయుఁ బెద్దలకు నా ప్రౌఢేందుబింబాస్యయ
ప్రత్యూహస్థిరభక్తిభారమున దోరం బైనగర్భంబుచే,
నత్యంతాలస యయ్యు నగ్గురుజనం బందంద వారింపఁగాఁ
బ్రత్యాసన్నసఖీసమర్పితకరాబ్జాతావలంబంబునన్. 208

క. అంగన యొక్కొకమఱి యు
త్తుంగమణిస్తంభ యష్టితో నొత్తగిలున్
మంగళభవనాంతరమున
బంగారుమెఱుంగుసాలభంజిక పోలెన్. 209

ఉ. బింబఫలాధరోష్ఠి మణిభిత్తిపుటంబులయందు నాత్మబిం
బంబు గరావలంబనసమర్థముగా మదిఁ గోరుఁ గేలిసౌ
ధంబుపయిన్ సమున్నతనితంబపయోధరభారగర్భభా
రంబునఁ గోమలాంగకము రాట్పడఁ గేలివిహారవేళలన్.

తే. భవనశృంగారవనలతాపల్లవముల
నబలకై దండ పట్టుట యద్భుతంబె?
విహృతసౌధమణిస్తంభవిస్రమరాంశు
కందళుల నూఁత గొనఁ బోవు గర్భగరిమ. 211

తే. పనులు పంపంగఁ జాలదు ప్రాణసఖుల
భవనకార్యప్రవృత్తికై పద్మనయన

తాను గర్భభరాలసత్వంబుకతనఁ
చేయఁ జాలదు మఱి వేఱ చెప్ప నేల?. 212

మ. అట మున్నెక్కుడు కేలిశైలమున నత్యారోహణంబాచరిం
చుటకై నెచ్చెలికత్తియల్ నగుచుసంసూచించినన్ గాంతయు
క్కటసంత్రాసమునొందుఁజన్నుఁగవయాకంపింపఁగానిందువే
కటిభారంబునఁ జేసి ధీరహృదయల్ గా రాదిగర్భేశ్వరల్.

వ. అంత నట బృహస్పతి పత్నీవియోగవేదనాదూయమాన
మానసుండై చంద్రుండు చేసినయపరాధంబు హరిహర
హిరణ్యగర్భులకు నింద్రాదిసురులకు నెఱింగించిన. 214

సీ. తగవు గా దనియె మంతన ముండి వృత్రారి
యనుచితం బనియె హుతాశనుండు
పాతకం బని దెప్పి పలికె దండధరుండు
దౌరాత్మ్య మనియెను దానవుండు
దుష్కర్మ మని చెప్పెఁ దోయాధినాయకుఁ
డపకీర్తి యల తూలనాడె గాలి
యన్యాయ మనియె గుహ్యకసార్వభౌముండు
గాదు గా దనియె శాక్కరగమనుఁడు

తే. హేతుదృష్టాంతములు చూపి యెల్లసురులు
నన్వయవ్యతిరేకమార్గానువృత్తి
బుద్ధిఁ జెప్పిరి యెవ్విధమున శశాంకుఁ 215
డమరగురునకు మగుఁడ నీఁ డయ్యెఁ దార. 216

వ. అంత.

చ. ప్రమథులతోడఁ గూడ నతిభైరవఘోరతరాట్టహాసుఁడై
శమనవిరోధి [illegible] చంద్రుఁడు వేల్పులతో నెదిర్చె

స్సమరము తార కామయమనంగనభోంగణభూమిఁ దారకా
సముదయభీతి హేతువయి సాఁగెఁ బురారికి నబ్జవైరికిన్.

తే. ఈశ్వరునితోడ నని సేయ నెట్లువచ్చు
నన్యులకు నెంతవారికి నాగ్రహమున?
నీశ్వరునిమూర్తి గావున నెదిరి నిల్చి
యుద్ధ మొనరించెఁ గాక యనుష్ణకరుఁడు. 218

వ. అప్పుడు. 219

శా. చండీశుం బొదివె న్నిశాకరుఁ డవష్టంభంబు జృంభింప బ్ర
హ్మాండక్రోడము శింజినీధ్వనులచే నాఘూర్ణనం బొంద ను
చ్చండాటోపభుజావలేపకలనాసంరంభచక్రీభవ
ద్గాండీవప్రవిముక్తభీషణమహాకాండప్రకాండంబులన్. 220

వ. ఇవ్విధంబునఁ బ్రతిఘటించి గెంటింపరానిమగంటిమిం
బెచ్చు పెరిఁగి కలువలనెచ్చెలి చిచ్చులుమియుశిలీముఖంబు
లొడలఁ గ్రుచ్చియార్చి శంఖంబు పూరించి సింహనాదంబు
చేసి గాండీవజ్యారావంబు రోదసీకుహరంబు నిండ దండ
మహాకాళనికుంభకుంభోదరవీరభద్రాదిప్రమథవర్గంబుతో
డం గూడఁ దన్ను నొప్పించినం గోపించి కించిదారజ్యమాన
లోచనాంచలుండై లలాటలోచనుండుపురనిశాటతాటంకినీ
కపోలకస్తూరికాకరిమకరికాముద్రాద్రోహియు, జలంధర
హృదయగర్వసర్వంకషంబును, సింధురాసురశిరగకూటపాక
శంబును, దక్షాధ్వరమృగధ్వంసనక్రీడానృశంసంబును, దుషా
రగిరికన్యకా భ్రూవల్లీవిలాసలేఖాలలితశృంగంబును నగు
నజగవంబున బ్రహ్మశిరోనామకం బైనదివ్యాస్త్రంబు
సంధించిన. 221

శా. ఆకంపించె జగత్త్రయంబు దెస లల్లాడెన్ సముద్రంబు లు
ద్రేకించెన్ భయమందె భూతలము ఛేదిల్లెన్ మహీధ్రంబులున్
శ్రీకంఠుం డవికుంఠవిక్రమమునన్ దివ్యాస్త్రముం గూర్చి వి
ల్లాకర్ణాంతముగా వెసం దివిచి శీతాంశు న్నిరీక్షించుడున్.

తే. అప్పు డడ్డంబు సొచ్చి పద్మాసనుండు
ప్రమథనాథునిరోషసంభ్రమము మాన్పి
చంద్రునికి బుద్ధిఁ జెప్పి మాత్సర్య ముడిపి
యాలి నిప్పించె నయ్యుచథ్యానుజునకు. 223

చ. అమృతమయుండుగావునసుధాంశునితోడిసమాగమంబునన్
రమణి కశుద్ధి లే దనుచు బ్రహ్మహరీశులు సంఘటింపఁగా
నమరగురుండు గైకొనియె నంబుజలోచనఁదారఁ దారకా
రమణముఖిం ద్యజించె నుడురాజును భామినినెట్టకేలకున్.

వ. అనంతరంబ గర్భం బాలోకించి గురుండు దాని కిట్లనియె.

తే. అతివ! యీగర్భ మెవ్వరి కైతి చెపుమ
చంద్రునికొ? నాకొ? యని రహస్యమున నడిగె
సిగ్గుపడి యెంత యడిగినఁ జెప్పదయ్యె
నాంగిరసునకుఁ దార తారాధిపాస్య. 226

తే. చెప్ప కున్నఁ గోపించి యిషిక యెత్తి
చూలు గరఁగంగ వైవంగఁ జూచె గురుఁడు
వేల్పురా యిందుముఖిఁ జూచి వెఱక చెప్పు
నిజము చెప్పిన నీకు నేనెగులు లేదు. 227

ఉ. నావుడు దార యొక్కవచనంబును బల్కక యూరకుండెల
జ్జావనతాస్య యై సరసిజాసనుఁ డప్పుడు చేర వచ్చి యో
దేవి! నిజంబు చెప్పు హిమదీధితిసంగతి నైనగర్భమో?
జీవ్రుతుఁడో [illegible] చేసిన గర్భ [illegible] యంచుఁ బల్కినన్.

తే. తోయజాతదళాక్షి కేల్దోయి మొగిచి
పలికె నెత్తమ్మిచూలితోఁ బ్రస్ఫుటముగ
వనజసంభవ? తారకావల్లభుండు
చూలుచేసినవాఁ డంచు సూక్ష్మఫణితి. 229

వ. గురుండును దారకుజన్మించినట్టికుమారునిం జంద్రుని కిచ్చె. చంద్రుండు నిజనందనునకు బుధుం డను పేరు వెట్టె బుధుండును దండ్రియనుమతి వడసి కాశి కరిగి బుధేశ్వరుండను లింగంబుఁ బ్రతిష్ఠించి పెద్దకాలంబు తపంబు చేసి యాబుధేశ్వరలింగంబునందుసాక్షాత్కరించినవిరూపాక్షుం బ్రస్తుతించి యమ్మహేశ్వరువలన నక్షత్రలోకంబునకు నూర్ధ్వంబున నున్నయీలోకంబున కధీశ్వరుం డయ్యె. 230

తే. చంద్రకుండచంద్రేశ్వరస్థానమునకుఁ
బ్రాగ్దిశాభాగమునయందు భక్తి నరుఁడు
కాశికాక్షేత్రసీమ బుధేశుఁ గొలిచి
పరమబోధంబు దప్పఁడు ప్రాణవిరతి. 231

తే. అనుచు గోవిందకింకరు లనఘమతులు
బుధునికథ చెప్పుచుండ నంభోదవీథిఁ
బోయె దివ్యవిమానంబు పుణ్యకర్మ
కపులనెల వైనశుక్రలోకంబు డాయ. 232

## శుక్రలోకవర్ణనము.

వ. అప్పు డయ్యిద్దఱు శివశర్మ కిట్లనిరి. నిశితశతక్రతుప్రయోగప్రక్రియాక్రమసమర్థశుక్రలోకం బిది. ఇందు దానవగురుండు గావ్యుం డధివసియించు. ఆభార్గవుండు భర్గువలన వర్షసహస్రంబు కణధూమంబాహారంబుగాదుస్సహంబైన తపం

బాచరించి మృతసంజీవనీవిద్యారహస్యంబును సకీలకంబుగా
నెఱింగినాఁడు. 233

తే. ఎఱుఁగ రీవిద్య నెవ్వారు నిజ్జగమున
బ్రహ్మవంశాగ్రగణ్య! వాక్పతి మొదలుగ
గుహుఁడు దక్కంగఁ గరటివక్త్రుండు దక్కఁ
బార్వతీదేవి దక్కంగ భవుఁడు దక్క. 234

తే. హరునితోడ విరోధించి యంధకుండు
యుద్ధ మొనరించు చొక్కనాఁ డోహటించె
నజగవోన్ముక్తఘననిశాతార్ధచంద్ర
బాణనిర్భిన్నవక్షఃప్రపాతుఁ డగుచు. 235

వ. కాలకంధరునకు నంధకాసురునకు నైనయమ్మహాయుద్ధంబున
నీల్గినరాక్షసులను మృతసంజీవనీవిద్యాప్రభావంబున భార్గ
వుండు బ్రతికించుచుండ దండనికుంభకుంభోదరప్రముఖు
లగుప్రమథులు పరమేశ్వరున కిట్లనిరి. 236

సీ. దేవ! మహాదేవ! త్రిపురదైత్యధ్వంస!
యభవ! మావిన్నప మవధరింపు
మీచేతఁ బడసినమృతజీవనీవిద్య
బ్రతికించుచున్నాఁడు భార్గవుండు
దైత్యవర్గము నెవ్విధంబున మా కెట్లు
జయము సిద్ధించు? నాఁ జంద్రమౌళి
నందికేశ్వరుఁ బంచి బందిగ్రహణలీలఁ
గావ్యుఁ దెప్పించి శ్రీకంధరుండు
తే. గరతలమున బదరిపండుకాంతి నతనిఁ
గాల్చి [illegible]

విషము మ్రింగిన పెన్నుద్ది వేల్పు ఱేఁడు
మనసిజారాతి మ్రింగి గట్టునఁగఁ ద్రేఁపె. 237

వ. అంధకాసురుండును భార్గవుండు లేనిపిమ్మటంగొంతకాలంబు
నకుఁ గృతాంతదమను చేత హతుం డయ్యె. బహుకాలంబు
కాలకంఠుజఠరగోళంబునం దుండి కావ్యుండును. 238

మ. ప్రవియించె దుహినాంశుశేఖరుని మేఢ్రద్వారమార్గంబు
నగ్గ,గవిశుక్లంబయితత్క్షణంబుననిజాకారంబుఁదాల్చెన్మనో,
భవవిద్వేషి నిజాత్మసంభవునిఁ గా భావించి వీడ్కొల్పె భా
ర్గవు నాతండు దపంబు సేయ నరిగెఁ గాశీపురీసీమకున్. 239

వ. అరిగి యానందకాననంబున లింగప్రతిష్ఠ చేసి యాలింగం
బునందు విశ్వేశ్వర శ్రీమన్మహాదేవు భావించుచుఁ జంపక
దుత్తూర కరవీర కుశేశయ మాలతీ కర్ణికార కదంబ
వకుళోత్పల మల్లికా శతపత్త్ర సింధువార కింశు కాశోక
పున్నాగ నాగకేసర క్షుద్రా మాధవీ పాటలా బిల్వ
మందార ద్రోణ గ్రంథిపర్ణ దమన చూతపల్లవ దర్భ తులసీ
నంద్యావర్త దేవదారుకాంచన దూర్వాంకురాదులశంకరు
ననేకకాలం బారాధించి శుక్రుం డీలోకంబున కధీశ్వరుం
డయ్యె. 240

క. వారాణసి శుక్రేశ్వరు
నారాధించిననరుండు ప్రాపించు సమ
గ్రారోగ్యాయుఃపుత్ర
శ్రీరాజ్యైశ్వర్యశౌర్యచిరసౌఖ్యంబుల్. 241

## అంగారకలోకవృత్తాంతము.

వ. అట నూర్ధ్వంబున నున్నది లోహితాంగలోకంబు. 242

సీ. తొల్లి దాక్షాయణితోఁ బాసి శంభుండు
విరహసంతాపాగ్ని వేఁగుచుండె
నావేళ నొక్కనాఁ డభవు ఫాలంబునఁ
బ్రస్వేదబిందు వుత్పన్న మయ్యెఁ
బరిపక్వకూశ్మాండఫలసన్నిభం బైన
యాఘర్మజలకణం బవని వ్రాలె
వ్రాలి తత్క్షణమ యవ్వసుమతీస్థలమునఁ
బద్మరాగోపలప్రతిమకాంతి

తే. నొక్కదివ్యకుమారుఁ డై యుండె నెదుర
నతని నందనుఁ గా శంభుఁ డాదరించె
ధాత్రియును వాని భావించెఁ బుత్త్రు గాఁగ
నతఁడు ప్రీతిని దపము సేయంగఁ గోరి. 243

సీ. భాగీరథీగంగ ప్రవహించు నేవీటి
పరిసరంబున నుదగ్భాగమునను
వరణాతరంగిణీవార్నిర్ఝరములతో
నలివేణి యేవీటియవధిఁ గూడెఁ
దత్తంబు హుతమును దత్తంబు నేవీటి
యైదుక్రోసుల నిచ్చు నమృతలక్ష్మి
వలచు నేవీటికవ్యాజరాగస్ఫూర్తి
శైలకన్యకకంటెఁ జంద్రమౌళి

తే. యట్టికాశికి గుర్వాజ్ఞ నరుగుదెంచి
పరమనైష్ఠికుఁ డగుచుఁ దపం బొనర్చెఁ
గలుషసంతానకాననాంగారకుండు
ధారకుఁడు భూతధాత్రి కంగారకుండు. 244

తే. పాంచముద్రమహాస్థానపదమునందుఁ
గంబళాశ్వతరేశోపకంఠభూమి
నిష్ఠ నంగారకేశుఁ బ్రతిష్ఠ నేసి
కాంచె నీలోక మేల నంగారకుండు. 245

వ. ఇది యంగారకలోకవృత్తాంతంబు. 246

బృహస్పతిలోకవృత్తాంతము.

క. అదె వీక్షింపు బృహస్పతి
పదము ధరామరవరేణ్యా! బహువిధశుభసం
పదలకు నాస్పద మీతఁడు
చదివినవాఁ డర్థశబ్దశాస్త్ర మఖిలమున్. 247

వ. అయ్యాంగిరసుండు కాశిక్షేత్రమున కరిగి యందుఁదన పేర శంభులింగంబుఁ బ్రతిష్ఠించి తత్సమీపంబున బహుదివ్యవర్షంబులు దపంబు నేసి తనకుం బ్రత్యక్షం బైనవిరూపాక్షు నిట్లని సంస్తుతించె. 248

తోటకము. జయశంకర! శాశ్వత! చంద్రధరా!
భయనాశ! గిరీశ్వర! భక్తపరా!
నయనత్రయభాస్వర! నాగహరా!
యయవర్ధన! శాంత! దయామధురా!. 249

తోటకము. భువనావన! పావన! భూతపతీ!
భవ! పన్నగభూషణ! భద్రకృతీ!
శివ! దేవ! మహేశ! విశిష్టమతీ!
భవభంగ! ఫలప్రద! పాపహృతీ!. 250

తోటకము. శ్రితపాపవిభంజన! సిద్ధనతా!
క్షితిభృత్తనయాధర! చిద్విదితా!

మృతిజన్మవిధూత! హరిప్రణుతా!
సతతప్రణవధ్వనిసాధరతా!. 251

క. చాటుకవితాకళాపరి
పాటిం బాటించి యారభటిభక్త్యావే
శాటోపంబున గీష్పతి
తోటకవృత్తములఁ బొగడెఁ దుహినాంశుధరున్. 252

శా. ఆటోపారభటి న్మునీశ్వరుఁడు దన్నందంద వర్ణింపఁ ద
చ్చాటుప్రౌఢికిఁ జేసె ధూర్జటి మహాశ్లాఘాశిరఃకంపమున్
జూటీకూటవిటంకకోటివిలుఠత్స్రోతస్వినీవీచికా
కోటీఘాటిరటత్కరోటికుహరక్రోడావకాశంబుగాన్. 253

వ. ఇట్లు ప్రీతుం డై. 254

సీ. బృహదుగ్రతపమ్ము సంభృతనిష్ఠఁ జేసిన
సామర్థ్యమున బృహస్పతివి గమ్ము
ప్రాణంబు ప్రాణ మై భక్తిఁ జేసితి గాన
జీవాహ్వయము నీకుఁ జెల్లుఁ గాక
వాగ్డంబరమునఁ గై వారంబు నేసితి
తగుదు వాచస్పతిత్వమున కీవు
పఠియించువారికిఁ బ్రాతిభస్ఫురణంబు
దొరకించు నీచాటుతోటకములు

తే. లోహితాంగుఁడు పాలించులోకమునకు
నూర్ధ్వ మైనపదంబున నుండు వత్స!
యనుచు వరములు కృపచేసి యసితగళుఁడు
బ్రహ్మఁ దలఁచెను దేవతాప్రతతితోడ. 255

వ. సంస్మరణమాత్రంబున నేగుదెంచిన బ్రహ్మాదిదేవతలచేఁ
దన్వాచస్పతిని దేవతాచార్యపదవీసామ్రాజ్యంబునకు

బట్టాభిషేకంబు చేయించి యప్పంచాననుండు చంద్రేశ్వరు
నికి దక్షిణభాగంబున విశ్వేశ్వరునికి నిరృతిభాగంబున ధిష
ణుండు ప్రతిష్ఠించినధిషణేశ్వరునియందు సంక్రమించె.
గురుండును నీలోకంబున కధీశ్వరుండయ్యె. ఇదిబృహస్పతి.
లోకవృత్తాంతంబు. 256

తే. దివిజగురువిష్టపంబు నతిక్రమించి
శౌరిభువనంబు గాంచి యాశ్చర్య మంది
పుణ్యశీలుండు శివశర్మ పుణ్యశీలు
నకు సుశీలున కిట్లనెఁ బ్రకటఫణితి. 257

ఉ. పాండురపద్మలోచనునిపార్శ్వగులార! మహాత్ములార! మా
ర్తాండసమానులార! యిదెప్రాంతమునందు సముజ్జ్వలప్రభా
మండలమధ్యవర్తియు సమగ్రవిలాససమన్వితంబు నై
రెండవనాకలోక మన దృష్టికి నింపొనరించె నెంతయున్.

శనైశ్చరలోకవర్ణనము.

వ. ఇది యెవ్వరిలోకం? బనిన వార లి ట్లనిరి. 259

తే. సంశితవ్రత! యిది శనైశ్చరునిలోక
మితఁడు గ్రహములలో నెల్ల నతిబలిష్ఠుఁ
డిమ్మహాత్ముని శుభచరిత్రమ్ము వినుము
విశదముగఁ జెప్పెదము నీకు విస్తరించి. 260

సీ. నారాయణునినాభినలినమధ్యంబున
జనియించె బ్రహ్మ యాపవజునకు
సంభవించె మరీచి సంయమిగ్రామణి
గలిగె నమ్మౌనికిఁ గశ్యపుండు
ప్రభవించె నాకశ్యపప్రజాపతికి మా
ర్తాండుఁ డబ్జానుండు త్వష్టకూఁతు

సంజ్ఞాభిధాన రాజనిభాస్య వరియించెఁ
దరణికి నది యపత్యత్రయంబుఁ

తే. గాంచె మను వన యముఁ డనఁగాఁ దనయుల
యమున యనుకన్య నక్కాల మప్పురంధ్రి
యోర్వ లే దయ్యె మగనియత్యుష్ణ మైన
తేజమున కతికోమలదేహ యగుట. 261

తే. ఛాయ యనుదాని సృజియించె సంజ్ఞ యొక్క
మానినీమణి నాత్మసమానమూర్తి
నగ్రమునయందుఁ బ్రాంజలి యగుచు నుండె
నది ప్రతిచ్ఛాయ లలితమాయాస్వరూప. 262

వ. సంజ్ఞాదేవి సవర్ణ యగునాఛాయ కిట్లను. కల్యాణి! యేఁ బుట్టినింటికిం బోయి వచ్చెద. నామాఱై నీవు మదీయాజ్ఞ సూర్యునికిం బరిచర్య సేయుము. మనువును, యముండును, యమునయునను నపత్యత్రయంబు నీయదిగాఁ దలంపుము. ఈరహస్యంబు కచగ్రహణశాపపర్యంతం బెవ్వరికిం జెప్పకు మని యప్పగించిపితృగృహంబునకుం బోయెనట్లు సవర్ణయు.

తే. అష్టముం డగుసావర్ణి యనెడుమనువు
మఱి శనైశ్చరు భద్రాసమాఖ్యఁ గన్యఁ
గాంచె నుష్ణాంశువలన నక్కలువకంటి
తరణియును దాని సంజ్ఞఁగాఁ దలఁచి యుండె. 263

వ. ఆసవర్ణయు సర్వస్త్రీస్వభావం బగుసాపత్న్యగుణంబున సంజ్ఞాసంతానముకంటెం దనసంతతియందు నత్యంతవాత్సల్యంబు పాటించి భోజనాలంకారలాలనంబులపట్టున వైషమ్యంబు గలిగియుండ నొక్కనాఁడు భవితవ్యతావిలాసంబు

సనో! బాల్యచాపల్యంబుననో! మమతాస్వాతంత్ర్యంబున
నో! జముండు సంజ్ఞారూపిణి యైనపినతల్లి ఛాయాదేవిం
గోపించి తన్నుం దలంచి పాదం బెత్తిన. 265

సీ. తనకు సంజ్ఞాదేవి మనములోఁ గడు నమ్మి
యిల్లడ వెట్టుట యెట్లు మఱచెఁ?
బసిబిడ్డ నేరమి పట్టి పాలార్పంగఁ
దగవు గా దని యేల తలఁప దయ్యెఁ?
దా నేమి బిడ్డలఁ గానదా? సవతాలి
కొడుకు త ప్పొకటి లోఁ గొన్న నేమి?
యల్పదోషంబున కననురూపం బైన
ప్రబలదండం బొనర్పంగఁ దగవె?
తే. జముఁడు దనమీఁదఁ బాదంబు చాఁచినపుడు
కనికరం బింత లేక యక్కలువకంటి
కంటికొనఁ గెంపు గదురంగఁ గనలి చూచి
పదము దెగి పడ శపియించె బాలు నతని. 266

తే. ఎట్టియపరాధ మొనరించె నేనిఁ దల్లి
కొడుకు శపియింప దిబ్బంగిఁ గ్రూరబుద్ధి
నతివ! సత్యంబు చెప్పు మెవ్వతవు నీవు?
నావుడును శాపభీతి నన్నలిననేత్ర. 267

వ. తనవృత్తాంతంబు చెప్పిన దానియం దపరాధంబు పొడగా
నక యమునిం జూచి మాతృశాపంబు నివర్తింప శక్యంబు
గాదు. నీచరణంబునం గలమాంసంబు కృమికీటంబులు దో
లిచి భక్షింప భూమిపయిఁ బడియెడు నని పలికి కొడుకు
నూఱడించి త్వష్టృప్రజాపతిభవనంబునకుం బోయి యతని

వలన నిజభార్య దపంబు సేయం జనుటయు, నున్నగుఱు
తును నెఱింగి యగ్రభాగంబున. 268

సీ. కఠినరింఖాపుటీఘట్టనంబుల భూమి
పటహనిధ్వానంబు ప్రస్తరింప
ధవళలాంగూలపల్లవచాలనంబులు
గౌముదీచ్ఛాయలఁ గ్రాసి యుమియ
వెలిదామరలఁ దోలువెడఁదకన్నులయందుఁ
దారంబు లళులచందము వహింపఁ
బ్రోథసంపుటపరిస్ఫురణావసరముల
దంతకోరకకాంతి దళుకు చూపఁ

తే. గొదమగోడిగ యై కురుక్షోణియందు
విపినవీథుల నేకాంతవృత్తిఁ దిరుగు
పరమపుణ్యాంగనాజన ప్రథమగణ్య
సంజ్ఞఁ బొడగాంచె దవ్వులఁ జండకరుఁడు. 269

ఉ. ఘోటిక యై చరించుతనకూరిమిభామినిఁ జూచి దవ్వులన్
ఘోటకరూపుఁ డై యతఁడు క్రొవ్వెసలారెడు కావరంబుపై
పాటున డాయ వచ్చి నిరుపాధికసౌహృదవిభ్రమంబునన్
జీటికి మాటికిం దెసలు చిల్లులువోవఁగఁ జేసె హేషలన్.

తే. అశ్వరూపుఁ డై నయరవిందబాంధవుఁ
డశ్వ యైనసంజ్ఞ నల్లఁ జేరి
కావరంబుతోడికందర్పవిక్రియ
మోర మోర మోపి మూరుకొనియె. 271

వ. ఇవ్విధంబున సాక్షాత్కరించిన తపోలక్ష్మియుం బోలె నబ్బ
డబబడబానలజ్వాలాజాలలీలా ప్రీడావహామహాఘపటలపాట
లిమపల్లవితదశదిశాభోగ భోగింపం దలంచి పూషవిషమ

ఖాణుచిట్టకంబున నకఠోరదూర్వాంకురచర్వణక్రియాసమ
భిహారహరిత ఫేనచ్ఛటాచ్ఛేదపిచ్ఛిలంబును, దారుణ్యాదర్ప
భరకవోష్ణనిశ్శ్వాసధారాధురంధరంబును, జలాచలప్రోథ
దళసంపుటంబును నగునాఘోటీవదనంబు చుంబించె. సం
జ్ఞయు నిజాంతఃకరణప్రవృత్తియ ప్రమాణంబుగా నతిప్ర
మాణమూర్తిస్ఫూర్తి యగునత్తురంగంబుఁ బతంగున కాఁ
దలంచి యిచ్చగించె. అత్తఱి వైనయమ్మత్తకాశిని గించిదు
న్నిద్రపారిభద్రకలికాచ్ఛాయాముద్ర కుద్ది యగుముద్ర
విరియించుచు మొగుచుచుం గదలకుండె మోర మోరతో
మోపియుఁ, గండంబు గఱచియు, డాసియుఁ, బాసియు,
బవళి చేసియుఁ,గొంతదడవు వినోదించియు, నక్కహానా
హాయంబగ్గోడిగ డగ్గఱి యుండె. అప్పు డమ్మావునకు ముకు
గ్రోళ్లనెక్కచరమధాతుద్రవంబు గదంబకుసుమకేసరపరా
గగంధపాణింధమంబై స్రవించె. అయ్యింద్రియంబునఁ
జంద్రబింబాననకు నిద్దఱు గవలవారు నాసత్యు లనం
బ్రభవించిరి. అక్కుమార ద్వయంబు. 272

తే. విబుధవైద్యద్వయం బయ్యె విమలచరిత!
యంత నిజమూర్తి ధరియించె నబ్జహితుఁడు
సంజ్ఞయును దాల్చె నిజమూర్తి సంతసించి
దంపతులు చని రాత్మసంస్థానమునకు. 273

వ. అంత నక్కడ శనైశ్చరుండు వారాణసికిం జని లింగస్థాప
నంబు చేసె. ఆశనైశ్చరేశ్వరుండు విశ్వేశ్వరదేవునకు
దక్షిణభాగంబున శుక్రేశ్వరున కుత్తరంబున సంప్రతిష్ఠి
తుండై భజియించువారికి భోగమోక్షంబులు ప్రసాదించు.

శనైశ్చరునకుఁ దత్ప్రసాదలబ్ధం బీలోకంబు. ఇది శనైశ్చర లోకవృత్తాంతంబు. 274

## సప్తర్షి లోకవృత్తాంతము.

క. సప్తమహామునిలోకము
సప్తార్చిగప్రతిమతేజ! సకలైశ్వర్యా
వాప్తికరం బిది చూడుము
ప్రాప్తాఖిలవిద్య! భూసుపర్వవరేణ్యా!. 275

వ. మరీచి యత్రి పులస్త్యుండు పులహుండు క్రతు వంగిరసుండు వసిష్ఠుండు వీరు బ్రహ్మమానసపుత్రులు, సప్తబ్రహ్మలు. వీరికి ధర్మపత్నులు గ్రమంబున సంభూతియు ననసూయ క్షమ ప్రీతి సన్నతి స్మృతి †యూర్జ. వీరివలన నాప్రజాపతులు నానారూపప్రజలసృజియించి బ్రహ్మాదేశంబున నయ్యవిముక్తక్షేత్రంబునఁ దపంబుచేసి మరీచ్యత్రీశ్వరాదిలింగంబులం బ్రతిష్ఠించిరి. సంభూత్యనసూయాదు లగు పతివ్రతలును దమపేర శివలింగంబులం బ్రతిష్ఠిచేసిరి తత్ప్రసాదలబ్ధం బైన యీలోకంబున సప్తమహామునులును బరమసుఖం బనుభవించు చున్నవారు. ఇది సప్తమహామునివృత్తాంతంబు. ఈలోకంబున కూర్ధ్వంబున. 276

## ధ్రువపదవర్ణనము.

సీ. త్రైలోక్యమంటపస్తంభసంభారంబు
గగనలక్ష్మీకంఠకనకభూష

---

† 'యశః' యని వెక్కుప్రతులఁ గనఁబడుచున్నది. ఇది 'సంభూతి రనసూయాచ క్షమా ప్రీతిశ్చ సన్నతిః,స్మృతి రూర్జా క్రమా దేషాం పత్న్యోలోకస్య మాతరః' అను మూలమునకు విరుద్ధము.

బ్రహ్మాండ కేతకీపాదప ప్రసవంబు
గంగాతరంగిణీ క్రౌంచఖగము
బలిదైత్యమథనాంఘ్రి ప్రపంకేజనఖరంబు
దారకావళితులాదండయష్టి
ధాతృలోకద్వారదంతకవాటంబు
గ్రహమండలీపశుగ్రామవేది
తే. తారకాశింశుమారకాకారుఁడైన
యాదినారాయణునితోఁకయలఁతిచిప్ప
తప్ప కీర్తింపు ధరణిబృందారకేంద్ర!
వివిధకల్పపరంపరాధ్రువుని ధ్రువుని. 277
వ. ఈతనిలోకవృత్తాంతంబు వినుము. 278
క. స్వాయంభువమనుధాత్రీ
నాయకుఁ డుత్తానపదుఁ డనం గాంచె సుతుఁ
దోయజనేత్రలు గేహిను
లాయయ్యకు నిరువు రంబుజాసనవంశ్యా!. 279
తే. కాంత యొక్కత సురుచి యొక్కత సునీతి
సురుచి కుత్తముఁ డను పేరిసుతుఁడు పుట్టె
ధ్రువుఁడు పుట్టె సునీతి కాధ్రువునికంటె
నుత్తమాహ్వయు మన్నించు చుండుఁ దండ్రి. 280
తే. ఒక్కనాఁ డోలగంబున నున్న వేళ
గురునితొడమీఁదఁ గూర్చుండె సురుచికొడుకు
ధ్రువుఁడు నేతెంచి వాఁ డున్నతొడయె యెక్క
సురుచి వారించె భూపతి చూచుచుండ. 281
వ. అప్పుడు మఱలి వాఁ డంతఃపురంబున కరిగి యావృత్తాంతం
బుతల్లికెఱిఁగించి పిన్నయయ్యనునుత్తమక్షత్రియతేజోవిశే

షంబునం బరిభవంబు సహింపఁ జాలక తల్లియనుజ్ఞ వడసి తపంబు సేయం జనువాఁడు యదృచ్ఛాగతు లగుసప్తఋషులఁ గాంచి సముచితప్రకారంబునం దనవృత్తాంతంబు వారి కెఱిఁగించి వారివలన ద్వాదశాక్షరమంత్రోపదేశంబు గొని పరమభక్తిపరాయణుం డైననారాయణు మధువన ప్రాంతంబున యమునాతటంబునఁ బెద్దకాలంబు పెక్కు విఘ్నంబులకు మనంబు చలింపక నీకయారాధించి సాక్షాత్కరించిన యప్పుండరీకాక్షువలన విశ్వోత్తరం బైనయిప్పదంబుఁ గాంచె. 232

తే. ధ్రువుని కిచ్చినమహిమంబు ధ్రువము గాఁగ
నతఁడు దాను వారాణసి కరిగె శౌరి
వానిఁ దనవెన్కదిక్కున వైనతేయు
మీఁద నెక్కించుకొని చిట్టమిడుచు నంత. 233

మ. శివుఁ గాశీపతి విశ్వనాయకుని సంసేవించి యప్పార్వతీ
ధనునాజ్ఞన్ గ్రహచక్రవాళమునకూర్ధ్వంబైనలోకంబునన్
ధ్రువ! వర్తింపుమనేకకాలమనుచున్ బోధించియేగన్ మనో
జవనుండైనఖగేంద్రునెక్కికొనివిష్వక్సేనుఁడెందేనియున్. 235

వ. ధ్రువుండును,

సీ. మణికర్ణికావారి మజ్జనం బొనరించి
యవిముక్తమునయందు శివుని నిల్పి
యాశివలింగంబు ననిశంబు సేవించి
యందు విశ్వేశ్వరు నావహించి
పంచాక్షరీమంత్రపారాయణంబును
ప్రణవమంత్రంబును బరిచరించి

విశ్వనాయకునకృపావిభవంబు పెంపునఁ
బరమోన్నతం బైనపదము గాంచెఁ
తే. గాశిలోన ధ్రువేశ్వరుఁ గాలగంఠు
భక్తి సేవింప ధ్రువ మైనపదము గలుగుఁ
బంచజనునకు నిది సిద్ధభాషితంబు
సమధికస్మార్తశుభకర్మ! శంభుశర్మ!. 286

వ. అని చెప్పి రంత నవ్విమానంబు ధ్రువలోకంబు గడచి క్రమం
బున మహాలోకజనోలోకతపోలోకంబు లతిక్రమించి సత్య
లోకంబు గదిసె. అప్పు డవ్విష్ణుకింకరులు శివశర్మ కి ట్లనిరి.

**శివశర్మ బ్రహ్మవిష్ణుమహేశ్వరలోకంబుల కేగుదెంచుట.**

క. ముందఱిది బ్రహ్మలోకము
సందర్శింపుము త్రిక్షేత్రశర్మ! ధరిత్రీ
బృందారక! యిది పరమా
నందస్థానంబు ద్రుహిణునకు నెల వగుటన్. 288

వ. అనుచు నతనిం బద్మగర్భసమ్ముఖంబునకుం గొనిపోయిరి.
అవ్విభుండును వారలం బ్రసాదబహుమానంబులందనిపి ప్ర
సంగవశంబున నమ్మహాశ్మశానంబున మృతుండుగానివానికి
ముక్తి సిద్ధింప దని సముచితప్రకారంబుగా వీడుకొలిపె.
శివశర్మయు నమ్మాటకు సంశయాకులుండగుచుఁ దదూర్ధ్వం
బుగాఁ జని చని పుణ్యశీలసుశీలురం జూచి మన కింక నెంత
ద వ్వరుగవలయు నెఱింగింపుఁడు. ఇప్పుడు పితామహుండు
కాశియందు శరీరంబు విడువక మోక్షంబు లేదనియె. నాకు
నిశ్శ్రేయససంప్రాప్తి యెట్లగు? అవ్విధంబును వివరింపుఁ
డనిన వార లి ట్లనిరి. 289

తే. ఉర్వి కెనిమిదికోటుల యోజనముల
పొడవునం దుండు నీథాత్రుభువన మనఘ!
యీప్రమాణంబునన యుండు నిందుమీఁద
విష్ణులోకంబు సతతవర్ధిష్ణు వగుచు. 290

వ. అవ్వైకుంఠంబునకు మీఁదఁ బదాఱుకోట్ల యోజనంబుల పొడవున శివలోకంబు కైలాసాహ్వయం బనం దనర్చు ధానికిం బరమం బగులోకంబు లేదు. 291

తే. సంశితాచారపర! దాని సంస్తుతింప
మాక కా దచ్యుతునకుఁ దామరసభవున
కైన శంభున కైనను నహివిభునకు
నైన గీష్పతికైనను నలవిగాదు. 292

వ. అప్పరమస్థానంబునందు నిందుధరుండు గిరినందనాసహాయుం డై గణాధిపతిస్కందనందికేశ్వరాదులుగొలువను దారవిహారంబులం బ్రవర్తిల్లుచుండు. అవ్విశ్వేశ్వరుండు విశ్వరక్షణార్థంబుగాఁ జతుర్భుజుఁ జతుర్దశభువనాధిపత్యంబునకుం బట్టాభిషిక్తుం జేసి యనంతరంబ. 293

## విష్ణుపట్టాభిషేకవర్ణనము.

సీ. మండు వేసవినాఁటి మార్తాండబింబంబు
గోడగించుఁ బసిండిగుబ్బతోడఁ
దొలుకారు క్రొమ్మెఱుంగుల థాళథళ్యంబు
శవణించు రత్నదండంబుతోడ
నచ్చువెన్నెల చాయ హెచ్చుకుం దాడెడు
వెలపట్టుజగజంపువలువతోడఁ
గడలియం దేకోదకము వేళఁ బుట్టిన
[illegible]

తే. వేనవే లోయ్యజనంబులవిరివి నొప్పు
లక్షకోటిశలాకికాలంకృతంబు
తారకాస్థూలముక్తికస్థాపితంబు
విష్ణునకుఁ బట్టె వెనకయ్య వెల్లగొడుగు. 294

తే. పార్వతీదేవి కైసేసె బహువిధములఁ
బలుకుఁదొయ్యలి రత్నదర్పణము చూపె
శచి నివాళించె మణిదీపసంచయమున
శేషశయనుని పట్టాభిషేకవేళ. 295

సీ. చాముండి యొనరించు జంపెతాళమునకు
భృంగీశ్వరుం డాడెఁ బేరణంబు
వెనుకదిక్కున నుండి కనకభూషలు మ్రోయ
సూర్యేందు శశియు వీచోపు లిడిరి
వెండికట్టులతోడి వేత్రదండము పూని
సందడి నెడఁ గల్గ జడిసె యముఁడు
గాలోచితంబుగాఁ గైవార మొనరించెఁ
బలుకుఁదొయ్యలి గద్యపద్యసరణి

తే. నఖిలలోకములకును బ్రహ్మాండములకు
నాధిపత్యంబు పూని సింహాసనమున
మునులచే వేలుపులచేత మ్రొక్కు గొనుచు
నచ్యుతుం డోలగంబున్నయవసరమున. 296

లయగ్రాహి. మ్రొక్కిరి గణేశ్వరులు మ్రొక్కె జలజాసనుఁడు
మ్రొక్కె మునిమండలము మ్రొక్కిరి దిగీశుల్
మ్రొక్కెను మరుద్గణము మ్రొక్కె గరుడవ్రజము
మ్రొక్కె దనుజావళియు మ్రొక్కి రురగేంద్రుల్

మ్రొక్కె నిగమప్రతతి మ్రొక్కె మనుయూథములు
మ్రొక్కె నితిహాసములు మ్రొక్కె నచలంబుల్
మ్రొక్కెఁ దటినీకులము మ్రొక్కెఁ జతురంబుధులు
నక్కమలనేత్రునకు నక్కజపుభక్తిన్. 297

వ. ఇవ్విధంబునం జతుర్భుజు నిర్భరస్నేహంబున భూర్భువస్స్వర్భువనంబులసామ్రాజ్యభారభరణంబునకుం బట్టాభిషేకంబు నేసి ఫాలలోచనుండు ప్రావృషేణ్యపాథోధరధ్వానగంభీరం బగునెలుంగున స్వయంభూజంభారిప్రముఖు లగుబర్హిర్ముఖులాకర్ణింప, విష్ణుండ యే నవియును, నేన విష్ణుం డనియును, నాకు విష్ణునకు భేదంబు లే దనియును, హరి మంగళాయతనం బనియును, విష్వక్సేనుండు మాననీయుం డనియును, నారాయణుండు జగద్రక్షాపరాయణుం డనియును, నచ్యుతుం డనాదినిధనుం డనియును, నరవిందలోచనుం డాదిపురుషుం డనియును, హరి సర్వపాపహరుం డనియును, నానతిచ్చి తనయిచ్చ నెచ్చోటి కేనియు విచ్చేసె. ఈయాఖ్యానంబును చతుర్భుజాభిషేకం బండ్రు. దీనింబఠియించిను,వినినను,వ్రాసినను.నరుల కాయురారోగ్యైశ్వర్యంబులు సంభవించు. శివశర్మ నీ వీరహస్యధర్మం బెఱింగి హరిహరత్వంబులయందు భేదంబు నేయ కుండు మని చెప్పిరి. అంతనవ్విమానంబు విష్ణులోకంబు గదియుటయు నాతనిం జూచి యిదివైకుంఠలోకంబు. ఇందు లక్ష్మీసహాయుండై వైకుంఠుం డుండు. నీ విందుఁ బరమానందంబున శతానందపరివత్సరపర్యంతంబు వసియింపుము. ఇటమీఁదివృత్తాంతంబు చెప్పెదము. పుణ్యతీర్థమరణోపాత్తం బైనఫలంబునను, భూతసుకృతశేషంబునను, భూ[illegible]లంబునను, [illegible] నందివర్ధన

నగరంబున వృద్ధకాలుండను పేరిరాజ వై పెద్దకాలంబు
రాజ్యంబు సేయంగలవు. నీరాజ్యంబునందు. 298

క. కురియు నెలమూఁడువానలు
సురభులు చన్నవిసి పితుకు సుకృతము జరుగున్
ధరఁ గొండ్ర వేలు పండును
బరఁగుం బురుషాయుషములు ప్రజలకు నెల్లన్. 299

వ. ఇవ్విధంబునఁ బెద్దకాలంబు రాజ్యంబు నేసి సుతవిన్యస్తరా
జ్యభారుండ వై కాశి కరిగి యయోధ్యావంతీమధురామా
యాద్వారవతీకాంచ్యుజ్జయినీతీర్థసేవాఫలంబున విశ్వనా
థుప్రసాదంబున నపవర్గంబుఁ గాంచెద వని పలికి విష్ణుకింకరు
లతని దివ్యవిమానంబువలన డించి నారాయణదేవు సమ్ము
ఖంబునం బెట్టిరి. అప్పుణ్యశ్లోకుండును విష్ణులోకంబునం బెద్ద
కాలంబు సుఖం బనుభవించి పుణ్యశీలసుశీలురు చెప్పినప్ర
కారంబున మోక్షంబు వడసె నని లోపాముద్రకుఁ గుం
భసంభవుండు శ్రీశైలకటకంబునందు సకలతీర్థంబులుం
గాశీప్రాపణద్వారంబున నారాదుపకారంబు లై మోక్షంబు
నిచ్చు, కాశి యవ్యవధానంబున ముక్తినిచ్చు నను నర్థంబుఁ
దేటపఱచె. ఇది శివశర్మనిర్యాణం బనునుపాఖ్యానంబు.
దీని విన్నను మ్ బఠియించినను వ్రాసినను నరుల కాయు
రారోగ్యైశ్వర్యములు సంభవించు నని చెప్పి. 300

ఉ. చేసెఁ బ్రదక్షిణంబు కలశీసుతుఁ డద్రికి మల్లికార్జునా
వాసశిఖాంతరంబునకు వామవిలోచనతోడఁగూడ వి,శ్వా
సముభక్తియుక్ష హితముశాంతియుదాంతియునొప్పనంతరా
ధ్యాసితశంభులింగసముదాయము వారకసంభవించుచున్.

వ. చేసి కతిపయప్రయాణంబుల. 301

## అగస్త్యుండు కుమారస్వామినిదర్శించుట.

లయగ్రాహి. సామిమలకుం జని మహాముని ఘటోద్భవుఁడు
భామయును దాను గడునేమమునఁ బుణ్యా
రామతరువాటి మణిధామమున నున్నయభి
రామసుకుమారతర హేమనిభ గాత్రున్
సామజముఖానుజు సుధామధురమందహసి
తామలకపోలవదనామృతమయూఖున్
హైమవతిపట్టి నఖిలామరశరణ్యు నత
కామితకరున్ గొమరసామి భజియించెన్. 302

వ. అనిన విని నైమిశారణ్యవాసు లగువాచంయములు కుంభ
సంభవుఁడు కుమారస్వామి దర్శించినయటమీఁదివృత్తాం
తం బెయ్యది? యని యడిగిన. 303

## ఆశ్వాసాంతము.

శా. వేమక్షోణివరానుసంభవ! దిశావేదండగండస్థలీ
సీమాపిచ్ఛిలదానగంధలహరీశ్లేషానుభూతిక్రియా
సామగ్రీపటుకీర్తిసౌరభ! కుభృచ్ఛార్దూల! సౌభాగ్యశో
భామత్స్యధ్వజ! మత్స్యవంశనృపరక్షాకేళిపద్మేక్షణా! 304

క. అరిరాడ్గజకంఠీరవ
బిరుదాలంకారపృథులభీషణబాహా
కరవాలనిశితధారా
పరిఖండితదుర్మదాంధపరిపంథినృపా! 305

ఉత్సాహ. అసమబాణనిభవిలాస! యాజిగాండివాయుధా!
బసవశంకరా! విశుద్ధపంటవంశ శేఖరా!
కసిమికోట వేంకటాయి కప్పకొడ కిల్లెడా (?)
ద్యసుహృదవనిపాంతరంగ హాలహాలవిషానలా!. 306

గద్య. ఇది శ్రీమత్కమలనాభ పౌత్త్ర మారయామాత్యపుత్త్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతం బైన కాశీఖండం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# పం చ మా శ్వా స ము.



మార్కండేయేశ
స్వామికృపాలబ్ధధరణిసామ్రాజ్యరమా
హేమాద్రిదానదీక్షిత!
వేమాంబాప్రియకుమార! వీరనృపాలా!. 1

## కుమారాగస్త్యసంవాదము.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. కుమారస్వామి పత్నీసహితుం డైనమహాముని నగస్త్యు నాదరించి కుశలంబడిగి కూర్చుండ నియమించివచ్చిన ప్రయోజనంబుఁ దెలిసి వారాణసీమాహాత్మ్యంబు వినిపించువాఁడై యక్కుంభసంభవుని కిట్లనియె. 2

తే. ఆఱుముఖములు గలవాఁడ నౌదుఁ గాని
నిగమశాస్త్రార్థములు గాన నేర్తుఁ గాని
యధికవైదగ్ధ్యవంతుండ నగుదుఁ గాని
కడఁగి వర్ణింప నోప శ్రీకాశిమహిమ. 3

వ. అయినను నానేర్చుభంగిఁ గాశికామాహాత్మ్యంబు వినిపించెద. అడుగవలసినయర్థంబు లడుగుము. కొల్లాపురము మహాలక్ష్మి పుత్తేర నేతదర్థంబు నీవు వచ్చుట యెఱుంగుదు నని

పలికినఁగుంభసంభవుండుకుమారస్వామిపాదాంభోజంబుల కెరఁగి యిట్లనియె. మహాత్మా! యవిముక్తంబు మోక్షస్థానం బనియును, మణికర్ణికాతీర్థంబు తీర్థరాజం బనియును, అప్పు ణ్యక్షేత్రం బవిముక్తంబానందకాననంబుమహాశ్మశానంబు రుద్రావాసంబు వారాణసి కాశి యనునామధేయంబులు ధరియించు ననియునుం జెప్పుదురు. అన్నియుం బరిపాటి విన వలతుం దేటపడ నానతిమ్ము. 4

తే. అనినఁ బర్వతరాజకన్యాసుతుండు
కలశసూతికి ని ట్లను గారవమున
నిల్వలారి! భవత్సముదీరిత మగు
ప్రశ్నభావంబు విస్తరింపంగ భరము. 5

వ. ఈయర్థంబు మాతల్లి పార్వతీదేవి మజ్జనకు హరు నడిగె. ఆసర్వజ్ఞుం డాజగన్మాతకు నానతిచ్చినప్రకారంబు నీకుం జెప్పెద సావధానమతి వై యాకర్ణింపుము. 6

వారాణస్యాదినామనిర్వచనము.

సీ. అంబుజాసనునాయురవసానమునయందు
గ్రస్తసమస్తలోకప్రపంచ
యై మాయ నిర్వికల్పాకారమునఁ దను
నాశ్రయింపఁగఁ బరమాత్మ యుండె
నిస్తరంగసముద్రనిభ మై నిరస్తస
మస్తావధిక మయి ప్రాణికర్మ
పరిపాకకాలంబు ప్రాప్త మయ్యెడునంత
దాఁక నెవ్వేళ విధాతృసృష్టి
తే. గగన మొక్కండ చిక్కంగఁ గ్రాఁగిపోవ
నంధకారంబు నీరంధ్ర మగుచుఁ బ్రబలె.

సత్తును నసత్తు సదసత్తు రిత్త యయ్యె
నెఱుక పడదయ్యె నేమియు నేమి సెప్ప? 7

వ. అనర్కచంద్రగ్రహతారకానక్షత్రం బనహోరాత్రం బన
గ్నిభూసలిలమారుతం బప్రధానం బశబ్దస్పర్శగంధరూపం
బదిఙ్ముఖం బై భువనప్రపంచం బంధకారావశేషం బై యుం
డ బ్రహ్మాండంబు నిష్ప్రచ్చరం బై కేవలత్వంబు భజియింప,
ననామరూపవర్ణంబు నస్థూలంబు నకృశంబు నహ్రస్వంబు
నదీర్ఘంబు నలఘువు నగురువు ననపచయంబు ననుపచ
యంబు నవాఙ్మానసగోచరంబు సత్యజ్ఞానానందరూపంబు
నప్రమేయంబు ననాధారంబు నవికారంబు నిర్గుణంబు నిర్వి
కల్పంబు నిరాలంబంబు నిర్మాయంబు నిరుపద్రవంబు నై
పరబ్రహ్మంబుతూష్ణీంభావంబు గైకొనినిష్కళంకంబై విహ
రించుచు లీలాకైవల్యంబున లోకమర్యాద నాదరించి నిజ
శరీరంబున నొక్కశక్తిం గల్పించె. ఆశక్తి ప్రకృతిరూపంబ
వగు నీవ. ఆపరబ్రహ్మంబు పురుషరూపుం డైన యేను.
కల్యాణి! యాదికాలంబునందు. 8

తే. ఉండఁ జో టెచ్చటను లేక యుత్పలాక్షి!
మనము చేరితి మవిముక్తమంటపంబు
నాఁడు మొదలుగ నిపుడు నున్నార మందుఁ
గాశికానగరీసంజ్ఞకంబునందు. 9

సీ. అనిశంబు మనచేత నవిముక్త మై యున్కి
ముగ్ధాక్షి! యిది యవిముక్త మయ్యె
మనకు నానందంబు నొనరించుఁ గావున
నానందవిపినాభిధాన మయ్యె

సంవసింతు మహాశ్మశానభూములఁ గాన
నే నుంటను మహాశ్మశాన మయ్యె
నోరంత ప్రొద్దును నుందు రుద్రుండ నే
నటుగాన రుద్రగేహాఖ్య మయ్యె
తే. నసియు వరణయుఁ గూడువర్ణములసమితి
సామిసమితవారాణసిసంజ్ఞ యయ్యెఁ
'గాశృదీప్తా' వనంగ విఖ్యాత మైన
థాతువునఁ గాశి యయ్యె భూతలమునందు. 10
శా. నక్షత్రగ్రహతారకంబులు నరణ్యాంబుల్ నదు ల్వార్ధి వి
శ్వక్షోణీధ్రములుఁ దిశావసుమతీచక్రంబు కాలంబుచేఁ
బ్రక్షీణత్వముఁబొందియున్న యెడవిశ్రాంతిఁ సుఖంబుండఁగా
శీక్షేత్రం బిది యంబుజాక్షి!మనకుఁ సిద్ధించె నేకాలమున్.
తే. † [ఈరహస్యంబు చెప్పకు మెవ్వరికిని
శంభుభక్తున కత్యంతశాంతిమతికి
శ్రద్ధధానున కధికవిశ్వాసమతికి
ననఘమానసునకు ముముక్షునకుఁ దక్క. 12
వ. అని భవుండు భవాని కానతిచ్చె. మణికర్ణికామాహా 13
త్మ్యంబు వినుము.

మణికర్ణికామాహాత్మ్యము.

ఉ. నిండుమనంబుతోడ ధరణీధరకన్యయుఁ దాను గాశిఁ గాఁ
పుండికుటుంబభారము మహోన్నతిఁబొందుటఁజూచివిశ్వనా
థుండొకనాఁడు శైలసుతతోడ విచారము చేసెదత్తుఁడో
క్షుండుహితుండుభారకుఁడుగావలదామనయింతయింటికిన్.]

† [ ]కుండలీకృతభాగమొకమాతృకలోమాత్రములేదు. పెక్కుమాతృకలం దున్నను నధికపాఠముగా గ్రహింపఁబడియున్నది.

తే. అని విచారంబు చేసి కాలాంతకుండు
చూచె నరగంట గిరిరాజసుత మొగంబు
ప్రభవ మొందె నాచూపునఁ బ్రావృషేణ్య
ముదిరనీలాంగుఁ డగునొక్కముద్దుకొడుకు. 15

వ. అబ్బాలునిం జూచి బాలేందుధరుండు. 16

సీ. పుండరీకేక్షణ! పురుషోత్తమాహ్వయ!
శిఖిపింఛసంఛన్నచికురభార!
యాజానుదీర్ఘబాహార్గళద్వయయుగ్మ!
హరినీలసింహాసంహనన కాంతి!
గంభీరతరనాభికాసారభవపద్మ!
శ్యామపిశంగవాసగకటీర!
శంఖచక్రగదాసిశార్ఙ్గదివ్యాయుధ!
కందర్పకోటిరేఖావిలాస!

తే. కాశిపట్టణమున నైదుక్రోశములును
పటుతర క్షేత్ర మిది రాజ్యపదవి నాకుఁ
బరమపుణ్యాత్మ! యీకుటుంబము భరింపు
తత్పరత మీఱ భారకత్వంబుఁ బూని. 17

వ. అని పల్కి మహేశానుండు బుద్ధితత్త్వస్వరూపి యగు
విష్వక్సేనుం గాశికాపురిసామ్రాజ్యభారంబు భరియింప
నియోగించిన జనార్దనుండును. 18

తే. చక్రమునఁ ద్రవ్వి యొక్కపుష్కరిణి సేసి
ఖననవేళాప్రయాససంజనిత మైన
ఘర్మజలమునఁ బూరించెఁ గైటభారి
యమ్మహాపల్వలంబుఁ గాశ్యంతరమున. 19

క. వేయును నెనిమిదియేం డ్ల
త్త్రోయజలోచనుఁడు చేసె దుస్సహతప మ
త్త్రోయాధారముదరిఁ గా
త్యాయన్యధిపతి గుఱించి యతులితభక్తిన్. 20

వ. అనంతరంబ. 21

శా. ఇందూత్తంసుఁడు కాశికాధిపతి విశ్వేశుండు ప్రత్యక్షమై
కందర్పారి ముకుందనిర్మితమహాకాసారముం జూచి యా
నందంబొందివృషధ్వజుండుబహుమానశ్లాఘఁగావించెఁదా
మందాందోళితమౌళియైవిధుశిరోమాల్యావలుల్ మ్రోయఁ [గాన్.

క. ఫణిభూషణుండు వాపీ
ప్రణుతిశ్లాఘాపరంపరల నొనరింపఁ
ద్రిణయనునిదక్షిణశ్రుతి
మణికర్ణిక మిట్టి సరసిమధ్యమునఁ బడెన్. 23

వ. పరమేశ్వరశ్రవణమణికర్ణికాప్రపతనస్థలం బగుటం జేసి
యచ్చక్రపుష్కరిణి మణికర్ణికాహ్వాయం బై యుండు. 24

తే. చక్రపుష్కరిణీతీర్థసవిధభూమి
శంఖచక్రగదాపాణి శంభు నడిగెఁ
గాశికాతీర్థమాహాత్మ్యగౌరవంబు
శివుఁడు నానతి యిచ్చె నక్షీణకరుణ. 25

కాశీతీర్థమాహాత్మ్యకథనము.

వ. అది వివరించెద నాకర్ణింపుము. మణికర్ణికాతీర్థంబునందు సం
ధ్యాస్నానజపహోమవేదాధ్యయనంబులువ్రతోత్సర్గవృషో
త్సర్గంబులు లింగస్థాపనంబులును నక్షయమోక్షఫలంబు
నొసంగు భూతభావిభవత్తీర్థంబు లీతీర్థరాజంబుతో సరిరావు.
సాంఖ్యయోగం బాత్మావలోకనంబు వ్రతతపోదానం

బులుతత్తీర్థస్నానంబునకుసమానంబులుగావు. శశమశకకీట
పతంగోరగంబులు పంచక్రోశియందుఁ బంచత్వంబు నొంది
నిర్వాణలక్ష్మిఁ గైకొను. కాశీక్షేత్రంబునం దెప్పుడుఁ గృత
యుగంబు. ఎప్పుడు నుత్తరాయణంబు. ఎప్పుడు మహోద
యంబు. చతుర్వేదాధ్యయనంబు చేసినపుణ్యంబు కాశిం
బంచాహోరాత్రంబులు వసియించినవారికిం గలుగు. అశ్వ
మేధరాజసూయాధ్వరంబుల నుపార్జితములైనఫలంబులు
కాశిం ద్రిరాత్రశయనంబున సమకూఱు. తులాపురుషదాన
ఫలంబు కాశీదర్శనమాత్రంబునం గలుగు. కాశీస్థానంబున
నాయాజ్ఞ దక్క నితరులయాజ్ఞ చెల్లదు. యోజనశతదూ
రస్థుం డైననరుండు కాశీస్మరణంబున దోషంబువలనం
బాయు. పంచక్రోశప్రవేశసమయంబునం బంచజనునిపాపప్ర
పంచంబు బహిరంచలంబునన నశియించు. కాశిం బెద్దకా
లంబుండి దైవయోగంబునం బరస్థలంబున కరిగి మృతుం
డైన మనుజునకుఁ గాశీమరణఫలంబు సంభవించు అవి
ముక్తక్షేత్రవాసంబు కర్మనిర్మూలనక్షమంబు. మణికర్ణికం
గృతాభిషేకుం డై తిలవ్రీహియవంబులఁ బిత్రాదితర్పణం
బొనర్చిననరుండు సర్వయజ్ఞఫలంబునం బ్రాపించు. మణి
కర్ణికాస్నానానంతరంబున మౌనంబున జితేంద్రియుం డై
విశ్వేశ్వర శ్రీమన్మహాదేవుని దర్శించు నెవ్వండు వాఁడు
సర్వవ్రతంబులం జేకొను. స్నానదేవార్చనాజపాదులమూ
త్రవిసర్జనసమయంబులదంతధావనహోమకాలంబుల వాచం
యముండై విశ్వేశ్వరు నర్చించిననరుం డేకవాసరంబునన
యావజ్జీవశివార్చనాఫలమునొందు. విశ్వేశ్వరప్రీణనార్థంబు
కాశియందు నిధనము నొందినవాఁ డెవ్వఁడైన గైవల్యధన

లాభంబు లంగీకరించు నిష్ప్రత్యూహం బైనయోగంబున నానాజన్మోపార్జితం బైనఫలంబు కాశియందుఁ దనుత్యాగంబు చేసిననరునకు సిద్ధించు. కాయంబు సాపాయం బనియును, బ్రసూతిమరణక్లేశంబులు దుస్సహంబులనియును, వితర్కించి నరుఁడాయురవసానపర్యంతంబుఁగాశినయుండునది.

శా. అర్ణోరాశిపరీతభూభువనమధ్యస్వర్గఖండంబు సం
పూర్ణైశ్వర్యసమృద్ధి కాశిఁ గృతపాపుం డైనఁదత్పట్టణాభ్య
ర్ణక్షోణులనైదుక్రోశములఁ బ్రాణాంతంబునన్ మర్త్యుఁడా, క
ర్ణింపండుకృతాంతవాహమహిషగ్రైవేయఘంటాధ్వనుల్.

వ. అని శంభుండు విశ్వంభరు నిరీక్షించి యింకొక్కవిశేషం బాకర్ణింపుము. భగీరథుం డనురాజన్యుండు కపిలముని ప్రదీప్తకోపానలదగ్ధు లగుసాగరుల నిరయంబువలన నుద్ధరించుటకై తపోవిశేషంబున మందాకినిం గొనితేర నమ్మహానది యిమ్మణికర్ణికమీఁదం బ్రవహింప నదిమొదలు నాసత్తీర్థంబు సురాసురులకు వర్ణింప నశక్యం బై విలసిల్లుచుండు. 28

సీ. భాగీరథీస్నానపరతఁ బోలంగ లే
దామ్నాయశాస్త్రాగమాధ్యయనము
వాలాయమును మనోవాక్కాయదురితాళి
విదళించు గంగాభివీక్షణంబు
శ్రీకంఠుకృప లేక సిద్ధింపనేరదు
త్రిదశగంగానదీతీరవసతి
బ్రహ్మవిజ్ఞానసంపత్ప్రాప్తిహేతువు
జహ్నుకన్యాసింధుసలిలసేవ

తే. కలియుగంబునఁ గలుషచిత్తులకు శరుల
శన్యవిత్తాపహా ద్రల కవిమతులకు

నాత్మయందుఁ బ్రాయశ్చిత్త మాచరింపఁ
గాంక్ష గలయప్డు నరునకు గంగ దిక్కు. 29

తే. ఆదియుగమునఁ దీర్థంబు లఖిలములును
త్రేత ద్వాపరమునయందుఁ దిష్యమునకుఁ
బుష్కరంబుఁ గురుక్షేత్రమును సుపర్వ
నిమ్నగయుఁ దీర్థములు బ్రహ్మనిర్మితములు. 30

తే. కృతయుగంబున ధ్యానంబు కేవలంబు
తపము త్రేతాయుగంబున ద్వాపరమున
నధ్వరంబులు గలివేళయందు గంగ
జనుల కిష్టార్థసంసిద్ధిసాధనములు. 31

శా. స్వారాజావరజాత! సార మగు ప్రాగ్జన్మాంతరాభ్యాససం
స్కారంబు న్మదనుగ్రహంబు వెలిగా స్నానంబు సిద్ధించునే!
వారాణస్యుపకంఠదేశవిలుఠద్వార్వేణివీచీఘటా
ధీరధ్వానపరంపరాకలకలోద్విగ్నాఘ భాగీరథిన్. 32

క. ఆకంఠకరటిదుంఠి
శ్రీకంఠజగండమదమషీచంద్రకితా
నేక ప్రవాహజాహ్నవి
వైకుంఠా! యెట్టిపాటివారికిఁ గలుగున్?. 33

క. గంగానది గంగానది
గంగానది యనుచు జేపకడ మేల్కనుచో
గంగఁ గొనియాడు నెవ్వఁడు
భంగించు నతండు ఘోరపాతకచయముల్. 34

ఉ. పాయునలక్ష్మి వాయునశుభంబులు వాయును దుర్నిమిత్తముల్
వాయునకీర్తి వాయుఁ బతిబంధము వాయు మహాఘసంఘము

ల్డాయుశుభంబు డాయుఁ గుశలంబులు డాయు మనోరథార్థ
ముల్, పాయక కాశికట్టెదురఁ బాఱువియన్నదిఁ దీర్థ మా
[డినన్.

క. ఏలా యుపవాసవ్రత ?
మేలా యష్టాంగయోగ ? మేలా యజ్ఞం ?
బేలా తపంబు ? గంగా
కూలంకషఁ దీర్థ మాడఁ గలిగిన యేనిన్. 36

క. శ్రద్ధాపురస్సరంబుగ
సిద్ధస్రోతోవహాంబుసిష్ణాసాసు
బద్ధహృదయు లగువారికి
సిద్ధించును మోక్షలక్ష్మి చేరువన హరీ!. 37

ఉ. వానికులంబునుం గులమె? వానితపంబులునుం దపంబులే?
వానికృతంబునుంగృతమె? వానిశ్రుతంబు శ్రుతంబె? కృష్ణ! యె
వ్వానిమనంబు పక్వమయి వ్రాలకయుండును విశ్వనాయకా
స్థానమహాశ్మశానదివిషత్తటినీముఖతీర్థసేవకున్. 38

క. విస్మయ మేల? మరున్నది
యస్మత్తేజోఽగ్నిగర్భ యటు గాకున్నన్
భస్మము సేయునె? కైటభ
ఘస్మర! నిమిషమున సకలకలికలుషములన్. 39

చ. నడచుచుఁగూరుచుండుచును నవ్వుచునిల్చుచుఁబారియాడు
చున్, గుడుచుచుఁబవ్వళించుచునుగూర్కుచు మేల్కనుచున్
రమించుచున్, బడుచును లేచుచున్నరుఁడు భావమునం దవి
ముక్తసీమసం, గడిఁ బ్రవహించు శ్రీగగనగంగఁ దలంచి త్య
జించుఁ బాపముల్. 40

క. జిహ్మగవిరోధివాహన!
జిహ్మమతుల్ దెలియువారె ? చిరకాలమునన్

బ్రహ్మాండమునడుమఁ బర
బ్రహ్మమయపయఃప్రపూరభరసురతటినిన్. 41

క. అంగీకరించు మనుజుఁడు
సాంగోపాంగాధ్వరక్రియాఫలము వియ
ద్గంగాపులినంబున శివ
లింగార్చన మాచరించి లెస్సగ శౌరీ!. 42

ఉ. రోదన మాచరించు వగఁ గ్రోధమనోభవకామలోభమో
హాదులఁ గూడి తీరములయం దఘముల్ దలఁబట్టు పట్టినేఁ
డాదిగ దీనఁ బాయఁ బడెనా! మన కంచును గాశికాసమ
ర్యాదమునన్వియత్తటినినాడఁగమర్త్యుఁడుగట్టుడిగ్గుచోన్.

తే. గంగ కరుగంగఁ దలఁప విఘ్నములు సేయుఁ
ప్రేతరక్షఃపిశాచికాభూతతతులు
గంగ డాసినపిదప విఘ్నములు సేయ
వాసవుఁడు లేఁడు నరునకు వానితరమె? 44

మ. అనుషంగంబున నొండె నొండెను విహారాపేక్ష నొండేని
ఘర్మనిరాసంబున నొండెఁ దీవ్రభయసంత్రాసార్థమొండేని
నన్యనియోగంబున నెవ్వఁడే మునుఁగు గంగాంభఃప్రవా
హంబునన్, జనుఁ డాతండును బుండరీకనయనా! శాసించుఁ
బాపౌఘముల్. 45

తే. ఇచ్చ లేకుండినను నగ్ని యెట్లు గాల్చుఁ
దన్ను నంటినవారి నద్దాహశక్తి
నిచ్చ లేక క్రుంకినను దహించు నట్లు
తైర్థికునిఁ బొంది యున్న పాతకము గంగ. 46

క. కంసాంతక! నరుఁ డంతకు
సంసారక్లేశముల విషాదము నొందఁ

సంసేవించుం గాశ్యప
తంసాభరణంబు గంగ దా నెపుడేనిన్. 47

చ. తెరలక కాశికానగరి దేవతరంగిణిఁ దీర్ఘ మాటకై
యరుగుచు నెవ్వఁడేని మృతుఁడౌ భవితవ్యత కారణంబుగాఁ
దెరువున నామనుష్యుఁడును దీర్ఘఫలంబఖిలంబుఁగాంచియం
బురుహాదళాక్ష! పాపములఁ బోకడవెట్టుఁబురార్జితంబులన్.

సీ. అరుణాంశుమండలం బంధకారముఁ బోలె
దంభోళి వసుమతీధ్రములఁ బోలె
ఖగసార్వభౌముండు కాద్రవేయులఁ బోలెఁ
గంఠీరవము గంధకరులఁ బోలె
దివ్యౌషధంబు వ్యాధినికాయములఁ బోలె
మండువేసవి నిండుమడుపుఁ బోలె
ఝంఝాసమీరంబు జలధరంబులఁ బోలె
మానదంభంబు ధర్మంబుఁ బోలె

తే. భక్తి సేవించువారిపాపము లడంచు
దురితతరుషండశతఖండపరశుధార
మదనవైరిజటాటవీమల్లికలిక
యభ్రరోధిపయోభంగ యమరగంగ. 49

క. యావజ్జీవము గంగా
ప్లావం బొనరించునరుఁడు పంకజనయనా!
జీవన్ముక్తుఁడు త్రిజగ
త్పావనుఁ డని చెప్పుదురు తపస్విప్రవరుల్. 50

తే. వలదు తిథివారనక్షత్రవర్గణంబు
తీరసంవాసజనులకు వారిజాక్ష!

సంచితము లైననిఖిలదోషములు వాయు
నాకవాహిని నేకాభిషేకమునను. 51

సీ. వలుదచన్నులమీఁదిపలుపచ్చిగందంబు
కష్మతావులు దిఙ్ముఖములఁ బొడువ
శశికాంతమణిశిలాశకలపాండుర మైన
మెయిచాయ చంద్రికామృతముఁ గురియ
జలదేవతాహస్తచామరానిలములు
కుటిలాలకములకు గొండ్లి గఱప
ధవళాతపత్రముక్తాదామకంబులు
గురుసువర్ణకిరీటకోటి మెఱయఁ

తే. బూర్ణకుంభంబుతో సితాంబుజముతోడ
దరముతోడ నభీతితోఁ గరము లలర
నదనదీపల్వాలంబులు గదిసి కొల్వఁ
గాశిఁ జేరోలగం బుండు గగనగంగ. 52

క. మండూకమకరకచ్ఛప
గండూపదఝలికులీరకలహంసకకా
రండవబకముల వెండిఁ బ
సిండిని గావించి గంగఁ జిదుముదురు ప్రతుల్. 53

వ. అని యిందుధరుండు ముకుందున కానతి యిచ్చె. గంగయు
నీశ్వరోక్తప్రకారంబునన యరుగుదెంచి కాశీస్థానంబున
కపూర్వాలంకరణం బయ్యె. ఇంకఁ గుంభినీధరపుత్రిక నద్దే
వుండానతిచ్చినప్రకారంబునం గాశీమాహాత్మ్యంబుఁ జెప్పెద.
కుంభసంభవ! అవధానపరుండ వై యాకర్ణింపుము. 54

తే. పరిహసించును వేదాంతభాగ మన్న
నుడునిధ [illegible]త్తన్న పిసుల [illegible]

గంటగించును సాంఖ్యయోగంబు లన్నఁ
గాశి నున్న నరుండు మోక్షమునఁ దనిసి. 55

క. దేహత్యాగము దానము
దేహనిపాతంబు దపము ధృతిఁ బరికింపన్
దేహవియోగమ యోగం
బాహా! కాశీపురీకృతావాసులకున్. 56

తే. విశ్వనాథుండు దేహాళి విఘ్నరాజు
గవనిమొగసాల నధికారి గా నొనర్చెఁ
గాశిఁ జొరనీఁడు తనముద్రగానియట్టి
ముక్తినిధి నెవ్వఁ డొడుచునో మోస మనుచు. 57

క. వరణ నసి రెండుదిక్కులఁ
దరుణేందుధరుండు నిలిపెఁ దలవరులం గాఁ
బరు లెవ్వరిఁ దా రెఱుఁగక
చొరనీకుం డనుచు ముక్తిచోరవిశంకన్. 58

వ. ఈశ్వరాదేశంబునంగాని కాశీనగరం బెవ్వరికిం జొరరాదు. ఈయర్థంబు దేటపడ నొక్కయితిహాసంబు గలదు. ఆకర్ణింపుము. దక్షిణాబ్ధితటంబున సేతుబంధసమీపంబున నొక్కగ్రామంబున ధనంజయుం డన నొక్కవైశ్యోత్తముండు గలండు. అతండు మాతృభక్తుండు. తల్లి జరాభారంబునం బెద్దకాలంబునకుఁ గాలధర్మంబు నొందిన. 59

తే. గాసిపడి గంగ నస్థులు గలపకున్నఁ
దల్లిబుణ మెట్లు వాయుఁ బుత్త్రకున కనుచుఁ
గదలెఁ గోమటి యానందకాననమున
కంబకీకసశకలసంహతులు పూని. 60

సీ. పంచగవ్యమున నాప్లవనంబు గావించి
పంచామృతమున నభ్యంగ మార్చి
యక్షకర్దమమున ననులేప మొనరించి
పుష్పమాల్యంబులఁ బూజ సేసి
పట్టువస్త్రంబునఁ బరివేష్టన మొనర్చి
యామూటఁ ది త్తిలో నదిమి తుఱిమి
పుడవిగాఁ గంబళంబున దృఢంబుగఁ గట్టి
ముద్దగా మన్నద్ది ముద్ర వెట్టి
తే. జతనముగ రాగిపెట్టెలో సంగ్రహించి
యలుతఁ దాళంబు నునిచి చిక్కలవరించి
యంబయస్థుల కుపచార మాచరించె
నొడలికిని బోలె గురుభక్తుఁ డూరుభవుఁడు. 61

వ. ఆయస్థిపేటికయు లోహాండియుఁ దండులంబులుఁ గంబళం
బులుం దగినసంబడంబును వహించి యొక్కరుండునుం దెరు
వుతోడునం బెక్కుదేశంబులు గడచి హవిష్యాశనుండును,
స్థండిలశయనుండును నైపథశ్రాంతి నభిఘాతజ్వరంబు సోఁకిన
లెక్కసేయక తఱిమి నడచిమార్గమధ్యంబున నొక్కవేఁట
పల్లె నొక్కయాటవికునికిఁ భృతియిచ్చిమూటమోపించు
కొని యెట్టకేలకుం గాశీపట్టణంబు చేరి. 62

క. ఆనందవనమునం దొక
వానెవణిజునింట నుండి వైశ్యుండు పదా
ర్థానయనార్థము పోయెం
దా నొక్కఁడు హట్టమునకుఁ దదవసరమునన్. 63

వ. మూటలోఁ దామ్రసంపుటకంబున ధనం బున్నయది యని చెంచు వంచనాపరుం డై బొక్కసం బెత్తుకొని తప్పు తెరువు నం గాఁ దన పల్లెకుం బోయె. ఇటఁ గోమటియును. 64

ఉ. అంగడినుండి బియ్యము పదార్థములుం గొని వచ్చి దప్పిమై
నంగము దూల నుస్సనుచు నల్లన కోమటిసెట్టి మందిర
ప్రాంగణసీమం వేదిపయిఁ బందిరినీడను విశ్రమించి పి
ల్పెంగటముం బ్రసేవమును జెచ్చెరఁ దెమ్మనిబంటుల్లేచ్చునిన్.

క. పిలిచి ప్రతివచన మొదవమిఁ
గళవళమున నిల్లు సొచ్చి కాననచరు న
న్నెలవునఁ గానక వైశ్యుఁడు
నలుమూలలు వెదకి నెమ్మనము దలఁకొందన్. 66

తే. అస్థిగర్భితతామ్రపేట్యన్వితమగు
బొక్కసం బెత్తికొని పోయె బోయ యనుచు
జననిఁ దలఁచి ప్రయాసంబు సంస్మరించి
మోసఁ దర్కించి యవ్వైశ్యముఖ్యుఁ డేడ్చె. 67

సీ. మధ్యాహ్నకాలంబు మందాకినీవారి
నభిషేక మొనరింప నబ్బ దయ్యె
శివుని విశ్వేశ్వర శ్రీమన్మహాదేవు
మదనారి వీక్షింప నోదవ దయ్యె
దండపాణిని డుంఠి దక్షిణామూర్తిని
గాలభైరవుఁ గొల్వఁ గలుగఁ దయ్యె
శ్రీవిశాలాక్షికిఁ జేదోయి మొగిడించి
శిరసుపైఁ గూర్పంగ దొరక దయ్యెఁ

తే. గోమటికిఁ దల్లియస్థులకొక మూట
పాపకర్ముండు చెం చర్థభార మనుచు

పంచనాపాటవంబునఁ గొంచుఁ బోయి
యారివేరంబు చేసిన కారణమున. 69

శా. జాలింబొందియుదప్పిఁజెందియుబుభుక్షావేదనంగుందియుఁ
వ్యాళాభీలకరాళతీవ్రతరమధ్యాహ్నార్కరోచిశ్ఛటా
జాలం గందియునుం గిరాటుఁడరిగెన్ సంరంభశుంభద్గతిన్
వైలక్ష్యంబునఁ జెంచువెంట జననీవాత్సల్యనిఘ్నాత్మతన్.

వ. అంతక మున్న యొక్కకాంతారంబున నమ్మూట విడిచి యాయాటవికుండు పెట్టెఁ దెఱచి యస్థిశకలంబులు చూచి తనవృథావస్థకుఁ జిన్నఁబోయి యవి యచ్చోటన పారం జల్లి తన పల్లెకుం బోయి మఱుఁగుపడి యుండె. ధనంజయుం డును నప్పక్కణంబున కేతెంచి. 70

తే. చెంచునింటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము
చెప్పి నమ్మించి తలమీఁదఁ జెయ్యి వెట్టి
వెఱకు మని తన్ముఖంబున నెఱుకుతేనిఁ
గాంచి యాతనితోడ సఖ్యంబు చేసి. 71

వ. అతఁడుం దానునుం గూడి యయ్యస్థిశకలంబులు పారం జల్లిన కాంతారప్రదేశంబున కేతెంచి రప్పుడు. 72

తే. ఎమ్ముకలు చల్లినట్టిచో టెఱుఁగఁ డయ్యె
దైవవశమున నాభిల్లతస్కరుండు
దిగ్భ్రమం బెత్తి యందంద తిరుగుచుండెఁ
గానలోపల నచ్చోటుఁ గానలేక. 73

క. వచ్చినచోటికి వచ్చుం
జొచ్చినకాననమ చొచ్చుఁ జోరపులిందుం
డెచ్చో నస్థులు గానక
యచ్చెరుపడె దైవమతము లవి యల్పములే? 74

వ. అయ్యాటవికుం దప్ప నడచుకొని కిరాటుండు బహుళ
క్షుత్పిపాసాపరవశుం డయి హాహాకారంబు సేయుచుం
గ్రమ్మఱం గాశీపురంబున కరిగి తన మందభాగ్యత్వంబు
ప్రకటించుచు మందాకినీస్నానంబుచేసి మఱలి నిజస్థానంబు
నకుం బోయెం గావున. 75

తే అనఘచారిత్ర! విశ్వేశ్వరాజ్ఞ గాని
రాదు వారాణసీనగరంబుఁ జొరఁగ
బలిమిఁ జొచ్చిన యేని నప్పంచజనుఁడు
పడనిపాటులఁ బడు విఘ్నపంక్తిచేత. 76

వ. అనుటయు. 77

తే. కార్తికేయ! కృపాబుద్ధి గలిగె నేని
శ్రవణయోగ్యుండ నేనును నపుడు నేని
నాన తీఁ దగు నానందకాననమునఁ
బ్రతివసించినక్రోధభైరవునిమహిమ. 78

వ. అనినం గుమారుండు మైత్రావరుణి కిట్లనియె. 79

కాలభైరవచరిత్రము.

క. వారాణసీకథాశ్రుతి
పారాయణుఁడైనపుణ్యాపరునకు నీకుఁ
నేరిచినభంగిఁ జెప్పెద
భైరవచరితంబు వినుము పరమమునీంద్రా!. 80

తే. హస్తములు రెంట నందంద యదిమి యదిమి
తాటిపం డారగించెడుచీటకముఁన
నత్యయంబున బ్రహ్మాండ మాస్వాదించు
భైరవుం డిచ్చుఁ గాత శోభనము మనకు. 81

మ. క్షయకాలంబున సింధుసాగరరసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యాకాలరాత్రీకర
ద్వయతాళానుగతిప్రకారమున నవ్వారి న్మహానృత్తముం
బ్రియమేపారఁగ నాడు భైరవుఁడు గల్పించున్మహైశ్వర్యముల్.
వ. అని తత్కథాకథనప్రవీణహృదయంబున నిట్లనియె. 83
క. హాటకవసుంధరాభృ
త్కూటస్థలియందుఁ దొల్లిఁ గొలువుండె నిరా
ఘాటవిభవాభిజృంభిత
హాటకగర్భుండు జగము లన్నియుఁ గొలువన్. 84
వ. అయ్యవసరంబునఁ దత్సభాసదు లగుమునీంద్రులప్పరమేష్ఠి
కిం బ్రణమిల్లి యిట్లనిరి. 85
తే. వరద! వాగ్వధూవల్లభ! వనజగర్భ!
యడుగఁ గల దొక్కసంశయితార్థ మిప్పు
డవ్యయం బగుతత్త్వ మెయ్యదియొ తెలియ
నంతవట్టును నీవు మా కానతిమ్ము. 86
వ. అనిన విని భారతీశ్వరుండు శ్రీమహాదేవమాయామోహ
వశంబునం బరమాత్మవివేకంబు లేక వారిం జూచి జగద్యోని
యగు నే నొక్కరుండన యీశ్వరుండ. నాకధీశ్వరుండు
లేఁడు. మీరివ్విధంబుఁ దెలిసి యవ్యయతత్త్వంబు నన్నకా
భావింపుఁ డనియె. అయ్యహంకారంబు సహింపక తత్సమీ
పంబున నున్న విశ్వంభరాంశసంభవుం డగు క్రతుపురుషుండు
కుటిలభ్రూకుటిదుర్నిరీక్ష్యుండుం గ్రోధతామ్రాక్షుండు
నగుచు నతని కిట్లనియె. 87
క. పరతత్త్వ మెఱుఁగ కూరక
పరమర్షులతోడ నేన పరముఁడ నను చున్

సుర లెల్లఁ గాకు చేయఁగ
దురహంకృతిఁ బలుకఁ దగునె? తోయజగర్భా!. 88

వ. విను మేను సాక్షాన్నారాయణుండను, యజ్ఞపురుషుండ,
జగత్ప్రభుండ. నవ్యయతత్త్వశబ్దవాచ్యత్వంబునాయంద
సంప్రతిష్ఠితంబు. నీవిట వలనిపెద్దఱికంబున నడచి పడ
కుండు మనియె. ఇట్లిద్దఱుఁ బరస్పరజయార్థు లగుచు వా
దడచి యడచి తమతారతమ్యం బామ్నాయంబుల నడిగి
రప్పుడు ఋగ్వేదం బి ట్లనియె. 89

సీ. సవరించు నెవ్వఁడు జఠరగోళంబునఁ
బొడ వడంగక యుండ భూతగణము
నెరయించు నెవ్వఁడు నిజసనాతనమాయ
సకలప్రపంచంబు సంతతముగ
నివసించు నెవ్వండు వివిధోపనిషదర్థ
హర్మ్యాగ్రములయందు నహరహంబు
చరియించు నెవ్వఁడు శాశ్వతమంగళ
ప్రోద్దంతురార్భటి నొక్కరుండు

తే. నహహా! యయ్యాదిదేవుఁ డనామయుండు
రుద్రుఁ డవిచింత్యుఁ డాద్యుఁ డరూపుఁ డుండ
నవ్యయం బగుతత్త్వ మే నన వశంబె
యన్యునకు నెట్టివానికి? ననఘులార!. 90

వ. అనవుడు యజుర్వేదం బి ట్లనియె. 91

సీ. సకలాధ్వరక్రియాసంచయంబులఁ జేసి
యిజ్యమానుం డగు చెవ్వఁ డలరు
నధ్యాత్మవిద్యారహస్యమార్గంబునఁ
దక్క నెవ్వఁడు గానఁ దరము గాఁడు

మాయందుఁ గరము ప్రామాణ్యవిశేషంబు
లెడపకుండఁగఁ జేయు నెవ్వఁ డెపుడు
ప్రకటమహాటస్థస్వభావత నఖిలంబుఁ
గదల కెవ్వఁడు సమీక్షణ మొనర్చు
తే. నట్టిశివుఁ డొక్కరుండు గా కర్హుఁ డగునె
యవ్యయపుఁదత్త్వ మనుసమాహ్వాయము దాల్ప?
నితరుఁ డెంతటివాఁ డగు? నేతదర్థ
మాత్మ సంశయింపకుఁడు ధర్మాత్ములార!. 92
వ. అనిన సామవేదం బిట్లనియె. 93
సీ. విశ్వంబు నెవ్వనివిపులక్రియాశక్తిఁ
దిరుగుచున్నది తీఁగతెంపు గాఁగఁ
జింతింతు రెవ్వనిఁ జిత్ప్రకాశాత్మకుఁ
బరమార్థవిదులు తాత్పర్య మొప్ప
రవిసుధాకరశిఖిగ్రహముఖ్యముల కెల్ల
భాసకం బెవ్వనిభవ్యతేజ
మితరదుర్ధర మగునీశ్వరశబ్దంబు
వలచి యెవ్వనిఁ బాయ దలఘులీల
తే. నతఁడు మరణోద్భవవ్యవహారదూరుఁ
డజుఁడు ఫాలాక్షుఁ డిందురేఖావతంసుఁ
డవ్యయపుఁదత్త్వ మగుఁ గాక యల్పు లొరుల
కమ్మహత్త్వంబు గలుగునే? యనఘులార!. 94
వ. అనిన నథర్వవేదం బిట్లనియె. 95
సీ. ఎవ్వఁడు తవణిల్లు నెల్లజీవులయందుఁ
బూసలలో నున్నదొండు వోలె

నెవ్వనిఁ బొడగంద్రు హృత్పద్మ నీథుల
భక్త్యనుగ్రహమున భవ్యజనము
లెవ్వఁడు వికసిల్లు నింతయుఁ దా నయ్యు
నేమియుఁ దాఁ గాక యేకహేళి
నెవ్వనిసద్భావ 'మిదమిత్థ' మని చెప్పఁ
జాలవు నేడును శాస్త్రఫణితు
తే. లతులకైవల్యమంగళాయతన మభవుఁ
డప్రతర్క్యుండు శంకరుఁ డప్రమేయుఁ
డతఁడ యవ్యయం బగుతత్త్వ మనఁ దనర్చు
మఱువుఁ డొండుతలంపులు మహితులార!. 96

వ. అని యిట్లు చతుశ్శ్రుతు లుపన్యసించిన విని విరించిమఘ
పురుషు లాహా! పరేతనిలయంబునఁ గాంతాపరవశుం డై
యుండుప్రమథనాథుం డెక్కడ? నవ్యయతత్త్వం బెక్కడ?
పరబ్రహ్మభావం బతని కెట్లు సమకూఱు. మాటలు పొసంగ
వనునవసరంబునఁ బ్రణవంబు మూర్తిమంతం బై వారి 97
కి ట్లనియె.

క. శితికంఠుఁ డలఘులీలా
ధృతవిగ్రహుఁ డట్లు గానఁ దెల్లం బాత్మ
వ్యతిరిక్త యగుసరోజా 98
యతలోచనతోడఁ గూడఁ డతఁ డెన్నండున్.

తే. అర్ధశశిభూషణుండు స్వయంప్రబుద్ధుఁ
డున్నతుండు నిత్యోర్జితజ్యోతి యతని
సంతతానందశక్తి యాసరసిజాక్షి 99
విశ్వజనయిత్రి వారికి వేఱు లేదు.

వ. అని యివ్విధంబున నెంత చెప్పిన విధాతృమఘమూర్తులం జుట్టుకొన్నయజ్ఞానతిమిరంబు దొలంగ దయ్యె. అప్పుడు దశదిశావకాశపరిపూర్ణం బగునొక్కయఖండదివ్యతేజంబు వారలనడుమ నుద్భవించె. అనంతరంబ తన్మధ్యంబునందు.

సీ. కటిభాగమున గందకరటి రాట్చర్మంబు
కపటంపుఁజిమ్మచీఁకట్ల నీన
వక్షస్థలంబునఁ జక్షుశ్శ్రవోభర్త
తారహారము రేవఁ దళుకుఁ జూపఁ
గేలుదామరయందు శూల ముద్భటనట
జ్జ్వాలనకీలముల వసంత మాడఁ
జూటకూటమునందు సొబగులేఁజందురుఁ
డకఠోరసారచంద్రికలు గాయఁ

తే గుటిలనిర్ఘాతఘర్ఘరఘోరఘోష
సరణి డమరుధ్వాన్నాదంబు పరిఢవిల్లఁ
బురనిశాటవిపాటనస్ఫుటవిహార
ధూర్ధరుం డగుహరుఁడు ప్రాదుర్భవించె. 101

వ. ఇట్లావిర్భవించినయవ్విరూపాక్షునిరీక్షించియు విరించిదుర హంకారం బుడుపనేరక పంచమవదనంబున నిట్లనియె. 102

తే. డమరుధర! నీవు నాలలాటస్థలమునఁ
దొల్లి జనియించి తిది తేటతెల్లగాఁగ
రోదనము హేతువుగ నీకు రుద్రనామ
మపుడు ఘటియించినాఁడ నే నలఘుమహిమ. 103

వ. అట్లుగావున నీవు నాకుఁ బుత్త్రుండవు, నన్ను శరణంబు చొచ్చి నావలనం బరిరక్షణంబు ... పుత్త్రకుఁడనుచు దురాలాపంబులు

పలికె. భర్గుండును నఖండం బగుతదీయగర్వంబు సహింపక
నితాంతరోషసంరంభంబున విజృంభించిన. 104

సీ. ఢమఢమార్భటిసముడ్డమరుఢక్కాధ్వని
పదిదిక్కులందును భ్రమరి పార
గళమూలనిర్గళత్కాలకూటచ్ఛవి
యర్కబింబంబు మాయంబు సేయ
ఫాలదృగ్భవసముద్భటశిఖాజాలంబు
లుదధుల నన్నింటి నుడుకఁ బెట్టఁ
గుటిలపాటలజటాంకురకుట్టనంబులు
జగదండసీమ బెజ్జములు వుచ్చ
తే. సంభవము నొందె హరునవష్టంభరభస
శుంభదవగాఢరోషవిస్ఫురణవలన
విశ్వసంహారసన్నాహవిషమసుషమ
పరుషదుర్నిర్భరవుం డగుభైరవుండు. 105

వ. ఇట్లుద్భవించి యుద్భటప్రతాపదుర్నిరీక్ష్యుం డగుచు నాత్మ
ణాంబ విరూపాక్షునాజ్ఞాపనంబునం బద్మగర్భునిం గదిసి. 106

ఆ. గంధకరటి నూత్నకమలంబుఁ బోలెన
బ్బురుషుఁ డలసలీల బాటకరింపఁ
ద్రుంచె నవ్విరించిపంచమవదనంబుఁ
బ్రఖరదీర్ఘహస్తనఖరధార. 107

తే. ద్రోహి యేయంగ మట్టిద రూ పడంపఁ
దగవు గావున దూషకత్వంబుఁ దెలిసి
తునిమెఁ బరమేష్ఠిపంచమాననమ యేర్చి
భైరవుం డింత యొప్పైనపాడి గలదె? 108

వ. అట్టియెడ నారాయణాంశజుం డైనక్రతుమూర్తి శైవంబు లైనస్తోత్రంబులు పఠించె. హిరణ్యగర్భుండును నహంకార ముడిగిభీతివశంబునశతరుద్రీయంబుజపియించె.అంతశరణాగతవత్సలుం డగునయ్యీశ్వరుండు వారి నిద్దఱిం గరుణా విలోకనంబుల మన్నించి నిజరూపాంతరం బైనభైరవదేవుఁ జూచి యీయధ్వరపురుషవిధాతలు నీకు మాననీయులు. వీరలయెడ నింకఁ గోపాటోపంబులు చాలు. నీవు వైధసం బైనకపాలంబు దాల్చి లోకాచారప్రకటనార్థంబు భిక్షాశనంబు గొనుచుఁ గాపాలికవ్రతంబుతోడ లోకంబులం జరియింపు మని చెప్పి యనంతరంబ. 109

సీ. మోకాళ్లు దిగకుండ ముడిచి కట్టినధాతు
శాటంబు గలకటిస్థలముతోడ
దట్టంబు గాఁగఁ జందనపంక మలఁదిన
యరుణంపువికటదేహంబుతోడఁ
బిల్లికన్నులఁ బోలు పింగళాక్షములందుఁ
గ్రూరంబు లగుమిడిగ్రుడ్లతోడఁ
బొదఁ గట్టువడుజపాపుష్పంబు చెరివిన
చికిచికిపల్లవెండ్రుకలతోడఁ
తే. గఠినదంష్ట్రికాభీలవక్త్రంబుతోడ
జిహ్మనటనత్వరోల్లలజ్జిహ్వతోడఁ
గత్తితోఁ †బట్టితో మహోగ్రత్వ మొంద
ఫాలనేత్రుఁడు సృజియించె బ్రహ్మహత్య. 110

వ. ఇట్లు సృజియించి దానిం జూచి కాశికానగరంబుదక్క నితర

† అన్నిమాతృకలందు 'పట్టి' యనియే యున్నది. 'కర్త్రీ కర్పరహస్తా' ఆని సంస్కృతమూలము. పట్టిశబ్దము కర్పరవాచక మగుట విచార్యము.

స్థలంబు లెవ్వియు నీకు దుష్ప్రవేశంబులు గావు. నీవితనిపజ్జ వర్తిల్లు మనుచుఁ బుండరీకభవశిరఃఖండనుం డైనభైరవుం జూపి యంతకాంతకుం డంతర్ధానంబు నేసె. అతండును నీశ్వరోక్తప్రకారంబున సకలజగమ్ములుగ్రుమ్మరుచు నొక్కనాఁడు వైకుంఠపురంబు చొచ్చి వైకుంఠనికేతనంబున కేగిన. 111

సీ. పదపల్లవంబునఁ బ్రకటిల్లుచదలేలు
  కడ లెత్తి ధాత్రి వెల్వాడిచి పాఱఁ
గటియందు రంజిల్లు కనకశాటి చెఱంగు
  గెళవుల రేయెండతళుకు లీనఁ
బొక్కిటినెత్తమ్మిపూవున ముసరెడు
  నలులు ఝు మ్మనుచు సంకులతఁ దిరుగఁ
దులసీపలాశమంజులదామకంబులు
  కౌస్తుభపదకంబు గ్రందుపఱుప
తే. సంభ్రమము విస్మయంబును సమ్మదంబు
  భక్తియును భావవీథిలోఁ బరిఢవిల్ల
  నిందిరయుఁ దానుఁ బద్మాక్షుఁ డెదురు వచ్చె 112
  భర్గమూర్తికి నయ్యాదిభైరవునకు. 113
వ. ఇట్లు వచ్చి యాలక్ష్మీశ్వరుం డగ్రభాగంబున.
మ. కనియెం గుండలిరాజకుండలు మహాకాళుఁ లలాటస్థలీ
  జనితానల్పకృపీటసంభవపటుజ్వాలాకరాళాత్ముఁ బా
  వనునిర్బ్రహ్మకపాలహస్తుని జటావ్యాఘాకనప్రౌఢది 114
  వ్యనదీవార్లహరీపరస్పరహతివ్యగ్రారవుఁ భైరవున్.
వ. కని జయజయశబ్దముఖరుం డగుచుం గదిసి ప్రణమిల్లి యం
  జలిపుటంబు నిటలంబునం గదియించి తత్ప్రభావవర్ణనా 115
  కుతూహలంబున నిందిరాదేవి కి ట్లనియె.

సీ. జలజాక్షి ! యితఁడు వో సకలయోగీంద్రులు
భావవీథులఁ గాంచుపరమతత్త్వ
మలివేణి! యితఁడు వో యఖిలభూతములకు
నాధార మగుచు నింపారు వేల్పు
కలకంఠి ! యితఁడు వో విలయకాలమునందు
నుడివోని శుభమూర్తి నుండు పెద్ద
లలితాంగి! యితఁడు వో యలఘు తేజంబున
విశ్వంబు వెలిఁగించు విశ్వనాథుఁ
తే. డబ్ధిసంభవ ! యితఁడు వో హాలహాలపు
విషము పుక్కిటఁ దాల్చినవెంగలీఁడు
పాటలీగంధి! యితఁడు వో భక్తతతికి
శాశ్వతానందకరుఁ డగునీశ్వరుండు. 116

క. మన మెట్టిభాగ్య మొనరిం
చినవార మొ నేఁడు పూర్ణ శీతాంశునిభా
నన! యట్లు గాక శంభుఁడు
విన నచ్చెరు విచటి కిట్లు విజయం చేసెన్. 117

వ. అని పలికి యప్పరమేశ్వరుండు వెండియు ననేకప్రకారం బులం బ్రస్తుతించి యతనివలనఁ దదీయభిక్షాటనవృత్తాంతం బంతయు నెఱింగి యాశ్చర్యహృదయుం డగుచుఁ బద్మ మందిరకు సంజ్ఞ సేసిన నాజగన్మాతయు నంతఃపురంబునకుం జని యనంతరంబ. 118

సీ. అడుగుఁదమ్ములయందు నడరుచున్న నిడాలు
కపటసంధ్యార్భటిఁ గ్రమ్మఱింపఁ
గాంచీమతల్లి కాకలకలారవములు
ఋష కేతునట్టహాసముల నవ్వఁ

గుచకుంభయుగళి ప్రేఁగునఁ దొట్రుపడి వేద
కౌఁదీఁగ జవజవఁ గంప మొందఁ
గ్రుయి వెల్లి జాఱినక్రొమ్ముడిలోపలి
విరులు తుమ్మెదలకు విందు వెట్ట
తే. సహజసంభ్రమతాత్పర్యసమ్మదములఁ
దళుకు చూపంగ నవరత్నదర్విఁ గొనుచు
నిందిరాదేవి యేతెంచి యిందుధరుని
హస్తపాత్రిక నమృతభిక్షొన్న మిడియె. 119

వ. ఇట్లు మహాలక్ష్మీదేవిచేత మనోరథపతి యను పేరం బ్రసిద్ధి యగుభిక్షఁ గొని పద్మాక్షునందలిభయభక్తివిశ్వాసంబులకు మెచ్చి యతనికోరినవరంబు లొసంగి యెప్పటియట్ల బ్రహ్మహత్య తోడన యేగుదేర జగంబులఁజరియించుచు నొక్క నాఁడు. 120

సీ. జనని యేతీర్థంబు సకలదుఃఖావళి
హారణప్రభావవిస్ఫురణమునకు
గృహిణి యేతీర్థంబు మహితహాలాహల
గరళచ్ఛవిచ్ఛన్నకంధరునకు
నావాల మేతీర్థ మభిమతప్రదకళా
కరవిశాలాక్ష్యాఖ్యకల్పలతకు
నావాస మేతీర్థ మఖిలతీర్థాలభ్య
ముఖ్యసౌఖ్యావహామోక్షమునకు
తే. నట్టితీర్థంబునకు నెమ్మి నరుగుదెంచెఁ
గాశినగరికి నికటభాగప్రకీర్ణ
గగనగంగాతరంగిణీకనకకమల
పరిమళోద్గారిణికి మహాభైరవుండు. 121

వ. ఇ ట్లద్దేవుండు విశ్వేశ్వరనివాసంబు సొచ్చినంతన బహిర్భాగంబుననుండి హాహాకారంబున మొఱవెట్టుచు బ్రహ్మహత్య పాతాళంబునఁ బడియె. అతనిహస్తంబున నున్న కపాలంబు నునూడి ధాత్రీతలంబునం బడియె. అది మొదలుగా నవ్వటుకనాథుం డానందంబున నయ్యానందవనంబునంద వసియించె. కపాలలోచనతీర్థంబు తన్ను భజియించువారికిఁ బాపభంజనంబు సేయుచుఁ బుణ్యప్రదాయకం బయ్యె. ఇయ్యాఖ్యానంబుఁ బఠించినను విన్నను మహాపాతకంబు దొలంగు నని చెప్పి కుమారస్వామి వెండియు నగస్త్యున కి ట్లనియె. 122

సీ. అజుఁడు దా నధికుండ ననుచు గర్వించినఁ
గరనఖాగ్రమునఁ దచ్ఛిరముఁ ద్రుంచె
సాకార యగుబ్రహ్మహత్య తోఁ జనుదేర
సకలలోకంబులు సంచరించె
వైకుంఠమున రమావైకుంఠు లర్పింప
నమృతభిక్షాశనం బారగించెఁ
గాశికానగరోపకంఠదేశంబునఁ
బగుల వైచెఁ గరంబు బ్రహ్మపునుక
తే. యాధిపత్యంబు వడసెఁ గామారిచేతఁ
బుఱియ వైచినచోన కాఁపురము సేసెఁ
గాశికాస్థానమున కేడుగడయుఁ జూవె!
క్రోధభైరవదేవుండు కుంభజన్మ! 123

వ. దురితభక్షణంబునం బాపభక్షకుండును, గలుషమర్దనంబున నామర్దకుండును, గాలకలనంబునఁ గాలనాభుండును, వృజిన

భైరవుం డగుటభైరవుండును నై యద్దేవుండు భజించు
వారికి పాణ్మాసిద్ధికరుండు. 124

తే. కలశయోని! యవ్వీటికి బలుతలారి
పాపహృద్భైరవుఁడు క్రోధభైరవుండు
కాశికాపట్టణం బైదుక్రోశములును
నవహితుం డై యతండు చేటచ్చి కాచు. 125

వ. అనినఁ గుంభసంభవుండు హరికేశుం డనుయక్షుండు దేవ
దేవునకుం బ్రేమపాత్రం బై వారాణసీపట్టణంబునం బ్రమథ
పరివారంబునకు దండనాయకుం డై యుండు నని విందు.
అతనిచరిత్రంబు వినవలయు. ఆనతిమ్మనినం గుమారస్వామి
యి ట్లనియె. 126

హరికేశచరిత్రము.

సీ. యక్షుండు రత్నభద్రాభిధానుఁడు గంధ
మాదనంబున నుండు మహితకీర్తి
పూర్ణభద్రుండు తత్పుత్త్రుఁ డాతనిభార్య
కనకమండన గంధకరటియాన
యాలేమతనయుండు హరికేశుఁ డతఁడు శ్రీ
యానందకాననాభ్యంతరమునఁ
దప మాచరింప నాతనిశరీరము ముంచి
పుట్టె వల్మీకంబు పొదలు వొదలె
తే. నభవుఁ డుమతోడఁ గూడి లీలార్థ మచటి
కరుగుదెంచి ప్రసన్నుఁ డై వరము నొసఁగె
దండనాయకపదవి యాతండు కాశి
చక్రరక్షకుఁ డై యుండుఁ జనువు గలిగి. 127

సీ. భరియించు నాతండు పాణిపల్లవమున
వెండికట్టులతోడిదండయష్టి
వసియించు నాతండు వారాణసీపుర
ప్రాకారగోపురప్రాంతభూమి
ధరియించు నాతండు తప్తారకూటరు
క్పరిపాటలచ్ఛాయఁ బ్రబలుజటలు
సవరించు నాతండు సతతంబు రుద్రాక్ష
భూషావిభూతిత్రిపుండ్రకములు
తే. సౌమ్యరూపంబు వహియించు సజ్జనులకుఁ
బాపమతులకు వికృతరూపంబుఁ దాల్చుఁ
బింగళాక్షుండు దీర్ఘగంభీరమూర్తి
చండికాపతి ప్రమథుండు దండపాణి. 128

వ. అనిన నగస్త్యుండు మహాత్మా! జ్ఞానవాపికాతీర్థమాహా
త్మ్యంబు వినవలతుం జెప్పవే యనినం గార్తికేయుండు. 129

## జ్ఞానవాపికాతీర్థమాహాత్మ్యము.

సీ. పాదాభిహతి సప్తపాతాళములతోడ
నుర్వీకటాహ ముఱ్ఱూఁత లూఁగ
నిబిరీసతతజటానికురుంబకంబులు
చెదరి బ్రహ్మాండంబు చెంపవెట్ట
బాహార్గళాస్తంభపరివర్తనంబుల
దిక్చక్రవాళంబు ద్రెళ్లి పడఁగ
వితతనిశ్వాసమారుతఘట్టనంబునఁ
బృథ్వీధరంబులు పెల్లగిల్ల

తే. డమరుధ్వానాదముల సముద్రము గలంగ
నారభటివృత్తిఁ దాండవం బవధరించెఁ
బ్రళయవేళ మహాకాలభైరవుండు
కాళరాత్రి కుచంబులు గగురుపొడువ. 130

తే. అభవుఁ డిబ్భంగిఁ దాండవం బాడి డస్సి
డప్పి గొని యారగింపఁ గాండంబు వెదకి
కానఁ డయ్యేను సప్తలోకంబులందుఁ
దియ్యనై జిహ్వ కింపైన తేటనీరు. 131

తే. ప్రళయకాలంబునందును బసిమి చెడక
నిలిచినది కాశిపురము కా నిశ్చయించి
యరిగె నీశానుఁ డనుసమాహ్వయముఁ దాల్చి
ఘనపిపాసార్తి నంధకదనుజవైరి. 132

తే. కన్నవా రెవ్వరును లేరు కన్నె మెఱుఁగు
గర్జితం బనువచనంబు కథల నిలిచె
శశవిషాణప్రరోహంబు జలదవార్త 133
యంబు లెబ్భంగిఁ గలుగు నయ్యవసరమున. 134

వ. అప్పు డీశానుండు.

సీ. సంసారసస్యబీజముల కూషరభూమి
నిర్వాణలక్ష్మికి నిలువ నీడ
యల్ల నేరెడుదీవి కవతంసకుసుమంబు
కామధేనువు ముక్తికాములకును
విహరణస్థానంబు విశ్వనాయకునకుఁ
గల్యాణముల కాదికారణంబు
కట్టుఁగంబము డుంఠిగంధద్విపమునకుఁ
బ్రణవాక్షరము పరబ్రహ్మమునకు

తే. నెద్ది యక్కాశికాపురి కేగుదెంచెఁ
బసిఁడిలాతాపుఁగోలయుఁ బల్లజడలు
నసితగళమూలమును ద్రిశూలాయుధంబుఁ
జాల నొప్పంగఁ దపసివేషమున హరుఁడు. 135

వ. ఇట్లు కాశికానగరంబుఁ బ్రవేశించి యీశానుండు విశ్వేశ్వరశ్రీమన్మహాదేవు నిర్మలజ్యోతిర్మయలింగాకారు సహస్రకలశాభిషేకంబుసేయను, దత్పాదతీర్థప్రసాదోదకంబులాస్వాదింపను దలంచి. 136

శా. చేతోజాతవిరోధి కాశినగరీక్షేత్రోపకంఠంబునన్
శాతాగ్రంబగుశూలమూఁది ధరణీచక్రంబు భేదించుచున్
బాతాళంబులు గ్రొచ్చుచున్నిగిడెనాభవ్యాయుధంబావృత
స్రోతోభారముసోఁకునట్లుగఁదృణస్ఫూర్తిప్రభావంబునన్.

తే. దృఢముగా నూఁది శూలంబు దివిసె హరుఁడు
దివిసినప్పుడ తన్మహావివరసరణి
నేడుపాతాళములు దాఁటి యిలయుఁ దాఁటి
యంబరము దాఁకె నవ్వారణాంబుధార. 138

వ. భూప్రమాణంబునకు దశగుణప్రమాణంబై శుద్ధస్ఫటికనిర్మలంబును, శరజ్జ్యోత్స్నాస్వచ్ఛంబును, నాకాశఖండసంకాశంబును, సుధాధారామధురంబును, పాటలాకుసుమసురభియునై యవ్వారిపూరంబు వెండితీఁగెయుంబోలె నెగసిన నీశానుండు సహస్రధారాకలశంబుల సహస్రవారంబులు పంచాక్షరీ పంచబ్రహ్మశతరుద్రీయ ప్రణవఘోరపాశుపతాదిమంత్రంబు లుచ్చరించుచు విశ్వేశ్వరశ్రీమన్మహాదేవు దివ్యలింగంబు నభిషేకించి. 139

క. భువనావరణోదకమున
భవు నభిషేకంబు సేయఁ బాసెను లయతాం
డవకేలీసమయసము
ద్భవ మగునీర్వట్టు కపటపాశుపతునకున్. 140

వ. అప్పుడు విశ్వేశ్వరుండు ప్రసన్నుం డై యీశానుకోరిన ప్రకారంబున. 141

సీ. జ్ఞానోద మన శివజ్ఞానంబు నా శివ
తీర్థంబు నా జ్ఞానతీర్థ మనఁగ
జ్ఞానవాపిక నాఁగ సంజ్ఞాంతరంబులు
గలిగి పానాభిషేకక్రియలను
సంస్పర్శనామాభిసంకీర్తనధ్యాన
సందర్శనంబుల సప్తతంతు
ఫలము నీఁజాలుప్రభావంబు కైవల్య
సంపత్ప్రదానైక చతురతయును

తే. సన్నిహత్యాదిఫల్గ్వాదిసకలతీర్థ
సమధికత్వంబు బ్రహ్మరాక్షసపిశాచ
శాకినీగ్రహకూశ్మాండశాంతివిధియు
నిచ్చె నీశానకుండికకీశ్వరుండు. 142

కళావత్యుపాఖ్యానము.

వ. అని యానతిచ్చి శంభుం డంతర్హితుండయ్యె. ఈశానవాపి కాసమీపంబున నీశానుండుకృతావాసుం డయ్యె కలశోద్భవా! చిత్రార్థం బగునితిహాసంబు శివతీర్థమాహాత్మ్యప్రకారంబుసెప్పెద. ఆకర్ణింపుము. హరిస్వామి యనఁగ నొక విప్రుండు కాశీనగరంబున నుండు. అతనికూఁతురు సుశీల

యసునది రూపరేఖావిలాసంబులం ద్రిభువనంబులయందు
నుం బొగడఁదగియుండు. నబ్బాలారత్నంబు. 143

చ. బలబల వేగ తేపకడఁ బంకజదీర్ఘికఁ దీర్థ మాడి నె
చ్చెలులునుదానునిందుముఖి శేషవిభూషణుఁబూజసేయుని
చ్చలు దెలికన్నులున్మొలకచన్నులుబొమ్మలమీఁదవ్రాలుఁగుం
తలములుఁజూచి పౌరులు మనంబుల నువ్విళులూరుచుండఁ

తే. లలన సాక్షాత్కరించినలక్ష్మివోలెఁ [గాన్. 144
గంకణంబులతో సూడిగములు రాయ
విశ్వనాథుని కళ్యాణవేదియందు
మ్రుగ్గుపెట్టంగ మోహించు ముజ్జగంబు. 145

తే. బహుళసౌభాగ్యలక్ష్మికిఁ బద్మముఖికి
ముజ్జగంబుల సరి లేరు ముదిత లనుచు
బ్రహ్మ సంకేతరేఖలు వ్రాసె ననఁగఁ
గాంతగళమున నొప్పె రేఖాత్రయంబు. 146

తే. కడుపులో మూఁడు శంభులింగంబు లుండుఁ
దొయ్యలికి జ్ఞానవాపికాతోయసేవఁ
గలశసంభవ! కేదారసలిలములును
గాశి శివతీర్థజలము లింగత్వ మొందు. 147

వ. ఒక్కనాఁ డొక్కవిద్యాధరుండు రూపలావణ్యమోహితుం
డై యర్ధరాత్రంబమ్మచ్చెకంటిముంగిటం బిండిచల్లినవిధంబున
వెన్నెలలుగాయఁ జంద్రికాపాండుతల్పంబున నిద్రించి
యుండ నిద్రాభంగంబు గాకుండ మెత్తమెత్తన నెత్తమ్మి
రేకులకంటెను సుకుమారంబు లైనతనహస్తపల్లవంబుల
నెత్తి గగనమార్గంబున మలయాద్రికిం గొనిపోయె నయ్యవ
సరంబున. 148

†శా. విద్యున్మాలి యనంగ నొక్కదివిషద్విద్వేషి యక్కన్యకన్
విద్యుత్సన్నిభగాత్రిఁ జూచి మదనావేశంబునం బట్టుకో,ను
ద్యోగించిన నాలతాంగినొకచో యోజించివిద్యాధరుం,డు
ద్యద్బాహుపరాక్రమస్ఫురణదైత్యుం దాఁకెనయ్యిద్దఱున్.

క. ఆహవము చేసి రంగజ
మోహాంధులు గడిమి మెఱసి ‡ముష్టీముష్టిన్
బాహాబాహిఁ గచాకచి
సాహసము జలంబు దివిజసంఘము పొగడన్. 150

వ. అప్పుడు. 151

తే. అప్సరస్త్రీ(ని) తిలోత్తమ యసురవరులు
తనకు నై పోరఁ జూచుచందంబు దోఁపఁ
జూచె విద్యాధరుఁడు రాక్షసుండు గడిమిఁ
దనకు నై పోరుచుండఁగఁ దలిరుఁబోఁడి. 152

వ. అవ్విధంబున యుద్ధంబు సేసి యన్యోన్యముష్టిప్రహారంబుల 153
నిద్దఱు సమరసమయంబున నిధనం బొంది రందు.

తే. ప్రాణనిర్యాణవేళ విద్యాధరుండు
గ్రుడ్డు దిరుగంగఁ బడి విప్రకులజఁ జూచి

---

†మ. "రక్కసుఁ డొక్కఁ డప్పురిసరస్థలిఁ గ్రుమ్మరి కేళి సల్పువాఁ
డక్కమలాక్షిచక్కఁదన మద్భుత మందుచుఁ జూచి రాగము
స్నెక్కనఁ దత్తరం బుడుగనేరక మారవికారచేష్టలం
గ్రక్కున దానిఁ బట్టుకొనఁగాఁ గవిసెన్ వడి దుర్మదాంధుఁ డై.

వ. ఇట్లు గవిసిన విద్యాధరుండును వాని నదల్చుచు రోషవేషభీషణాకారుఁ
డై సమరావష్టంభవిజృంభణంబున నిల్చె నయ్యిరువురు నయ్యవసరంబున."
అని మద్రాస్ ఓరియంటలు లైబ్రరీప్రతిలోఁ గనుపట్టుచున్నది.

‡ అన్నిమాతృకలలో 'ముష్టాముష్టిన్' యని యున్నను ప్రమాదమని
సవరింపఁబడినది.

కటకటా! నిన్ను ననుచు గద్గదికకతన
మాట నాల్కన యుండంగ మరణ మయ్యె. 154
వ. అంత నక్కాంత నిజాంతర్గతంబున. 155
క. ఆలింగనంబు సేసెం
బాలిండ్లను మొట్టె వదనపద్మము తావుల్
గ్రోలె మగం డన నెవ్వం
డా లనఁగా నెద్ది? భర్త యతఁడే నాలిన్. 156
వ. అని విద్యాధరుతోడ ననుగమనంబు సేయం దలంచి యతి
మి యమ్మెఱుంగుఁబోఁడి మలయాచలోపాంతంబున. 157
ఉ. వెగ్గల మైనకూర్మి నరవిందదళాయతనేత్ర కొండకా
రగ్గి పటీరకాష్ఠములయందు రవుల్కొనఁ జేసి కమ్మవూ
మొగ్గలదండఁ దాల్చి మది మున్కడఁ గాశిని విశ్వనాయకు
న్దిగ్గన సంస్మరించి జననిన్ జనకుం దలఁచెం గ్రమంబునన్.
వ. మఱియు నాత్మగతంబున. 159
క. ఏమిటఁ దప్పితి నోకో? నా
స్వామికి విశ్వేశ్వరునకు వారాణసిలో
నేమమున నెల్లరును దమ
ధామంబుల నుండ నిట్టిదశ నా కొదవెన్. 160
సీ. జ్ఞానవాపీపయస్స్నానక్రియావేళఁ
జెలికత్తియలు నన్నుఁ దలఁతు రొకొ!
మదిలోన నేభంగి మఱుఁగుచుండుదు రొకొ
తల్లిదండ్రులు సంతతంబు నాకు!
హరితాంకురంబు లే నందీక మేయని
హరిణశాబము లెవ్వ రరయువారు

సేవ సేయించుకోఁ జిత్తగింపఁడు సుమీ
నాచేత శ్రీవిశ్వనాయకుండు!

తే. కాశి! లోలార్క! కేశవ! కాళనాథ!
దండనాయక! ఢుంఠి వేదండవదన!
సంభ్రమోద్భ్రిములార! యోజహ్నుకన్య!
కాన వచ్చెద మిమ్ము ముంగలిభవమున. 161

తే. విధవనై జన్మ మెల్లను వేఁగఁ జాల
నొకనిచేపడి యోప నొండొకని వెదుక
నితనితోడిద లోకమై యేగుదాన
ననలముఖమున నిమిషవేదనకు నోర్చి. 162

ఉ. ఇంకొకఁడెవ్వఁడేని నను నెక్కటి నుండఁగఁజూచి పట్టునో!
కింక మహాటవిం గరటికేసరిదంష్ట్రితరక్షుయూథముల్
సంకటపెట్టునో! యతినృశంసత నింతలు సేసినట్టి యా
పంకజసూతిపై నెరయఁబ్రయ్యెడివేగమయగ్నిఁ జొచ్చెదన్.

క. పాపపుదైవ మొనర్చిన
యీపరిభవవహ్నికంటె నెక్కుడె? పటుసం
తాపమునఁ జితాకాష్ఠో
ద్దీపిత మగువహ్ని యేల? ధృతిఁ దొఱఁగంగన్. 164

ఉ. భూధరరాజసన్నిభుఁడు పుష్పశరాసనుతోడిజోడు వి
ద్యాధరచక్రవర్తి నను నర్మిలిఁ దెచ్చినవాఁడు నాకుఁ గా
శీధవనాథుకట్టెదుర నీదశ నుండఁగ విశ్వనాథ! కా
శీధవ! యంబికారమణ! జీవిత మేను ధరించుదాననే?. 165
166

వ. అని దుఃఖావేశంబున.

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్బిసరుహనేత్ర కొండచటఁ బెద్దయెలుంగున వెక్కివెక్కి వె

క్కస మగుమన్యువేగమునఁ గాటుకకన్నులనీరు సోనలై
యుసిరికకాయలంతలుపయోధరముల్ దిగువాఱునట్లుగన్.

మ. మలయంబెక్కడఁ? గాశియెక్కడ? నసన్మార్గంబుపాటించి తై
క్కలిదైవం బిటునాకునీయహితముంగావించు నే?యంచువే
తలయూఁచెం గలకంఠియచ్చెరువునం దాటంకరత్నప్రభల్
పలుకంబాఱిన చెక్కుటద్దములపైఁబైపై విలంఘింపఁగాన్.

వ. వెండియు నక్కన్యకకర్పూరకదళికాద్రుమనిర్యన్నిర్యాసధా
రాద్రవవాసనాసుగంధంబు లగుగంధసారగిరినితంబనిర్ఝ
రాంభగప్రవాహంబుల ముఖక్షాళనం బాచరించి విద్యాధ
రోపరివిరచితచితాగంధసారకాష్ఠంబులరవుల్కొనిగంధకరటి
కర్ణతాళవృంతతాండవప్రస్తారవిస్తారంబు లగుమారుతంబు
లవలనం బెచ్చుపెరిఁగి విచ్చలవిడిఁ మండుచిచ్చునకుం బ్రద
క్షిణంబు వచ్చి నిసర్గకాతరంబు లగుకటాక్షవీక్షణంబులు
పుష్పాంజలివిక్షేపభంగి నంగీకరింపఁ జంపుడుగట్టయగు
శిలాపట్టంబు మెట్టి నిలిచి సంతతస్వాధ్యాయాధ్యయనధ్వని
ముఖరంబును, నగ్నిహోత్రధేనుఖరఖురవలయార్ధచంద్రకి
తాజిరంబును, త్రికాలశంభుపూజాసమారంభవిజృంభమా
ణశంఖకాహళబహుళకోలాహలాకులంబును నగునయ్యా
నందకాననంబునందు బ్రహ్మపురివాడకుంజూడారత్నంబైన
నాపుట్టినిల్లభివృద్ధిం బొంది యుండుంగాక! కాశికాకటకవి
ప్రకుటుంబినీశ్లాఘనీయచరిత్రయగునా జనయిత్రిప్రియంవద
ముత్తైదువ యగుంగాత! అష్టాదశమహావిద్యాస్థానసామ్రా
జ్యభద్రాసనాసీనుం డగురుద్రావాసవిద్వత్సింహంబు నా
తండ్రి హరిస్వామి సమానులయం దుత్తమశ్లోకుం డగుం

గాక ! మహాశ్మశానంబునం దనూచానం బగు నాబంధు
వర్గంబు బంధువర్గపుఁదీఁగయుంబోలెఁ గొనసాఁగి బ్రతుకుం
గాక యని యాశీర్వదించి 169

సీ. ఏఁ బ్రభాతంబుల నీశానవాపిక
నని శంబుఁ దీర్థ మాడినఫలంబు
వివిధభంగుల నేను విశ్వేశ్వరస్వామి
ముక్తిమంటపి నిడ్డముగ్గుఫలము
ప్రతిచతుర్థిని డుంఠిభద్రేభవక్త్రునే
నారాధనము నేసినట్టిఫలము
నానందకాననాభ్యంతరక్షేత్రంబు
నం దేను జన్మించినట్టిఫలము
తే. సర్వమును గూడి మీఁదటిజన్మవేళ
నితనికే భార్యఁగా నన్ను నిచ్చుఁ గాత !
యనుచు హరిణాంకమూర్తి తీవ్రాంశుఁ బోలెఁ
గోసర కగ్నిఁ బ్రవేశించెఁ గువలయాక్షి. 170

క. లింగత్రయగర్భిణి యగు
నంగనసాన్నిధ్యమున నిశాటుండును ద
త్సంగతి విద్యాధరరా
జుం గాంచిరి త్రిదశపదము సుకృతస్ఫురణన్. 171

వ. అంతఁ గొంతకాలంబునం బ్రియాస్మరణంబు నేసెం గావున
విద్యాధరకుమారుండు మలయకేతుం డనునామంబునను
నగ్నిప్రవేశసమయంబున నవ్విద్యాధరకుమారుండు తనకుం
బతి కావలయు నని కోరెం గావున సుశీల కళావతి యను
పేర ధాత్రీతలంబున జన్మించి వధూవరులైరి. ఆదంపతుల 172
యందు [illegible] పూర్వజన్మవాసనావశంబున.

మ. అళినీలాలక దాల్చుఁ జన్నుఁగవ రుద్రాక్షావళీదామకం
బులు ముక్తామణిభూష లొల్ల దసితాంభోజాతపత్రాక్షిమై
నలఁదుఁ భస్మ మలంద నొల్ల దొకనాఁ డైనం బటీరద్రవం
బులుపన్నీరుకురంగనాభియును గర్పూరంబు కాశ్మీరమున్.
తే. కడుపు చల్లంగఁ గాంచె నక్కలువకంటి
మలయకేతుమహీపాలమన్మథునకు
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవాది
శుభగుణశ్రీసమృద్ధుల సుతుల ముగుర. 174
వ అంత నొక్కనాఁడొక్కచిత్రకరుఁడు వారణాసీస్థానవృత్తాం
తంబు చిత్రపటంబున లిఖియించి తెచ్చి కళావతీసహితుం
డైనమలయకేతుసన్నిధిం బెట్టిన నవ్విలాసవతి పటంబు
చూచి ప్రాగ్జన్మవాసనావశంబునఁ దన్ను మఱచి సమాధి
స్థయుం బోలె లోచనంబులు మొగిచి ముహూర్తమాత్రం
బూరకుండి కన్నులు దెఱచి యాచిత్రపటంబునం గలయ
శేషవిశేషంబులు క్రమంబునం బూస గ్రుచ్చినతెఱంగునం
గరతర్జనింజూపి చూపి ప్రియునికిఁ జెప్పఁ దొడంగె. ఆప్రకా
రంబు కుంభసంభవా! నీకుం జెప్పెద నాకర్ణింపుము. 175
తే. కాశినగరి ధనుర్వల్లి గంగ నారి
కోటియుగ్మంబు లోలార్కకుధరధరులు
వృషము బాణంబు లక్ష్యంబు వృజినరాశి
విశ్వనాథుండు ధన్వి యుర్వీకళత్ర ! 176
సీ. అదె వియద్వాహిని యదె మణికర్ణిక
యదె కాశి నిఖిలకల్యాణరాశి
యదె విధాతృకపాల మవని వ్రాలినచోటు
వాఁడె శ్రీమత్కాలభైరవరాజు

పంచతీర్థం బదె ప్రణవమంత్రాకృతి
మత్స్యోదరీస్థానమండల మదె
కామేశ్వరుఁడు వాఁడె స్కందేశ్వరుఁడు వాఁడె
వాఁడె వినాయకేశ్వరుఁడు హరుఁడు

తే. శశికిరీటుండు పార్వతీశ్వరుఁడు వాఁడె
వాఁడె భృంగీశుఁ డధ్వరేశ్వరుఁడు వాఁడె
వాఁడె యష్టాదశాంగుళేశ్వరుఁడు శివుఁడు
ధర్మశాస్త్రేశ్వరుఁడు వాఁడె ధరణినాథ ! 177

తే. ఇతఁడు సారస్వతేశ్వరుం డిందుమౌళి
యితఁడు రత్నజాతీశ్వరుఁ డిభవిరోధి
యతఁడు శైలేశ్వరుఁడు భుజంగాభరణుఁడు
సప్తజలధీశ్వరుఁడు వాఁడె శంకరుండు. 178

సీ. సప్తకోటిమహార్హసన్మంత్రములకు న
ధీశ్వరుం డితఁడు మంత్రేశ్వరుండు
త్రిపురేశ్వరుఁడు వీఁడె త్రిపురదానవులకు
సాన్నిధ్య మై పూజఁగొన్న వేల్పు
బాణేశ్వరుఁడు వీఁడె బాణాసురునకు వే
భుజము లిచ్చినచంద్రభూషణుండు
వైరోచనేశుండు వాఁడె ప్రహ్లాదేశ
నారదేశ్వరు లల్లవారు చూడు

తే. ధరణినాయక ! యాదిగదాధరేశ
భీష్మకేశభృగ్వీశగోపీముకుంద
నారసింహేశ్వరాత్రేయనాథశేష
విష్ణు ... 179

తే. బిందుమాధవదేవుఁ డానందవిపిన
వీథికాకేళికలకంఠవిష్కిరంబు
పంచనదతీర్థరాజంబు పార్థివేంద్ర!
కాశికాఫాలకస్తూరికాతిలకము. 180

క. ఇదె మంగళకాత్యాయని
యిదె మార్కండేయనాయకేశ్వరలింగం
బిదె ధాతపాతకేశ్వర
పద మిది కిరణేశునునికిపట్టు మహేశా! 181

తే. వేయు నేటికి? నానందవిపినభూమి
నడుమ శశిఖండకోటీరనాగకటక
నిటలలోచనగిరిశధూర్జటులు హరులు
నారుపోసినచందాన నాటియుండ్రు. 182

వ. అని చెప్పి కళావతి జ్ఞానవాపికాతీర్థంబుఁ జూపి. 183

సీ. స్తంభరోమాంచాదిసాత్త్వికభావంబు
లందందఁ దోఁపంగ నవ్వధూటి
మూర్ఛిల్లె నద్భుతంబును బొంది భూపతి
శిశిరోపచారంబు సేయుచుండె
బుద్ధిశరీరిణి పుష్యత్ప్రగల్భ యా
ధవళాక్షిఁ బొంది నిదాన మెఱిఁగి
చిత్రపటంబు మైఁ జేర్చి కర్ణముఁ జేర్చి
జ్ఞానోద మనియును జ్ఞానవాపి

తే. యనియు శివతీర్థ మనియు దృఢాక్షరముగఁ
బలికె ముమ్మాఱు చేతనాప్రాప్తిఁ బొందె
సరసిజాతాయతాక్షి తచ్ఛబ్దమాత్ర
వా[illegible] 184

వ. మలయకేతుండును గళావతీప్రేరణంబునం బుత్త్రసంక్రాంత రాజ్యభారుం డై వారాణసీపురంబున కరిగి జ్ఞానవాపికా తీరంబునం దపం బాచరించి ముక్తుం డయ్యె. ఇది శివతీర్థ మాహాత్మ్యంబు. కుంభసంభవా! ఇం కేమి యడుగం దలం చెద వడుగు మనుటయు. 185

తే. అనఘ ! నాకు సదాచార మానతిమ్ము
ధరణిసురుఁడు సదాచారపరతఁ గాని
యాత్మసంశుద్ధి వడయ లేఁ డాత్మశుద్ధిఁ
గాని సిద్ధింప నేరదు కాశివసతి. 186

## సదాచారనిరూపణము.

వ. అనినఁ గుమారస్వామి యతనిం జూచి మన్వత్రిభృగుభ రద్వాజయాజ్ఞవల్క్యకశ్యపాంగిరసయమాపస్తంబసంవర్తకా త్యాయనబృహస్పతిశాతాతపశంఖలిఖితపరాశరాదులమా ర్గంబుల సదాచారంబు ప్రసంగానుప్రసంగంబున వివరింప వచ్చిన నపారం బై యుండుఁ గావునఁ గుంభసంభవ! నీకు దిఙ్మాత్రంబు వివరించెద. సావధానమతివై యాకర్ణింపుము.

తే. చాతురాశ్రమ్యమును జతుష్కంధ మయ్యె
మొదటిస్కంధత్రయము ధర్మములు వహించు
నగ్రిమస్కంధ మెల్ల వింధ్యాద్రిదమన!
జ్ఞానసంపద్విభూతికిఁ దానకంబు. 188

శా. ఓరాత్రిం గను టెప్ప వేయకమహోద్యోగంబునన్ ధీరతా
ధౌరంధర్యము పూనుమానవుఁ డకుంఠాత్మప్రవృత్తిన్ సదా
చారం బెట్లొనరింపవచ్చుఁ గలశీసంజాత! కాశీశ్వరున్
గౌరీవల్లభు సంస్మరించి బ్రతుకుం గా కాతఁ డప్రచ్యుతిన్.

తే. ద్విజుఁడు వేఁబోక మేల్కాంచి దినదినంబె
ప్రత్యవాయపరీహారపరతఁ జేసి
సంస్మరింపంగఁ దగు భక్తిసౌష్ఠవమున
మంగళాస్పద మగువస్తుమండలంబు. 190

వ. బ్రాహ్మముహూర్తంబున మేల్కాంచి కృతాచమనుండయి వివిక్తప్రదేశంబున భస్మోద్ధూళనంబును, భసితత్రిపుండ్రధారణంబునుం బొనర్చి, రుద్రాక్షమాలికలు ధరియించి, పద్మాసనాసీనుండయి, మనంబున హేరంబు, నంబికాసహాయుం, ద్ర్యంబకు, లక్ష్మీసమేతుఁ బుండరీకాక్షు, భారతీసహితుం బరమేష్ఠిం,బాకశాసనపావకప రేతరాజపలలాశిపాశిపవనపౌలస్త్యపశుపతులను, వసిష్ఠాదిమునుల, గంగాదిపుణ్యవాహినులఁ,బ్రయాగాదితీర్థంబుల,శ్రీశైలాదిపుణ్యపర్వతంబులను, దుగ్ధోదాదిసముద్రంబుల, మానసాదిసరోవరంబుల, జ్ఞానవాప్యాదిదీర్ఘికల, నందనాదివనంబులఁ, బుష్కరాదిద్వీపంబుల, నార్యావర్తాదిజనపదంబులఁ, గామధుగ్ధేన్వాది ధేనువులం, గల్పవృక్షాదివృక్షంబులం, గాంచనాదిధాతువుల, లక్ష్మ్యాది పుణ్యాంగనల, గరుడాదిపతంగంబుల, శేషాదిమహానాగంబుల,నైరావణాదివారణంబుల,నుచ్చైశ్శ్రవఆదితురంగంబులఁ, గౌస్తుభాదిమణుల, నరుంధత్యాదిపతివ్రతల, రంభాద్యప్సరసల,నైమిశారణ్యాదిపుణ్యారణ్యంబుల, వారణాస్యాది పట్టణంబుల, విశ్వేశ్వరాదిలింగంబులఁ, బాంచజన్యాదిశంఖంబుల, సుదర్శనాదిదివ్యాయుధంబుల, వేదాదివిద్యలఁ, బద్మాదిపురాణంబుల, మానవాదిస్మృతుల, గాయత్ర్యాదిమంత్రంబుల, సనకాదియోగీంద్రుల, నోంకారాదిబీజాక్షరంబుల, వ్రీహ్యాదిధాన్యంబుల,నారదాదివైష్ణవుల, బాణాదిశివభక్త

లఁ, బ్రహ్లాదాదిభాగవతుల, మహాకాళాదిప్రమథులఁ, బద్మాది నిధుల, దధీచ్యాదివదాన్యుల, హరిశ్చంద్రాదిభూపతుల, జననీజనకులఁ, బితరుల, గురులను సంస్మరించి యీయందఱు నాకు నాయురారోగ్యైశ్వర్యంబులు ప్రసాదింతురు గాక యనుచుం బ్రార్థించి ప్రణమిల్లి నిలిచి నిత్యనైమిత్తికాద్యనుష్ఠానంబుల నిష్ఠాపరుండయి ద్విజుం డొనర్చునది. 191

సీ. వెడలి యూరికి నాలువిండ్లదవ్వున నైరృత్య
దెస బహిష్కార్యంబు దీర్పవలయు
నన్నాలువిండ్లమాన మగుదూరమ్మున
బయలి కేగుట పాడి పట్టనమునఁ
దల ముసుంగిడి తృణంబులు గప్పినధరిత్రి
విణ్మూత్రజలముల విడువవలయుఁ
జెవి బ్రహ్మసూత్రంబుఁ దవిలింప నర్హంబు
విట్ప్రస్రవోత్సర్గవేళలందు

తే. దివసముఖసంధ్యలం దుదగ్దిఙ్ముఖుండు
యామినులయందు శమనదిగాననుండు
నగుచు మౌనవ్రతంబున నవనిసురుఁడు
మలవిమోక్షంబుఁ గావించుఁ గలశజన్మ! 192

సీ. నిలుచుండి కారాదు జలమధ్యమునఁ గాదు
కాదు దున్నిననేలఁ గాదు మందఁ
గాదు గోసన్నిధిఁ గా దగ్నికెదురుండి
కా దగ్రజన్ములకట్టెదురను
గాదు సస్యంబులఁ గాదు రథ్యాభూమిఁ
గా దెదుర్గాలికిఁ గాదు గాటఁ

గాదు తారాదినక్షత్రగ్రహంబులఁ
గనుఁగొంచు మలవిమోక్షం బొనర్ప
తే. శిశ్న మొకచేతఁ గబళించి చెదలు చీమ
లేక కర్కర గాక వల్మీకజంబు
నెలుకకలుగును గాక మన్నెమకి పట్టి
యరుగునది శౌచ మొనరింప నవనిసురుఁడు. 193
తే. ముసుఁగుఁ గవియఁగఁ దిగిచి నెమ్మొగము వాంచి
యంగులీయుగ్మకమున ముక్కులమిపట్టి
మలవిమోక్షణ మొనరించి తొలఁగునపుడు
కనుఁగొనఁగఁ గా దమేధ్యంబు కలశజన్మ! 194
సీ. అయిదువారము లపానాభ్యంతరంబున
నొకమాఱు శిశ్నమస్తకమునందుఁ
బదిమాఱు లపసవ్యపాణిపల్లవమున
నిరుగేలులందును నేడుతూరు
లంఘ్రిద్వయంబునయం దొక్కమాఱు త్రి
వారిఁ గ్రమ్మఱ హస్తవనరుహముల
నంతరాంతరములయందు నిశ్శబ్దంబు
గాఁ బ్రకృత్యంబు సంక్షాళనంబు
తే. గలుగునట్లుగ నామలకప్రమాణ
మృదులమృత్పిండఖండంబు మ్రేవి మ్రేవి
గంధలేశక్షయావధి గా నొనర్ప
వలయు శౌచంబు మది కెక్కఁ గలశజన్మ! 195
వ. ఇది గృహస్థశౌచంబు. దీనికి ద్విగుణంబు త్రిగుణంబు చతుర్గు
ణంబును బ్రహ్మచారివానప్రస్థయతులకు నియతంబై యుండు.

తే. పగటిశౌచంబులోన సాఁబాలు రేయి
రాత్రిశౌచంబులోన నర్ధము రుగార్తిఁ
జోరబాధాదిదుష్టకాంతారమార్గ
మునఁ దదర్ధంబు శౌచంబు మునివరేణ్య! 197

క. పురుషుల శౌచములోనం
దరుణుల కర్ధంబు శౌచతంత్రంబు మునీ
శ్వర! నిష్కారణ మింతేకిఁ
బురుషునకుం దగదు శౌచముం దలఁగంగన్. 198

తే. ధరణిధరమంతపాడవుమృద్రాశి యైన
నంబునిధియంతజల మైన ననఘచరిత
భావశౌచంబుఁ బోలదు బాహ్యశౌచ
మనిరి శౌచక్రియావేదు లయినమునులు. 199

తే. అగ్నిహోత్రావాుతులకుఁ జాంద్రాయణాన్న
పిండమునకును శౌచమృత్పిండమునకుఁ
గలశసంభవ! యుసిరికకాయయంత
మాన మని చెప్పుదురు కర్మమర్మవిదులు. 200

వ. అనుష్ణంబులు నఫేనంబులు నబుద్బుదంబులు నక్షారంబులు నలవణంబులు నకలుషంబులు నదుర్గంధరసంబులు నయిన యుదకంబులు, నగక, నిలుచుండక, మాటలాడక, వెలిఁజా డక, వంగక, తెన్నుండక, వేగిరపడక, యజ్ఞోపవీతంబువిడు వక, ప్రసారితపాదుండుగాక, బహిర్జానుండుగాక, చప్పుడు గాకుండ ముమ్మాఱు బ్రహ్మతీర్థంబు హృదయపర్యంతంబుడిగ్గ శుద్ధిబుద్ధ్యర్థంబు ప్రాశించునది. అనంతరంబ యంగుష్ఠమూల

దేశంబున నినుమాఱు* గండస్థలంబున నిరియించిన యోష్ఠాధరంబులు ముమ్మాఱు స్పృశించి యనంతరంబ కుడిచేతం బుడిసిలించినయుదకంబు వామహస్తసంపుటంబున నిలిచి దక్షిణవామపాదంబులయందు మూర్ధంబునందునుం బ్రోక్షించునది. *మఱిమాటిమాటికి వామహస్తోదకంబు స్పృశించుచు నంగుళిత్రయంబుననాస్యంబును, దర్జన్యంగుష్ఠాగ్రంబులనాసికారంధ్రంబులు, నంగుష్ఠానామికాగ్రంబులఁ జక్షుశ్శ్రోత్రంబులును, గనిష్ఠాంగుష్ఠయోగంబుననాభీరంధ్రంబును, హస్తతలంబునహృదయంబును, నంగుళ్యగ్రంబుల మస్తకోభయస్కంధంబుల ముట్టునది. కొందఱ అనుష్ఠానపరులీచతుర్వింశత్యాచమనక్రియలందుఁ గేశవాదిచతుర్వింశతినామంబులుచ్చరింతురు. అవి క్రమంబున నంభగప్రాశనత్రయంబునఁ గేశవనారాయణమాధవనామంబులుఁ, గపోలమార్జనద్వయంబున గోవిందవిష్ణునామంబులు, నంతరాధరోష్ఠమార్జనత్రయంబున మధుసూదనత్రివిక్రమనామంబులు, వామహస్తోదకధారణంబున శ్రీధరనామంబును, దక్షిణవామపాదోదకప్రోక్షణంబున హృషీకేశపద్మనాభనామంబులును, శిరః ప్రోక్షణంబున దామోదరనామంబును, నంగుళీత్రయాస్యస్పర్శనంబున సంకర్షణనామంబును, దర్జన్యంగుష్ఠనాసారంధ్రద్వయస్పర్శనంబున వాసుదేవప్రద్యుమ్ననామంబులు, ననామికాంగుష్ఠచక్షుశ్శ్రోత్రస్పర్శచతుష్టయంబున ననిరుద్ధపురుషోత్తమాధోక్షజనారసింహనామంబులుఁ, గనిష్ఠాంగుష్ఠనాభీ

* ఇది మూలాతిరిక్తవిరుద్ధముగానున్నది. 'త్రిః పీత్వాంబువిశుద్ధ్యర్థం తతః ఖాని విశోధయేత్, అంగుష్ఠమూలదేశేన ద్విర్ద్విరోష్ఠాధరౌ స్పృశేత్' అని మూలము.

రంధ్రస్పర్శనంబుల నచ్యుతనామంబును, హ స్తతలహృదయ స్పర్శనంబున జనార్దననామంబును, గరాగ్ర శిరస్స్పర్శనంబున నుపేంద్రనామంబును, నంగుళ్యగ్రస్కంధస్పర్శద్వయంబున హరికృష్ణనామంబు లుచ్చరింతురు. ఇది యాచమనప్రకా రంబు. 201

తే. శుద్ధుఁ డగుహృద్గతముల భూసురుఁడు నీళ్ల
గళగముల భూమిపతి తాలుగముల వైశ్యుఁ
డాస్యగంబుల శూద్రుఁడు నాఁటదియును
నాచమన వేళయందు వింధ్యాద్రిదమన! 202

తే. ముక్తకేశుండు సంవృతమూర్ధగళుఁడు
గాక సం[illegible]ళితాంఘ్రి యై [illegible]సురుండు
విమలజలముల నాచాంతవిధి యొనర్ప
నర్హమగు వింధ్యశైలదర్పాపహారి! 203

ఉ. తుమ్మినయప్పుడుం బురముత్రోవఁ జరించినయప్పు వారిపా
నమ్మొనరించినప్పు డశనంబు భుజించినయప్డు నవ్యవ
స్త్రమ్ము ధరించినప్డు దురితంబులు చూచినయప్డు పుణ్యకా
ర్యమ్ములయప్డు హేయములనంటినయప్పుడు వారువందగున్.

సీ. చిటికెనవ్రేలియంతటిపరిణాహంబు
పదివేళ్లనిడుపును బలము కలిగి
తొల్లి తొఁజ లేక తోమంగ నను వైన
తరుకాష్ఠమున దంతధావనంబు
వదనసంశుద్ధికై వలయుఁ గావింపంగఁ
బ్రతిపద్దినంబును బర్వతిథియు
షష్ఠియు నవమియు సవితృవాసరమును
బరిహార్యములు కాష్ఠభక్షణమున

తే. కర్త్మదివసంబు లేక యనర్హవేళఁ
బండ్లు దోమంగ వలసెనేఁ బదియు రెండు
సలిలగండూషములు సేయ సంవిశుద్ధి
గలుగు వక్త్రంబునకు బ్రహ్మకర్మనిరత! 205
తే. దంతధావనపూర్వంబు తాన మాడి
ప్రాతరారంభవేళల బ్రాహ్మణుండు
సంధ్యవార్వంగ వలయు నిచ్చలును నిష్ఠ
నర్ఘ్య మీఁ దగు నర్కోదయంబునపుడు. 206
సీ. సౌభాగ్యమేధాప్రసాదసంపన్మహో
త్సాహోదయములకు జన్మభూమి
నవరంధ్రములయందు స్రవియించురోఁత చే
శుచి గాని మేనికి శుద్ధికరము
తేజంబు గల్పింప దీర్ఘాయు వొనరింపఁ
జాలు వాసరముఖస్నాన మనఘ!
యరుణోదయమున మూర్ధాభిషేక మొనర్చి
తగును జేయఁగ మంత్రతంత్రవిధులు
తే. స్నానమున కంగకములు మృత్సంచయంబు
నక్షతంబులు దిలలు దర్భాంకురములు
గోమయంబును బావమానీముఖంబు
లైనబుఙ్మంత్రములును వింధ్యాద్రిదమన! 207
వ. విశుద్ధం బైనమృత్పిండంబుశుచిప్రదేశంబునం బెట్టి యుదఙ్ము
ఖుండును బద్ధబ్రహ్మశిఖుండును నై యద్దేవతాకంబు లైన
మంత్రంబు లుచ్చరించుచు సలిలావగాహనంబు చేసి. 208
క. నేమం బొప్పఁగఁ బ్రాణా
యామం బొనరించునది జలాంతరమున లో

సాముద్రాధిప! ప్రాణా
యామంబు శ్రుతిప్రసూతయజనం బనఘా. 209

తే. మొదలి తుదియోంకృతులతోడ మూర్ధ మగుచు
వ్యాహృతులు మూఁటి నాల్గింటి నధిగమించి
మంత్రరాజంబు గాయత్రి మహిమ నొప్పుఁ
గడుపు చల్లంగ శ్రుతివిద్యఁ గన్నతల్లి. 210

వ. గాయత్రీత్రివారజపంబు ప్రాణాయామంబు, గాయత్రీదశవారజపంబు తపంబు. జలాంతరమునగాయత్రీత్రివారజపం బొండెవిష్ణుసంస్మరణం బొండెఁ జేయునది. స్నానానంతరంబ కారుణ్యాపితృప్రీతికరంబు వస్త్రనిష్పీడనం బొనర్చునది. ఇది స్నానవిధానంబు. 211

క. ధౌతపరిధానపరుఁడై
ప్రాతస్సంధ్యను భజించి బ్రాహ్మణుఁడు కుశా
స్ఫీతకరాంగుండై ప్ర
ద్యోతనునకు నర్ఘ్య మిచ్చు నుదయింపంగన్. 212

వ. అనంతరంబ గాయత్రీజపం బాచరించునది. 213

తే. పగలు నిలుచుండి జపియించు నిగమమాత
మాపు గూర్చుండి జపియించు మహితభక్తి
బ్రాహ్మణుఁడు సంధ్యవార్చని బ్రాహ్మణుండు
గీసతక్కువశూద్రుండు కేవలంబు. 214

వ. ఈప్రకారంబునన మధ్యాహ్నకాలంబునను బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నింద్రాదిదిక్పాలకుల మరీచ్యాదిమహర్షుల మన్వాదిమనువుల సలిలతర్పణాంబులం దృప్తిం బొందించునది. చందనాగరుకర్పూరగంధమిశ్రితంబులగుజలంబులు తర్పణార్హంబులు. దైవం బార్షంబు బ్రాహ్మంబు పైతృకం

బసుతీర్థంబుల దేవాదితర్పణంబులు నాచరించునది. 215

సీ. ఛందంబు త్రిష్టుపు చంద్రికాచ్ఛచ్ఛాయ
నభిరామ మభినవయౌవనంబు
రుద్రుండు దేవత భద్ర మాకారంబు
కశ్యపుండు మహర్షి గన్ను నోసలు
నాపాదమస్తకం బఖిలాంగకంబులు
నథ్వర్యుశాఖాక్షరాత్మకంబు
లాంబోతు వాహనం బవతంసకుసుమంబు
తరుణనిర్మలసుధాధామ రేఖ

తే. తరణిబింబంబు గగనసౌధంబుమీఁదఁ
బసిఁడికుంభంబుచందంబు పరిఢవింపఁ
గానవచ్చినమధ్యాహ్నకాలసంధ్య
యందు సావిత్రి కఖిలవిద్యాధినాథ! 216

తే. పచనపావకుఁ బ్రజ్వలింపంగఁ జేసి
వైశ్వదేవం బొనర్పంగ వలయు నిష్ఠఁ
జణకకోద్రవమాషనిష్పావకములు
తైలలవణంబులును గావు తద్విధులకు. 217

తే. అగ్నికార్యంబు దీర్చి యనంతరంబ
హంతకారంబు నిష్ఠఁ జేయంగ వలయు
హంతకారం బొనర్ప బ్రహ్మాదులైన
త్రిదశముఖ్యులు తృప్తిఁ బొందుదురు సూపె! 218

తే. హంతకారం బనంగఁ బదాఱుగళ్లు
కలశభవ! నాల్గుగళ్లు పుష్కల మనంగ
గ్రాసమాత్రంబు భిక్ష యక్షయ్య మండ్రు
మౌనిబృందారక! తదన్నదానఫలము. 219

క. బలిహరణము సేయఁగఁ దగుఁ
గలశీసుత! వైశ్వదేవకర్మాంతమునన్
నిలయబహిర్భాగంబున
జలధారాసంయుతముగ శ్రద్ధాపరతన్. 220

సీ. కైసేసి యంబువైక్లబ్యంబు నొందక
యుచితపీఠిక సంస్థు లొనర మోపి
యుండెనే ప్రాఙ్ముఖం బొండె నుదఙ్ముఖం
బగుచుఁ గూర్చుండి సాజ్యాభిఘార
మభ్యుష్ణముగ విశుద్ధాన్న మాపోశన
పూర్వంబుగాఁ బ్రాణములు నపాన
ములు నాది యగుధాతువుల కైదిటికిఁ దృప్తి
యావహిల్లంగ స్వాహాంతములను

తే. బంచవాయునామంబులఁ బరమనిష్ఠ
వేల్చు విప్రుఁడు దర్భలు వ్రేళ్లఁ బూని
యశనకబళాహుతులు జఠరాగ్నియందు
గుణము నగుణంబు నెన్నఁడు గుడుపునకును. 221

తే. కపుడులో గాలి కొకకొంతయెడము విడిచి
యన్నపానీయములఁ దృప్తి యావహిల్ల
నవనినిర్జరుఁ డనుపాన మనుభవించుఁ
దక్ర మైనను శీతలోదకము లైన. 222

తే. ధరణినిర్జరుఁ డమృతాభిధానశబ్ద
పూర్వమంత్రంబు సముచితంబుగఁ బఠించి
సగము ప్రాశించి యుదకంబు సగము భూమి
విడువవలయును హస్తంబు గడిగికొనక. 223

వ. అప్రక్షాళితదక్షిణహస్తాంగుష్ఠమూలనిష్ఠ్యూతంబైన యా

సలిలం బపుణ్యనిలయంబైన రౌరవంబునంబద్మార్బుద నివాసు
లైనపితరులకుం దృప్తినావహించు. చేతులకు వార్చి యాచ
మనంబు సేసి శుచియై కర్కరీసలిలంబు వలకాలి పెనువ్రేలి
మీఁద ధార యెత్తునది. అద్ధార యయ్యంగుష్ఠంబు నాశ్ర
యించినయంగుష్ఠమాత్రుం డగుపురుషుం బరితోషింపంగఁ
జేయు. అనంతరంబు బొడ్డు నివురుకొనుచుం బ్రాణాపాన
సమానోదానవ్యానంబులు దృప్తిం బొంది నాకు నానందం
బొసంగుం గాతమని యాశీర్వదించుకొనునది. తాంబూల
చర్వణంబులం బుణ్యకథాశ్రవణంబులం బ్రొద్దుపుచ్చునది.

తే. వర్ణములలోన బ్రాహ్మణవర్ణ మెక్కు
డాశ్రమంబులలోన గార్హస్థ్య మధిక
మనఘ! లక్షణవతి యైనయాలు సూవె!
తగినయవలంబనంబు తద్ధర్మమునకు. 225

## స్త్రీలక్షణనిరూపణము.

వ. పాదతలంబులు రేఖ లంగుష్ఠాంగుళినఖంబులు మీఁగాళ్లు
గుల్ఫంబులు పిక్కలు జంఘలు రోమంబులు జాను లూరు
లు కటి నితంబంబు భగంబు నాభి కుక్షి పార్శ్వంబు
మధ్యంబు వళులు రోమావళి హృదయంబు వక్షోజద్వ
యంబు చూచుకంబులు జత్రుస్కంధకక్షమణిబంధద్వయంబు
మీఁజేతు లరచేతులు కృకాటిక కంఠంబు చిబుకంబు
హనువులు కపాలంబులు వక్త్రం బుత్తరోష్ఠాధరోష్ఠంబులు
జిహ్వా తాలువులు హసితంబు నాసిక కన్నులు పక్ష్మంబు
భ్రూకర్ణ లలాటశిరోరుహంబు లనునఱువదియా అంగం
బులు లక్షణాన్వితంబులు గావలయు. అట్టిలక్షణవతి యైన
భార్య గృహలక్ష్మి. అట్టిగృహిణికతంబునం గదా గృహస్థుం

డిహపరసౌఖ్యంబులకు భాజనం బగు నని చెప్పి కుమార
స్వామి కుంభసంభవున కి ట్లనియె. 226

తే. ఇన్ని పాటులఁ బడఁగ లే దిల్వలాసు
రారి! వర్ణాశ్రమస్థుల కలషుమతుల
కూర్ధ్వలోకంబు ముక్కున నూర్పుగాలి
యుడిగినప్పుడె కాశియం దొదవు ముక్తి. 227

వ. అని సదాచారవర్ణనం బొనర్చి కుమారుండింక నేమియడిగెద
వడుగు మనినఁ గుంభసంభవుండు జ్ఞానకారణంబు లెయ్యవి?
యని యడిగినం గుమారుండు. 228

## యోగనిరూపణము.

తే. అఖిలవేదానువచనంబు యజ్ఞపరత
బ్రహ్మచర్యైకనిష్ఠ దపంబు దమము
శ్రద్ధ యుపవాసపారతంత్ర్యము శమంబు
కలశసంభవ! విజ్ఞానకారణములు. 229

తే. ధర్మనిర్మలహృదయ! శ్రోతవ్య మాత్మ
తారకబ్రహ్మనిష్ఠ! మంతవ్య మాత్మ
సర్వశాస్త్రప్రవీణ! ద్రష్టవ్య మాత్మ
దంభరహిత! నిదిధ్యాసితవ్య మాత్మ. 230

వ. ఆత్మావలోకంబునకు యోగాభ్యాసంబు పరమసాధనంబు.

సీ. కుంభినీధరగుహాక్రోడాటవీకుంజ
గర్భవాసము గాదు కారణంబు
గ్రంథతాత్పర్యపర్యాలోచనక్రియా
కర్మతత్త్వము గాదు కారణంబు
దానంబు వ్రతము నధ్వరము లోనుగఁ గల్గు
కర్మకాండము గాదు కారణంబు

నాసాగ్రసంవీక్షణంబు నాసనబంధ
కల్పనంబును గాదు కారణంబు

తే. మానమును శౌచమును యంత్రమంత్రములును
గావు కారణములు యోగకలనమునకు
నిశ్చయంబును నభియోగనిశ్చలతయుఁ
గడఁకయును నభ్యసము గాని కలశజన్మ! 232

తే. ఆత్మఁ దప్పించి యెఱుఁగఁ డన్యంబు నెవ్వఁ
డాత్మసంతుష్టుఁ డెవ్వఁ డహర్నిశంబు
నాత్మ నాత్మనె కను నెవ్వఁ డాత్మమిథునుఁ
డెవ్వఁ డాతండు యోగలక్ష్మీశ్వరుండు. 233

వ. కొంద ఱాత్మమనస్సమాయోగంబ యోగం బండ్రు. కొంద
ఱు ప్రాణాపానసమాయోగంబ యోగం బండ్రు. కొందఱు
విషయేంద్రియసమాయోగంబ యోగం బండ్రు. కొందఱు
పరమాత్మ క్షేత్రజ్ఞసమాయోగంబ యోగం బండ్రు. యమ
నియమాసనప్రాణాయామప్రత్యాహార ధ్యానధారణసమా
ధులుం గొంద ఱెనిమిది యోగాంగంబు లండ్రు. నామతం
బాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధులా
ఱంగంబుల. అందుఁ బ్రథమాంగంబైనయాసనంబు స్వస్తి
కాసనంబు, గోముఖాసనంబు, పద్మాసనంబు, వీరాసనంబు,
సింహాసనంబు, భద్రాసనంబు, ముక్తాసనంబు, మయూరాస
నంబు, సుఖాసనంబన బహుభేదంబులం గలిగియుండు. ఇం
దొక్కయాసనంబున నాసీనుండై యోగి యోగంబభ్యసిం
చునది. దంశమశకాకీర్ణంబుగాక, కేశభస్మాంగారకీకసాదిప్ర
దూషితంబుగాక, జీవసంకులంబుగాక, సర్వబాధావిరహితం

బై సర్వసుఖావహంబై మనఃప్రసాదజననంబై కుసుమస్రగ్వాసనాధూపామోదమేదురంబైన ప్రదేశంబున నతృప్తుండును, నతిక్షుధార్తుండును, విణ్మూత్రబాధితుండును, జింతాకులుండును గాక, నిమీలితాక్షుం డై దంతంబులు గూర్పక యింద్రియగ్రామంబు నియమించి ప్రాణాయామంబున కుపక్రమించునది. 234

తే. యోగి యొయ్యొయ్య మరిగించి యునుపవలయుఁ
గుక్షిగోళంబులో గాలి కుంభకమున
బలిమి నిలిపిన రోమకూపముల వెడలి
యది ప్రకల్పించుఁ గుష్ఠాదు లైనరుజల. 235

ఉ. ఎంత యఘోరమైన విపినేభము మెల్లన మస్తరించి మావంతుఁడు గంఠపీఠి గుదె వైచి సుఖంబున నెక్కునట్టు లశ్రాంతము యోగసాధకుఁడు ప్రాణసమీరణము న్నిసర్గదుర్దాంతము మస్తరించియవధానముమైధరియింపఁగాఁదగున్.

తే. కడఁగి సవ్యాపసవ్యమార్గముల వెలికి
యాన మొనరించుఁ గావునఁ బ్రాణ మయ్యెఁ
జంద్రనాడికఁ బూరించు సాధకుండు
భానునాడిక విడుచుఁ బ్రాణానిలంబు. 237

సీ. నలినాసనాదినానావిధాసనములఁ
గ్రమముమై దేహదార్ఢ్యము వహించుఁ
బ్రాణానిలాయామపరిపాటిని దహించు
నందంద కలుషసంహతుల నెల్లఁ
బ్రత్యాహృతిక్రియాపాటవంబునఁ జేసి
పావనత్వంబు చేపట్టు మేన

ధారణావిధిదురంధరతాబలంబునఁ
జర మైనచిత్తంబు దిరముసేయు
తే. ధ్యానమున నీశుఁ జూచి సమాధియుక్తిఁ
గర్మనిర్మూలనక్రియాకర్మ శూర
మైన మోక్షంబుఁ గాంచు వింధ్యాద్రిదమన!
సాధకుం డిది యోగాంగషట్కఫలము. 238
తే. దహని యన భ్రామణి యనంగ స్తంభని యన
సమని యనఁ బ్లావని యనంగ సంయమీంద్ర!
ప్రాణపవమానధారణ లైదుగలుగఁ
జెప్పుదురు యోగసిద్ధాంతసిద్ధమతులు. 239
ఆ. ఉడ్డియానముద్రయును మహాముద్రయు
మూలబంధగగనముద్రికలును
సారతరవివేక! జాలంధరంబును
ననఁగ యోగముద్ర లైదు సుమ్ము. 240
వ. నాడీశోధనంబునకుం జంద్రసూర్యసంఘటనంబునకురసపోష ణంబునకు.మహాముద్ర కపాలకుహారంబునజిహ్వాప్రవేశంబు నేసి బ్రహ్మరంధ్రధ్రువేందుమండల సుధాధారానిష్యందనం బాస్వాదించుటకు నభోముద్ర; అదియ ఖేచరీముద్రయు. ఉడ్డీనం బగుమహాఖగంబు నహోరాత్రంబు నిలుపుటకు నుడ్డీయానముద్ర. నాడీజాలంబుధరించుటకుజాలంధరంబు. అపానమూలంబు బంధించుటకు మూలబంధంబు. ఈయైదుముద్రాబంధంబులు సమాధినిష్ఠాప్రతిష్ఠాకారణంబులు, బిందుస్థితికరణకారణంబులు, గంధవహాధారణాధురంధరంబులు.
తే. ఊర్ధ్వమున నున్నప్రాణంబు నొడిచి తివుచుఁ
గ్రింద నున్నయపానంబు గిట్టి పట్టి

యూర్ధ్వమున నున్నప్రాణంబు నొడిచి తివుచుఁ
గ్రింద నున్నయపానంబు గిట్టి పట్టి. 242

క. మానక జీవుఁడు ప్రాణా
పానంబుల చేతఁ దివియఁబడు వెలుపలికిఁ
లోనికి నెక్కుచు డిగ్గుచుఁ
బౌనగపున్యమునఁ బడనిపాటులఁ బడుచున్. 243

వ. హంకారంబున బహిర్గమనంబును సకారంబున నంతర్గమనం
బును జేయుచు హంసహంసయను ప్రణవాక్షరమూలభూతం
బగునజపామంత్రంబున దివారాత్రంబు లిరువదియొక్క వే
యిన్నూ ఱునూఱు వారంబు లుచ్ఛ్వాసనిశ్వాసరూపంబున
జీవుండు జపించు. అమ్మహామంత్రంబుసంకల్పమాత్రంబున.

సీ. విను దూరవార్తలు వీక్షించు దవ్వుగా
నడుచును శతయోజనములు గదియ
నశ్రుతం బగుశాస్త్రమైన వక్కాణించు
గౌరవం బొందు లాఘవముఁ జెందుఁ
బరకాయములఁ జొచ్చుఁ బక్షికీటమృగాది
బహుజీవజాతులభాష లెఱుఁగు
దివ్యగంధంబును దివ్యతేజము దివ్య
కర్మంబులును దివ్యకళయుఁ దాల్చు

తే. మోక్షనగరీమహాద్వారముఖకవాట
విఘటనాలోహకుంచికావిభ్రమమున
నుల్లసిల్లెడు షడంగయోగవిద్య
నభ్యసించినసాధకుం డద్రిమదన! 245

వ. ఇది యాభ్యంతరం బైనముద్రాసహితషడంగయోగంబు.
ఇంక బాహ్యం బైనషడంగయోగంబు వినిపించెద. 246

తే. విశ్వభర్త విశాలాక్షి విబుధగంగ
దండపాణి చమూనాయకుండు ఢుంఠి
కాలభైరవదేవుండు కలశజన్మ!
కాశినగరి షడంగయోగమున నెఱుఁగు. 247

తే. విశ్వనాయక దేవత్రివిష్టపేశ
వీరకేదారనాయకోంకారకృత్తి
వాసు లిల్వాలదైత్యవిధ్వంస! మఱియుఁ
గాశినగరి షడంగయోగముగ నెఱుఁగు. 248

సీ. వారాణసీపురవాటిసంచారంబు
ఖేచరీముద్ర యక్లిష్టచరిత!
వేగమై యానందవిపినంబునకు రాక
భద్ర! యుడ్డీయానభద్రముద్ర
కాశికానికటగంగావాహినీవారిఁ
దల ధరించుట జలంధరము ఘటజ!
శివరాజధానిఁ జేసినమూలబంధంబు
మూలబంధంబు సన్మునివరేణ్య!
తే. నహుషదమన! మహాశ్మశానంబుమీఁద
భక్తిముద్ర మహాముద్ర పరమయోగ
విద్యను షడంగముద్రికాన్వితము గాఁగ
నీకుఁ జెప్పితి దృఢముగా నిలుపు మాత్మ. 249

వ. అనిన నగస్త్యుండు. 250

క. ఆయురవసానకాలం
బేయనువునఁ దెలియవచ్చు నెఱుఁగింపుము గాం
గేయ! యరిష్టాగమనము
లేయవశకునములు మాకు దెలుపఁగదగున్. 251

వ. అనినఁ గుమారుం డతని కిట్లనిరెు. 252

## కాలజ్ఞానకథనము.

తే. వామనాసాపుటమున నెవ్వాని కేని
గాలి యుచ్ఛ్వాసనిశ్శ్వాసగతిఁ జరించు
బింగళానాడి నడువదు పెద్దయేని
వాఁడు మూఁడబ్దములకు నిర్వాణ మొందు. 253

తే. ఒండె మూఁడహోరాత్రంబు లొండె నేని
రెండహోరాత్రములు సంచరించు పేళి
నరుని కెవ్వని కొక్కవత్సరముగాని
బ్రతుకఁ డండ్రు సుధర్మిణీప్రాణనాథ! 254

క. నాసాపుటయుగమున ని
శ్శ్వాసోచ్ఛ్వాసానిలములు సరియై నడుచున్
వాసరము లెవ్వనికిఁ బది
మాసత్రితయమున వాఁడు మరణముఁ బొందున్. 255

క. ప్రాణానిల మెవ్వనికిని
ఘ్రాణపుటీయుగ్మకమునఁ బ్రవహింపక సం
క్షీణం బై నోరవెడలుఁ
బ్రాణ మతఁడు దొఱఁగు వాసరత్రితయమునన్. 256

తే. అదరిపా టెవ్వఁ డీక్షించు నాకసమున
హాటకపుఁగ్రుష్ణపింగళుం డైనపురుషు
నాతనికి వత్సరద్వయం బవధి సూవె!
ప్రాణధారణమున కిల్వలాసురారి! [మూ

ఉ. తుమ్మును నింద్రియంబు నిజతోయమలంబులునొండెనొండె
త్రమ్ముమలమ్ముఁ దుమ్ము బలదార్ఢ్యము చాలక యెవ్వఁ డేనినో

క్కమ్మడినుత్సృజించునతఁడుండఁడుప్రాణముతోడఁగూడిషే
కమ్మగువత్సరమ్ము గడ గాంచినపిమ్మట వాసరార్ధమున్. 259
ఉ. కానఁ డరుంధతిన్ ధ్రువునిఁ గానఁడు విష్ణుపదత్రయంబునుం
గానఁడు మాతృమండలముఁ గానఁడు గన్నులు గల్గియేనిషే
మానవుఁడమ్మనుష్యునకుమాసములాఱువిరామ మొందఁగాఁ
గానఁగ వచ్చుఁ గుంభభవ! కాలునిబంధురసౌధవీథికల్.
తే. దృఢవివేక! యరుంధతీదేవి జిహ్వ
నాసికాగ్రంబు ధ్రువుఁ డిల్వలాసురారి!
విష్ణుపద మది భ్రూమధ్యవీథి యనఘ!
మాతృమండల మక్షిపద్మము మునీంద్ర! 260
సీ. అసితాదివర్ణంబు నామ్లాదిరసమును
నన్యథాభావంబు నందెనేని
దంతోష్ఠకందరాతాలుజిహ్వాగ్రంబు
లొండొక్కవర్ణంబు నొందెనేనిఁ
గరజేంద్రియంబులు గనుదోయికొలుకులు
ధూమధూమ్రత్వంబు దొరసెనేని
నాఖండలీయకం బగుధనుఃఖండంబు
నభముపై రేయిఁ గన్పట్టెనేని
తే. నాలుమాసములకు మర్త్యుఁ డస్తమించు
వేగ యేతెంచి యూసరవెల్లి తొండ
పాదములనుండి తలదాఁకఁ బ్రాఁకెనేని
యతఁడు షణ్మాసములఁ జూచు యముని మొగము. 261
తే. జలక మాడినపిమ్మటఁ జరణములను
హృదయమున నీళ్లు వేగంబ యిగురఁ బ్రాపు

దర్పణమునీడ దోఁచు నాత్మప్రకాంతి
నెవ్వనికిఁ వాఁడు నాఱ్నెల్ల కేఁగు దివికి. 262

వ. మఱి ఛాయాప్రకంపంబు, మతిభ్రంశంబు, చంద్రద్వయ సూర్యద్వయదర్శనంబు, పగలు తారకావీక్షణంబు, రాత్రి తారకానభివీక్షణంబు, గంధర్వనగరావలోకనంబు, పిశాచనృత్తవీక్షణంబును, శ్రవణధ్వనిహాని, స్వప్నంబునందుఁ బిశాచఖరవాయసభూతప్రేతశునక గృధ్రగోమాయుబాధ, పాంసురాశియూపదండవల్మకారోహంబుఁ, దైలాభ్యంగ ముండనంబులు మరణసూచకంబులు. 263

క. ఈదుర్నిమిత్తములతో
నే దైనను నొకటి గాంచి యెదలోనఁ గడుఁ
ఖేదము నొందక నరుఁడు ప్ర
మోదమ్మునఁ గాశినగరమున కేగఁ దగున్. 264

వ. అని చెప్పిన మహాత్మా! నిష్ప్రపంచంబు నిర్వికల్పంబు నిరాకారంబు నిరస్తసమస్తోపాధికంబు, నిత్యంబు నగుపరబ్రహ్మంబే క్షేత్రంబును నాశ్రయించియుండు, నే క్షేత్రంబునందలలాటనేత్రుండు తారకబ్రహ్మవిద్యావర్ణకర్ణేజపుండై కీటపతంగక్రిమిసరీసృపాదు లగునానావిధజంతువులకుం బ్రాణాంతకాలంబున నభయం బొసంగు, నే క్షేత్రంబునకు నుత్తరవాహిని యగువియత్తటిని యుపకంఠంబునం గంఠముక్తాకలాపంబునుం బోలెఁ బ్రవహించు, నే క్షేత్రంబున కభ్యర్ణంబున మణికర్ణికాతీర్థంబు తీర్థరాజంబు రజనీకరకిరణసందోహదానదీక్షాధురంధరవినిర్మలకబంధకల్లోలమాలికాస్ఫాలితమహాదేవదివ్యలింగశతసహస్రలక్షకోట్యర్బుదన్యర్బుదంబై మహోత్తమ్నంబుఁ గాంచె, నట్టి యవిముక్తక్షేత్రంబు

మహిమ యింకను వినవలతు నానతిమ్మని ప్రార్థించినం
గరుణావశంవదుండై శిఖివాహనుం డతని కిట్లనియె. 265

దివోదాసవర్ణనము.

తే. బ్రాహ్మణోత్తమ! పద్మకల్పంబునందు
మనువు స్వాయంభువుని కాలమున ధరిత్రి
యఱువదేఁడు లనావృష్టి యైనకతనఁ
దద్ద వందురి కడు నుపద్రవము నొందె. 266

సీ. అంభోధితీరంబు లద్రికాననములు
నాశ్రయించిరి పేద లగుచు మనుజు
లంగళ్లయందు మిట్టాడ మానిసి లేక
గుడియుఁ బాడును జిక్కఁ జెడియె నూళు
లుద్యానములు వాపికోదకంబులు లేక
వృక్షవాటంబులు వెలరువోయె
వ్యాఘ్రాదు లైనక్రవ్యాదహింస్రమృగంబు
లెచ్చోటఁ జూచిన నేపు మిగిలె
తే. సంతతము దాను సృజియించు జంతుకోటి
గఱువుపా ల్పడి మోములు కాళ్లు వాఁచి
వండఁగాఁ దిన్న బూరెలవరుస నడఁగ
భ్రమసి దిట దప్పి నివ్వెఱపడిగె ధాత. 267

తే. రాజు లేనికతంబున రాష్ట్రములకు
నన్నిటికి బాధగా ధరిత్ర్యంతరమున
వ్రాలె నఱువదియేఁడు లవగ్రహంబు
గాచి వెలిపుచ్చ నొకమాత్ర గాక యుండ. 268

వ. అప్పుడు చింతాక్రాంతుం డై జగద్యోని ప్రజాక్షయంబున
యజ్ఞాదిక్రియ లుత్సన్నంబులై ... విశ్వనాశనం

బున నధ్వరభుజులు భూప్రజలఁ బోలె హవిర్భాగాద్య
భావంబున బుభుక్షాక్షోభంబు వహించిరి. ఇంక నేమి
సేయుదు? ఒక్కనిం బట్టంబుగట్టనినాఁడు సర్వసర్వంసహా
మండలంబును నాఖండలుండు వర్షింపకుండుటం జేసి యెండి
బెండువడిపోవుచున్నయది. నిఖిలక్షోణీచక్రరక్షణైకదీక్షా
ధురంధరుం డైన యంతటివాఁ డెక్కడఁ గల్గునో? యని
యన్వేషించి మనువంశంబున రిపుంజయుం డనువాని
నౌదార్యశౌర్యధైర్యాదిగుణగరిష్ఠుంగాంచి సబహుమానం
బుగా నతని కిట్లనియె. 269

సీ. మనువంశమకుటమండన! యోరిపుంజయ!
ధర యేలు లవణాబ్ధి గరుసు గాఁగ
మత్ప్రసాదమున సామర్థ్యం బతీంద్రంబు
కలకాలమును నీకుఁ గలుగఁ గలదు
బర్హిర్ముఖస్నేహపరిపూర్తిమై దివో
దాసాఖ్యవిఖ్యాతిఁ దాల్తు వీవు
వాసుకితనయ విలాసినీరత్న మ
నంగ మోహిని భార్య యగును నీకు
తే. ననిన నంజలి చేసి మహాప్రసాద
మనుచుఁ బరమేష్ఠియానతి నాదరించి
యిట్టు లని విన్నవించె ధాత్రీశ్వరుండు
పద్మభవునకు గంభీరభాషణముల. 270

ఉ. నెట్టన నన్ను సత్కరుణ నీరధివేష్టిత యైనధాత్రికిం
బట్టము గట్టెదేని నాకభాస పితామహ! యాత్మ నెగ్గుగాఁ
బట్టక విన్ము భోగిపసుపర్వులు క్రిందను మీఁద నుండువా
రొట్టవుసత్యమాదరణిన్నొక్క రుఁడున్ననుఁ జేయరాజ్యమున్.

వ. అనిన నట్లయగుం గాకయని బ్రహ్మ కాశీనగరంబునకేగి విశ్వ నాయకున కత్తెఱం గెఱింగించి తదనుమతిదివోదాసునకుం బట్టాభిషేకంబు సేసి సత్యలోకంబునకుం జనియె ననంతరంబ.

శా. చాటించెన్ మనువంశవర్ధనుఁడు విశ్వక్షోణి నందంద ఘం టాటంకారము దుందుభిధ్వనియుఁ గూడ న్వేగమై దేవతా కోటుల్ మేదిని నున్నఁ దప్పగుఁ జుఁడో కోపంబుపాపం బుషా త్తాటోపంబు మెయింగుటుంబసహితంబై చేరుఁడో నాకమున్.

క. పాతాళమునకుఁ జనరో
వాతాశను లెచటికేని వలసినయెడకున్
భూతము లేగరో! యని య
త్యాతతగతిఁ జాటి రవని నధిపతిదూతల్. 274

—● ఈశ్వరుండు నిఖిలదేవతలం గూడి మందరాద్రి కేగుట. ●—

వ. ఇవ్విధంబున దివోదాసదాసులు కాశీశ్రీశైలకుంభకోణ కోణార్కపుండరీకపురపాండురంగమహాకాళకాళహస్తికాంచి వేంకటశ్రీరంగవల్మీకరామేశ్వరాదిదివ్యస్థానంబుల ఘంటా పథంబుల ఘంటాడిండిమంబులతోడం గూడంజాటిన బ్రహ్మ దత్తవరానుభావంబునం గుటుంబసహితంబు త్ర్యంబకపీతాం బరహేరంబభైరవదుర్గావీరభద్రప్రథానులగునిర్జరులుదమ తమచిందంబులతో దుందుభివేణుమృదంగకాంస్యకాహళ ఢక్కాహుడుక్కానకంబుల మ్రోఁత దిక్తటంబుల దీటుకో నం గిరీటకోటిఘటితమణిమయూఖరేఖాపుంజంబుగల్లయవ సంజపొడవు వేడబంబు విడంబింపవెల్ల జగజంపుగొడుగుల పె ల్లును, డెక్కియంబుల పెక్కువయు, నాలవట్టంబుల డాలును, సీవిరుల తేవయుఁ, దాలవృంతంబులడంబును, దాంబూలకరం కంబులపొంకంబును, గర, దీకలా ... గండ ... పథానమణి

ముకురశయ్యాకటాహంబులకల్మియు,మహైశ్వర్యంబుబ్రక టింప నిలింపమార్గంబున సవాహనులు, సాయుధులు, సపరి వారులు, సశక్తులు, సాలంకారులునై కాశీపట్టణంబున కేతెంచి విశ్వేశ్వరాదేశంబున నెచ్చోటికైనను జనువారై గంగాతీరంబునవిడిసి కాశీశ్వరుండునునేక క్రియాఫలంబు నీఁజాలునట్టిప్రకారంబు విచారించి యటమున్న పెద్దకాలం బునం బట్టి యవిముక్తక్షేత్రంబునందునుం బోలె నిజశిఖర దేశంబునం దా నధివసించుట ఫలంబుగాఁ గోరి తన్నునుద్దే శించి ఘోరవీరతపంబు చేసినమందరాచలంబు కృతార్థం బగునట్లు నగ్గిరీంద్రంబునం దుండి దివోదాసుప్రతిజ్ఞ చెల్లిం చువాఁడై తత్కాలసన్నిహితం బైన నానాదిగ్దేశదేవతా సమూహంబుఁ గనుంగొని యిట్లనియె. 275

ఉ. ఓసురముఖ్యులార!కమలోద్భవుఁ డాదర మొప్పఁగా దివో
దాసున కిచ్చినాఁడు వసుధావలయంబు జగద్ధితార్థమై
రాసుతుఁ డాతఁ డీభువనరాజ్యభరంబు వహించునప్డు దే
వాసురసిద్ధసాధ్యగరుడాదుల వేల్పులఁ బన్నగేంద్రులన్.

తే. ఆజ్ఞ పెట్టినఁ గాని రాజ్యంబు సేయ
బహుముఖం బైనరాజ్యంబు పదిలపడదు
ఫణులు పాతాళమున నుండఁ బాడివారు
నిర్జరులు నాకమునయందు నిల్చువారు. 277

వ. అని వరంబు వేఁడినఁ బితామహుండును నాయనుమతి నభీ ప్సితంబు నొసంగె నని యానతిచ్చి. 278.

సీ. మహనీయరుద్రాక్షమాలికాభరణులు
భసన్మత్రిపుండ్రకోద్భాసితులును

వికటపాటలజటామకుటవర్ధనులును
సముదీర్ణ శార్దూలచర్మధరులు
దంతనిర్మితయోగదండమండితులును
ననిలభుగ్బ్రిష్మాసూత్రాన్వితులును
నాసాశిఖాగ్రవిన్యస్తలోచనులును
బంచాక్షరీమంత్రపఠనరతులు

తే. నైనప్రమథులు గొలిచి రా నగజతోడ
నంది కేశ్వరు నెక్కి యానందలీల
సకలజగదీశ్వరుండు పర్జన్యవీథి
మందరాద్రికిఁ గదలె సమగ్రబుద్ధి. 279

వ. మఱియు సారస్వతేశ్వరుండు, రత్నజాతేశ్వరుండు, సప్తనాగ రేశ్వరుండు, శైలేశ్వరుండు, త్రిపురేశ్వరుండు, బాణేశ్వరుండు, ప్రహ్లాదేశ్వరుండు, భృంగీశ్వరుండు మొదలైన పరమేశ్వరులు, దివ్యజ్యోతిర్లింగమూర్తులు, శతసహస్రలక్షకోట్యర్బుదన్యర్బుదసంఖ్యాకులు, విశ్వేశ్వరమహాదేవునను గమించిరి. లోలార్క కేశవులు, విశాలాక్షియు, ఢుంఠివిఘ్నేశ్వరుండును, దండపాణియుం గదలిరి. అందఱు వేల్పులిరు పక్కియలనుం బిఱుందనుం గూడి రాఁ గాశీశ్వరుండు. 280

సీ. లవణపాథోధివేలావేష్టితంబైన
యల్లోనేరేడుదీవి యతకరించి
యిక్షురసాబ్ధిపరీతాంచలంబైన
ప్లక్షాంఘ్రిపద్వీపపరిధి గడచి
హాలారసోదన్వదభిముద్రితంబైన
శాల్మలద్వీపభూస్థలము దాఁటి

ఘృతపయోరాశిసంక్లప్తావధిక మైన
చంచత్కుశద్వీపజగతిఁ జేరి
తే. యమ్మహాద్వీపమునకు రత్నాఢ్యమైన
మకుటమును బోలె నొప్పారుమందరమునఁ
గనకకలధౌతమాణిక్యకందరమున
గాఁపురముసేసె శివుఁ డంబికయును దాను. 281

వ. ఇట్లు కృతనివాసుండై యిందుధరుం డమ్మందరాచలంబు నందు మణికంధరామందిరంబున విహరించుచుంబర్వతరాజనందనం జూచి యి ట్లనియె. 282

సీ. నలినాక్షి! యైరావణంబుకుంభములతో
సరివచ్చు నీగుబ్బచన్నుదోయి
తన్వంగి! పారిజాతప్రవాళములతోఁ
బ్రతివచ్చు నీహస్తపల్లవములు
కాంత! కౌస్తుభమణిగ్రావకందళముతో
నెనవచ్చు నీలేఁతయిగురుమోవి
యలినీలకుంతల! యమృతపూరంబుతో
దొరవచ్చు నీముఖసరసఫణితి
తే. యువిద! యీయుపమానవస్తువులు గలిగె
నంబునిధియందు నీమనోజ్ఞాంగములకు
నిమ్మహామందరాద్రి కవ్వంబు గాఁగ
సురలు నసురులు సంప్రీతిఁ దరువఁ బట్టి. 283

చ. చటులఁబడి తీవ్రఘుర్షణవశంబున నొక్కట తీఁగచుట్టు నె
త్తటులయియున్న పాపతరిత్రాటిమలంకల నిర్ఘరాంబువుల్
గిటికొని మీఁదనుండిదిగఁ గిన్నరకంఠి.పయోధిఁద్రచ్చున
త్తటి ఫణిరాజు చుట్టినవిధంబున నున్నది చూడు మిగ్గిరిన్.

వ. అనియె నంత. 235

సీ. సోమార్కమయమహాసోపానములు డిగ్గి
పుష్కరాంబువు లోఁగిఁ బుక్కిలించి
గ్రహతారనక్షత్రగణము నాస్ఫాలించి
విధుకిరీటునిమౌళి వెల్లి గొల్చి
వడఁకుగుబ్బలిరాచవారిమూర్ధం బెక్కి
కనఖలక్షేత్రంబుఁ గౌఁగిలించి
కాశికానగరోపకంఠదేశము డాసి
యేఁడ్నాలుముఖముల నేగ జలధి

తే. కిమ్మహానది యియ్యేటి కిరుగెలఁకుల
విడిసియున్న నల్దిక్కుల వేలుపులును
నంబుధరమార్గమున నేగి రభవుఁ గూడ
మందరమునకు సంభృతానందలీల. 236

తే. అపుడు జంబూతరుద్వీపవిపులయందు
వాసి కెక్కినయద్దివోదాసునాజ్ఞ
గొంది సందిని నొకకుంటి కుదుపు వేద
యనదబూతంబు నుండనీరైరి భటులు. 237

క. కోయిలఁ దిరుమలఁ బెరుమా
కోయిలఁ దిరుపతులఁ గుంభకోణాదికపు
ణ్యాయతనంబుల మాయం
బై యెక్కడఁ బోయెనో కొముశాంతకుప్రతిమల్? 238

తే. మోసపోక ముసానమ్మ ముద్దరాలు
దారె సరిసప్డు లేక పాతాళమునకుఁ
దాను గొడుకులు నొకకొంత దడసె నేని
గుటిలపటుపరె నృపుబంట్లు గుడెలవారు. 239

వ. అప్పుడు చతురంతమహీమండలంబు సర్వదేవతాశూన్యం బగుటం జేసి విఘ్నేశ్వరావసథంబుల స్తవరాజస్తోత్రపాఠం బును, గౌరీకాకోష్ఠంబుల హృల్లేఖాదిమంత్రజపంబును, శివ స్థానంబులం బంచాక్షరీపంచబ్రహ్మపాశుపతాద్యఘోరశార భాది విద్యానుసంధానంబును, విష్వక్సేనావాసంబులం బురుషసూక్త ద్వాదశాక్షరాష్టాక్షర ప్రధాననామస్మరణం బును లేక తక్కం దక్కిన వేలుపులగుళ్లయందును సంధ్యా కాలబలిపటహశంఖ కాహళకోలాహలం బుడిగె. నేనునుం గర్ణాటదేశహాటకమణికిరీటంబును, గిష్కింధాచలహేమ కూటమతంగగిరిప్రాంతంబును, దుంగభద్రాతటినీనైకటికం బును, భాస్కరక్షేత్రప్రాతివేశికంబును, బంపావిరూపాక్ష దేవ దివ్యవికటపాటలజటాజూటకోటీపినద్ధముగ్ధేందు లేఖా మయూఖకందళగళదమృతధారానిష్యందనేకసంవర్ధితసుకు మారసరళసహకార జంబుజంబీర నారికేళ కేసరకురవకా శోకశాకోటకుటజపారిభద్రద్రాక్షారుద్రాక్ష సర్జ ఖర్జూర భూర్జ బిల్వ చిరి బిల్వాదితరులతాకుంజఖంజన్మిహిరకిరణ పుంజంబు నగుసామిమల విడిచి మందరాచలంబున కరిగితి. ఇవ్విధంబున దేవసంఘంబులు దివికిం గాద్రవేయకులంబు బలిసద్మంబునకుం బోవ నిర్ద్వంద్వంబు, నిరవగ్రహంబు, నిస్సపత్నంబునుం గాఁ గాశీనగరంబు తనకు మొదలిపట్ట ణంబుఁ గావించికొని దివోదాసుం డేకవాసరప్రాయంబుగా వత్సరాయుతాష్టకంబు రాజ్యంబు నేసిన నక్కాలంబు నందు. 290

ఉ. దేవత లెల్లఁ దక్కఁ గలదీవులకర్గ దివి కేగునట్టిచోఁ బోవఁగ లేక కుంటికుదుపుంజిలు వేల్పులు దైత్యదానవుల్

సేవకు లై మహీవిభునిచే నధికారనియోగవృత్తికై
జీవిత మంది నిల్చిరి త్యజింపఁగఁ జాలక జన్మదేశముల్. 291

తే. తత్పరతమీఱఁ గొలిచి రాధరణినాథు
దైత్యదానవు లవధూతదానవారి
పతితపాత మాబాలగోపాల మైన
సుద్ది పగవారిపగవారు చుట్ట లగుట 292

తే. విశ్వదేవగణంబుతో వేలువేల
వచ్చి పితృదేవతలు మహీశ్వరుఁ గొలిచిరి
చులకఁ గా ల్వట్టి యీడ్చినఁ జూరు వట్టి
వేలుదులు గాక తనవారి విడుతు రెట్లు. 293

సీ. సిద్ధు లారాజుఁ గొల్చి ప్రసిద్ధిఁ గాంచిరి
గ్రహముల కతఁ డనుగ్రహముఁ జూపె
విద్యాధరుం డయ్యె విద్యాధరుల కతఁ
డతఁడు రుద్రులకు సౌహార్ద మొసఁగె
రక్షించె నాతఁడు రక్షస్సమూహంబు
నతఁడు తార్క్ష్యులకు నాధ్యక్ష మిచ్చె
మన్నించె నాతఁడు కిన్నరవ్రాతంబుఁ
దుషితుల నతఁడు సంతోషపఱిచె

తే. నతని భూతపిశాచకూశ్మాండగణము
ఢాకినీప్రేతరంకులు హాకినులును
గర్కరీప్రాదుకావీటికాకరంక
పేటికలు దాల్చి కొల్చిరి భృత్యు లగుచు. 294

వ. అవ్విధంబున రిపుంజయుండు ప్రజాపాలనంబు పరమధర్మం
బుగా శక్తిత్రయచతురుపాయషాడ్గుణ్యంబులు కాలంబెఱిఁగి
నడుపుచుఁ బెద్దకాలంబు రాజ్యంబు సేసె. చాతుర్వర్ణ్యం

బును, జతురాశ్రమంబులుఁ దమతమధర్మంబులు దప్పక వర్తించె. అపుడు వేల్పులు ధరావియోగవేదనాదూయ మానమానసులై మరుద్గురుం బురస్కరించుకొని మంతనం బుండి దివోదాసునకు రాజ్యపదభ్రంశనం బెవ్విధం బునం గావింత మొకో యని విచారంబునకుం దొడంగిరి. అప్పుడు కార్యంబు నిదర్శించి బృహస్పతి యింద్రాదిదేవతల కిట్లనియె. 295

క. ప్రాణాపానవ్యానో
దానసమానములు తృప్తి దలకొనఁ జేయం
గా నోపెడు నది యన్నము
ప్రాణం బన నన్న మనఁగఁ బర్యాయంబుల్. 296

తే. అగ్ని మనలోన నొక్కరుఁ డౌనొ కాఁడొ?
చేయఁడే మారుతము మనచెప్పినట్లు?
వరుణుఁ డెవ్వరివాఁడు? ముగ్వురును లేక
యాయితం బగునెబ్భంగి నోయిరంబు? 297

వ. వరుణానిలాగ్నులు తమతమశక్తులుపసంహరించిరేని బితర పాకంబు సాగదు. పితరపాకంబు సాగక యోదనంబు పరి పక్వంబు గానేరదు. పరిపక్వాన్నంబులేక వైశ్వదేవబలిహర ణాదిక్రియాకలాపంబులు కుంఠితంబు లగు. హవ్యకవ్యక్రి యాశూన్యులైన బ్రాహ్మణులు రాజునందు విరక్తులగుదురు. బ్రాహ్మణులు విరక్తులైనప్పుడ తక్కినవర్ణంబులప్రజలువైరా గ్యంబు వహింతురు. ప్రజానురంజనంబునంగదా రాజు రాజౌ ట. ప్రజావిరక్తిఁ గోశదుర్గబలాదిసప్తాంగంబులుపరిక్షీణంబు లగు. సప్తాంగపరిక్షయంబునఁ ద్రివర్గంబు నశించు. త్రివర్గ నాశంబున ముక్తిమార్గంబును ఖిలీభవించుంగావున.

తే. మొదల వైశ్వానరునినిజమూర్తిశక్తి
సంహరింపంగఁ దగుఁ గాశి జనపదమున
నగ్ని లేకున్న నోగిరం బనువుపడక
రాజు ప్రజలును నెబ్భంగి బ్రదుకఁగలరొ? 299

ఉ. చండకరాన్వయాంబునిధిచంద్రుఁడు భూరమణుండ తండుఁజా
గుండియవాఁడు వేలుపులకోటు లసంఖ్యలు భూతధాత్రిపై
నుండఁగ నీక కాశిపురి నొక్కఁడు రాజ్యముసేయుటెట్టు? లీ
దండికి మెచ్చినారము ప్రతాపవిహీనుఁడు భూమిపాలుఁడే!

తే. అనిన నాచార్యవచనంబు లాదరించి
యింద్రుఁ డనుపఁగ ధాత్రికి నేగి యగ్ని
మొదలఁ గాశీపురమునకు ముట్టడముగ
సకలగృహములఁ దనమూర్తి సంగ్రహించె. 301

మ. కర మాశ్చర్యముగాఁ బ్రతిక్షయమునంగార్హంబులందగ్నిదే
వర నిష్పచ్చరమై యడంగుటయు సర్వస్త్రీలు పాకక్రియా
పరతం దక్కిరి యాయజూకభవనప్రాగ్వంశమధ్యంబులన్
*వరుసం జేయరయారెవీడునస్వధాస్వాహావషట్కారముల్.

ఉ. యంత్రితభక్తిభావమున నగ్నిసమింధని సామిధేని ఋ
ఙ్మంత్రము లుచ్చరించుచు సమగ్రతరారణిమంథనక్రియా
తంత్రము నాచరించి వసుధాసురముఖ్యులు వీతిహోత్రునా
మంత్రణ సేయ లేరయిరి మచ్చరికించియుఁ గాశికాపురిన్.

వ. ఆస యంబున. 304

ఉ. భూపతిసమ్ముఖంబునకుఁ బోయి కరద్వయము ల్మోగిడ్చి వి
జ్ఞాపన సేసె నాంధసికసంఘము మెల్లనఁ గొంకి కొంకి యి

*'పరిబిద్యాం బెడ మొల్క వీడును; పర జర్యోం బెడ మొల్క' అనియుఁ గొన్ని ప్రతులలోఁ గనఁబడుచున్నది. ఈపాఠములు చింత్యములు.

ష్టాపకరోక్తిఁ జెప్పెడునెడం *గడునల్గుడు నీతి యూ ననం
బ్రాపలు మేదినీశ్వరులమానసముల్ దిరిసెంపుఁబూవులున్.

తే. అవధరింపుము నీప్రతాపాతిశయము
గరిమమున కోహటించిరో కాని వహ్ని
కాశికాపట్టణమున నివేశమునకుఁ
బదిల మై యుండ నోపక పాఱిపోయె. 306

ఉ. అంబుజబాంధవాన్వయనృపాగ్రణి! బోనము నేఁడుసూర్య
కంబున నాయితం బయినకజ్జము భోజనశాలలోనఁ బ్రపా
శ్యం బిడినారు పంకజదళాక్షులు రెండవజాముగంట ప్రే
యంబడె నారగింప సమయంబని చెచ్చెర విన్నవించినన్.

తే. వేల్పు లొనరించినట్టి దుర్వృత్తి యగుట
నెఱిఁగి యింతియ కాక యొం డేమి? యనుచు
నారగించె దివోదాసుఁ డర్కకిరణ
తాపపక్వంబు లగుపదార్థంబు లెలమి. 308

వ. భోజనానంతరంబ యాస్థానమధ్యంబునం గొలువుండి దివో
దాసుండు వాసవాదులు సేసినయపకారంబునకుఁ బ్రతీకా
రంబు చింతించుచున్న యవసరంబునఁ బౌరజానపదు లగు
జను లగ్నితిరోధానంబునకు భయం బంది యమ్మహోత్పా
తంబు విన్నవింప నేతెంచిన. 309

ఉ. అందఱ నాదరించిమిహిరాన్వయముఖ్యుఁడువారియాత్మలా
నందముఁ బొంద నిట్లనియె నాకనివాసులు సేసినట్టికీ [యా
డొందునె నన్ను? మీరు వెఱకుండుఁడుభూప్రజలార! నేడ
నందవనంబునందు దహనంబు ఘటించెద యోగసంపదన్.

* 'గడునక్షాలనీతియోవనం, బ్రాపలు' అని ముద్రితపుస్తకపాఠము.
ఈరెండు పాఠములును జింత్యములు.

మ. అనుమానింపక యాసుధాంధసులుమాయావంచనాకల్పనం
బున వైశ్వానరునిన్ హరించిరియవుంబో! యింతమాత్రంబు
లో, ననునా యోగమహానుభావమునకున్ భంగంబువాటి
ల్లునే?, సనెక ర్లాంచినఁ బెండ్లి మానునొకో! దుశ్చారిత్రము
[ల్గంటి రే!

సీ. దహనస్వరూపంబుఁ దాల్చి యేఁ గైకొందు
హవ్యకవ్యాహుతు లధ్వరములఁ
బర్జన్యమూర్తిఁ జేపట్టి యే వర్షింతు
సలిలధారలు సస్యములు ఫలింప
శశిదివాకరుల వేషముఁ దాల్చికొని యేన
ఖండింతు గాఢాంధకారపటలిఁ
బవనునాకారంబు భరియించి యేను బ్రా
ణ్యంతర్బహిర్వ్యాప్తి నావరింతు
తే. వేల్పులందఱు నేన నై వివిధకృతుల
విశ్వలోకంబు రక్షింతు వేయు నేల?
యింక నోదాని నిట నేన యేలువాఁడ
నాగలోకంబు నాకంబు యోగశక్తి. 312

వ. అని యోగవిద్యాబలంబున సర్వదేవతామయుండై దివో
దాసుండు రాజ్యంబు సేయుచుండె. అంత నటఁ బరమేశ్వ
రుండు మందరాచలంబునం దధివసించి కాశీవియోగవేద
నాదూయమానమానసుండై తత్సమాగమోపాయంబుఁ
జింతించుచుండె నప్పుడు. 313

తే. అభవుఁ డిందుకళాధరుఁ డయ్యు నమర
వాహినీధరుఁ డయ్యు దుర్వార మైన
కాశికావిప్రయోగాభిఘాతజనిత
తాపభారంబు సైరింప నోపఁ డయ్యె. 314

## ఈశ్వరుండు యోగినులం గాశి కంపుట.

వ. అంత నొక్కనాఁ డద్దేవుండు గజానన, సింహముఖి, గృధ్రాస్య, కాకతుండిక, ఉష్ట్రగ్రీవ, హయగ్రీవ, వారాశి, శరభానన, ఉలూకిక, శివారావ, మయూరి, వికటానన, అష్టవక్ర, కోటరాక్షి, కుబ్జ, వికటలోచన, శుష్కోదరి, లలజ్జిహ్వా, అశ్వదంష్ట్రి, వానరానన, ఋక్షాక్షి, కేకరాక్షి, బృహత్తుండ, సురాప్రియ, కపాలహస్త, రక్తాక్షి, శుకి, శ్యేని, కపోతిక, పాశహస్త, దండహస్త, ప్రచండ, చండవిక్రమ, శిశుఘ్ని, పాపహంత్రి, కాలి, రుధిరపాయిని, వసాధయ, గర్భభక్ష, శవహస్త, ఆంత్రమాలిని, స్థూలకేశి, బృహత్కుక్షి, సర్పాస్య, ప్రేతవాహన, దందశూకకర, క్రౌంచి, మృగశీర్ష, వృషానన, వ్యాత్తాస్య, ధూమనిశ్శ్వాస, వ్యోమైకచరణ, ఊర్ధ్వదృశ, తాపని, శోషణి, దృష్టి, కోటరి, స్థూలనాసిక, విద్యుత్ప్రభ, బలాకాస్య, మార్జారి, కటపూతన, అట్టాట్టహాస, కామాక్షి యను నీచతుష్షష్టియోగినుల రావించి మీరు నానాప్రకారమాయావేషచేష్టావిడంబంబులం గాశీనగరంబునం బుణ్యస్త్రీలపాతివ్రత్యంబులు, పురుషులయాచారంబులు చెఱుచునది. వర్ణాశ్రమంబులు నిజధర్మంబున వర్తింపకున్న దివోదాసుండు రాజ్యపదభ్రంశంబునుం బొందెడు. అప్పుడు గాని మాకుఁ గాశీసమాగమంబు సిద్ధింపదు. అనిన వారును మహాప్రసాదం బని. 315

సీ. పుష్పలావిక యొర్త బూమెకత్తియ యొర్త
గంధవాహిని యొర్తొకర్త లంజె
హస్తాంఘ్రిరేఖాసమాలోకనక్రియా
సాముద్రికజ్ఞానచతుర యొర్త

సలిలాగ్ని వాగ్వాయ స్తంభవిద్యాకళా
ప్రావీణ్య యోర్తు సైరంధ్రి యోర్తు
మాచకమ్మ యొకర్తు మంత్రవాదిని యోర్తు
రంగవల్లివిచిత్రరచననిపుణ

తే. చదువఁ బాడంగ నర్తింప సరస మాడఁ
గథలు సెప్పంగ నగ్గింపఁ గన్ను లార్ప
వీణ వాయింపఁ బొగడంగ విరులు గట్ట
నేర్చునట్టిది యొకరిత నియత యోర్తు. 316

వ. ఇవ్విధంబుల నానారూపవిధంబులు గైకొని వారణాసికిం
జని రనంతరంబ. 317

ఈశ్వరుండు సూర్యునిం గాశి కంపుట.

తే. మనసిజారాతి సిద్ధయోగినులఁ బంపి
యూరడిలి యుండఁ జాలక యుష్ణకరుని
ననిచెఁ గాశీనగరికి వృత్తాంత మరయఁ
గౌతుకము కాలయాపనాక్షమము గాదు. 318

సీ. పురవైరి రవిఁ గాశిపురి కనుపనప్పు డే
కాంతంబు సేసి యి ట్లనుచుఁ బలికె
వాసరాధిప! దివోదాసు ధర్మాత్ముని
నేయుపాయంబున నేని ధర్మ
విముఖుఁ గావింపుము విడియంగ నాడకు
ధర్మమార్గైకతత్పరుని నతని
మన మాదరింపకుండిన ధర్మ మెబ్భంగి
నభివృద్ధిఁ బొందుఁ గావున నయంబు

తే. *దప్పకుండంగ నేదేని తప్పటోఱపు
మత్సరాహంకృతులను గామమునఁ గ్రోధ
మోహములఁ బ్రత్యవాయంబు మూదలించు
తప్పు లేకయ శిక్షింపఁ దగవు గాదు. 319

తే. కదలకుండును మది నెంతకాల మేని
ధర్మమతిసుస్థిరం బయి కర్మసాక్షి!
యంతకాలము నరునకు నావహిల్ల
దేయపాయంబు నీసూక్ష్మ మెఱిఁగికొనుము. 320

వ. అని చెప్పినం బ్రసాదం బని శివాజ్ఞ శిరంబున వహించి రవి
కాశీపురంబున కరిగి యొక్కొక్కమాటుయాచకుం,డొక్కొ
క్కమాటు దూత, యొక్కొకమాటువదాన్యుం, డొక్కొ
క్కమాటు దీనుం, డొక్కొక్కమాటుగార్తాంతికుం,డొక్కొ
క్కమాటు దృష్టప్రత్యయవాది,యొక్కొక్కమాటుజటిలుం,
డొక్కొక్కమాటుదిగంబరుం,డొక్కొక్కమాటుజాంగలి
కుం, డొక్కొక్కమాటు పాషండుం, డొక్కొక్కమాటు
బ్రహ్మచారి,యొక్కొక్కమాటుగృహి,యొక్కొక్కమాటు
వానప్రస్థుం,డొక్కొక్కమాటుయతియైనానాప్రకారవేష
భాషాచేష్టాయంత్రమంత్రతంత్రమాయాప్రయోగబలంబున.

తే. ఇన్నివిధముల జనియించి యినుఁడు గాశి
ప్రణము గానంగ లేఁ డయ్యె రాజునందు

*ఇచట 'తప్పకుండదు నెడనొక్క తప్పువెఱపు' అని యచ్చుప్రతిలోను, 'తప్పకుం
'తప్పకుండ నెందే నొక తప్పువెఱపు' అని యొకవ్రాతప్రతిలోను, పాఠభేదములు
డంగ నేదేని తప్పటోఱపు' అని కొన్నివ్రాతప్రతులలోను తక్కిన
గనఁబడుచున్నవి. ప్రథమపాఠము కేవల మపభ్రంశముగ నున్నది. దోషజ్ఞులు ప్రమాణము.
పాఠములఁ గ్రొత్తకల్పన చేయఁదగియున్నది. [illegible]

నవకరంబు మహీపాలునంద యేల?
కనఁగ లేఁ డయ్యె నొకవృద్ధజనునియందు. 322
వ. ఇట్లు విఫలప్రయత్నుం డయి యినుండు నిజాంతర్గతంబున.
సీ. కార్యంబు నిష్పత్తిగతికి రాకుండంగ
మందరంబున కెట్లు మఱలి పోదు?
అదె వచ్చె యిదె వచ్చె నని నా కెదురుచూచు
నీశు నీక్షింతు నే నేమొగమునఁ?
బతియాజ్ఞ నిర్వహింపక కాని దేవతా
ప్రమథులం దే నెట్లు ప్రభుతఁ గాంతు?
నొచ్చెంబు ధరియించి యొదిగి యుండక యెట్లు
నిటలలోచనుమ్రోల నిలుచువాఁడఁ
తే. గనలియున్నాఁడు నేఁ డెల్లి కాశివిరహ
వేదనాభారమున వేఁగి వేఁగి భర్గుఁ
డడ్డపడువారె యొరు లతఁ డలిగినపుడు?
గాన నిచటన కాలంబు గడపువాఁడ. 324
వ. హరిశ్చంద్రశిబిదధీచిప్రముఖు లగుపెద్దలుం గాశీసంసేవనంబున సంసారదుఃఖంబులు ద్యజించి రని ప్రభావజ్ఞుం డగు భాస్కరుండు లోలార్కుం డన, నుత్తరార్కుం డన, సాంబాదిత్యుం డన, గరుడాదిత్యుం డన, మయూఖాదిత్యుం డన, ఖఖోల్కాదిత్యుం డన, నరుణాదిత్యుం డన, వృద్ధాదిత్యుం డన, కేశవాదిత్యుం డన, విమలాదిత్యుం డన,గంగాదిత్యుం డన, యమాదిత్యుం డనఁ బండ్రెండు మూర్తులు వహించి కాశీపురంబునం దధివసించె. కాశీవాసనిమిత్తంబుగా మనంబు లోలంబగుట లోలార్కుం డయ్యె.క్రమంబున నీయాదిత్యులప్రభావం బభివర్ణించెద నాకర్ణింపుము. 325

## ఉత్తరార్కప్రభావవర్ణనము.

సీ. కాశీపురికి నుత్తరాశాప్రదేశంబు
నందు నుండుట నుత్తరార్కుఁ డయ్యె
నితిహాస మొకటి యయ్యినునిమాహాత్మ్యంబు
సంప్రకాశ మొనర్పఁజాలెడునది
వినిపింతు విను కాశి విప్రుఁ డొక్కఁడు సదా
చారసంపన్నుఁడు శాంతిశాలి
యతిథిప్రియుఁడు ప్రియవ్రతుఁ డనుపేరివాఁ
డతనిభార్య శుభవ్రతాభిధాన

తే. దంపతులు వారి కుదయించెఁ దనయ యొక్క
మూలనక్షత్రమునయందు మొదటికాలఁ
గేంద్రమున నాంగిరసుఁ డుండఁ జంద్రవదన
బాల వర్ధిల్లె రూపసంపదయుఁ దాను. 326

తే. దాని పేరు సులక్షణ మౌనివర్య!
సర్వలక్షణసౌభాగ్యజన్మభూమి
బాల యంతంత వర్ధిల్లెఁ బ్రతిదినంబుఁ
జింత తండ్రికి వర్ధిల్లె నంత కంత. 327

తే. తగినవరుఁ డెవ్వఁ డొక్కొ యీతలిరుఁబోఁడి!
కనుగుణుం డెవ్వఁ డొకొ విశుద్ధాభిజాత్య
పరమసౌభాగ్యభాగ్యసంపదల! కనుచు
నిత్యమును దండ్రి యాత్మఁ జింతించుచుండె. 328

తే. మూలనక్షత్రమునయందు మొదలికాలఁ
గన్య గండానఁ బుట్టినకారణమునఁ
గర్మఠుఁడు విప్రుఁ డానందకాననమునఁ
జచ్చెఁ జింతాజ్వరముపైన జ్వరము దాఁకి. 329

వ. శుభవ్రతయునుం బతి ననుగమించె. సులక్షణ దుర్గభావేశ
యయ్యును ధీరోదాత్త గావునఁ దాత్పర్యంబునం దలిదం
డ్రుల కౌర్ధ్వదైహికవిధులు నిర్వర్తించి నిజాంతర్గతంబున.

సీ. ప్రాణంబు ప్రాణంబు లైనతల్లిని దండ్రి
హృదయంబులోన నే నెట్టు మఱతుఁ?
బితృమాతృహీన నై యతిశూన్యవృత్తి నే
నెబ్భంగి నీఁదుదు నీభవాబ్ధి?
నేల కల్పించె నాకీరూపలావణ్య
సౌభాగ్యసంపద జలజభవుఁడు?
కులశీలరూపాదిగుణములు వీక్షించి
యెవ్వారి కీ నేర్తు నేన నన్ను?
తే. ననుచు నిర్వేదమునఁ బొందె నలరుఁబోఁడి
పురుషు నెవ్వనిఁ జిత్తంబు చొరఁగ నీక
బ్రహ్మచర్యవ్రతస్థితిఁ బదిలపఱిచి
యుత్తరార్కునికడఁ జేసె నుగ్రతపము. 331

ఉ. నిత్యము నిష్ఠతోడ ధరణీసురకన్యక కాశి నుత్తరా
దిత్యునిపార్శ్వదేశమునఁ దీవ్రతపం బొనరింప వచ్చి సాం
గత్యము చేసెఁ గూర్మి చెలికత్తియ కైవడి నొక్క మేఁక సం
ప్రీత్యనులబ్ధినంగనయుఁ బ్రేమ మొనర్చుచునుండెదానిపైన్.

తే. రాత్రి దూర్వాప్రవాళచర్వణ మొనర్చి
యుత్తరాదిత్యకుండిక నుదక మాని

331-వ పద్యమునకుఁ దరువాతఁ గొన్ని ప్రతులలో 'వ. ఇవ్విధంబున దపంబు సేయుచు నక్కన్యకారత్నంబు' అనియొకవచనముగనఁబడు చున్నది.

పగలు నాల్జాలు సేవించుఁ బద్మనయన
వత్సలత మీఱ *నలవోక వయసు మేఁక. 333.

వ. అంతం బెద్దకాలంబున నీలలోహితుండు ప్రత్యక్షం బై వరంబు వేఁడు మనిన సులక్షణ యవ్విరూపాక్షునకుఁ బ్రణమిల్లి యి ట్లనియె. 334.

తే. మీనకేతనదమన! యీ మేఁకపిల్ల
ప్రాణసఖివోలె నాయొద్దఁ బాయకుండు
శర్వ! యీనోరుమాలినజంతువునకు
మొదలు వర మిమ్ము వర మిమ్ము పిదప నాకు. 335

వ. అనిన విని శంకరుండు కరుణాకింకరం బైనకటాక్షాంకురంబునం గురంగాక్షిం గనుంగొని గౌరీహృదయానురాగంబునం బర్కరి యన్యజన్మంబునం గాశిరాజుపట్టపుదేవికిం గూఁతు రై పుట్టునట్లుగా వరం బొసంగె. బర్కరి పేర నయ్యుత్తరాదిత్యకుండంబు బర్కరీకుండం బనం బరఁగె. గుణానురాగిణి యైనగౌరి సులక్షణఁ దనకుం జెలికత్తియంగాఁ గైకొని జయ,విజయ,జయంతిక,శుభానంద,సునంద, కౌముది,యూర్మిళ, చంపకమాల, మలయవాసిని, కర్పూరతిలక, గంధధారశుభ, అశోక,విశోక, మలయగంధిని,చందననిశ్వాస,మృగమదోత్తమ, కోకిలాలాప, మధురభాషిణి, గద్యపద్యనిధి, బాలయను కృత్తజ్ఞ మొదలయినచెలికత్తియలనుం బోలె బ్రహ్మచారిణి యైనయయ్యాలివేణి నాదరించె. ఇది యుత్తరార్కమాహాత్మ్యం బనుటయు నైమిశారణ్యవాసులు మహాత్మా! యింకనుం గాశికానగరపంచక్రోశపుణ్యక్షేత్రం

* 'నెలవ్రోక' అని ముద్రితప్రతి.

బునం గలదేవతాస్థానంబులు, పుణ్యతీర్థంబులు వివరించి మమ్ముం గృతార్థులం జేయు మనుటయు. 336

ఆశ్వాసాంతము.

శా. ధారాపట్టణసార్వభౌమ సురథాణ్దర్పాపహారక్రియా
ధౌరంధర్యపటిష్ఠనిష్ఠురభుజాదంభోళిసంరంభ ! దా
క్షారామప్రమదాకటాక్షలహరీవ్యాపారనీరాజితా
కార శ్రీజితమత్స్యకేతన ! సమిద్గాండీవబాణాసనా! 337

క. వేంగివిషయాధీశ్వర !
సంగరగంగాతనూజ ! సాహిత్యకళా
సంగీతలక్ష్యలక్షణ
భంగీసర్వజ్ఞ ! విమలపాండిత్యనిధీ ! 338

మాలిని. చతురుదధిచతుర్దిక్సాధవీథీవిటంకా
ప్రతినవబహుముక్తారంగవల్లీమతల్లీ
ప్రతిమవిమలకీర్తీ ! పంచనారాచమూర్తీ !
వితరణగుణభోజా! వేమమాంబాతనూజా! 339

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతం బైనకాశీఖండం బనుమహాకావ్యంబునందుఁ బంచమాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# ష ష్ఠా శ్వా స ము.

క. ఆశ్రితకటాక్షవీక్షణ
విశ్రాణన! విభవవిజితవిద్యాధర ! వ
ర్ణాశ్రమరక్షాతత్పర!
యాశ్రితమందార! రెడ్డియల్లయవీరా ! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

## సాంబాదిత్యమాహాత్మ్యము.

సీ. యదువంశమునయందు నవనిభారాపనో
దార్థంబు దుష్టదైత్యావలేప
హరణార్థముగఁ బుట్టె నంభోజనాభుండు
దేవకికిని వసుదేవునకును
ద్వారవతీపురాధ్యక్షుండు దైత్యారి
యవరోధకాంతాసహస్రములకుఁ
గాంచె నందనుల లక్షయునెనుబదివేలు
మాన్యులైనప్రధానమహిషులందు
తే. జాంబవతి యనుదేవికి సాంబుఁ గనియె
నక్కుమారుండు లేఁతప్రాయంబునందు
వీథి నొకనాఁడు సఖులతో విహృతి సలుప
నెచట నుండియొ నారదుం డేగుదెంచె. 3

క. ఆటతమకమున నమ్మథు
కైటభరిపునందనుండు గౌరవబుద్ధిఁ

భాటింప నేరఁ డయ్యెను
హాటకగర్భునితనూజు నభ్యాగతునిన్. 4

ఉ. తోడికుమారులుం సఖులు దూరమునందక రారవిందముల్
మోడిచి ఫాలభాగమున మోపినమస్కృతు లాచరింపఁగా
నాడుచు నుండెఁగాని ముని కంజలిసేయఁగ నేరఁడయ్యెన
వ్వేడుక కాఁడు పుట్ట దొకవేళ వివేకము దొడ్డవారికిన్. 5

చ. త్రిదశమునీశ్వరుండునుమదింగలుషంబొకమూలనుండఁగా
యదుకులసార్వభౌముఁగని యర్చనగైకొని యిష్టగోష్ఠితో
ముదితల నమ్మియేమఱుట మోససుమీ! యనిబుద్ధిచెప్పుచ
చ్చదురునసన్న సేయఁదగజాంబవతీసుతునెన్నెధూర్తుఁగాన్.

తే. ఎన్ని యాతోయమున మిన్న కేగి దివికి
నారదుఁడు శౌరిచేత సత్కార మొంది
నెరసు వొడఁగానలేఁ డయ్యె నెమకి నెమకి
సాంబుపైఁ బాంచజన్యరథాంగపాణి. 7

వ. అంతం గొన్నిదినంబులకు.

తే. సాంబు నడచినదాఁక వ్రతంబు పట్టి
జలజసంభవతనయుండు చలపకారి
ద్వారవతి కేగుదెంచె నంతఃపురములఁ
బుండరీకవిలోచనుం డుండు టెఱిఁగి. 9

తే. వెదకి సాంబునిఁ బొడగాంచి విబుధమౌని
హరికిఁ దనరాక నెఱిఁగింపు మనుచుఁ బలికెఁ
బోవు టనుచిత మొప్పదు పోవ కునికి
యేమి సేయుదు పని యాతఁ డిచ్చుఁ దలఁకి. 10

వ. ఎట్టకేలకు శుద్ధాంతగతుం డై నతండ్రిసమీపంబున కరిగి

యవ్వేళ గమనాపరాధంబు గారణంబుగా శౌరిచేతం గుష్ఠ
వ్యాధిబాధితుండు గా శపింపంబడి సాంబుండు. 11

తే. తండ్రికిని నారదునికి వందనము సేసి
జాంబవతిపట్టి శాపావసాన మెఱిఁగెఁ
గాశికకు నేగి యత్యంతగాఢభక్తి
భాను సేవింప నీవ్యాధి మాను ననియు. 12

వ. ఇట్లు నారదానుమతిం గృష్ణుచేత శాపమోక్షప్రకారం
బెఱింగి సాంబుండు కాశికరిగి తదుపదిష్టమార్గంబున భాను
సేవించి కుష్ఠవ్యాధిబాధావిముక్తుం డయ్యె. ఇది సాంబా
దిత్యమాహాత్మ్యంబు. 13

గరుడాదిత్య మయూఖాదిత్య ఖఖోల్కాదిత్యారుణాదిత్యమాహాత్మ్యము.

సీ. పరమసంయమి కశ్యపప్రజాపతికిని
వినత కాత్మజుఁ డైనవిహగభర్త
విషధికుక్షినిషాదవితతి భక్షించుచో
ద్విజుఁ గ్రాసి యుమిసినవిమలబుద్ధి
యిభకచ్ఛపముల రోహిణిశాఖితోఁ దాల్చి
దివిమీఁదఁ బాఱినపవనవేగి
యరికోటి గెల్చి చిచ్చార్చి చక్రము దాఁటి
యమృతంబుఁ దెచ్చినయసమబలుఁడు

తే. జిష్ణుపవి కొక్కయీఁక యిచ్చినప్రదాత
యచ్యుతునివాహనము తార్క్ష్యుఁ డగ్రజులును
దానుఁ దల్లియుఁ గాశికాస్థలమునందుఁ
గొలిచి రర్కుల నలువురఁ గుంభజన్మ! 14

వ. అని చెప్పిన విని యగస్త్యుండు హస్తంబులు మొగిడ్చి పార్వతీ
హృదయానందవర్ధన! కుమార! యొక్కసందేహంబు నడ

గెదం దెలియ నానతిమ్ము. దక్షప్రజాపతిపుత్త్రి కశ్యపప్రజాపతిపరిగ్రహంబు గరుత్మంతునిజనని వినత యేమికారణమున దాస్యంబు వహించె నని యడుగుటయు బాహులేయుం డు కుంభసంభవున కి ట్లనియె. 15

తే. సవతి కద్రువ శేషతక్షకులు మొదలు
గాఁగ వేవురు భుజగపుంగవులఁ గాంచె
నండముల మూఁటఁ గలధౌతగండశైల
సన్నిభంబులఁ గనెఁ బుణ్యసాధ్వి వినత. 16

ఉ. ఆదిమమైనయండమునయం దుదయించెను గూబపుల్గు సూ
ర్యోదయవేళ ముజ్జగము నుబ్బరపోవఁగ నయ్యులూకమ
ష్టాదశసంఖ్యదీవులకు సర్వవిహంగమకోటికిఁ మహా
హ్లాదము గా వహించెను లలాటమునం దధిరాజపట్టమున్.

తే. ఖగములకు నాదిజం బైనకారణమున
సమ్మతించి విహంగమజాతి మొదలఁ
గౌశికము రాజ్యయోగ్యంబు గా దటంచు
నగియెఁ బిమ్మట దుర్లక్షణములు సూచి. 18

సీ. భంగించిన ట్లుండుఁ బడఁతె మాటికి మాటి
కూర్ధ్వకంపంబు సేయుటకతమున
జంకించిన ట్లుండు శ్రవణనిష్ఠురముగాఁ
జెలఁగి ఘూత్కారంబు సేసె నేని
బెదరించిన ట్లుండుఁ బృథువర్తులములైన
దృగ్గోళకంబులు దిరుగఁబడిన
గర్వించిన ట్లుండు ఘస్రంబు నాల్జాలు
నెదిరిఁ దన్నునుఁ గాంచు నెఱుక లేమిఁ

తే. బుట్టుపుణ్యంబుమాలిన చెట్టపులుగు
గూబ యెక్కడఁ? గలహంసకోకకీర
నీలకంఠాదిబహుపక్షినివహరాజ్య
భార మెక్కడ? నిది యసంబద్ధ మనుచు. 19

వ. కులము పెద్దలు పరాభవించిన. 20

ఉ. గద్దియ డిగ్గి †కాశికుఁడు గాదిలిసూనుఁడు గొండ వట్టినన్
ముద్దియ దక్షుకూఁతురు వినూఢత రెండవపుత్త్రునైన నుం
దద్దయు వేడ్కఁ జూతు నని తాలిమి లేక నఖాంకురంబునం
బిద్దముచేసెమై సగమునిండనిగర్భముతోడియండమున్. 21

వ. అపరార్ధకాయహీనుండును బూర్వార్ధతనుండును నైనపు
త్త్రుం డనూరుం డన నుద్భవించి యపకారంబు నేసినతల్లిం
గినిసి సవతికి దాసివి క మ్మని శపియించిన. 22

సీ. ఏలరా నాయన్న! యేకాపరాధంబు
సైరింప వైతివి శాపమునకు
మోక్ష మెన్నఁడు గల్గు నక్షీణకారుణ్య!
గరిమఁ జెప్పర యాత్మ గలఁగె నాకు
ననవుడుఁ బిచ్చుకుం టమ్మతో ని ట్లను
నేనూఱువర్షంబు లేగునంత
మూఁడవయీయండమున నుద్భవించిన
తనయుండు తల్లి! నీదాస్య ముడుపు
తే. నేమరక దీని రక్షింపు మీవు నియతి
ననుచు బుద్ధులు చెప్పి యయ్యరుణుఁ డరిగె

† 'కశ్యపుని గాదిలిసూనుఁడు' అని వ్రాతప్రతిపాఠము. 'కాశికేఽడ
తథాప్యత్తే' అని సంస్కృతమూలము.

జననియనుమతిఁ గాశికాస్థానమునకుఁ
దారక బ్రహ్మవిద్యానిధానమునకు. 23

వ. ఆశాపంబు కారణంబుగా నొక్కనాఁడు కద్రూవినతలు సముద్రతీరంబున వినోదార్థంబు విహరించువారు వేలావనధి ప్రాంతంబున మరుత్వంతునితురంగం బుచ్చైశ్శ్రవంబు మేయుచున్నం గనుంగొని వినత 'యోహో! యీహయో త్తమం బింత యొప్పునే? మహాపురుషునికీర్తిపూరంబునుం బోలెఁ గార్తికచంద్రచంద్రికాధవళం బయియున్నయది;' యనినఁ గద్రువ యేకన్నులఁ గనుఁగొంటివి ? తురంగంబు నందు నిందుబింబంబునందుఁ గందునుం బోలె వాలధి యందు వాలంబు లొక్కకొన్ని నీలంబు లయియున్నయవి యని పలికె. ఆ యనియునుం, గా దనియునుం గొంతతడ విద్దలు వాదంబు సేసి దాస్యంబు పణంబుగాఁ బన్నిదంబు చఱచిరి. అప్పా ర్వద్దునకుం బ్రొద్దు చాలమి నిజనివాసంబుల కరిగిరి. మఱునాఁడు ప్రాతఃకాలంబునఁ గద్రువ కొడుకులం బనిచినం గొంద ఱక్కార్యంబు సమ్మతింపక కినుకం బడిరి. కొందఱు వాలమాత్రసూక్ష్మాకారంబులు వహించి వాలం బునందు వ్రేలిరి. వినత యోటువడి కద్రువకు దాస్యంబు సేయుచుండె.మఱియేనూఱువత్సరంబులకుఁదృతీయాండం బునం దుదయించినగరుత్మంతువలన నమృతాపహరణంబు నిష్క్రియంబుగా దాస్యంబువలన విముక్తిం బొందె. కుంభ సంభవ! నీయడిగినప్రశ్నంబులకు నిది ప్రత్యుత్తరంబు. 24

సీ. పత్నీసామ్రాజ్యసంపత్పదభ్రంశంబుఁ
బొందిన పెనుగూబపులుఁగుఱేఁడు

కటిభాగమున కథగికాయంబు శేషంబు
పేలవం బగుపుట్టుపిచ్చుకుంటు
సపతి కేనూఱువత్సరములదాఁక దా
స్యంబు సేసి కృశాంగి యైనవినత
యనిలాశనముల వీఁపునఁ బెద్దకాలంబు
భరియించి తిరిగినపక్షిరాజు
తే. తరలి నలువురుఁ గాశికాస్థానసీమ
హరుని ప్రతినిధు లైనభాస్కరులఁ గొలిచి
యచిరకాలంబునన యభీష్టార్థసిద్ధిఁ
గనిరి ప్రతిబంధములు వాసి కలశజన్మ! 25

వ. గరుడుని పేర గరుడాదిత్యుండును, నులూకంబు పేరమయూ
ఖాదిత్యుండును, వినత పేర ఖఖోల్కాదిత్యుండును, నరు
ణుని పేర నరుణాదిత్యుండును ననం బరఁగిరి. ఇంక వృద్ధా
దిత్య కేశవాదిత్య విమలాదిత్య గంగాదిత్య యమాదిత్యుల 26
మాహాత్మ్యంబులు సెప్పెద నాకర్ణింపుము.

సీ. వృద్ధహారీతుండు వృద్ధత్వమునఁ బాసి
తరుణుఁ డై హరిఁ గొల్చి వరము వడసె
†ఆదికేశవదేవుఁ డభ్యాశమున నుంచి
రవి శంభుఁ గనిపించె రత్నమూర్తి
విమలాహ్వయుఁడు రాజు గమలబంధు భజించి
ప్రబలకుష్ఠవ్యాధిబాధఁ బాసెఁ

† ఇది ప్రాఁతవ్రాఁత ప్రతులపాఠము. సంస్కృతమూలమునకుఁ గొంత వఱకు సరిపడుచున్నది. పూర్వముద్రితగ్రంథమున "ఆదికేశవదేవుఁ డభ్యాశమున నుబ్బి, యనిశంబు గొల్చిన యర్కమూర్తి" యనియున్నది. ఈ పాఠము చింత్యము.

ప్రాసాదపర్వతలింగంబు లివి యష్టషష్ట్యాయతనంబులు. 190

సీ. శ్రీవిశాలాక్షిచే శిశిరభానుకిరీటు
నర్ధాంగలక్ష్మిచే నగజచేత
లలితచేఁ దరుణపల్లవపాటలాంగిచే
జవరాలిచే లోకజననిచేతఁ
బూఁబోఁడిచే విశ్వభుజచేత హ్రీంకార
వనజవాటివిహారవరటచేత
శివదూతచేతఁ బశ్చిమనాడికావీథిఁ
బరమయోగులు గాంచుఫలముచేతఁ

తే. చిత్రకంఠికచే నీలచికురచేత
భద్రకాళికచే దైత్యభయదచేత
నిగళభంజనచేఁ గృపానిఘ్నచేతఁ
గరిమ గైకొనె శ్రీకాశికాపురంబు. 191

తే. గుజ్జుమోకమావి కుబ్జామహాదేవి
భక్తలోకకీరపతగములకుఁ
గమల గమలనాభుగారాబుదేవేరి
గ్రామదైవతములు గాశినగరి 192

సీ. ఐరావణము నెక్కి యశని చే ధరియించి
యైంద్రి ఘంటావీథియందు మెలఁగు
విహరించు శృంగారవిపినవీథులయందుఁ
గౌమారి శిఖిశాబకంబునెక్కి
చంద్రశేఖరునాదిశక్తి మహేశ్వరి
యాఁబోతు నెక్కి వాహ్యాళి వెడలుఁ
జదలేటిసైకతస్థలుల వినోదించు
నలువరాణి బ్రాహ్మి రాయంచ నెక్కి

తే. విహగపతి నెక్కి వైష్ణవి ప్రహరి దిరుగుఁ
బంచమియును జాముండియు సంచరింతు
రాత్మవాహనముల నెక్కి యహరహంబు
ననఘ ! శ్రీ కాశికాపురాభ్యంతరమున. 193

తే. చిత్రఘంటామహాదేవి శివపురంధ్రి
గౌరి నెవ్వాఁడు సేవించుఁ గాశినగరి
నాతఁడు వినండు ప్రాణప్రయాణవేళ
యమలులాయక ఘోరఘంటారవంబు. 194

శా. ఝుంకించుం గరతర్జనీముఖమునన్ శైలేశ్వరీదేవి గా
శ్యంకస్థాయిని భక్తకోటిబహువిఘ్నౌఘంబులన్నిచ్చలున్
హ్రీంకారాక్షరమంత్రసౌధశిఖరక్రీడాకళాలోల సా
హంకారామరవైరిమర్దనవిధివ్యాపారపారీణ యై. 195

గీ. భద్రనాగమహాతీర్థపరిసరమున
భద్రవాపికయందు నాప్లవ మొనర్చి
భద్రకాళిక వీక్షించి పంచజనుఁడు
భద్రసంస్థితిఁ గాంచు వింధ్యాద్రిదమన ! 196

క. సిద్ధివినాయకు గెడ వర
సిద్ధిఁ ద్రిసంధ్యంబు సేవసేసిన నెరయన్
సిద్ధించును మనుజునకును
శ్రద్ధావంతునకు విభవసంపత్సిద్ధుల్. 197

క. విధిశక్తిఁ గాశికాపుర
నిధి నిరుపమనిరభిసంధినిరవధికకృపా
భ్యధిక విధీశ్వరశివుస
న్నిధిఁ గొలిచిననరుఁడు గాంచు నిరుపమసిద్ధుల్. 198

గీ. అధికభక్తితోడ నమృతేశ్వరీదేవి
సిద్ధలక్ష్మి సంభజించి నరుఁడు
నిడివిగాఁగ బ్రదుకు విడువంగ ముడువంగ
వ్రేఁక నైనకలిమి వృద్ధిఁ బొందు. 199

వ. వెండియుఁ ద్రిలోకసుందరి యనుకందర్పదమనుశక్తి యవి
ముక్తక్షేత్రంబునకుఁ గస్తూరికాతమాలపత్రంబు. శ్రీకంఠ
సన్నిధియందు మహాలక్ష్మి భజించువారలకు భోగమోక్ష
లక్ష్ములనొసంగు. లక్ష్మీపీఠంబు సాధకాభీష్టదంబు. గమలా
పీఠంబున కుత్తరంబున హయకంఠియనుదేవి కఠిన తర
కుఠారధారాఘుట్టనంబున విఘ్నద్రుమషండంబు ఖండించు.
పాశపాణిదక్షిణంబునఁ గౌర్మిశర్మంబులు ఘుంటించు. వాయ
వ్యభాగంబున శిఖిచండి శిఖండినీరూపధారిణి యై జాము
జామునఁ గేకాధ్వనులు సేయు. భీమచండి యుత్తర
ద్వారంబు రక్షించుచుండు. 200

గీ. కాశిభీమేశ్వరునిచక్కఁ గట్టెదురునఁ
బాశపుష్కరపాణి యై భద్రకాళి
భీమచండి మహాదేవి భీమకుండ
పార్శ్వభూమండలంబునఁ బాయకుండు. 201

గీ. భాగవక్త్రేశ్వరీదేవి శంభుశక్తి
వృషభకేతనుయామ్యాదిగ్వీథియందుఁ
గదిసి సేవించువారివిఘ్నముల నెల్ల
మేయుఁ జిగురాకు భక్షించు మేఁకవోలె. 202

గీ. తాటిపాడవున నవిముక్తధామసీమ
తాళజంఘేశ్వరీదేవి తలిరుఁబోఁడి

విఘ్నములఁ జీరి కొట్టును వెదకి వెదకి
తాటికంబంబు సవ్యహ_స్తమునఁ దాల్చి. 203

క. వికటానన యనుదేవత
మకుటాంగదకటకహారమండన కాశీ
నికటమున నుండుఁ బాయక
యకలంకశశాంకశకల మాదల నుండన్. 204

క. ఉద్దాలకతీర్థంబున
నుద్దాలకనామధేయుఁ డుడుపతిమకుటుం
డుద్దండదండధరమద
భిద్దోర్గఖట్వాంగుఁ డుండుఁ బ్రియ మెసలారన్. 205

గీ. అందు వసియించు యమదంష్ట్రి యనెడుదేవి
పూర్వదిగ్భాగమునకు విభూష యగుచు
నమ్మహాశ_క్తి నవమందహాస మైన
మెల్లచూపున వలపించు మృదునివానసు. 206

గీ. దారుకేశ్వర మనెడుతీర్థంబునందు
దారుకేశ్వరదేవు నిద్ధప్రకాశుఁ
దారకేశ్వరరేఖావతంసు శివునిఁ
దారకబ్రహ్మనిధిఁ గొల్చు ధన్యతముఁడు. 207

సీ. ఆదారుకేశ్వరం బనుదీర్ఘ మేలెడు
దారుకేశ్వరుని ప్రత్యంతభూమి
స_ప్తపాతాళవిష్కంభ తాలుద్వయ
భీకరంబును దందశూకరాజ
జిహ్వాతలంబును జీమూతవిద్యు_త్త
రోష్ఠంబు నూర్ధ్వాధరోష్ఠదళము

దార కానక్షత్రదళనమండలము వి
ద్యుద్దండదంష్ట్రాచతుష్టయంబు
నైనవదనంబుఁ దెఱచి బ్రహ్మాండపిండ
కబళనమునకుఁ జేసాచు కాళరాత్రి
కాళి శుష్కోదరీదేవి గదల కుండుఁ
జర్మముండకుఁ జెలికత్తె శైలదమన! 208

జంగాళముగ వ్యాఘ్రచర్మాంబరముఁ గట్టి
శూలంబు వలచేతఁ గీలుకొలిపి
భస్మత్రిపుండ్రంబు ఫాలపట్టికఁ దీర్చి
నిద్దంపుఁజిలువజన్నిదముఁ దాల్చి
చనుదోయిఁ గీకసస్రక్కలాపము పూని
తనువల్లి రక్తకర్దమ మలంది
గరళాంజనము కల్కిక్రాలుకన్నులఁదీర్చి
మధుపానమున నుబ్బు మదికి నొసఁగి
వాసి గల్గి మహాప్రేతవనమునందు
సంతతంబును విహరించుఁ జర్మముండ
రుండమండన యై యుండు రూఢిఁ జర్మ
ముండయట్ల మహారుండ మునివరేణ్య! 209

శా. హాలాపాన మొనర్చి యిద్దఱును నన్యోన్యంబు మత్తిల్లి కం
కేళీనృత్తవినోదకందుకమణిక్రీడావిహారక్రియా
లీలాహాస్యకళాప్రసంగముల నుల్లేఖించి వర్తింతు రె [తల్.
క్కాలంబుల్ ఘటజన్మ! కాశినదుర్మా గర్వించి యద్దేవ

భుజంగప్రయాతము.—
హయగ్రీవతీర్థంబునం దభ్రగంగా
పయోవేణి నిర్ధూతపాదారవింద

ద్వాయారత్న పీఠాంకఁ దాళ్ప్రమాణక్
భయఘ్న న్మహారుండ భావింతు రార్యుల్. 211
వ. మహారుండకుం బశ్చిమదిగ్భాగంబున స్వప్నేశ్వరి. ఆస్వప్నే
శ్వరి భజించువారలకు భూతభవిష్యచ్ఛుభాశుభార్థంబులు
గలయందుం దెలుపుచు నవమ్యష్టమీచతుర్దశీదివసంబులం
బూజఁగొను. ఆస్వప్నేశ్వరికి వరుణదిగ్భాగంబునదుర్గాదేవి.
ఆదుర్గ కాశీక్షేత్రంబున దక్షిణద్వారదేశంబు రక్షించుచుం
డు ననినం గుంభసంభవుండు శంభుతనూభవున కిట్లనియె.
గీ. తుహినగిరిరాజకన్యక దుర్గయయిన
కారణం బేమి? కందర్పవైరితనయ!
ఆనతిమ్మన్న గుహుఁడు వింధ్యాద్రిదమన!
వినుమనుచుఁ జెప్పఁ దొడఁగె సవిస్తరముగ. 213

## దుర్గామాహాత్మ్యము.

వ. దుర్గుండనఁగ నొక్కరాక్షసుండు రురునికొడుకు తపోబలం
బున నవధ్యుఁడై భూర్భువస్స్వర్భువనంబుల బాధింపం
దొడంగిన దేవతలు మహేశ్వరు నభయంబు వేఁడిరి. శివుం
డును రాక్షసునిం భంజింప దాక్షాయణి నియోగించిన. 214
గీ. గౌరి వింధ్యాద్రి కేతెంచి కాళరాత్రిఁ
బంచె రాత్రించరేంద్రునిఁ బట్టి తేరఁ
జంపఁ బాతాళమున కంపఁ జాలునట్టి
శక్తియును నేర్పు నిచ్చి యైశ్వర్య మొసఁగి. 215
వ. కాళరాత్రియు రుద్రాణియాజ్ఞ శిరంబునఁ దాల్చి యద్దైత్యు
సన్నిధి కరిగి యతనితో ని ట్లనియె. 216
గీ. కాయుబారంబు వచ్చితి రాక్షసేంద్ర!
[illegible]

బుద్ధిమంతుఁడ వై తేని భువనములకు
బాధ సేయక యుండు నిష్పాపబుద్ధి. 217

వ. వేదోక్తంబు లైనసర్వక్రియాకలాపంబులుం బ్రతిష్ఠింపం
బాలుపడ్డయది భవాని. అమ్మహాదేవియాజ్ఞం జేసి పెద్దకా
లంబు బ్రతుకుము. కాదేని బంట వై యకుంఠితోత్సాహం
బున నకుంఠీరవవాహతోడ యుద్ధము గావింపుము. 218

తే. హితము సెప్పితి విన నేర్చి తేని లెస్స
జగము బాధింప కుండుట చాలు మాకుఁ
దుహినగిరికన్యయానతిఁ ద్రోచి తేని
యిాడ్చికొని పోదు వెంద్రుక లిరియఁబట్టి. 219

వ. అని గర్వించి పలికినకాళరాత్రిం జూచి కనలి రాత్రించ
రేశ్వరుండు. 220

సీ. అట్టహాసము చేసి యోరోరి! ప్రతాపోక్తు
లాఁటదానికి నింత యదటు వలదు
యే మన్న ననియెఁ గా కేమి మీయేలిక
సాని వచ్చితి వీవ చాలు మాకు
జగదేకసామ్రాజ్యసంపత్తియును బోని
యీ వుండవలదె మాయింట నెపుడు?
నేతదర్థమ కదా ఋషి దేవతాకోటి
బందిఁ బెట్టినవాఁడఁ బట్టి తెచ్చి

తే. వంటయిలు సొచ్చెఁ గుందేలు వనజనయన!
మెచ్చినారము విధి నిన్నుఁ దెచ్చినపుడ
యడవిలోపల నున్న గేహమున నున్న
బొందఁగలభాగ్యవిభవంబు పొందు బురుషు. 221

వ. అని యంతఃపురచరుల 'దీని నభ్యంతరంబునకుం గొనిపొం' డని పలికినం గళవళింపక కాళరాత్రి రాత్రించరేశ్వరున కిట్లనియె. 222

ఉ. నీతివిదుండ వీవు రజనీచరవంశవరేణ్య! యర్హమే
దూతలమాటకుం గినియ! దూతలు నేరక యాడినప్పుడుం
గాతురు దప్పు విశ్వనయకార్యధురంధరులైన భూపతుల్
దూతకు నిష్టసిద్ధి కయి తూలఁగ నాడఁగఁ జెల్లు భూపతిన్.

సీ. నయపరాక్రమము లెన్నఁడు బ్రయోగింపవే
దేశకాలములు శోధించి చూచి?
నన్నుఁ బట్టఁగ నేమి యున్నది? పట్టంగ
రాదె నన్నే లెదురాజవదన?
నెంద అబ్బురు నీకు నేనుసైతంబుగాఁ
బర్వతాత్మజ పట్టువడ్డయప్పు
డే నాఁక నున్నప్పు డెవ్వారు చూపెద
రింక నెఱింగి యయ్యిందువదన?

తే. వేఁటకానికి మృగము లేవెంట వచ్చుఁ
దెలియుమా దీముఁ గాలిచి తిన్న పిదప?
నన్నుఁ బట్టియ సాధింపు నగతనూజఁ
బ్రథననిర్జితదిగధీశ! రాక్షసేశ! 224

తే. కాంతఁ గందువఁ బెట్టి నీకడకు మేలు
చెప్ప వచ్చిననన్ను శిక్షింపఁ దగునె?
మొనసి హితమాచరించిన 'ముందముక్కు
కోఁతపడె' ననుమాటయె గోచరించె. 225

శా. నీయాజ్ఞన్ గడుగాసి వెట్టెదరు నర్ణ బెక్కంద్రు రంతఃపుర
స్థాయుల్ దుర్ధరుల్ ... గొప్పనుం

జేయుం జెట్టయుఁబటి రాజులుపరస్త్రీ నింత సేయింతు రే?, న్యాయంబా యిది? మాన్పుని గ్రహము మేలందింతునీ కెమ్మెయిన్.

అని కాళరాత్రి సకరుణంబుగాఁ బలుకం గ్రోధాంధుం డై యవ్విబుధవిరోధి వినియు విననియట్ల యూరకుండె. పాద పాద మని సావిదల్లులు హస్తపల్లవంబులు పట్టి తివిచిన నప్పంకజాక్షి కంకణఝుణఝుణత్కారంబుగాఁ గేంగేలు సదిలిచితివిచికొని వికటకుటిలభ్రుకుటినటనభీషణఫాలఫలకయై కలకలం గటికినగవు నగి కన్నులనిప్పులురుల హుంకారంబు సేసినం గల్పాంత కాలాదికరాళ కాళవ్యాళ ఘనాఘన ఘటాకఠోరదీర్ఘ నిర్ఘాతచ్ఛటాపాతంబునకుఁ దాత యగునా నిర్ఘోషంబు విని గుండియ లవిసి బెండువడి యంగజాలలు గాలుగాలం బెనచుకొని చాఁపకట్టుపడం గూలిన నచ్చెరువు మచ్చరంబును గోపంబును నాటోపంబు నెఱయ మెఱయ దుర్గాసురుండు ఖడ్గ ఖేటకంబులు ధరియించి డిగ్గన గద్దియదిగ నుఱికిన నప్పు డడ్డంబు సొచ్చి దుర్ముఖుండును సీరపాణియుఁ బాశపాణియు సురేంద్రదమనుండు ఖడ్గరోముండు నుగ్రాక్షుండు దేవకంపనుండు నహంపూర్వికాసంఫుల్లపుటంబులగు చేతస్సంపుటంబులం బుటపుటనియవష్టంభంబుపూని కుంభినీధ్రసన్నిభాకారులు కుఠారభిండివాలమండలాగ్రత్రిశూలపట్టిసప్రాసతోమరంబులు ధరియించి యమ్మహాదేవిం

227

జుట్టుముట్టి పట్ట నురువడించిన.

ఘనరౌద్రోద్ధతిభద్రకాళికకటాక్షజ్యోత్స్నఁ గెంపారనుహ్వా
నివక్త్రంబు బిగించి యూఁదుటయు నుల్కాగ్నిచ్ఛటల్ గ్రమ్మవె
ల్వనిజంఝాపవమానముప్పతిలి రక్షఃకోటి నొక్కుమ్మడిన్
గొని పోయెన్ వినువీథిఁ జొప్పడక నాఁడుం బోలెనెందేనియున్.

తే. పగర నిబ్భంగి శతకోటిఁ బొఱ నూఁదిఁ
కఠినవాసం బొనర్చి యక్కాళరాత్రి
యరిగె నాకాశవీథి వింధ్యాచలమున
కసురయును శక్తి వెన్నాడి యరుగుదెంచె. 229

తే. అంబరక్షోణిచక్రమధ్యంబు నిండి
కోటి కోటి నిశాటులు గొల్చి నడువఁ
గాళరాత్రి మహాశక్తిఁ గదిసి వెంట
నేగుదెంచె దుర్గాసురుం డేకథాటి. 230

వ. అప్పుడు శతకోటిరథంబులు నర్బుదశతద్వయగజంబులు గోట్యర్బుదహయంబులు నసంఖ్యాతయోధులుం గొలువ వచ్చుదుర్గాసురునిముందట బృందారకమార్గంబున నిరర్గళాటోపంబున నేతెంచుకాళరాత్రిని దవ్వుదవ్వులం గాంచి మహాభుజసహస్రాఢ్యయు మహాతేజోపబృంహితయు మహాఘోరప్రహరణ పరంపరాధగద్ధగితధామచ్ఛటాచ్ఛోటితాంబరయుఁ బ్రోద్యచ్చండమార్తాండమండల సహస్రకాంతి తేజశ్చక్రమధ్యవర్తినియు లావణ్యవార్ధి సమృద్ధిచంద్రికయుఁ ద్రైలోక్యకల్యాణమంటపప్రదీపికయు నైయాసర్వమంగళకట్టాయితం బై నిలిచె నప్పుడు. 231

తే. ధరణీధరరాజతనయపాదముల కెఱఁగి
కరసరోజద్వయము మోడ్చి కాళరాత్రి
యాదినుండియుఁ దనదువృత్తాంత మెల్లఁ
బూసగ్రుచ్చినచందానఁ బోసఁగఁ జెప్పె. 232

వ. అనంతరంబ దుర్గాసురుండు వింధ్యాటవీమధ్యంబునబలంబు విడిసి జంభ మహాజంభ కుజంభ వికటానన లంబోదర పింగాక్ష మహిషగ్రీవ మహోగ్రాత్యుగ్రవిగ్రహ క్రూరా

స్యె క్రోధన సంక్రందన మహాభయ జితాంతక దుందుభి
వృకానన సింహాస్య సూకరాస్య ఖర శివారావ మహో
త్కట శుకతుండ ప్రచండ ముండ మహాభీషణాదు లగు
దొరల రావించి యందఱం గలయం గనుంగొని యుచ్చై
స్స్వనంబున ని ట్లనియె. 233
తెం పెసలారఁ గా మనల దీకొనియున్నది యొక్క లేమదో
స్సంపద వింధ్యభూధరవిశాలశిరస్థ్సలి నీతలోదరిం
జంపక పట్టి తేవలయుఁ జయ్యన నేగి సరోరుహాక్షులం
జంపకపుష్పకోమలులఁ జంపుట ధర్మమె? వీరకర్మమే? 234
ఛలమున నొండెను నొండెను
బలమున బంధించి యొండెఁ బ్రార్థనలీలా
కలనమున వేగ కొని రా
వలయుఁ దరుణిఁ గంద కుండ వాడక యుండన్. 235
క్రచ్చఱ నెవ్వఁ డేనిఁ గసుగందక యుండఁ జకోరలోచనం
దెచ్చునుపాయమార్గమునఁ దెచ్చినయప్పుడయేనువానికిన్
మెచ్చుడివోవకుండమఱిమీఁదటియోగులువేయునుండనీ
యిచ్చితి నింద్రలోకపదమిందఱుసాక్షిగఁబొందుగ్రమ్మఱన్.
అనుటయు సన్నద్ధులై రాక్షసులు సంవర్తకాలంబున జల
ధులు మేర దప్పినవిధంబున భువనంబులు ముంచి మంచుఁ
గొండకూఁతుపై విజృంభించి శంఖభేరీపటహకాహళారా
వంబు రోదసీకుహరంబు పూరటిల్లం జేయ ధాత్రీమండలంబు
వడవడవడంక నడచి రాసంరంభంబున. 237
తే. శక్తి రాక్షసుతోడ రాక్షసుఁడు శక్తి
తోడఁ దలపడ సమధికాద్భుతము గాఁగ
ద్వంద్వయుద్ధంబుసాగె వింధ్యంబుమీఁదఁ

బ్రకటనిష్ఠురబహువిధ ప్రహరణములు. 238

వ. త్రైలోక్యవిజయతోడ దుర్ధరుండును, దారతోడదుర్ముఖుండును,జయతోడ శిరుండును,త్రైలోక్యసుందరితోడసీరపాణియుఁ,ద్రిపురతోడఁ బాశపాణియుఁ,ద్రిజగన్మాతతోడ సురేంద్రదమనుండును,ద్రిపురభైరవితోడ దేవకంపనుండును, గామాక్షితోడ ఖడ్గరోముండును,గమలాక్షితోడ వజ్రపాణియుఁ, ద్రిపురతాపనితోడ బిడాలాక్షుండును, జయంతితోడఁ గుక్కుటాస్యుండును, విజయతోడఁ గపింజలుండును, నపరాజితతోడఁ గాకవక్త్రుండును, శంఖినితోడ ఘూకరవుండును, గజవక్త్రతోడ శంఖకర్ణుండును, మహిషఘ్నితోడ జాలంధరుండును,రణప్రియతోడ బకుండును,శుభానందతోడఁ గిమ్మీరుండును, గోటరాక్షితోడ ధూమ్రవర్ణుండును, శివారవతోడ ధూమ్రాక్షుండును, త్రినేత్రతోడఁ బింగాక్షుండును దలపడినం బోరు ఘోరం బయ్యె నయ్యవసరంబున. 239

శా. ద్యావాపృథ్వ్యవకాశముల్ బుగులుకోనందంద వింధ్యాద్రి
ఘం,టావీథిఁ జెలఁగెఁ గఠోరతరకంఠ క్ష్వేళనాదంబుతో
దేవీదానవకోటినిష్ఠురభుజాలి ప్రాథనానాధను
జ్యావల్లీభవభూరిధాంకృతు లురుద్రాఘిష్ఠదీర్ఘధ్వనిన్. 240

క. శక్తులతో సరి పోరెను
నక్తంచరకోటి ప్రహరణవ్రాతములన్
ముక్తాముక్తంబులఁ గర
ముక్తంబుల యంత్రముక్తముల ముక్తములన్. 241

మ. తిమిరంబుల్ ఘటియించెఁ బట్టపగలున్ దేవీమరుద్విద్విష
త్సమరారంభములన్ సముద్ధతభుజాచక్రీభవద్దీర్ఘదు

ర్ధమకోదండవినిర్గతంబు లయి హేరాళంబు పారతుర
ప్రమహాభల్లశిలీముఖాంజలికనారాచార్ధచంద్రేషువుల్. 242
ఇవ్విధంబున నుభయసైన్యంబులు సరి పోరుచుండ వింధ్య
వాసిని మహామాయ వాయవ్యాస్త్రంబు ప్రయోగించి
శస్త్రాస్త్రంబులు దూల నడఁచిన నిరాయుధు లై యద్దైతే
యులు విచ్చి పఱచిరంత దుర్గాసురుండు డగ్గరి మహాశక్తిం
గొని వైచిన. 243

తే. రాక్షసుఁడు వైచినట్టియాప్రబలశక్తి
శక్తి వైచి విఖండించె శంభుశక్తి
చక్రమున వైచె వింధ్యాద్రిసదన నసుర
శైలకన్యక యది త్రుంచెఁ జక్రమునను. 244

తే. అనిమిషారాతి వి ల్లెత్త నగజ ద్రుంచె
శూల మెత్తిన ఖండించె నీలవేణి
పఱియలుగఁ జేసె గద యెత్త భద్రకాళి
ఖడ్గ మెత్తినఁ జక్కాడెఁ గంబుకంఠి. 245

మ. వడి వింధ్యాచలగండశైలమునఁద న్వైవంగ నే తెంచుచో
నుడురాజార్ధశిఖావతంసుసతియత్యుగ్రంబువహ్న్యస్త్రముల్
దొడి దుర్గాసురునేయవాఁడువడియెఁ దుర్వారవజ్రాహతిఁ
బడుశైలంబును బోలి మెచ్చిరి హరిబ్రహ్మాదిబృందారకుల్.

వ అప్పుడు "దేవీ! జగద్ధాత్రీ! జగత్త్రయీజననీ! మహేశ్వర
మహాశక్తీ! దైత్యద్రుమకుఠారికా! త్రైలోక్యవ్యాపినీ!
శివా! శంఖచక్రగదాశార్ఙ్గధారిణీ! విష్ణుస్వరూపిణీ! హంస
యానా! సర్వసృష్టివిధాయినీ! అనాదినిధనవాగ్జన్మభూమి!
చతురానన! ఐంద్రీ! కౌబేరీ! వాయవీ! వారుణీ! యామీ!

నైరృతీ! ఐశీ! పావకీ! శశాంకకౌముదీ! సౌరీ! సర్వదేవ
మయీ! పరమేశ్వరీ! గౌరీ! సావిత్రీ! గాయత్రీ! సరస్వతీ!
ప్రకృతీ! మతీ! అహంకృతీ! బ్రహ్మాండాంతస్థమహాదేవీ! పర!
పరాపరపరమ! పరమాత్మస్వరూపిణీ! సర్వస్వరూప! సర్వగ!
చిచ్ఛక్తిమహామాయ! స్వాహా! స్వధా! శ్రౌషడ్వౌషట్స్వరూ
పిణీ! ప్రణవాత్మిక! సర్వమంత్రమయీ! చతుర్వర్గాత్మిక! చతు
ర్వర్గఫలోదయ! యని యనేకప్రకారంబుల దేవతలు ప్రస్తు
తించిరి. భద్రకాళియు నిర్జరుల కభీష్టవరంబులు ప్రసాదించె.
దుర్గాసురుని మర్దించి జగంబులదుర్గతి మాన్పుటం జేసి భర్గ
గృహిణికి దుర్గాభిధానంబు గలిగె. దుర్గాదేవి కాశీక్షేత్రం
బునం దుపసర్గాదిదోషంబులుమాన్చు. దుర్గాకుండంబునం
గృతస్నానుం డైన నరుండు దౌర్గత్యంబులు వాయు. దుర్గా
శరీరంబునం బుట్టినశక్తులు దుర్గాసమీపంబునం దధి
వసించి పంచక్రోశంబున నిరాక్రోశంబుగా శాసింతురు.
మఱియు శతనేత్రసహస్రాస్యయుత భుజయశ్వా
రూఢగజాస్యత్వరితశవవాహినివిశ్వసౌభాగ్యగౌరి వీరు
తొమ్మండ్రును శక్తులు. రురుండు చండుం డసితాం
గుండు గపాలి క్రోధనుం డున్మత్తభైరవుండు సంహారుండు
భీషణుం డీయెనమండ్రు భైరవులు విద్యుజ్జిహ్వుండు లలజ్జి
హ్వుండు క్రూరాస్యుండు క్రూరలోచనుం డుగ్రుండు వికట
దంష్ట్రుండు వక్రాస్యుండు వక్రనాసికుండు జంభకుండు
జృంభణముఖుండు జ్వాలానేత్రుండు వృకోదరుండు గర్త
నేత్రుండు మహానేత్రుండు తుచ్ఛనేత్రుండు అంత్రమండ
నుండు జ్వలత్కేశుండు కంబుశిరుండు ఖర్వగ్రీవుండు
మహాహనుండు మహానాసుండు లంబకర్ణుండు కర్ణప్రావ

రణుం డనసుం డాదిగాఁ గలబేతాళు లసంఖ్యాతులు.
భూతంబులసంఖ్యంబులు. ఇందఱు కాశీక్షేత్రంబు సంర
క్షింతు రనినఁ గుంభసంభవుండు గాశీస్థానంబున దివ్య
లింగంబు లెన్ని ? తత్ప్రభావం బానతిమ్మనినఁ బార్వతీ
దేవికి భవుం డానతిచ్చినప్రకారంబున నయ్యగస్త్యునకుఁ
గుమారుం డి ట్లని చెప్పె. 247

## ఓంకారేశ్వరమాహాత్మ్యము.

సీ. ఆనందవిపినంబునం దాదిమబ్రహ్మ
దప మాచరించె నత్యంతనిష్ఠఁ
బర్యాయమున నేగెఁ బదినూఱులుయుగంబు
లంతఁ బాతాళలోకాంతరమున
నుండి యుత్థిత మయ్యె నొకదివ్యలింగంబు
బహుకోటిరవివిభాభాసితంబు
విధి మనోవీథి భావించు నేతేజ మా
తేజంబు లింగమూర్తిత్వ మొందె
తే. భూరిభువనాగ్రభాగవిస్ఫుటనవేళ
సంభవించినచటచటచ్ఛబ్దధారఁ
గ్రమముతోడ సమాధియోగంబు విడిచి
కన్ను లెనిమిదియును విచ్చెఁ గమలభవుఁడు. 248
సీ. ఆదిమతేజంబునం దకారము దోఁచెఁ
గైటభారాతియాకారరేఖ
నటఁ జూడఁ జూడఁ బ్రత్యక్షమయ్యె నుకార
మంబుజాసనునిరూపంబుఁ దాల్చి
తదనంతరంబ చంద్రశిఖావతంసుచం
దంబుఁ గైకొని మకారంబు మెఱసె.

నంత శబ్దబ్రహ్మ మైననాదంబున
భువనహేతువును బిందువును దోఁచె
తే. నఖిలమును గూడి యోంకార మయ్యెఁ బిదపఁ
గ్రమముతోఁ గుంభభవ! యకారము నుకార
మును మకారంబు నగువర్ణములును నాద
బిందువులు ధాతయగ్రంబునందు నిలిచి. 249

వ. ఎయ్యది సంసారతారకంబగుటఁ దారకం బయ్యె. ఎయ్యది ప్రకర్షంబునం జేసి యశేషవిక్రియావిరహంబునం గూటస్థనిత్యం బయ్యును బరమానందప్రకాశంబున సర్వదా యభినవం బగుపరబ్రహ్మంబునకు వాచకం బగుటఁ బ్రణవాభిధానంబు వహించె. ఎయ్యది యకారోకారమకారబిందునాదంబులైదవయవంబులవలనను బంచాశత్కళారూపయగుమాతృకకుం గారణభూతం బయ్యె. ఎయ్యది త్రయీమయంబు తురీయంబు తురీయాతీతంబు నిఖిలాత్మకం బనం బరఁగు. ఎయ్యది చతుశ్శృంగంబు సప్తహస్తంబు ద్విశీర్షంబు త్రిపాదంబు త్రిధాబద్ధంబై వృషభాకారం బైమ్రోయు. ఎద్దానియందు బ్రహ్మస్థం బగుజగం బభిలీనం బైయుండు. ఎయ్యది యకారోకారమకారంబు లనువర్ణత్రితయంబుచే వేదచతుష్టయాత్మకంబును గార్హపత్యదక్షిణాహవనీయసంవర్తకాగ్నిరూపంబును బృథివ్యంతరిక్షద్యుసోమలోకాత్మకంబును నుదాత్తానుదాత్తస్వరితప్రచయాత్మకంబును భూతభవిష్యద్వర్తమానసాధారణకాలాత్మకంబును నాఁ జను. ఎద్దానియం దాదర్శంబునందు ముఖంబునుం బోలె స్వప్రకాశకచిద్రూపుండు పరమేశ్వరుండు ప్రతిబింబించు. ఎయ్యది యకారాదివర్ణంబు లేకత్వంబునొందునట్లుగా సంయో

జింప 'నాద్గుణ' యనుసంధిఁ గూడి మంత్రత్వంబు నొందు. అట్టియోంకారమంత్రంబు దివ్యలింగస్వరూపం బైయావిర్భ వించినం గనుంగొని పంకజాసనుండు 'నమ ఓంకార స్వరూ పాయ,నమ స్సర్వరూపస్వరూపిణే, నమో రుద్రాయ,నమో భవాయ,నమ శ్శర్వాయ,నమ ఉగ్రాయ, నమ స్సామర్గ్యజు స్స్వరూపాయ,నమో నాదాత్మనే, నమో బిందుకళాత్మనే, నమో లింగాయ,నమో లింగస్వరూపాయ, నమో భీమా య,నమఃపశుపతయే, నమస్తారస్వరూపాయ, నమశ్శివాయ, నమఃకపర్దినే, నమశ్శితికంఠాయ, నమో మీఢుష్టమాయ, నమో గరిష్ఠాయ, నమ శ్శిపివిష్టాయ, నమో హ్రస్వాయ, నమో బృహతే,నమోవృద్ధరూపిణే, నమః కుమారగురవే, నమ శ్శ్వేతాయ,నమః కృష్ణాయ, నమః పీతాయ, నమోఽ రుణమూర్తయే,నమో ధూమ్రవర్ణాయ, నమః పింగళాయ, నమః కిర్మీరవర్చసే, నమః పాటలవర్ణాయ, నమో హారితతే జసే,నమో నానావర్ణస్వరూపాయ,నమో వర్ణపతయే, నమ స్స్వరరూపాయ, నమో వ్యంజనరూపిణే, నమ ఉదాత్తాను దాత్తస్వరితరూపాయ, నమో హ్రస్వదీర్ఘప్లుతవిసర్గాత్మనే, నమోఽనుస్వారస్వరూపాయ,నమస్సానునాసికాయ,నమో నిరనునాసికాయ, నమో దంత్యాయ, నమ స్తాలవ్యాయ, నమ ఓష్ఠ్యాయ, నమ ఉరస్యాయ, నమఊష్మస్వరూపాయ, నమోఽంతస్థాయ, నమఃపినాకినే,నమోనిషాదాయ, నమో నిషాదపతయే, నమ స్తారాయ, నమో మంద్రాయ, నమో మధ్యమాయ,నమోఘోరాయ,నమోఽఘోరమూర్తయే, నమ స్తానస్వరూపాయ, నమో మూర్ఛనాస్వరూపాయ, నమస్థాయిసంచారిస్వరూపాయ, నమో లాస్యతాండవ

జన్మనే, నమ స్త్రార్యత్రికస్వరూపాయ, నమ స్థూలాయ, నమ స్సూక్ష్మాయ, నమోఽదృశ్యాయ, నమోఽర్వాచీనాయ, నమః పరాచీనాయ, నమో వాక్ప్రపంచస్వరూపాయ, నమ ఏకాయ, నమోఽనేకభేదాయ, నమ స్సదసస్పతయే, నమ శ్శబ్దబ్రహ్మణే, నమః పరబ్రహ్మణే, నమో వేదాంతవేద్యాయ, నమో వేదపతయే, నమః పార్వతీశ్వరాయ,నమోజగదీశ్వరాయ,నమోదేవదేవాయ, నమశ్శంకరాయ, నమ స్తుభ్యం మహేశ్వర! నమ స్తుభ్యం జగదానంద! నమ స్తుభ్యం చంద్రశేఖర! నమ స్తుభ్యం మృత్యుంజయ ! నమ స్తుభ్యం త్ర్యంబక! నమ స్తే పినాకహస్తాయ, నమ స్తే త్రిశూలధారణే, నమ స్తే త్రిపురఘ్నాయ, నమ స్తేఽంధకనిషూదనాయ, నమః కందర్పదర్పదళనాయ, నమో జాలంధరారయే, నమఃకాలాయ, నమఃకాలకూటవిషాదినే నమో భక్తవిషాదహంత్రే, నమోనమ"యని యనేకప్రకారంబులం బ్రస్తుతించిన. 250

సీ. హరుఁ డకారేశ్వరుం డై కైటభారాతి
యాకారలేఖఁ బ్రత్యక్ష మయ్యె
శివుఁ డుకారేశ్వర శ్రీమహాదేవుఁ డై
ధాతృస్వరూపంబుఁ దాల్చి యొలసె
గంగాధరుండు మకారేశ్వరుం డయి
విధుమౌళి శేవ నావిర్భవించె
నాగకేయూరుండు నాదేశ్వరుం డయి
భాసిల్లి శబ్దరూపత వహించె
తే. విశ్వలోకైకభర్త బిందీశ్వరుఁ డయి
భువనకారణభావంబుఁ బూని మెఱసె

నిందఱును బ్రహ్మ కిచ్చి రభీప్సితంబు
లైదులింగంబులును బ్రణవాత్మకములు. 251

వ. ఈరైదును దివ్యలింగంబులు. 252

తే. దమనుఁ డను బ్రాహ్మణుఁడు భరద్వాజగోత్రుఁ
డాదిమాశ్రమమునను వింధ్యాద్రిదమన!
పాశుపతదీక్షఁ గైకొని కాశియందు
సిద్ధి చేకొనె నవిముక్తసీమయందు. 253.

తే. భారభూతేశ్వరుఁడు యక్షభర్తదిశకు
నింద్రదిశకును మణికర్ణికేశ్వరుండు
బ్రహ్మగోకర్ణపతు లవాక్పశ్చిమముల
కవధు లవిముక్తమునకు వింధ్యాద్రిదమన! 254.

వ. అట్టహాసుండు ప్రాగ్ద్వారంబును, భూతధాత్రీశ్వరుండు దక్షిణ
ద్వారంబును, గోకర్ణుండు పశ్చిమద్వారంబును, ఘంటా
కర్ణుం డుత్తరద్వారంబును, ఛాగవక్త్రుం డీశదిక్కోణంబును,
భీషణుండు వహ్నిదిక్కోణంబును, శంకుకర్ణుండు రాక్షస
దిక్కోణంబును, ద్రుమిచండుండు వాయుదిక్కోణంబును,
నానాప్రమథగణపరివృతులై రక్షింతురు. కాలాక్షరణ
భద్రకాలేయకాలకంపనులు గంగాతీరంబును, వీరభద్ర
నభకర్దమాలిస్తవిగ్రహాస్థూలకర్ణ మహాబాహు లసితీరం
బును, విశాలాక్షమహాభీమకుండోదరమహోదరులు దేహ
లీదేశంబును నందిషేణ పంచాల ఖరపాద కరంటకానంద
గోపకబభ్రులు వరణాతీరంబును గాచి యుండుదురు. 255.

తే. కపిల సావర్ణులకును శ్రీకంఠ పింగ
ళాంశుమంతులకును [illegible] యవసరమున

నేపురకుఁ గల్గె నాశ్చర్య మేమి చెప్పఁ
దనువుతోడన శివుఁ గూడికొనఁగఁ గాశి? 256

చ. కలశతనూజ! యచ్చెరువు! కాశికయం దొకశంభులింగమున్
దిలలను నక్షతంబులను ధీనిధి యొక్కఁడు పూజ చేసి పో
నొలికినవాని మేయుటకు నోలిఁ బ్రదక్షిణ మాచరించి చి
ట్టెలుకశరీరముం‡దొఱఁగ కెక్కెనుబోరజతాద్రికూటము [న్.

క. ఘటసంభవ! శ్రీకాశీ
కటకమునకు నికటగగనగంగాతటినీ
చటులకృపీటోర్మిఘటా
స్ఫుటదఘమున కెనయె యితరపుటభేదనముల్? 258

శా. అంభోజాసనునంతవానికిని శక్యంబే నుతింపంగ నో
కుంభీసంభవ! ఢుంఠిరాజకరటక్రోడక్షరద్దానవా
స్సంభేదప్రవిజృంభమాణవరణాసంపర్కసంపన్న కా
శ్రీంభర్యామరసింధునైకటికమున్ శ్రీకాశికాక్షేత్రమున్?

క. అవిముక్తం బవిముక్తం
బవిముక్తం బనుచుఁ బ్రాతరారంభములం
దవధానపరత నెవ్వం
డు వచించును వాఁడు ధన్యుఁడు మునిప్రవరా! 260

తే. మొగుచు జంతువు గాశికానగరసీమ
నపునరున్మీలనమున కై యక్షియుగముఁ
గాంచు నిక్కలగా నొక్కకలయు నపుడు
త్రిణయనుండుఁగఁ దన్ను నదీర్ఘనిద్ర. 261

ఉ. ఎట్టు నుతింతు నల్పమతి నిల్వలమర్దన! యేను గాశికా
పట్టణశంభుమూర్తులకృపాగుణ? మొూర్తులతాంగి త్రే పెదు

‡ 'దొఱఁగి యెక్కె' అని పాఠాన్తరము. మూలవిరుద్ధము.

ర్కట్టునముంగిటంగసవుగాంఁడ్రయుఁబుచ్చుచుఁ జేతిచీపురుం
గట్టయుఁదానుఁజొచ్చెఁగఱకంఠునినోంకృతినాదదేవునిన్.

తే. ఓంకృతి శ్రీమహాదేవునొద్దఁ గలదు
బిలము పాతాళమున కేగు పెద్దత్రోవ
దానివాఁకిట నుంద్రు వాతాపిదమన!
సావిదల్లులు కుఱుపల్లజడలబుఘులు. 263

తే. వెంటఁ బడి వచ్చు కాకికి వెఱచి భేకి
తిరిగె నందంద నోంకారదేవుభవన
మటఁ బ్రదక్షిణ మొనరించె నట్టిమహిమ
నొడలితోడనె యాకప్ప మృడునిఁ గలసె. 264

తే. పాడి మెచ్చించె నొకయింతి పంజళమున
నాడి మెచ్చించె లేమ లాస్యమున నొర్తు
పొగడి మెచ్చించె నొక్క లేఁజిగురుఁబోఁడి
కరుణ గలవాఁడు కాశి నోంకారభర్త. 265

మ. మనుజుం డెవ్వఁడు కాశికిం జనఁడు శ్రీమత్తోన్యదరీతీర్థముం
గనఁడోంకారశశాంకమూర్ధనకు మ్రొక్కండద్దురాత్ముండపో
మునిశార్దూల! వినాశకారణము దోర్మూలాగ్రకూలంకష
స్తనభారాలససూక్ష్మమధ్యజననీతారుణ్యసంపత్తికిన్. 266

చ. పనివడి ఫాలలోచనుఁడు పర్వతరాజతనూజ కానతి
చ్చినపరిపాటి నీకు నఱ సేయక చెప్పెద సావధానతన్
విను కలశీతనూభవ! త్రివిష్టపనాథసమాహ్వయత్రిలో
చనచరితంబుసర్వకలుషఘ్నముపుణ్యసమృద్ధ్యుపఘ్నమున్.

క. విరజాహ్వాయ మగుపీఠము
పరమఋషిప్రవర! కాశిపట్టణ[illegible]న్న

భరణము. తద్దర్శనమున
†నరుఁడును విరజస్కుఁ డగు ననఘ! నిమిషమునన్. 268

తే. అనఘచారిత్ర! కాళిందియును సరస్వ
తియును నర్మదయును దదంతికమునందుఁ
గాలుదిక్కునఁ బ్రవహించుఁ గాలకూట
కంఠపాదాబ్జపీఠోపకంఠ మొరసి. 269

ఉ. సంభృతభక్తిభావనఁ ద్రిసంధ్యమునందును నాతరంగిణుల్
శంభుఁ ద్రివిష్టపేశ్వరునిఁ జంద్రకళాధరుఁ దీర్థ మార్చు వి
స్రంభమునం గరాంబురుహసంగతమంగళశాతకుంభకుం
భోంభితగంధసారరసయోగసుగంధనవాంబుధారలన్.

క. స్థాపించె నాస్థలంబున
నాపుణ్యతరంగిణీత్రయము చంద్రకళా
నైపథ్యంబుల భుజగక
లాపంబుల విమలమణిశిలాలింగములన్. 271

ఉ. నిండుమనంబుతోడ రజనీకరమౌళిఁ ద్రివిష్టపేశ్వరున్
దండనమస్కృతిప్రవణతన్ భజియించినపుణ్యకోటికిన్
వెండియుఁ గర్మబంధములె? వెండియు నాధివికారబాధలే?
వెండియుమాతృయోనిపదవీచ్యుతిసంకటమే? ఘటోద్భవా!

మ. గయ కేలా యరుగంగ మానవులకుం? గాశీపురీవాహినీ
త్రయ వేణీపులినంబులందు నిడ రాదా తల్లినిం దండ్రినిం
బ్రియమాతామహులం బితామహులనుం బేర్కొంచుఁ బిండా
న్నము?, ల్గయికో రోటు ప్రియంబుతోడఁ బితరు ల్హస్తాగ్ర
ముల్ సాచుచున్? 273

† 'నరుఁడును విరజస్కుఁ డగును నిమిషమునన్' అని పాఠాన్తరము.

తే. దక్షిణంబు త్రివిష్టపస్థానమునకుఁ
జెంగట సరస్వతీమహాక్షేత్ర మనఘ!
యిచ్చుఁ గొలిచినవారి కయ్యిందుధరుఁడు
గరుణ సారస్వతం బైనపరమపదము. 274

క. యమునేశ్వరుఁడు ద్రివిష్టప
సమీపమున నంబుపతిదెస న్వసియించుఁ
యమపుటభేదననికట
ద్రుమవాటికఁ జూడ రవ్విధుధరునిభక్తుల్. 275

తే. అత్రిలోచను ప్రాగ్దిక్కునందు నుండు
నర్మదేశుండు నిజభక్తశర్మదాయి
శైవదీక్షావిధిజ్ఞ! తత్సేవకులకు
మాతృగర్భార్భకత్వంబు*మందు సుమ్ము!. 276

తే. అఖిలనీవారముష్టింపచాగ్రగణ్య!
ప్రత్యహంబు ద్రివిష్టపద్రష్ట యెవ్వఁ?
డవ్విశిష్టుఁడు విష్టపాభ్యంతరమున
నీసమంతటిమాత్రంబు వెలితిస్రష్ట. 277

ఉత్సాహ. లీల మనుజుఁ డెవ్వఁ డేఁ బిలిప్పిలాతరంగిణిం
దేలి శ్రీత్రివిష్టపేశుఁ ద్రిపురమథను శశికళా
మౌళిఁ బూజ సేయుఁ గుసుమమాల్యముల నతండు డా
కాలిమడమఁ జప్పటించుఁ గాలమృత్యువక్త్రమున్. 278

* అచ్చుపుస్తకమున 'మందు కొడుక' అనియు, వ్రాతపుస్తకమున 'మందు కుడుక' యనియు, మఱియొక వ్రాతపుస్తకమున 'మందు సుమ్ము!' అనియున్నది. దీనికి "దృష్టం త్రిలోచనా త్ప్రాచ్యాం నర్మదేశం సుశర్మదం, కల్పింగార్చనతో [illegible] నివిద్యతే" అని సంస్కృతమూలము.

మానిని. ఉత్తరవాహినియైప్రవహించుచునున్న పిలిప్పిలఁగ్రుంకి
మదిం, దత్తరపాటొకయించుక లేక యథావిధిఁగోమల
తారకరా, డ్భిత్తకిరీటుఁ ద్రివిష్టపనాయకుఁ *బెన్మసనంబునఁ
గొల్చిన భాగ్యోత్తరుఁ గాంచి నమస్కృతి సేయుదురప్పర
వీథిఁ జరించుసురల్. 279

తే. ఇతరదేశంబులం దుపార్జితము లైన
పాపములు వాయుఁ గాశికాపట్టణమునఁ
గాశిఁ జేసినపాప మెక్కడను బాయ
దదియుఁ బాయుఁ ద్రివిష్టపోపాంతభూమి. 280

తే. కాశి జంబూతరుద్వీపకనకభూష
గాశియం దుత్తమంబులు గ్రమనిరూఢి
సింధుసంభేద మోంకారశివపదంబు
శ్రీత్రివిష్టపనాయకక్షేత్రతలము. 281

క. విదితముగఁ గాశినడుమం
ద్రిదశమణికిరీటకోటిదీధితివిలస
త్పదునిఁ ద్రివిష్టపుఁ గొలిచిన
†నదవీయసి మోక్షపదవి యధికవివేకా!. 282

శా. కుంభీసంభవ! యాత్రివిష్టపుని గ్లాకోటీరు సింధుత్రయీ
సంభేదస్థలవాసుఁ గొల్చునరునిర్ సాధింపఁగాఁ జాలునే
కుంభీపాకముఖప్రధాననరకక్రూరప్రకారవ్యథా
సంభారంబుల నీనఁ జాలుమదిరాస్వాదాదిపాపౌఘముల్.

సీ. క్రూరుండు పిశునుండు గోఘ్నుఁ డభక్ష్యభ
క్షకుఁడు విస్రంభవిఘాతుకుండు

* 'ప్రేమమనంబునఁ' అని వ్రాఁతపుస్తకము. 'బెన్నసమంబుగఁ' అని అచ్చుపుస్తకము. †'నొ[illegible] లధికవివేకా!' అని పాఠాన్తరము.

గురుతల్పగుఁడు నిందకుఁడు నాస్తికుఁడు కూట
సాక్షి పరద్రవ్యచౌర్యపరుఁడు
మాతాపితృత్యాగి యాతతాయి శఠుండు
పరదారలోలుండు గరళదుండు
కులధర్మవిముఖుండు గురుజనద్వేషుండు
బ్రహ్మహత్యాసురాపానరతుఁడు
తే. నాఁగఁ గలపాపుల కఘంబు నీఁగ దిక్క
శ్రీత్రివిష్టపదేవుండు శేషధరుఁడు
నీలలోహితు నభవు నిందించునట్టి
కర్మచండాలునికిఁ దక్కఁ గాశియందు. 284
క. ఇందుకళాశేఖరునిన్
నిందించుట నిగమపదము నిందించుట త
ల్లిం దండ్రి న్నిందించుట
నిందించుట హర్యజాదినిర్జరకోటిన్. 285
క. శివనింద సేయుపాతకు
దవుదవ్వునఁ జూచి తొలఁగఁ దగు శైవులకున్
శివనిందాపరుపలుకులు
చెవి యొడ్డి వినంగఁ దగదు శివభక్తులకున్. 286
ఉ. సత్యము పల్కెదన్ శ్రుతులు శాస్త్రము లాగమముల్
పురాణముల్, ప్రత్యయ మయ్యెనే నిజముఁ బట్టెద రింతియ
కాక యేమి? దుష్కృత్యపహారదక్ష యగుకాశియ తీర్థము
తీర్థకోటిలో, నిత్యుఁడు విశ్వనాయకుఁడు నిక్కపుదైవము 287
దైవకోటిలోన్.
తే. ఆదిఁ బంచనదంబునయందు మునుఁగు
నాడు మణికర్ణికాతీర్థ మంతమాఁడ

విశ్వనాథుని భక్తి సేవించుఁ బిదప
నట విఖండించు మనుజుఁ డొక్కఁడ యఘంబు. 288
శా. వాతాపీల్వలదైత్యమర్దన! తగుఁ వర్ణింప దివ్యామృత
జ్యోతిర్లింగతనుం ద్రివిష్టపుని నస్తోకప్రభావాన్వితుఁ
బాతాళంబున నుండి వెల్వడి పురీపర్యంతభాగీరథీ
స్రోతస్విన్యుపకంఠభూమిఁ గృతవాసుం డైనసర్వేశ్వరున్.
వ. త్రివిష్టపేశ్వరునకుఁ బశ్చిమభాగంబున ద్రోణేశ్వరలింగంబు,
తదగ్రభాగంబున నశ్వత్థామేశ్వరలింగంబు, అటుపిఱుంద
శాంతనవేశ్వరలింగంబు, అశ్వత్థామేశ్వరలింగంబునకు
వాయవ్యదిగ్భాగంబున వాలఖిల్యేశ్వరలింగంబు, తత్సమీ
పంబున వాల్మీకేశ్వరలింగంబు, మఱియుఁ ద్రివిష్టపేశ్వర
లింగంబు మాహాత్మ్యం బభివర్ణించెద. 290

త్రివిష్టపేశ్వరమాహాత్మ్యము.

తే. అమ్మహాదేవుప్రాసాద మాశ్రయించి
యుండుపారావతంబులు రెండు నెమ్మి
నాలుమగఁడు నగర్హ్యాగార్హస్థ్యగరిమ
సకలకాలంబుఁ గవఁగూడి సంచరించు. 291
సీ. పక్షాగ్రముల వీచి ప్రాసాదవలభికా
పర్యంతముల ధూళి పాఱుఁ దుడుచుఁ
జలుపు యాతాయాతములఁ బ్రదక్షిణములు
మాటిమాటికి గర్భమంటపికకు
సోమసూత్రప్రణాళీమార్గనిష్ఠ్యూత
తీర్థోదకంబులు దివుటఁ గ్రోలు
భక్షించు దేవాలీబల్యర్థవిక్షిప్త
పిండసిద్ధములు సంప్రీతి యెసఁగ

తే. విను౦ద్రికాలంబు నర్చనావేళలందు
శంఖకాహాళపటహాజర్ఝరరవంబు
కాశినగరంబునం ద్రివిష్టపేశునగరి
నవ్వియాంగమరత్నంబు లనుదినంబు. 292

వ. ఇవ్విధంబునం బారావతస్త్రీపుంసంబులు సంసారసుఖంబు లను
భవించుచు నొక్కనాఁడు త్రివిష్టపదేవభవనచంద్రశాలా
గర్భవితర్ది కానిర్యూహావిటంకనీడంబునం గూడి మెలంగి
యాడుచుండ నొక్కశ్యేనం బమ్మిథునంబు దవుదవ్వులం
గనుంగొని చేర వచ్చి జాలకంబులలో నుండి తన్ను నల
వోకయుం బోలెఁ గనుంగొనుచు దుర్గసమాశ్రయఫలం
బున నయ్యుగ్మంబు లెక్కసేయకయున్న నప్పటికి నొడుపు
దప్పి తొలంగి యెక్కడికేనియుం బోయె. పరేంగితజ్ఞాన
చతురయగు నప్పారావతి పతి కిట్లనియె. 293

సీ. మనపాలివేరువిత్తని యెఱుంగుదు గదా
యెఱుఁగవో శ్యేనంబు హృదయనాథ!
ప్రబల మైనట్టిదుర్గంబులో నున్నార
మగుట నేఁటికిఁ దప్పెఁ బ్రాణభయము
వైఫు దప్పిన మహాకోపంబుతోడన
పోయె వైరం బాత్మఁ బూని దాయ
యొండుచోటికి నేగు టుచితంబు మన కింక
వానికిన్కకు నోర్చువార మెట్లు?
తే. చిచ్చువాతను బరివాతఁ జిక్కువడక
తప్పిపోయినవారపో తద్జ్ఞు లెందుఁ

దాతకట్టినచెలు వంచుఁ దగునె మునుఁగ?
*నిల్లు విడువంగ లేక చా వేల మనకు. 294

చ. అన విని పారువంబు నవయౌవనగర్వమునం బడంతి కి
ట్లను నిదియేమి? నాబలపరాక్రమసంపద యింతమాత్రమే?
తనసరివారికి న్వెఱచి థామముఁ బాడఱఁ జేసి డాగఁ బో
యినసరియిండ్లవారనగ రే? ఖగమోయదియేమిదయ్యమో?

తే. అది విహంగమ మేను విహంగమంబ
పెసరగింజకుఁ దక్కువే పెసరగింజ?
యబల! యిటు చూడు మప్పక్షియద టడంతుఁ
గుటిలచంచూపుటీకోటికుట్టనముల. 296

వ. అనిన 'ధర్మో జయతి' యనుచుం బారావతి యూరకుండ
మలునాఁడు తేపకడ నా శ్యేనంబు ద్రవిష్ట పేశ్వరునగరీప్రాసా
దంబుమీఁద నిర్గమద్వారంబు రోధించి పొంచియుండి
సంచారార్థంబు దిక్కులకు వెడలునక్కలరవంబుల నుక్కుఁ
దండసంబువోనిముక్కున నంకుశంబులం బోలుచరణనఖాం
కురంబులం బెట్టనుం బోతునుం గఱచియు నిఱికియుం
బట్టి యేకాంతప్రదేశంబునం భక్షించునది యై యంతరిక్షం
బున దవ్వుగాఁ గొని చనియె నప్పుడు సేయునది లేక
కాందిశీకత్వంబునఁ జీకాకువడియు వివేకనిధి యైనపారా
వతి పారువంబుఁ దప్పక చూచి నయనసంజ్ఞం గాలుం
గఱువు మని పలికిన. 297

ఉ. శ్యేనము కాలివ్రేలుఁ గఱచెా దిట దప్పక పారువంబు లో
నూనినతీవ్రవేదనకు నోరువఁ జాలక చీత్క్రియానుసం

* 'ఇల్లు వెడలక చావంగ నేల మనకు?' అని పాఠాన్తరము.

థానముపాదధూననముఁ దత్సమయంబునఁ జేసెఁబత్త్రియా
మానమునందఁ బాఱి రసమానరయంబునఁ బక్షిదంపతుల్.

వ. పాఱి యొక్కచోటంగూడి బలవద్విరోధంబునం గాశి నుండ వెడలి యయోధ్యానగరంబున సరయూతీరంబునం బెద్దకాలంబు మనువు మని యపరజన్మంబున మందారనామకుండను విద్యాధరుండును రత్నావతి యనునాగకన్యకయు నై జన్మించి జాతిస్మృతివశంబున నప్పౌరువంబులు రెండును దంపతు లై కాలక్రమంబునఁ గాశీత్రివిష్టపేశ్వరు సేవించి ముక్తులై రి. ఇది త్రివిష్టపేశ్వరమాహాత్మ్యంబు. 299

## కేదారేశ్వరమాహాత్మ్యము.

తే. ఆదిఁ బరమేశ్వరుఁడు గౌరి కానతిచ్చి
నట్టిపరిపాటిఁ జెప్పెద ననఘ! నీకుఁ
గాశికేదారశంభులింగంబుమహిమ
సావధానత వినుము వింధ్యాద్రిదమన! 300

వ. అనేకజన్మసంచితంబు లైనపాపంబులు గేదారేశ్వరస్మరణంబునం బాయు. సాయంప్రాతఃకాలంబుల గేదారేశ్వరస్మరణంబు సర్వదురితహారంబు. 301

శా. ప్రాతఃకాలమునందు మర్త్యుఁడు*హరత్పాపాభిధానప్రద
స్రోతఃపూరమునన్ మునింగి పరమజ్యోతిర్మయంబు న్మునిధ్యాతవ్యంబును శాశ్వతంబు నగు కేదారేశలింగంబు సం
ప్రీతిం జేరి భజించి కాంచు వితతాభీష్టార్థసంసిద్ధులన్. 302

*'హరన్ బాపాభిధాన' యని యచ్చుపుస్తకము. 'హరం పాపాభిధాన' యని యొకవ్రాతపుస్తకము. 'హరపాపప్రదేస్నాత్వా' యనిసంస్కృతమూలము. ఛందోభంగనివృత్తికై 'హరత్పాప' యని సవరింపఁబడినది.

వ. తొల్లి రథంతరకల్పంబునందు వశిష్ఠుం డనువిప్రుండు హిర ణ్యగర్భాచార్యువలనం బాశుపతదీక్ష వడసి కేదారేశ్వ రునిసేవించి ముక్తుం డయ్యె వెండియు. 303

సీ. శిశిరభూధరకన్య చిఱుబంతిపసు పాడు
నెందు సాయంకాల మిం పెలర్ప
నరుఁ డెందు జలము నుద్ధరణంబు సేవించి
శంభులింగముఁ దాల్చు జఠరపిఠరి
వినువీథిఁ బోరాడి వివశంబు లై కూలి
హంసంబు లయ్యె వాయసము లెందుఁ
బ్రవహించు నెందు శ్రీభాగీరథికిఁ బోటి
యమృతస్రవాహ్వయ యైనతటిని

తే. యది విముక్తవధూకంఠహారలతిక
దివ్యకేదారలింగేశతీర్థభూమి
నదనదీవాపిపల్వలహ్రదసమగ్ర
ద్రాక్షపందిలి కాశికోద్యానమునకు. 304

వ. అందు గౌరీకుండంబు గౌరతీర్థం బమృతస్రవాతీర్థంబు గల హంసతీర్థంబు మొదలుగా ననేకతీర్థంబులు గలిగియుండు. కేదారేశ్వరంబున కుత్తరంబునఁ జిత్రాంగదేశ్వరలింగంబు, తత్సమీపంబునం గేదారేశ్వరస్థానంబు, దక్షిణంబుననీల కంఠేశ్వరలింగంబు, నీలకంఠక్షేత్రంబునకువాయవ్యభాగం బున నంబరీషేశ్వరలింగంబు, తత్సమీపంబున నింద్రద్యు మ్నేశ్వరలింగంబు, ఆదక్షిణంబునఁ గాలంజరేశ్వరలింగంబు, చిత్రాంగదేశ్వరు నుత్తరంబున క్షేమేశ్వరలింగం, బిది కేదారలింగమాహాత్మ్యంబు. ఇంక ధర్మరాజేశ్వరలింగ మాహాత్మ్యంబు వివరించెద. 305

తే. అనినఁ బ్రియ మంది నైమిశమునిగణంబు
సూతు నర్చించి భక్తిసమేత మగుచు
ధర్మరాజేశశివుమహాస్థానమహిమ
గుహుఁడు సెప్పె నెవ్విధమునఁ గుంభజునకు? 306

వ. అవ్విధంబు మా కానతి మ్మనుటయు. 307

ఆశ్వాసాంతము.

శా. కల్పాంతానిలఘూర్ణమానజలముగ్గర్జానినాదోద్భవా
నల్పాటోపకఠోరఢాటిపటహోద్యద్ఘోషవిధ్వస్తసం
కల్పారాతినృపాలసంశ్రితకులక్ష్మాభృద్గుహాగేహ! యా
కల్పక్షౌమపటీరహీరహిమవాగ్గకాశ్మీరచంద్రప్రభా! 308

క. వీరావతార! వితరణ
పారాయణహృదయ! రాజపరమేశ్వర! ది
గ్వారణకరసన్నిభభుజ!
ఢారాసురఢాణదర్పధరణీధ్రపవీ! 309

మాలిని. ధరణిభరణహేలాధగకృతక్రోడలీలా
జరఠకమఠభూభృచ్చక్రచక్రీశ్వరాశా!
ద్విరదనివహశుంభద్దీర్ఘదోస్తంభయుగ్మా
భరితగుణదిలీపా! పంటవంశప్రదీపా! 310

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన కాశీఖండం బను మహాకావ్యంబునందు షష్ఠాశ్వాసముసమాప్తము.

శ్రీ ర స్తు.

# స ప్త మా శ్వా స ము.





శ్రీ రాజరాజ! సుగుణా
ధార! ధరాభరణకరణధౌరంధర్య
స్ఫారభుజార్గళ! భక్తిస
మారాధితభుజగహార! యల్లయవీరా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

## ధర్మరాజేశ్వరలింగమాహాత్మ్యము.

తే. దృఢవివేక! ధర్మేశ్వరతీర్థమహిమ
యబ్జజున కైన వర్ణింప నలవి యగునె?
యమ్మహాక్షేత్రమున నున్న యండజములు
బ్రహ్మవిజ్ఞానవాసనాప్రవణమతులు. 3

వ. కాశీమధ్యంబుననర్ఘ్యమణినిర్మితంబై, మోక్షలక్ష్మీవిహార
స్థానం బై, సముత్తంభితశాతకుంభకుంభమండలీమండిత
సుధాధవళసౌధవీథీ విభ్రాజితంబై, యవతరణ రభసశీర్ణ
స్వర్ణదీ స్రోతశ్శిలాకానుకారిపుంగపపతాకాలంకృతం బై,
గవాక్ష వివరోద్గీర్ణ గుగ్గులుమహిసాక్షీధూపధూమరేఖాస్మా
రిత స్మరహరకంఠమూల కఠోర కాలకూట విషచ్ఛాయా
ఛటాగుళుచ్ఛంబై యుండు ముక్తిమంటపంబున ముక్కంటి
మధ్యాహ్న కాలంబున బ్రాహ్మణవేషంబున వైశ్వదేవబలి
హరణంబులు సేయు మహాప్రాసాదంబునకు నింద్రదిగ్భాగం

బున జ్ఞానమంటపంబునందు బాలేందుధరుండు దక్షిణామూర్తి స్వరూపంబు ధరియించి బ్రహ్మాదులకు జ్ఞానోపదేశంబు సేయుఁ; దత్ప్రాంతంబున విశాలాక్షీహర్మ్యంబునందును బ్రతివాసరంబును గుతపకాలంబునందు. 4

సీ. పసిఁడికమ్ములతోడి కుసుమవ్రావన్నియ
నిద్దంపుఁబుట్టంబు నెఱిక గట్టి
యింద్రనీలములతో నెడకట్టి గ్రుచ్చిన
రమణీయతారహారము ధరించి
పారిజాతకతరుప్రసవగర్భిణి యైన
కబరిపైఁ జెంగల్వకచ్చు నిలిపి
ఫాలభాగంబునఁ బన్నీట మెదిచిన
కమ్మకస్తురితిలకమ్ము దీర్చి
తే. వలుఁదచన్నుల జిలుగుఁగంచులికఁ దొడిగి
కటిభరంబున వజ్రాలకమరు దాల్చి
యరసి యాఁకొన్నవారికి నమృతభిక్షఁ
గరుణ నిడు శ్రీవిశాలాక్షి కాశియందు. 5

వ. విశాలాక్షీపీఠస్థానంబునకు సమీపంబునఁ జక్రపుష్కరిణీ తీర్థంబు. 6

తే. భవ్యతరనిష్ఠ నుభయదర్భలును దాల్చి
సంధ్య వారుచుఁ జక్రపుష్కరిణియందు
ఫాలనేత్రుండు దారకబ్రహ్మమంత్ర
వర్ణకర్ణేజపుఁడు ప్రతివాసరంబు. 7

వ. ఆతీర్థంబునకు సమీపంబున రత్నేశ్వరలింగంబు, తత్సమీపంబున వృషభధ్వజలింగంబు, తత్సమీపంబున నాదికేశవపీఠంబు, తత్సమీపంబునఁ బంచనదతీర్థంబు, తత్సమీపం

బునఁ బంచముద్రమహాపీఠంబు, తత్సమీపంబున వీరేశ్వర లింగంబు, తత్సమీపంబున సిద్ధేశ్వరపీఠంబు, తత్సమీపంబున యోగినీపీఠంబు. 8

తే. కలవు పీఠంబు లానందకాననమునఁ
*జెట్టు వ్రేసిన చోట నక్షీణపుణ్య!
యర్థవాదంబు కాదు సత్యంబ కాని
పెద్దపీఠంబు ధర్మేశపీఠకంబు. 9

విశ్వభుజాఖ్యానము.

క. విశ్వభుజాగౌరీపర
మేశ్వరి సేవించి యందు నింద్రాణి సమ
గ్రైశ్వర్యము సౌభాగ్యము
శాశ్వతముగ భర్తసంప్రసాదముఁ గాంచెన్. 10

వ. విశ్వభుజాదేవి మనోరథతృతీయావ్రతంబున నారాధించి శచీదేవి యింద్రుని, నరుంధతి వసిష్ఠు, ననసూయ యత్రిని, సునీతి యుత్తానపాదుని భర్తలంగా వరంబు వడసిరి. ఈ విశ్వభుజాదేవిసమీపంబున నాశావినాయకుండు ప్రణతాఖిలభక్తమనోరథసిద్ధిదాయకుం డై యుండు. 11

తే. వృత్రవధసంభవం బైనవృజినమునకు
శాంతి గాఁ గాశికాపురి జంభభేది
ధర్మపీఠంబునకు నుపాంతంబునందు
నిష్ఠతో శంభులింగప్రతిష్ఠ చేసె. 12

ధర్మేశమాహాత్మ్యము.

వ. ధర్మతీర్థంబు బ్రహ్మహత్యాదిపాపంబుల నపనయింపంజాలుఁ, దారకేశ్వరునకుఁ బశ్చిమభాగంబున నింద్రేశ్వరుండు, దక్షిణ

* 'జెట్టు వ్రేసినఁ జేటెఁ డక్షీణపుణ్య!' అని పూర్వము ద్వితపు వక పాఠము.

భాగంబున శచీశ్వరుండును, నింద్రేశ్వరుం బరివేష్టించి లోకపాలేశ్వరులును, ధర్మేశ్వరునకుం బశ్చిమభాగంబున సూర్యశీశ్వరుండును, ధర్మేశ్వరునకు నాలుగుదిక్కుల దత్త్వేశ్వర వైరాగ్యేశ్వర జ్ఞానేశ్వ రైశ్వర్యేశ్వరులును నుండ్రు. కదంబశిఖరం బనువింధ్యపాదంబున దమునికొడుకు దుర్దముం డనువాఁడు దురాచారుం డై యొక్కపురుషువలన జ్ఞానోపదేశంబు వడసి కాశికిం జని లింగప్రతిష్ఠ చేసె. ఆదుర్దమేశ్వరుఁడు భజించువారలకు భోగమోక్షప్రదాయకుం డై యుండు. అమిత్రజిత్తనురాజు విష్ణుభక్తిపరాయణుండు నారదునుపదేశంబువలనఁ గంకాలకేతుం డనురాక్షసుని చేత నపహరింపఁబడి పాతాళలోకంబునం జంపకావతియను పట్టనంబుననుండి మలయగంధి యనువిద్యాధరకన్యకం బెండ్లియాడి యానందకాననంబున కరిగి వీరేశ్వరదివ్యలింగస్థానంబునందు నక్కాంత మనోరథతృతీయావ్రతంబు నోమించి పుత్త్రవంతుఁ డయ్యె. 13.

తే. మఱి హయగ్రీవతీర్థంబు మౌనివర్య!
కాశికాతీర్థములలోన ఘనము మహిమ
నంతకం టెను గజతీర్థ మభ్యధికము
ప్రథిమఁ గోలావరాహతీర్థంబు నట్ల. 14.

వ. దిలీపతీర్థంబు సప్తాబ్ధితీర్థంబు హంసగోవ్యాఘ్రేశ్వరముచుకుంద పృథుపరశురామబలభద్రదివోదాసహరత్పాపదశాశ్వమేధభరతశుక్రభవానీ ప్రభాసగరుడబ్రహ్మావృద్ధార్కకేశవనృసింహ చిత్రరథధర్మవిశాలలలితాగౌతమ గంగా కేశవ నర్మదా వసిష్ఠమార్కండేయభాగీరథీఖురకర్తరీతీర్థంబు లివి మహాపుణ్యతీర్థంబులు. 15.

తే. ఇపుడు సెప్పినతీర్థంబు లెన్ని గలవు
వీని నన్నిటి రాశి గావించి యందు
మూఁడుకోటులు శివలింగములను నిలుప
నీసమష్టి వీరేశ్వరు నెనయలేవు. 16

వీరేశ్వరాఖ్యానము.

తే. అర్థి నేతీర్థమునఁ దీర్థ మాడె నెవ్వఁ
డతని కాతీర్థమాడినయంతఫలము
అనఘ! వీరేశతీర్థ మాడిననరుండు
గాంచు నిశ్శేషతీర్థావగాహఫలము. 17

తే. మలయగంధితనూజుండు కలశజన్మ!
వీరుఁ డనువాఁడు వాఁడు సేవింపఁబట్టి
యబ్బె శివునకు వీరేశుఁ డనెడునామ
మనఘ! యానందకాననాభ్యంతరమున. 18

వ. మఱియు సంగమేశ్వరతీర్థంబు పాదోదకతీర్థంబు క్షీరాబ్ధి
తీర్థంబు శంఖతీర్థంబు మఱియుఁ జక్రపద్మగరుత్మద్వైకుంఠ
నారద ప్రహ్లాదాంబరీషాదిత్యకేశవ దత్తాత్రేయ భార్గవ
వామన నీలగ్రీవోద్దాలక నరనారాయణ యజ్ఞవరాహ
విదారణ నరసింహలక్ష్మీనృసింహగోపీ గోవిందశేషసాంఖ్య
మహిషాసురబాణ వైతరణీప్రణవపిశంగిలాపిలిప్పిలానాగే
శ్వర కర్ణాదిత్యభైరవ ఖర్వనృసింహ పంచనదతీర్థంబులు
భోగమోక్షప్రదంబులు. 19

స్రగ్ధర. ఆనందారణ్యపూర్మధ్యమునఁ గలవు కో
ట్లర్బుదన్యర్బుదంబుల్
నానాముక్తిప్రదంబుల్ నలినజమురభి
న్నాకరాడ్వందితంబుల్

స్థానంబుల్ గల్గు నీపంచనదమున మహా
శంభుతీర్థంబుతోడఁ
వానిఁ సామ్యంబు సేర్పఁ వలదు బహుళని
ర్వాణలక్ష్మీసమృద్ధిన్. 20

వ. మఱియు జ్ఞానహ్రదంబు మంగళతీర్థంబు, మయూఖాదిత్య
తీర్థంబు మఖతీర్థంబు, బిందుతీర్థంబు పిప్పలాదతీర్థంబు,
మఱియు వరాహామరుదీశ్వరమైత్రావరుణాగ్న్యంగార
వైకలచంద్రవిఘ్నేశ్వరహరిశ్చంద్రపర్వతకంబలాశ్వతరసర
స్వత్యుమాభామమణికర్ణికాతీర్థంబు లివి తీర్థోత్తమంబులు.

తే. వింటి వీవు తీర్థంబులు వేనవేలు
కలశసంభవ! చెప్పితి గారవమున
హెచ్చు గుందాడఁ దగవు గా దిల్వలారి!
యన్నిటికిఁ బెద్ద మణికర్ణి యని యెఱుంగు. 22

ఆ. అని దశాశ్వమేధ మగ్రంబు తీర్థంబు
పంచనదము కాశిఁ బస గలయది
వానికంటెఁ బెద్ద వాతాపితాపన!
చక్రపుష్కరిణి యసంశయంబు. 23

## దుర్వాసోలింగమాహాత్మ్యము.

వ. ఇంక దుర్వాసోలింగమాహాత్మ్యంబు వినుపించెద నాకర్ణిం 24
పుము.

తే. సకలదేశంబులందును సంచరించి
ఋషివరేణ్యుఁడు దుర్వాసుఁ డేగుదెంచె
నఖిలముక్తివధూవిహారావరోహ
సౌధవీథికఁ గాశికాస్థానమునకు. 25

వ. ఇట్లు వచ్చి యమ్మహాభాగుండు భాగీరథీనదీమాతృకంబులై ముక్కారును బండుపంటవలంతి కేదారక్షేత్రంబులు, నిర్ధూత కలధౌతశలాకాశకలశంక నంకురింపఁ జేయఁ జాలుక్రొత్త మొలక లెత్తునవియును, సుకుమారశుకచ్ఛదచ్ఛటాదాయాదంబులై యడ్డపచ్చఁ గొనునవియును, నార్యావర్తనేశమత్త కాశినీజంఘాకాండపాండిత్యంబు గండూషించుచిగురుపొట్టలఁ గనుపట్టునవియును, బదియాఱువన్నెకడానికుందనంబు హెచ్చు కుందాడుపసిమిఁ బచేళిమంబు లగునవియు నైన పాసఁగుంజేలును, వికటఘటీయంత్రవ్రాతవాపి కాసలిల ధారాధోరణీ ప్రవాహసేకసంవర్ధితంబు లై జంబూజంబీర నారికేళ సహకారకురవకవకుళాశోకశాకోటకుటజముఖ నిఖిలవిటపివాటికాభిరామంబులైన యారామంబులును, సముద్దండపుండరీక కువలయ కుముదషండమండితంబు లగు తీర్థకుండంబులును, నారసాతలగంభీరసలిలసంభారంబు లైన పరిఘాచక్రంబులును, గనకగిరిప్రదీప్తవప్రాకారంబు లగు ప్రాకారంబులునుం గనుంగొనుచు, భూర్భువస్స్వర్మహాలింగ మకుటగంగాతరంగకూటకోలాహలవ్యాజృంభి సముత్తంభితశాతకుంభసౌధభవనచంద్రశాలావలభీగర్భక్రోడంబులును, ఖఖోల్కాదిత్యప్రత్యగ్రకిరణకందళీ సందోహస్పంద కందళిత మందాకినీకనకారవింద కాననంబును, జైగిషవ్యేశ్వరభూషాభుజంగఫూత్కారపవనధారాతరంగితోత్తుంగ పుంగవపతాకాకౌశేయపట్టపటీవల్లీ వేల్లితనభోంగణంబును, వికటాదేవీ కరకఠోరడమరుఢాంకార బృంహిత బ్రహ్మాండ మండలంబును, ద్రుమిచండవతీ కలాకంఠమూలకాకోల విషమషీవిసృత్వ రాంధకారచ్ఛటాసంఘాతజ్యోతి .రింగ

ణాయ మానశశిపతం సమండలంబును, మాహేశ్వరీ వాహానవృషలంబకగళకంబళకషణమసృణత్వక్శాఖాస్కంధ పరిణాబంధురవరణాసింధురోధగ్గ ప్రత్యాసన్నచైత్యద్రుమం బును, డుంఠిరాజశుండాకాండ చుళుకితోన్మక్తజ్ఞాన వాపికా సలిలనిర్ఝర జలాంతరిక్షంబును, క్రోధభైరవ ప్రబలహుంకార కఠినతరకహకహాట్టహాసముఖరిత ప్రాకా రగోపురాట్టాలకంబును, గర్మబీజంబులకు నూషరంబును, బుట్టువులకు వీడుకోలును, గల్మషంబులకుఁ గర్తరియును, మంగళంబులకు నాస్పదంబును, గైవల్యంబునకు ఘంటాప థంబును, జ్ఞానంబులకుఁ దానకంబును, విరక్తికి నెలవును, విభవంబులకుఁ బ్రభవంబును, విలాసంబులకు నివాసం బయినకాశికాపట్టణంబుఁ బ్రవేశించి. 26

తే. తపసి పెద్దయుఁగాలంబు దపము సేసి
కాలగళువీట నానందకాననమున
ఫలము గడుదూర మైనఁగోపంబు వుట్టి
కాశినగరంబు శపియింపఁ గాఁ దలంచె. 27

వ. అప్పుడు ప్రత్యక్షంబై. 28

చ. కహకహ నవ్వె దంష్ట్రికలగల్లమెఱుంగులు భానుదీప్తిసం
గ్రహముఁ దిరస్కరింప శితికంఠుఁ డకుంఠితరోషదీప్తుఁ డై
యహహ! దురాత్మ! కాశిపయినగ్గిదవే? యనుపల్కుపల్కినా
గ్రహమున నేనుడుంఠిగణరాజు నెదిర్చితి మమ్మునీంద్రునిన్. 30

వ. అప్పుడు.

సీ. నందిషేణువిలోచనముల నిప్పులు రాలె
శూలంబు చే నందె సోమనంది

మృత్యుప్రకంపను మే నెల్లఁ జెమరించె
దండుఁ డాస్ఫోటించె ధరణిఁ గాలఁ
గుంభోదరుండు భ్రూకుటి ఫాలమునఁ బూనెఁ
గోకిలాక్షుఁడు పండ్లు గొఱికికొనియె
నగ్నిజిహ్వుండు ఘోరాట్టహాసము సేసెఁ
గృత్తివాసుండు హుంకృతి యొనర్చె
తే. భృంగితండులు తాండవప్రియుఁడు రేఁగి
డమరుకంబులు వాయించి రమితపటిమ
రాజరేఖాధరుండు దుర్వాసుమీఁద
నలుగు లెఱేఁగి తదీయరోషానువృత్తి. 31

శా. ఆభుగ్నభ్రుకుటీకరాళముఖులై యంగంబులుప్పొంగ ద్యా
వాభూమ్యంతరమట్టహాసడమరుధ్వానంబులన్ బిట్టు సం,క్షో
భింపం బ్రమథధ్వజిన్యధిపతుల్ కుంభోదరాదుల్ మహా,భూ
భృత్సన్నిభులం బ్రుల్లన్ ధరణియాస్ఫోటించి తాటించుచున్.

క. జడముడులు జటిలభ్రుకుటులు
ముడివడఁ గనుఁగవలఁ గెంపు మొలతేరంగా
మృదుప్రమథులు పులితోలుం
గడవసములు మడిచికొనుచుఁ గడురభసములన్. 33

ఉ. చంపుదు మే కృతాంతు? శిఖిచండమయూఖుల బారిగొం
దు మే?, డంపుదు మే కుభృత్పరివృఢంబుల? మొత్తుదు మేయ
జాండమున్?, జింపుదు మే చతుర్దిశలు జృంభితబాహుపరా
క్రమక్రియా, సంపద సొంపు మీఱఁ *బురశాసను నానతి
యింత గల్గినన్? 34

వ. అని వెండియు. 35

* 'పురశాసన ! మాకు ననుజ్ఞ గల్గినన్.' అని తాళపత్ర పుస్తక పాఠము.

తే. మాటిమాటికిఁ గోపసంభ్రమము పేర్మిఁ
గక్షపాత్రంబులం దున్నకమ్మబూది
వదనములఁ బ్రామికొనుచు నిర్వక్రలీల
'హరహరా!' యని పల్కిరి యభ్ర మడల. 36

వ. అప్పుడు దుర్వాసుండు శర్వాణీపతికి దండప్రణామంబు
లాచరించితలవకారముండకఛాందోగ్యశ్వేతాశ్వతరాద్యు
పనిషదర్థగర్భితంబు లైనబహువిధస్తోత్రసందర్భంబులనమ్మ
హాదేవుం బ్రస్తుతించె. శివుండునుం బ్రసన్నుండయి యమ్ము
నీంద్రునకుం గోరినవరంబు లొసంగి యంతర్హితుం డయ్యె
ననంతరంబ. 37

తే. అమ్మునీంద్రుండు దనపేర నధికభక్తిఁ
గాశియందుఁ బ్రతిష్ఠించెఁ గాలకంఠు
దివ్యలింగంబు భాగీరథీతటంబు
నందు మణికర్ణికాతటోపాంతభూమి. 38

విశ్వకర్మేశ్వరలింగప్రాదుర్భావము.

వ. దుర్వాసోలింగంబు సర్వాభీష్టఫలదాయకంబు. మఱివిశ్వ
కర్మేశ్వరలింగంబు ప్రాదుర్భావంబు వివరించెద సావధాన
మతి వై యాకర్ణింపుము. త్వష్టృప్రజాపతికొడుకువిశ్వకర్మ
బ్రహ్మచర్యంబున భిక్షాన్నభోజనుం డై గురుకులంబున
విద్యాభ్యాసంబు సేయుచుండె నంత. 39

సీ. వానకాలము వచ్చె వర్షంబు లందందుఁ
జడివట్టి కురిసె నాసావియందు
గురుఁడు నా కొక్కమందిరము నిర్మింపుమీ
యుదకధారలచేత నుఱియకుండ

గురుపత్ని నా కొక్క కుపసంబుఁ గుట్టుము
చలిగాలి యొడలిపైఁ బొలయకుండ
గురునందనుండు నాకు రచింపు పాదుక
లడుసు పాదంబులం దంటకుండ
తే. గురుతనూభవ నాకు బంగరువుతోడవు
* వజ్రభూషలు సేయు తాల్పంగవలయు
ననుచుఁ బ్రార్థించి రందఱే కతఁడు మ్రొక్కి
యిన్నియును దాను గల్పింప నియ్యకొనియె. 40
వ. ఇవ్విధంబున గురునకు గురుపత్నికి గురుపుత్త్రులకు గురుత నూభవకు వారలు గోరినయర్థంబులు సంఘటింప నను వెఱుంగక చింతాక్రాంతుం డై దైవయోగంబున నొక్క పుణ్యపురుషునుపదేశంబునం గాశికరిగి శివలింగంబుఁ బ్రతిష్ఠించి పరమనిష్ఠం బెద్దకాలంబు తపం బాచరించినం బ్రత్యక్షం బై విరూపాక్షుం డనుగ్రహింప సర్వధాతువులకు, సర్వదారువులకు, సర్వశిలలకు, సర్వమణులకు,సర్వరత్నంబులకు, సర్వపుష్పంబులకు, సర్వవస్త్రంబులకు, సర్వసుగంధంబులకు, సర్వకందమూలఫలంబులకు, సర్వచక్రంబులకుఁ దాన కర్త యగునట్లుగా వరంబు వడసి గురుజనంబుల యాజ్ఞ చెల్లించి విశ్వోపకారపరుండయ్యె. అతని పేరఁ గాశి విశ్వకర్మేశ్వరుండు విశ్వాభీష్టఫలప్రదాయకుండయి యున్నవాఁ డింక దక్షేశ్వరలింగప్రాదుర్భావంబు వివరించెద. 41

## దక్షేశ్వరలింగప్రాదుర్భావము.

ఉ. సామజదైత్యశాసనుఁడు సారసగర్భుఁడు నచ్యుతుండు సుత్రాముఁడు నాది గా సురకదంబము గొల్వ నశేషలోకర

* 'వజ్రభూషణములు నాకు వలయుఁ దాల్ప' అని వ్రాఁతపుస్తకము.

ధామమహనీయతర రజతశైలముపైఁ గొలువుండె శుద్ధము
క్తామణిభూషితం బయినకాంచనరమ్యశిలాతలంబునన్. 42

వ. తదనంతరంబ. 43

తే. వేలుపుల నెల్లఁ బరిపాటి పీడుకొలిపి
సముచితం బైనతారతమ్యమున శివుఁడు
మఱచె దక్షప్రజాపతి మామ ననుప
నెట్టివారికి మఱపు లే దె ట్లొకపుడు? 44

వ. ఖిన్నుం డై యతండును మరలి నిజస్థానంబునకుం బోయి
నిజాంతర్గతంబున. 45

సీ. ఇతనివంశం బెద్ది యెఱుఁగంగ వచ్చునే?
యితనిగోత్రం బెవ్వఁ డెఱిఁగినాఁడు?
దేశంబు గుఱుతు సాధింపంగ వచ్చునే?
వర్తనం బెఱుఁగంగ వచ్చు నెట్లు?
వృషభవాహనుఁ డఁట విషముఁ దిన్నాఁడఁట!
యితనిసమాచార మేమి లెస్స?
యస్త్రంబు ధరియించు నఁట తపస్వియు నట్టె!
యిట్టివేడబము లెయ్యెడలఁ గలవె?

తే. కాటిలో నుండు గార్హస్థ్యగణన యెట్లు?
బ్రహ్మచారియు గృహియు నెబ్భంగి నయ్యె?
శూద్రుఁడో! బ్రాహ్మణుండో! వైశ్యుండో! రాజో!
తెలియవచ్చునె యీతనికల తెఱంగు? 46

వ. అర్ధనారి గావునం బురుషుండు గాఁడు; గడ్డంబు గలిగినకతం
బున యోష గాదు; సమర్చనీయలింగమూర్తియగుట నపుంస
కుండు గాఁడు; పెద్దకాలంబువాఁడు గావున బాలుండు
గాఁడు; చిరంతనుండు గావున దరుణుండు గాఁడు; జరా

మరణవర్జితుం డగుట వృద్ధుండు గాఁడు; మహాకల్పాంతంబునం బ్రహ్మాదుల సంహరించియుఁ జాతకి గాఁడు; ఈతని చందం బెవ్వాం డెఱుంగు? నది యట్లుండె. 47

క. మామ గురుస్థానంబు న
సామాన్యుఁడ నెట్లు? జలజసంభవసుతుఁడర్క
సౌముఖ్యంబున యోగ
క్షేమము లారసి ప్రియంబు చెప్పందగదే? 48

క. మాతాపితృవర్జితుఁ డగు
†నీతని కే నెట్లు బిడ్డ నిచ్చితి? నకటా!
నాతప్పు గాక యిది దా
నీతనిత ప్పెట్లు? నాకు నిటు కావలయున్. 49

తే. పేద లయ్యును గడు బిఱ్ఱబిగిసి యింద్రు
వట్టియభిమానములను గర్వములఁ బట్టి
యల్లువారికి నెల్ల నీయవగుణంబు
వెన్నతోఁ బెట్టినది యింత విసువ నేల? 50

తే. అహహా! ‡ యలచంద్రుఁ డనువాఁ డహంకరించి
రోహిణీదేవి నొల్లక రోసి యుండఁ
బాపి నతని క్షయవ్యాధిబాధితుఁడుగఁ
గినిసి శపియింపనే? నల్లఁ గనిన నోర్వ. 51

క. ఇది ధర్మం బకులీనుల
కిది విధి మాతాపితృప్రహీనుల కహహా!

---

† 'నీతనికిని నెట్లు బిడ్డ నిచ్చితి(నదియుఁగ)నాదిగ' అచ్చుపుస్తకము.
‡ 'మునుచంద్రుఁ; యిలచంద్రుఁ...రోహిణీదేవి నొకకొంత రోసి' అని వ్రాఁతపుస్తకము.

యిది కట్టడ తిరువరులకు
నెదిరిం దను నెఱుఁగ కునికి కేలా మాటల్? 52

శా. తా నెట్టేనిఁ దిరస్కరించె నను నాస్థానంబునం దేవతా
మానివ్రాతములోనమామ యనుసన్మానంబు శూన్యంబుగా
నేనుం దన్నుఁదిరస్కరించెద మఘుం బిప్పాటఁ గల్పించి సం
థానై యత్యముఁబూనియల్లుఁడనుసన్మానంబుశూన్యంబుగన్.

వ. అని యజ్ఞసంభారంబులొడంగూర్చియజ్ఞపురుషుం డైనపురు
షోత్తముం డుపద్రష్టగా, బ్రహ్మవాదు లగుమరీచ్యత్రిభర
ద్వాజాదిసప్తర్షులుబుత్విజులుగాఁ,దైలోక్యంబునుదక్షిణా
ద్రవ్యంబుగా, భృగుండు బ్రహ్మగా, నాంగిరసుండాచార్యుం
డుగా, భగపూషాదులుసదస్యులుగా, దిక్పాలకులురక్షకు
లుగా, నల్లురు ధర్ముండును జంద్రుండును గశ్యపుండును సహా
యులుగాఁ, గామధేనువు హవిస్సును గల్పవృక్షంబులు సమి
త్కుశంబులును విశ్వకర్మ దారుపాత్రశకటమంటపాలంకా
రంబులును గల్పించువారు గా, ధర్మపత్ని యగుశతరూపా 54
దేవితోఁగూడి మహాధ్వరంబు సేయం బ్రారంభించిన.

తే. అరణిసంగ్రహ మొనరించి యజునిపట్టి
పెద్దకొలు వుండె ముత్యాలగద్దె యెక్కి
చుట్టు బలిసి కూర్చుండిరి సురలు మునులు 55
వింధ్య మాఁ కిడిన ట్లుండె విశ్వసభయు.

వ. అప్పుడు పరమమాహేశ్వరుండు దధీచి యనువిప్రర్షి సభా 56
మధ్యంబున నిలిచి యెల్లవారును విన నిట్లనియె.

సీ. భారతీదేవి †కైవారవాక్యంబులు
పఠియించుచున్నది ప్రస్ఫుటముగ
నాచార్యపదవికి నర్థిమై నాయితం
బైయున్నవాఁడుచతుర్థ్యానుజుండు
కర్మకాండవిదుండు గాచియున్నాఁడు బ్ర
హ్మత్వమునకు క్షణం బంది భృగుఁడు
గట్టువాలై లక్ష్మి గైసేయుచున్నది
చేరి యంతఃపురస్త్రీజనముల
తే. దేవి శతరూప జాలియఁ దీర్చె మౌళి
నీవు దీక్షిష్యమాణుండ విద్ధమహిమ
నధ్వరారంభ మింతొప్పు నయ్య! దక్ష!
శివునిఁ దోడ్తేనియొక్కఁ డెచ్చెంబ కాని. 57

క. అపరాధ మింక నెట్టిది?
చెపుడా! మఖమునకుఁ దన్నుఁ జీరినమాత్రన్
త్రిపురాంతకుఁ బిలిపింపక
యుపదర్శన మాచరించు టుచితమె హరికిన్. 58

† ఇచటఁ గైవారశబ్దము సంస్కృతసమాసఘటితమైయున్నది. ఇది సంస్కృతశబ్దముగూడ నని శబ్దరత్నాకరమున నున్నదిగాని యచ్ఛకర్ణాటశబ్దముగఁ గర్ణాటనిఘంటువులోనున్నది. ప్రాచీనసంస్కృతనిఘంటుగ్రంథములలో నెక్కడ నీశబ్దము గనఁబడదు. కావున నిది దేశ్యమొండెఁ, గవివార(కవులపలుకులు) శబ్దతద్భవమొండెం గావలయు. ఈశబ్దము స్తుతిపరముగనే యఱవమునఁ గన్నడమునను వాడఁబడుచున్నది. ఇట్లే శృంగారనైషధమునను 'మీకై వారమువ్యాప్తణం, బులకుం గాని'(ఆ-7. ప-89) యని ప్రయోగించియున్నాఁడు. శ్రీనాథుఁడు సంస్కృతశబ్దముగ భ్రమించె నని తోఁచుచున్నది.

క. వామాంగము వైకుంఠుఁ డ
వామాంగము వేధ మదనవైరికి నని యో
సోమప! యెఱుఁగుదో? యెఱుఁగవో?
యామృడు రప్పింపవలదె యధ్వరమునకున్? 59

సీ. శితికంఠునకును నెచ్చెలికాఁడు గాఁ డొకో
యజమటీఁ డైనయీయక్షభర్త?
యహికంకణునకు మూఁడవకన్ను గాఁ డొకో
పాల్గొలునట్టియీపావకుండు ?
పురవైరి కవతంసపుష్పంబు గాఁ డొకో
నిర్భాగ్యుఁ డైనయీనీరజారి ?
గంగాధరునకు లెంకలలెంక గాఁ డొకో
పెనుగూళ యైనయీయనిమిషేంద్రుఁ?

తే. డేమి గుడువంగ వచ్చినా రిండ్లు విడిచి
హరుని వెలివెట్టినట్టియీయాగమునకుఁ ?
బంచవదనునికను జేవుఱించె నేని
దక్షిణమునంద తమయాండ్రతాళ్లు దెగవె ? 60

తే. ఏల వచ్చినవాఁడు బాలేందుమౌళి
విరహితం బైనయీయాగవిధికి జముఁడు ?
మఱచెనే శూలి డాకాలమడమతాఁపు
దీర్ఘనిర్ఘాతసంపాతనిర్ఘృణంబు. 61

క. వినరే ! 'శ్వేతాశ్వతరో
పనిషత్తు హరుండు భోక్త భర్గుఁడు భోగ్యం
బనిలాశిధరుఁడు ప్రేరిత'
యని చెప్పెనో వేదమది ప్రయత్నముతోడన్ ? 62

వ. వియదాదిపరమాణ్వంతం బైనచరాచరాత్మకజగత్ప్రపంచం
బునకు సృష్టిస్థితిలయకారణం బైనశంభుండు నీకు మాననీ
యుండు గా కుండుట యెట్టు? విచారింపుము. 63

తే. బ్రాహ్మణుఁడ నాశ్రితుఁడ నీకుఁ బరమహితుఁడ
దక్ష! యొకమాట వినవయ్య తగవు గల్గి
క్రతుఫలాధీశు భువనరక్షాధురీణు
భోగికంకణు రప్పింపు యాగమునకు. 64

వ. అర్థహీనం బైనవాక్యంబును, గర్మహీనం బైనశరీరంబును
బతిహీనం బైననారీరత్నంబును, గంగాహీనం బైనదేశం
బును, బుత్రహీనం బైనదాంపత్యంబును, దానహీనం బైన
వైభవంబును, మంత్రిహీనం బైనరాజ్యంబును, శ్రుతిహీనం
బైనయాకారంబును, యోషాహీనం బైనసౌఖ్యంబును,
దర్భహీనం బైనసంధ్యావందనంబును, దిలహీనం బైనపితృ
తర్పణంబును, హవిర్హీనం బైనహోమంబును, శివహీనం
బైనక్రియాకలాపంబులు నిరర్థకంబులు. 65

తే. అనినఁ గోపించి దక్షుఁ డీయవనిసురుని
వెడలఁ ద్రోయుఁడు ప్రాగ్వంశవేశ్మ మనఁగఁ
దనకుఁ దాన దధీచి యాస్థాన మెల్లఁ
దల్లడిల్లంగ వెడలె నుద్దామభంగి. 66

వ. అతనితోడ దుర్వాసుండు, నుదంకుండు, నుపమన్యుండును,
రుచికుండును, గాలవుండును, మాండవ్యుండును, వామదే
వుండును, నుద్దాలకుండును వెడలిరి. అంతకమున్న మీఁ
దెఱింగి బ్రహ్మసత్యలోకంబునకరిగె. మఖంబు ప్రారంభింప
బడియె. తద్వృత్తాంతం బంతయు నారదువలన విని సతీ

దేవి మహేశ్వరుననుమతి దివ్యరథారూఢ యై తండ్రికి
బుద్ధిచెప్పుపొంటెఁ గైలాసంబున నుండి యేతెంచి. 67

తే. యజ్ఞవాటంబు సొత్తెంచి యఖిలజనని
యర్థిఁ గూర్చుండె రత్నసింహాసనమున
భక్తితో దేవసభయును బ్రహ్మసభయు
నంజలులు ఫాలభాగంబునందుఁ గూర్ప. 68

వ. అప్పుడు దక్షప్రజాపతి కోపించి వచ్చినకూఁతుచిత్తం
బెఱింగి యి ట్లనియె. 69

సీ. హరుఁ డమంగళవేషుఁ డౌఁ గాఁడొ చెప్పుమా!
యెఱుఁగ కిచ్చితిమి ని న్నేమి చెప్ప?
నిటు చూడు † మిందఱు నిం తొప్పి యున్నవా
రఖిలభూషణభూషితాంగు లగుచుఁ
దనరూపునకుఁ దోడు దలము దప్పినగర్వ
మరకంటఁ జూడఁ డే నరిగినపుడు
నాపెండ్లికొడుకులం దేపాటివాఁడు దా?
నే నేల రప్పింతు నిట్టివాని?

తే. నీవు వచ్చితి మే లయ్యె నిదియ చాలు
నతఁడు రాకున్నఁ గొదలేశ మైన లేదు
దాను భిక్షాకపాలంబు దాల్చి వచ్చి 70
బందు నేయుటకంటె రాకుండు టుఱవు. 71

వ. అనిన విని సతీదేవి తండ్రి కి ట్లనియె.

శా. ఆహా! లెస్స! వివేక మే! పురహరుం డాసించియున్నాఁడె నీ
స్వాహాకారము? శంభుఁ బాసి యిట నీసత్త్రంబునం దేనుమ్మ

† 'సిరంద ఊర తొప్పి' అని ప్ర.

ష్టాహారంబు భుజింపవచ్చితినె మోహాంధుండ వై యీశ్వర
ద్రోహం బేటికిఁ జేసెదంచుహితబుద్ధుల్ సెప్పఁగావచ్చితిన్.

తే. శివుఁడు దాత భోక్త శ్రీమహాదేవుండు
సర్వమును హరుండు శాశ్వతుండు
శంభు వేఱు సేసి సాగింప వచ్చునే
క్రియలు ? వెఱ్ఱి వేల యయితి ? చెపుమ. 73

దండకము. విను మతఁడు. సదానిదిధ్యాసితవ్యుండు మంతవ్యుఁ
డాతండు శ్రోతవ్యుఁ డాతండు ద్రష్టవ్యుఁ డాతండు జన్మస్థితి
ధ్వంసనమ్ముల్ దిరోభావమోక్షంబులుం గృత్యముల్గాఁగనా
తండు లోకంబులం బట్టి పాలార్చు రుద్రుండు విశ్వాధికుం
డంచు నామ్నాయసంఘాత మామ్రేడితప్రక్రియం దోయ
మై యాతనిం జెప్పు సత్యంబు నిత్యంబు శుద్ధంబు బుద్ధం
బనంతంబు శాంతంబు కూటస్థ మాత్మప్రతిష్ఠం బఖండంబు
సత్తద్వితీయంబు చిత్తేశ మానంద మాద్యం బవేద్యంబు
దిగ్దేశ కాలవ్యవచ్ఛేదనీయంబు బ్రహ్మంబుదత్తత్త్వముం వేద
వేదాంతవిద్యామహావాక్యమీమాంసహంసు ల్విచారింతు
రధ్యాత్మయోగంబునం షణ్ణవత్యంగులీమానయుగ్దేహ
మధ్యాంతరాళానలావాస కోణత్రయీగేహరోహత్ప్రభా
లేఖికాస్యూతనిర్భిన్నషట్పుష్కరీగర్భ విష్కంభ నిష్కంప
నీవారశూకోపమాధామధామచ్ఛటాకోటిశంపాలతాలం
ఘితద్వాదశారేందునిష్యందమానామృతాసారధారాప్లవా
స్పందితానందు లై యోగిబృందారకుల్ లీలతో లోనఁ గం
డ్రాతనిం నిక్కమై యాతఁ డొక్కండ భూతాత్మ భూతంబు
నం దుండి నానాత్వముం బొందిన ట్లుండు నె ట్లాఘటాంత
స్థితం బై ఘటాకాశమునయ్యున్ [illegible] స్థితంబై మఠా

కాశమయ్యుఁ నిజంబొక్కయాకాశమాకాశముల్ పెక్కులైనట్టిచందంబులఁ భ్రాంతిదోఁచుం గదా! త్రిపురమథను ఫాలనేత్రుం ద్రిలోకీగృహస్థుం ద్రయీమౌళిమాణిక్య ఖడ్గంబు బ్రహ్మాండకుక్షింభరిఁ శంభుఁ గుంభీనసగ్రామణీ కంఠహారుఁ గటీభాగశాటీభవత్సింధురక్రవ్యభుక్కృత్తి మృత్యుంజయుం గూఢపాత్కుండలుం బాండురాంగుం గురంగాంకఖండావతంసుం గిరీశుఁ లలాటేక్షణావిర్భవ ద్భీషణోపర్బుధజ్వాలమాలాసమాలీఢ పుండ్రేక్షుకోదం డునిఁ భూర్భువస్స్వర్జగద్దాహలీలాకళాదోహలవ్యాళహాలాహలగ్రాసకల్మాషకంఠోపకంఠుఁ నమద్బ్రహ్మవైకుంఠ ముఖ్యామరగ్రామకోటీరకోటీ మణిశ్రేణిశోణప్రభాజాల బాలాతపస్మేరపాదారవిందుఁ భజింపం దగుఁ సత్క్రియా రంభకాలంబునఁ, జనక! కనకశైలకోదండుఁ డల్పుండు గాఁజూచితే? తండ్రి! కల్పాంతసంధ్యామహాతాండవాడం బరారంభ సంరంభ సంక్షోభితాశేష లోకప్రపంచుండు వంచింప నర్హుండొకో? యయ్య! త్రయ్యంత విద్యావధూ రత్నసీమంతసిందూరపాంసుచ్ఛటాపాటల శ్రీపదాంభోజ యుగ్మండు తన్మాత్రుఁడే? తాత! దైతేయ లీలావతీగండ పాళీపరిన్యస్తకస్తూరికాపత్రవల్లీ మతల్లీ కళాద్రోహిబాహా ర్గళ స్తంభుపై నీకవష్టంభసంరంభ మేలయ్య! యీలా గునఁ? మధుమథన! మహాప్రబుద్ధుండ వీ విట్టిదుశ్చేష్టితం బెట్లు వీక్షింపుచున్నాఁడ? వజ్రాస్త! నీయిల్లు వేల్పుండ నీబండ దుర్గోష్ఠిలోఁగూడియున్నాఁడ విం కొక్కనాఁడైన నేమో మునం జూచె దీశానుపాదాబ్జముల్? వహ్ని! యీకూడు దీఁ పరయ్యే నీకు నాభాగ్య? వేణాంక! యంతగకళంకంబుఁ

దెల్లంబుగావించి తిన్నాళ్ల కుర్ల లెస్స గాకేమి? పౌలస్త్య! నిన్నుం గనుంగొన్న సిగ్గయ్యెడుర్ల? శక్ర! నీ మొక్కలంబు ల్విసంబడ్డవే కావె? వాచస్పతీ! నీచరిత్రంబు చిత్రంబు నీచంబు చాలుర్ల వృథాలాపముల్ సేయ నీయున్నవారింద ఉన్నారు చూడంగ నేఁ డెల్లి యెల్లుండి యీలోన నేపాకముంబొంద నున్నారొ? యేదుర్గతిం జెంద నున్నారొ? యేయాపదం దూల నున్నారొ? యేపంచలం గూల నున్నారొ? యామీఁద దైవం బెఱుంగున్. 74

వ. అని పలికి భవాని కన్ను మొగిచిన. 75

సీ. పాదపద్మములందుఁ బ్రభవించునప్పుడు
ప్రత్యగ్రయావకద్రవము చెలువు
కటిమండలంబుపైఁ గనుపట్టునప్పుడు
కనకకాంచీదామకంబు డాలు
వలుఁదచన్నులమీఁద మొలతెంచునప్పుడు
కాశ్మీరజాంగరాగంబుపొలుపు
సీమంతపదమునఁ జిగురొత్తునప్పుడు
రమణీయసిందూరరజముసొబగు
తే. ప్రోదిసేయుచు భగ్గన భుజగహారు
రాణివాసంబు దివ్యవిగ్రహమునందు
రవులుకొని మండె నాస్థానరంగభూమి
నధికరోషోత్థితంబు యోగానలంబు. 76

సీ. ఆక్రోశ మొనరించె హాహాస్వనంబుతో
బంధువర్గము శోకపరవశమున
మొగములు దెల్లఁగా మునులు దేవతలును
భీతిల్లి చేతులు పిసికికొనిరి

చ్యుతవికంకతతరుస్రుక్స్రువప్రకర మై
విభ్రాంతిఁ బొందె ఋత్విగ్గణంబు
† ప్రజ్వలింపక యాఱుభంగి నేమియు లేక
మడివోయి చల్లనై యుండె వహ్ని
తే. పుట్టె నుత్పాతములు పెక్కు భువిని దివిని
విడిచిపోయిరి యొకపాటి విబుధమునులు
యజ్ఞవాటంబునందుఁ గామారిదేవి
యోగవహ్నికి దేహ మాహుతి యొనర్ప. 77

తే. భామతోఁ గూడి వచ్చినపారిషదులు
వేగమున నేగి సతిసుద్ది విన్నవింప
భవుఁడు గోపించె భ్రూకుటిభయదఫాల
భాగుఁ డై యప్పు డొకమహాప్రభ జనించె. 78

వ. ఆప్రభామండలంబునడుమ నొక్కదివ్యపురుషుం డావిర్భ
వించి యమ్మహాదేవునకు నమస్కరించి. 79

సీ. వదనంబు దెఱచి మ్రింగుదునె బ్రహ్మాండంబు
పలు మోవ కుండంగఁ బాండురాంగ?
పిండిపీచంబుగాఁ బృథివీధరంబులు
డంతునే కాలదండమున నభవ?
దందశూకాధీశుతలలు దండసిలంగఁ
దాటింతునే కాల ధర మహేశ?
వ్రచ్చి వైతునె కేలి వాలారునఖముల
నఖిలదిక్కులు శశాంకార్ధమకుట?

† 'ప్రజ్వలింపఁగరానిభంగి గా కొకభంగిఁ, దఱుచుగానుండె హైతా వహ్ని' అని అన్యప్రతము.

తే. యేమి సేయుదు? నానతి యిమ్ము నాకు
నను చుఁ గ్రమ్మఱ మ్రొక్కి బాహాస్ఫాలించి
తన్మహాధ్వనిఁ గలఁగి యుత్కటము లగుచు
జడధు లేడును ఘూర్ణిల్ల శంభుసుతుఁడు. 80

వ. అనిన రుద్రుం డతనికోద్రోద్రేకంబునకువీరరస రేఖాముద్ర కుం బ్రమోదం బంది భద్ర! నీకు వీరభద్రనామంబిచ్చితి, నవ్యాక్షేపంబున దక్షయజ్ఞంబుసంక్షయంబు నొందింపుము, ప్రమథాక్షౌహిణీబలంబు నీకు సహాయం బయ్యెడు నని యానతిచ్చిన మహాప్రసాదంబని విరూపాక్షుం బ్రదక్షిణీక రించిదక్షిణాభిముఖుండై ధాటీసంరంభంబున నరిగెనప్పుడు.

క. సంగడిఁ బిఱుంద ముందట
నింగియు నేలయును నిండి నిష్ఠురభంగిం
బుంగవకేతనుసుభటు ల
భంగురవీరప్రతాపభయదస్ఫురణన్. 82

క. కొండలు మహీరుహంబులు
గండోపలములు ధరించి కహకహ నగుచున్
మెండుకొని యజ్ఞవాటిక
‡కొండొరులను గడవ నరిగి రుద్భటభంగిన్. 83

వ. అందుఁ గొందఱు యూపస్తంభంబు లుద్ఘాటించిరి. కొందఱు కుండంబులను బూరించిరి. కొందఱు మంటపంబులు పడఁద్రోచిరి. కొందఱు వేదికలు గ్రొచ్చిరి. కొందఱు హవిస్సులు భక్షించిరి. కొంద అన్నంబు లారగించిరి. కొందఱు పాయసంబులు మెసఁగిరి. కొందఱు పిండివంటకంబులు మ్రింగిరి. కొందఱు ఘృతదధిక్షీరక్షౌద్రపుండ్రేక్షు

‡ 'కొండొరుఁగడవంగఁజొచ్చిర యుగ్రత మెఱయన్' అని వ్రాతపుస్తకము.

ఫలాదు లాస్వాదించిరి. కొందఱు యజ్ఞపాత్రంబులు పగుల మొత్తిరి. కొందఱు స్రుక్స్రువంబులు విఱిచిరి. కొందఱు శకటంబులు వీటతాటంబులు సేసిరి. కొందఱు చషాలంబులు చెవులం దగిలించుకొనిరి. ఇవ్విధంబున నిర్మర్యాదంబై నిరవగ్రహంబై పారిషదుల యాగ్రహంబులు చెల్లుచుండం గోపాటోపసమున్నిద్రుం డై. 84

సీ. తనమీఁద వైవంగ దంభోళి యెత్తినఁ
జెలఁగి సంస్తంభించె జిష్ణుభుజము
కైటభారాతి చక్రము ప్రయోగించిన
వెసఁ జక్కిలముఁ బోలె విఱిచి బొక్కెఁ
బటుచపేటంబునఁ బండ్లు డుల్లఁగ మొత్తి
పూషార్కువదనంబు బోసిపుచ్చెఁ
జిప్పముత్యంబు రాల్చినభంగి నలవోక
భగునిగ్రుడ్డులు ధరఁ బడఁగఁ జిదిమె

తే. నర్ధచంద్రబాణంబున యజ్ఞమృగము
శిరముఁ దెగ సేసి కట్టె నంబరముమీఁద
ధాతసతిముక్కు సోణంబుదాఁకఁ గోసెఁ
బ్రకటవిస్ఫూర్తి శ్రీవీరభద్రమూర్తి. 85

తే. ద్రోహు లగు వేలుపులలోన దొరలి యున్న
పదియునొక్కండ్రు రుద్రులఁ బాఱ విడిచె
గాసి చేయక కాకోలకంఠుపట్టి 86
తండ్రి పేరివా రగుట చిత్తమునఁ దలఁచి. 87

వ. అంత.

క. సిగ్గువడి విరియఁబాఱెరి
బగ్గనఁ బొరిఁబుచ్చ్చి వీరభద్రుని ...

నుగ్గు లయి యపురుసవు రయి
గగ్గులకాఁడై వికావిక లయి యమర్త్యుల్. 88

తే. దక్షునల్లుండ్ర మెడల సూత్రములు గట్టి
యూపములు సూత్రములతోడ నుద్దిసేసి
దామెనలు గూర్చి నడిపించెఁ దరతరంబ
వీరభద్రుండు పశువుల వెల్చునట్లు. 89

మ. పనిలే దేటికి బాధ పెట్టనను? నబ్రహ్మణ్యమైతో? మొఱో
యని యుచ్చైర్ధ్వనిఁ గూఁత వెట్టమఖశాలాగ్రంబునఁ శ్రా
ద్ధదేవునిఁ గట్టించెను వీరభద్రుఁడు భటవ్యూహంబుచేనా
గ్రహం,బున ధూమోర్ణపయోధరద్వితయమర్చఁ ముద్దాడు
హస్తాబ్జముల్. 90

క. *తాపించె ధనదువదనముఁ
గూపెట్టఁగఁ గాలకంఠుకొడు కుత్తరవే
దీపాషాణాంచలమునఁ
బాపపుయాగమునఁ దొట్రుపడి రుత్తములున్. 91

చ. మతకరిపాకశాసనుఁడు మత్తశిఖావళశాబకంబునా
కృతి ధరియించి ప్రాంతమునఁ గేలిమహీధరశృంగ మెక్కని
ర్వృతమతి నుండె వేలుపుల వేదనఁ బెట్టెడువీరభద్రు ను
ద్ధతి పరికించుచుఁ †నయపథంబు బృహస్పతిచే నెఱుంగఁడే?

తే. తటిగె నర్యముదీర్ఘదోర్దండయుగము
క్రకచమున వీరభద్రుఁడు కరుణ దొఱఁగి

* క. 'రావించె భృగుని...దొట్రుపడి రంత మునుల్.' పాఠాన్తరము.
† 'నయపథంబు బృహస్పతి చొప్పెఱుంగఁడే.' ఒక వ్రా. ప్ర. 'చేఁదె ఱుంగఁడే' పూ. ము. ప్ర.

త్ర్యంబకునిపట్టి పవను వధ్యంబు సేసె
వానియంతగగపురస్త్రీలు వనటఁ బొంద. 93

ఉ. పలపలికాల ముక్కునను వాత సుధారస ముప్పతిల్లఁ గా
వెలికిల వైచి మట్టె రణవీరశిఖామణి వీరభద్రుఁడ
చ్చలమున రోహిణీరమణుచాపుశరీరముఁ దత్పదాహతిం
గలిగినకందుగాదె పొడగానఁగ నయ్యెడునేఁడుచిహ్నమై!

తే. ఈశ్వరద్రోహి! గర్వాంధ! ఋషిసురేంద్ర
బంధునాశైకకారణ! పాపకర్మ!
చావు మని యొక్క పెట్టునఁ జక్రధార
దక్షుతలఁ ద్రెవ్వవ్రేసె ఫాలాక్షుసుతుఁడు. 95

వ. ఇవ్విధంబున మధుమథనుచక్రాయుధంబు విఱిచి, జంభాంతకుభుజాస్తంభంబు సంస్తంభించి, భగునికన్నులు కెలికి, పూషుపండ్లు వెఱికి, మఖమృగంబుశిరంబు ఖండించి, దక్షుతల ద్రెవ్వవ్రేసి, దాక్షాయణిసుతుఁ బొట్టగుజ్జులుక మట్టి, భారతీదేవిముక్కు చిదిమి, గాలివధ్యంబుచేసి, జముని మెడదండె దగిల్చి, యదితియధరపల్లవంబు చక్కడచి, యగ్నినాలుకలు గోసి, నిరృతిఁ దలవట్టి వంచి, కింపురుషపతి మొగంబు పాషాణపట్టంబున బిట్టు రాచి, యనంతరంబ గరుడులందోలి, ఖచరుల జోకొట్టి, యచ్చరల సిగ్గువుచ్చి, కిన్నరులఁ దన్ని, గుహ్యకుల గోడునడిపి, సాధ్యులం జెఱిచి, రుద్రులం బఱపి, మరుత్తుల నుత్తాడించి, విశ్వుల వైచి, విద్యాధరుల వెలిచి, గంధర్వుల గారించి, యక్షుల నధిక్షేపించి,చక్షుశ్శ్రవుల శిక్షించి, చారణుల జంకించి, కింపురుషులఁ బరిభవించి, వీరభద్రుండు మాఱులేక మలయుచుండె 96

నివ్విధంబున.

ఉ. తామరసాసనుం డగుపితామహుఁ డారిమిపట్టి యైనమా
తామహుయాగతంత్రమునఁదంత్రము చేసిశివాజ్ఞవిక్రమో
ద్దాముఁడు వీరభద్రుఁడు పదంపడి యందఱఁ గాచె దేవతా
గ్రామణులం దనూవ్రణవికారములన్నియు మానునట్లుగన్.
తే. రణములో నైనతనువికారంబు లెల్ల
దేవతలకు శమించె నద్దేవుకరుణఁ
దాల్చె దక్షుఁడు భవితవ్యతాబలమునఁ
గంఠనాళాగ్రమునయందు మేంఠశిరము. 98
తే. శంకరద్రోహపాపప్రశాంతిఁ గోరి
దక్షుఁ డెంతయుఁ గాలంబు దపము సేసె
బహుళకై వల్యసామ్రాజ్యపట్టభద్ర
సింహపీఠికఁ గాశికాక్షేత్రసీమ. 99
వ. దక్షుండు తనపేర దక్షేశ్వరలింగంబుఁ బ్రతిష్ఠించె. 100
తే. అంబికకుఁ బుట్టినిల్లు నీహారశిఖరి
యత్తవారిల్లు కాశీమహాపురంబు
హిమకరోత్తంసునకుఁ బుట్టినిల్లు కాశి
యత్తవారిగృహంబు నీహారశిఖరి. 101
వ. నర్మదేశ్వరుండుసరస్వతీశ్వరుండురత్నేశ్వరుపురోభాగంబున
నధివసింతు రంక వ్యాసేశ్వరుమాహాత్మ్యం బభివర్ణించెద.

## వ్యాసేశ్వరుమాహాత్మ్యము.

తే. బాదరాయణుఁ డఖిలభూపరిధియందు
సకలతీర్థంబులను నాడి శాంతబుద్ధి
నైమిశం బనుపుణ్యకాంతారమునకు
నరుగుదెంచెను శిష్యసంహతియుఁ దాను. 103

క. ఆతతమతి నతఁ డష్టా
శీతిసహస్రములు ఋషులు శివుఁ గొలువంగా
నేతెంచి శిష్యులును దాఁ
బ్రాతగ్గకాలమునఁ బొగడఁ బద్మేక్షణునిన్. 104

వ. లక్ష్మీశ్వరుండె దైవంబు, జనార్దనుండె భుక్తిముక్తిప్రదాయ
కుండు, విష్ణుధర్మంబె ధర్మంబు. 105

సీ. సత్యంబు భుజగేంద్రశయనుండె దైవంబు
సత్యంబు దైవంబు చక్రధరుఁడు
సత్యంబు వైకుంఠసదనుండె దైవంబు
సత్యంబు దైవంబు శాశ్వతుండు
సత్యంబు కైటభశత్రుండె దైవంబు
సత్యంబు దైవంబు శార్ఙ్గధరుఁడు
సత్యంబు వార్ధిజాసహితుండె దైవంబు
సత్యంబు దైవంబు శ్యామతనుఁడు
తే. మఱియు సత్యంబు దైవంబు మాధవుండు
మఱియు సత్యంబు దైవంబు మదనగురుఁడు
మాట లేటికి? దైవంబు మఱియు మఱియుఁ
బుండరీకదళాయతాక్షుండొకండె! 106

వ. అని యీప్రకారంబు వారణాశియందుఁ బంచనదంబునం
బాదోదకంబులం దీర్థం బాడి యాదికేశవుఁ బాంచరాత్ర
దివ్యాగమమార్గంబున నర్చించి విశ్వేశ్వరభవనద్వారంబున
నిల్చి దక్షిణభుజం బెత్తి సకలవేదపురాణేతిహాససిద్ధాంత
నిశ్చితార్థంబు సత్యంబు, సత్యంబు, పునస్సత్యంబు, వేద
శాస్త్రంబులకుం బరం బైనజ్ఞానంబుఁ, గేశవుకంటెఁ బరం 107
బైన దైవంబు [illegible] విని

శా. 'ఎట్టెట్టూ! వినమైతిమింకనొకమాతేర్పాటుగాఁ జెప్పుమా
భట్టారా!' యని నందికేశ్వరుఁడు విస్పష్టంబుగాఁ బల్కిన
న్బట్టెన్ గంఠబిలంబు చెయ్యి దివియన్ బ్రాదయ్యె వారాణసీ
హట్టస్థానమునందు వ్యాసునకు శిష్యశ్రేణి భీతిల్లఁగన్. 108

క. భుజవాక్స్తంభంబునఁ
బ్రజనితభయుఁ డగుచు ముట్టఁబడి మదిఁ దలఁచెన్
గజరాజవరదు గరుడ
ధ్వజుఁ డప్పుడ యేగుదెంచె వ్యాసునికడకున్. 109

వ. వచ్చి 'బాదరాయణుండ! బుద్ధిమంతుండ, విట్టియపరాధం
బెట్టు సేసి?' తని కినిసి 'నందికేశ్వర! నాకుం బ్రియంబుగా
నీతనియపరాధంబు క్షమించి కరుణార్ద్రదృష్టింజూడు' మని
వేఁడుకొనియె. అప్పుడు సత్యవతీనందనునకు వాగ్భుజాస్తం
భంబులు నివర్తిల్లె. కృష్ణద్వైపాయనుండును బహుప్రకా
రంబులంబరమేశ్వరుంబ్రస్తుతించి తనపేర వ్యాసేశ్వరలింగం
బుఁబ్రతిష్ఠించెె. ఆవ్యాసేశ్వరుండు భజించువారలకుభోగ
మోక్షప్రదాయకుండు. అనినవినికుంభసంభవుండు శంభు
సంభవున కభివాదనంబు సేసి సవిస్రంభంబుగా నిట్లనియె.

సీ. శైవారి వాగ్భుజాస్తంభం బొనర్చుట
నజ్ఞానవిరహితుం డయ్యె నేని
భాగీరథీతటోపాంతస్థలంబున
లింగప్రతిష్ఠఁ గల్పించె నేని
పుణ్యపంచక్రోశభూతీర్థమహిమంబు
నెరవుగా సర్వంబు నెఱిఁగె నేని
ముక్తిమంటపమధ్యమునఁ బురాణంబులు
శైవంబు లే...ద్ధఁ ... నేని

తే. తపములకు బాధకములు క్రోధంబు లగుటఁ
దెలిసి యొక్కింత యేని తితిక్ష లేక
యేల శపియించెఁ గాశిఁ బుద్ధ్యైకరాశి
గంధవతిపట్టి? యానతీ కార్త్తికేయ! 111

వ. అనిన గాంగేయుం డౌర్వశేయా! యడుగవలసినయర్థంబ యడిగితి. సాత్యవతేయుండు వాగ్భుజాస్తంభంబునాఁటం గోలె బుద్ధిమంతుం డై యుండె. కాశికానగరంబుమీఁదం గోపించి బాదరాయణుండు శపించుటకుం గారణంబు మీఁద వివరించెద. కాశికామాహాత్మ్యవర్ణనావిశేషావశేషంబు వినుము. 112

## కాశీతీర్థమహిమావర్ణనము.

తే. కలుగనీ కాశి శంభులింగములు కోట్లు
విశ్వనాథుండు లింగంబు శాశ్వతుండు
గలుగనీ తీర్థములు కోట్లు కాశియందు
ననఘ! మణికర్ణికయ తీర్థ మని యెఱుంగు. 113

క. సేవ్యుఁడు విశ్వేశుఁడు స్నా
తవ్యము మణికర్ణికాప్రదజలౌఘము శ్రో
తవ్యంబులు శంభుకథా
దివ్యపురాణములు గాశితీర్థమునందున్. 114

సీ. వసియింప వలయు యావజ్జీవ మనురక్తి
పరత వారాణసీపట్టణమునఁ
జక్రపుష్కరిణి నిచ్చలుఁ దీర్థ మాడంగ
వలయు సంకల్పపూర్వకము గాఁగ
నర్చింప వలయు గంధాక్షతంబులఁ బుష్ప
ఘనపత్త్రముల విశ్వపతి మహేశు

నిలుపంగ వలయును నెఱసు వాటిలకుండ
నాత్మధర్మస్వవర్ణాశ్రమముల
తే. స్నానమహిమంబు భక్తితాత్పర్యగరిమ
వినఁగ వలయుఁ బురాణార్థవిదులవలనఁ
దనయథాశక్తి వలయును దాన మిడఁగఁ
గాశిఁ గైవల్య మిన్నింటఁ గాని లేదు. 115
తే. యాత్ర విధ్యుక్తసరణిఁ జేయంగ వలయు
వలయుఁ బరిపాటి క్షేత్రదేవతలఁ గొలువ
వలదు బొంకాడ వలదు జీవముల కలుగ
వలదు నగిరైనఁ బరమర్మములు వచింప. 116
తే. ప్రాణసందేహ మైనట్టిపట్టునందు
ననృతములు వల్కఁ డైనను నౌర్వశేయ!
యన్య రక్షింపఁ దలఁచు టత్యంత మైన
పరమధర్మంబు గాశికాపట్టణమున. 117
క. కాలాంతకుకటకమునఁ బి
పీలికఁ గాచుట మహర్షిబృందారక! యీ
త్రైలోక్యంబును గాచుట
పోలఁగ నీధర్మసూక్ష్మములు దెలియుమిటన్. 118
తే. తీర్థసన్న్యాసకారులై ధీరబుద్ధిఁ
గాశి వసియించుపెద్దల గారవించు
టధికధర్మంబు దాన నాహ్లాదమందు
వివిధకైవల్యసంధాయి విశ్వభర్త. 119
సీ. కుదియించునది నెట్టుకొని యింద్రియవ్యాప్తి
మనసుచాంచల్యంబు మాన్పునదియు

మదిలోన మోక్షకామము వీడుకొనునది
పాయంగ నిడునది ప్రాణభయము
వ్రతదానధర్మసంరక్షణార్థంబుగాఁ
గావించునది యాత్మకాయరక్ష
తత్కాలదేహయాత్రామాత్రమునఁ గాక
సమకూర్చునది ధాన్యసంగ్రహంబు
గీ. నణఁచునది దంభ ముజ్జగించునది యీర్ష్య
యుడుగునది రాగలోభ గర్వోదయములు
శాంతిదాంతితితిక్షానృశంససత్య
నిరతుఁ డగునది కాశిలో నిలుచునరుఁడు. 120

క. ఒకవర్షశతంబున నొం
డొకతీర్థమునందుఁ గలప్రయోజనలాభం
బొకదివసంబున నానం
దకాననమునందు సర్వదా సిద్ధించున్. 121

క. నేమమున నొక్కప్రాణా
యామంబునఁ గాశిఁ బడయునట్టిఫలశ్రీ
సామగ్రి యొండెడ ముని
గ్రామణి! సాష్టాంగయోగగతిఁ గనరు నరుల్. 122

సీ. *చక్రవాళపరీతసర్వసర్వంసహా
ప్రథితతీర్థములలోఁ బరము గాశి
కాశికాపట్టణక్రోశపంచకతీర్థ
సమితిలో సారంబు జహ్నుకన్య

* 'చక్రవాళపరీత సర్వసర్వంసహా ప్రథితతీర్థములలోఁ బెరుగుఁగాశి' యనిపూర్వముద్రితపుస్తకపాఠము. ఈపాఠమిష్టమేని 'చక్రవాళ......ప్రథితతీర్థములలోఁ బెరుగు కాశి' యని సవరించుకొనఁదగు.

జహ్నుకన్యాతీర్థసముదాయమునయందుఁ
గడుఁ బెద్ద మణికర్ణికాహ్రదంబు
మణికర్ణికాతీర్థమజ్జనఫలముకం
టెను విశ్వనాథుదర్శన మధికము

గీ. విశ్వపతికంటెఁ గైవల్యవిభునికంటెఁ
గాలకంఠునికంటె ముక్కంటికంటెఁ
దీర్థములు దైవములు లేవు త్రిభువనముల
సత్య మింకను సత్యంబు సంయమీంద్ర! 123

సీ. అఖిలకాలము శంభు నర్చించినఫలంబు
సకృదీక్షణమునను సంభవించు
భవసహస్రముల సంపాదితం బగుపుణ్య
మొకప్రదక్షిణమున కుపమ గాదు
పుష్పప్రదానంబుఁ బోలంగ లేవు షో
డశమహాదానకాండములు గూడి
తలకూడ దశ్వమేధఫలంబు పంచామృ
తాభిషేకవిధాన మాచరింప

గీ. వాజపేయసహస్రప్రవర్తనమునఁ
గలఫలం బిచ్చు నైవేద్యకల్పనమున
నిన్నియును జిత్తగించి విశ్వేశు నభవుఁ
గాశికాధీశు భజియింపు కలశజన్మ! 124

క. గొడుగులు వింజామరములుఁ
బడగలునుం దాలవృంతపటవాసములుం
మృడుని కొసంగినధన్యుఁడు
పుడమి నిజైకాతపత్రముగ నేలింపున్ 125

వ. మఱి యాస్తిక్యబుద్ధి, వినయంబు, మానావమానంబుల వికృతి లేమి, యకామిత్వం, బనౌద్ధత్యం, బహింస, యప్రతిగ్రహవృత్తి, యదాంభికత్వం, బలుబ్ధత, యనాలస్యం, బపారుష్యం, బదీనత, యాదిగాఁ గలగుణంబులు గాశీతీర్థవాసికవశ్యంబును సంభావనీయంబులు. 126

తే. కలశసంభవ! 'వ్యాసుండు కాశిమీఁద
నేల కోపించెఁ జెప్పు' మం చీ వడిగితి
బాదరాయణకోపప్రపంచమునకుఁ
గారణము సెప్పెదను విను గారవమున. 127

వ్యాసుండు కాశిమీఁదఁ గోపించుట.

సీ. త్రిషవణస్నానంబు దీర్చు భాగీరథి
శివధర్మములు సెప్పు శిష్యతతికి
నుదరపోషణము సేయును మాధుకరవృత్తి
లింగార్చనంబుఁ గల్పించు నియతి
ముక్తిమంటపమధ్యమునఁ బురాణము సెప్పుఁ
బంచాక్షరంబు జపంబు సేయు
భూతి సర్వాంగీణముగ సముద్ధూళించు
ధరియించు రుద్రాక్షదామకములు

తే. శ్రుతులు నాల్గు నేర్పఱిచినసూక్ష్మబుద్ధి
బ్రహ్మసంవేది యాదిపురాణకర్త
భారతాఖ్యానసంహితాప్రథమసుకవి
గంధవతిపట్టి యానందకాననమున. 128

వ. ఇవ్విధంబునం బెద్దకాలంబు గాశీనగరంబునఁ గృష్ణద్వైపాయనుండు శిష్యవర్గంబును దానును నపవర్గపదవీకల్యాణలా

భార్థంబు వసియింప నమ్మునిమనస్థైర్యంబు పరీక్షింపం దలంచి విశ్వేశ్వర శ్రీమహాదేవుండు విశాలాక్షి కి ట్లనియె.

గీ. బాదరాయణుభక్తి యేపాటియదియొ
యరయుదము గాని యతఁడు భిక్షాటనమున
కేగుదెంచినయప్పు డింటింట భిక్ష
గలుగకుండంగఁ జేయంగ వలయు నీవు. 130

వ. అనిన నద్దేవి మహాప్రసాదం బని యఖిలభూతాంతర్యామిని గావునఁ గాశికానగరంబున గృహిణీగృహస్థులయంతరంగంబుల నధివసించి భిక్షాప్రదాన ప్రతిష్టంభ కారణం బై యుండె. కృష్ణద్వైపాయనుండును. 131

సీ. *కాలోచితము లైనకరణీయములు దీర్చె
నరుణోదయము గాకయటక మున్న
గంగలోఁ జక్రపుష్కరిణీహ్రదంబున
నఘమర్షణస్నాన మాచరించె
యరుణాంశుమండలం బర్థోదయమునందు
సమయంబు వీక్షించి సంధ్య వార్చె
నిలుచుండి జపియించె నియతిమై గాయత్రి
సంఖ్య యష్టోత్తరశతము గాఁగ

* 'గంగలోఁ జక్రపుష్కరిణీహ్రదంబున నఘమర్షణస్నాన మాచరించి నిలుచుండి కావించి నియతిమై గాయత్రి సంఖ్య యష్టోత్తరశతము గాఁగఁ బఠియించి యప్పుడు పత్రపుష్పములతో శివు నీలకంఠుని సేవ చేసి యంతరంగంబున నభవుని నిడుకొని శాంతచిత్తంబున సంధ్యవార్చి
గీ. యగ్నికార్యముఁ దీర్చి కౌమారిఁ గొల్చి,' అని యొకవ్రాతపుస్తకమునఁ బాఠాంతరము.

తే. నగ్నికార్యము దీర్చి గామారిఁ గొల్చి
ముక్తిమంటపికామధ్యమునఁ బఠించె
శివపురాణంబు మధ్యాహ్నసీమదాఁక
నపరనారాయణుఁడు బాదరాయణుండు. 132

మ. ఝుటితిసూత్యతపలాశపత్రపుటికాశాటీప్రదేశంబులున్
ఘటముల్ దామరపాకులున్ గుహాళులున్ గండోలముల్
పూని బా, సట వేదంబుఁ బఠించుచుం గదిసి వైశంపాయ
నాదుల్ సము, త్కటభంగిం గొలువంగ నేగె ముని భిక్షా
కృత్యయాత్రార్థమై. 133

తే. నెట్టుకొని కాయ బీరెండ పట్టపగలు
తాను శిష్యులు నిల్లిల్లు దప్పకుండఁ
గాశికావిప్రగృహవాటికల నొనర్చె
నఖిలవిద్యాగురుండు భిక్షాటనంబు. 134

శా. ఛాత్రుల్ పైలసుమంతజైమినులు వైశంపాయనుండాదిగాఁ
బాత్రంబుల్ ధరియించియన్నిదెసలన్ భైక్షంబు వేఁడంగ న
క్షత్రాధీశ్వరమౌళిపట్టణమునం గాశిం దలంప న్మహా
చిత్రంబో గిరమబ్బదయ్యె బుషికిం జేకూరదయ్యెందుదిన్.

తే. తిరిగె నింటింట భిక్షాం ప్రదేహి యనుచు
బాదరాయణుఁ డీశానుపట్టణమున
నొట్టు వెట్టినభంగి నేయుగ్మలియును 136
బిలిచి యొకపట్టెఁడన్నంబు వెట్టదయ్యె.

తే. వండుచున్నార మను నొక్కవనజనేత్ర
తిరిగి రమ్మను నొక్క లేఁదీఁగెఁబోఁడి
దేవకార్యంబు నేఁ డనుఁ దెలివ యొర్తు 137
దాక్షికవాటంబుఁ దెఱవదు వనిత యొకతె.

వ. ఇవ్విధంబున భాగ్యహీనుండు ధనంబునుం బోలె భిక్షా
న్నంబు వడయ లేక మఠంబునకుం జని జఠరతృష్ణాఖావ్యథా
దూయమానమానసుండై కృష్ణద్వైపాయనుండు శిష్యుల
రావించి యి ట్లనియె. 138

తే. అబ్బెనే నేఁడు మీకు మధ్యాహ్నభిక్ష
బ్రహ్మపురివాడఁ గాశికాపట్టణమున?
నబ్బదో నాకపోలె మహర్షులార !
వాడవాడల నీపెద్దవల్లకాట? 139

సీ. దుర్భిక్షదోషంబు దొరకొన్నఁ గడపని
కడపనిగృహసూతకంబునందు
నింటఁ బీనుంగు వోయినయేనిఁ గడపని
కడపనిపెనుముక్కు గవిసె నేని
కువలయేశుండు దండువు గొన్నఁ గడపని
కడపనిభవనంబు గాలె నేని
పితృకార్యవిధి సమీపించినఁ గడపని
కడపనిముట్టంటు గవిసె నేని
తే. వేళ గాకున్నఁ గడపని వేలుపులకు
మీఁదు వోకున్నఁ గడపనిమిన్న కెట్లు
గడపె నింటింట నీకాశికాపురమునఁ
బుణ్యగేహిని? యిది మహాద్భుతము గాదె? 140

వ. పెద్దకాలమునంబట్టి మన మున్నవార,మి క్కాశీపట్టణంబున
భిక్షాన్నంబుపుట్టనిదినంబునుంగలదె? కుతపకాలంబునందు.

సీ. ముంగిట గోమయంబున గోముఖము దీర్చి
కడలు నాలుగ ముగ్గుకల్లు పెట్టి

యతిథి నచ్చోఁ నిల్పి యర్ఘ్యపాద్యము లిచ్చి
పుష్పగంధంబులఁ బూజ చేసి
ప్రక్షాళితం బైనపసిఁడిచట్టువమున
నన్నంబు నునిచి నె య్యభిఘరించి
ఫలపాయసాపూపబహూపదార్థములతో
భక్తివిశ్వాసతాత్పర్యగరిమఁ
తే. బెట్టుదురు మాధుకరభిక్ష భిక్షుకులకుఁ
గంకణంబులతో సూడిగములు రాయఁ
గమ్రకరముల బ్రాహ్మణాంగనలు గాశి
నన్నపూర్ణభవాని క ట్టనుఁగుఁజెలులు. 142
క. ఆపరమపురంధ్రులయం
దేపుణ్యాంగనయు భిక్ష యిడదయ్యెఁ గటా!
రేపాడి మేలుకని యే
నేపాపాత్మునిముఖంబు నీక్షించితినో? 143
తే. వాడఁబాఱినయవి వక్త్రవనరుహములు
భాజనంబులలోన నిప్పచ్చరంబు
మీకు భిక్షాన్నములు లేమి నాకుఁ దెలిసెఁ
జేలపంటలఁ గొయ్యలే చెప్పఁ గాదె! 144
వ. చతుర్విధపురుషార్థములకు నకట! పుట్టినిల్లైనయిక్కాశీపట్ట
ణంబునకు నేఁడు భిక్షాన్నంబు పుట్టమికిఁ గారణంబెయ్యది
యో మీర పరామర్శించి రండనిన నట్లకాక యని గురుని
యోగంబున నందఱు నన్నిముఖంబులకుం జని యేయవ
కరంబునుం బొడఁగానక క్రమ్మఱవచ్చి శిష్యులందఱు బాద
రాయణున కి ట్లనిరి. 145

తే. అవధరింపుము నారాయణావతార !
బాదరాయణ ! కాశికాపట్టణమున
నవకరము లేదు నీయట్టియధికపుణ్యు
లుండ నివ్వీటి కెట్లు గీ డొందు నేర్చు ? 146

సీ. విశ్వేశ్వరుం డెందు విచ్చేసియున్నాఁడు
కైలాసశైలశృంగంబు విడిచి
ప్రవహించు నెందేని భాగీరథీగంగ
యుపకంఠమున హారమో యనంగ
నాఁకొన్న వారికి నమృతదివ్యాన్నంబుఁ
గృప సేయు నెందేని గిరితనూజ
యుండు డుంఠివినాయకుం డెందు నొసలిపై
యువరాజపట్టంబు నవధరించి
తే. యెందులను నుండ్రు మీయంత లేసివారు
పరమపుణ్యులు సంయమీశ్వరు లనేకు
లట్టికాశిని భిక్షాన్న మబ్బ దనుట
వినఁగఁ బొసఁగునె యిది యేమి విధమొ కాక. 147

సీ. జిలుఁగుసంధ్యారాగచీనాంబరము గట్టి
కుసుమగర్భముగఁ గీల్కొప్పు దుఱిమి
కస్తూరి మెదిచినగంధసార మలంది
ముత్యాలతాటంకములు ధరించి
సీమంతపథమునఁ జేర్చుక్క సవరించి
కురులపైఁ జిన్నిపూ గుస్తరించి
శ్రీపాదముల హేమనూపురంబులు దాల్చి
కటిమీఁద వజ్రాలకమరు నిల్పి

తే. యన్నపూర్ణ విశాలాక్షి యనెడు పేళ్లఁ
గాశికామధ్యశృంగాటకములయందు
విశ్వపతిదేవి మధ్యాహ్నవేళఁ బెట్టు
నమృతపాయసదివ్యాన్న మనుదినంబు. 148

తే. మనము మనమనపూర్వజన్మములయందుఁ
గడపినారము మధ్యాహ్నకాలభిక్ష
యనుభవింపక పోవంగ నలవి యగునె
కమలజుని కైనఁ బ్రారబ్ధకర్మఫలము.? 149

క. అందలు భుజంగభూషణు
*లందఱునుం గాలకంఠు లందఱు గిరిశుల్
అందఱు ధృతేందుకళ లా
నందవనీనగరనివసనస్థితులు నరుల్. 150

తే. బ్రహ్మలోకంబు గాశికి బడిసివాటు
విష్ణులోకంబు గాశికి వినిమయంబు
దాసదాసానుదాసబృందంబు గాశి
కింద్రచంద్రాదిలోకంబు లిద్ధమహిమ! 151

సీ. శివుని నివాళించు శేషాహి నడురేయి
బహుఫణారత్నదీపముల చేత
నంతర్హితంబు లై యర్చించు నీశాను
ఫలపుష్పములఁ గలపాదపములు
కామధేనువు లిందుఖండేందుశేఖరు
నూధస్యధారల నోలలార్చు
నిధులు దొమ్మిదియుఁ గంఠేకాలునకు నిచ్చు
నిర్మలమణులు గానికలు గాఁగఁ

* 'అందఱును ద్రిశూలపాణు లందఱును గిరీ, శేందూత్తంసులు' అని పా.

తే. గాశికాపట్టణంబు శంకరుని నెలవు
కలి ప్రవేశింప దానందకాననమున
శ్రీనివాసంబు వారాణసీపురంబు
ముక్తిసంధాయకం బవిముక్తకంబు. 152

వ. అని శిష్యులు గాశీమాహాత్మ్యంబు ప్రశంసించిన విని బాద
రాయణుండు వారల కిట్టు లనియె. 153

తే. ఉపవసింతుము గాక నేఁ డుడిగి మఱిఁగి
యస్తమించుచు నున్నవాఁ డహిమభానుఁ
డెల్లి పారణ కైన లే దెట్టు మనకు
మాధుకరభిక్ష బ్రాహ్మణమందిరముల. 154

వ. అని యారాత్రి గడపి మఱునాఁడు మధ్యాహ్నకాలంబున
శిష్యులుం దాను వేఱు వేఱ వేదవ్యాసుండు విప్రభవనవా
టిక భిక్షాటనం బొనర్చి తొలునాఁటియట్ల ముక్కంటిమా
య నేమచ్చుకంటియు వంటకంబు వెట్టకున్నఁ గటకటం బడి
భిక్షాపాత్రంబు నట్టనడువీథిం బగులవైచి కోపాటోపంబున.

తే. ధనమదంబును వేదవిద్యామదంబు
మోక్షలక్ష్మీమదంబును ముదిరి కాదె
కాశికాపట్టణంబునఁ గరుణ లేక
బ్రాహ్మణులు నన్ను నిటు భంగపఱిచి? రనుచు. 156

వ. కృష్ణద్వైపాయనుం డాత్మగతంబున. 157

తే. ధనము లేకుండెదరు మూఁడుతరములందు
మూఁడుతరములఁ జెడుఁ గాక ముక్తిలక్ష్మి
విద్యయును మూఁడుతరముల వెడల వలయుఁ
బంచజనునకుఁ గాశికాపట్టణమున 158

వ. అని పారాశర్యుండు క్షుత్పిపాసాపరవశుం డై శపియింపం
జూచునవసరంబున నొక్కవిప్రభవనంబువాకిటం బార్వతి
ప్రాకృతవేషంబున. 159

ఉ. వేసలి పాటపాట నరవెంద్రుకతోం దిలతండులాన్వయ
శ్రీ నటియింపం గై సడలి వ్రేఁకనిచన్నులు పాలవంక లై
శా నసియార్పవాలుం దెలికన్నులంగల్కితనంబు వీడ్కొనన్
మానిని హస్త మూఁదియొకమంజులభాషిణి వచ్చె వీథికిన్.

ఉ. వేదపురాణశాస్త్రపదవీనదవీయసి యైన పెద్దము
త్తైదువ కాశికానగరహాటకపీఠశిఖాధిరూఢ య
య్యాదిమశక్తిసంయమివరా! యిటు రమ్మనిపిల్చె హస్తసం
జ్ఞాదరలీలరత్నకటకాభరణంబులు ఘల్లుఘల్లనన్. 161

వ. చేరం బిల్చి యమ్మత్తకాశిని సాత్యవతేయున కిట్లనియె. 162

శా. ఆకంఠంబుగ నీవు మాధుకరభిక్షాన్నంబు భక్షింపఁగా
లేకున్నం గడు నంగలార్చెదవు మేలే! లెస్స! శాంతుండవే!
నీకంటె న్మతిహీను లే కటకటా! నీవారముష్టింపచుల్, శాకా
హారులుం గంధభోజులు శిలోంఛప్రక్రముల్ దాపసుల్.

తే. ఓమునీశ్వర! వినవయ్య యున్నయూరుఁ
గన్నతల్లియు నొక్కరూ పన్నరీతి?
యటు విశేషించి శివునియర్ధాంగలక్ష్మి
కాశి యిప్పీటిమీఁద నాగ్రహము దగదు. 164

తే. వేయిశాఖలతో సామవేదరాశి
యేకవింశతిభేద మై బుజ్ఞిగమము
తొమ్మిదియు నూటయొక్కండ్రుతొవ లంది
యొరిమె నాథర్వణయజుస్సు లుండుఁ గాశి. 165

వ. ఇట్టి కాశికానగరంబుమీఁద భిక్ష లేకుంట కారణంబుగా నీయంతవాఁడు గటకటంబడి శపియింపం దలంచునె? బ్రాహ్మణుండవు గదా! నీ వేమన్ననుం జెల్లు. అటు విశేషించి యాఁకొన్న వాఁడవు కావున నీయవసరంబున నిన్ను పెచ్చుకుందాడుట మముబోఁటిగృహిణులకు మెచ్చుగాదు. మాయింటికిం గుడువ రమ్ము. కుడిచి కూర్చున్న పిమ్మటం గొన్నిమాటలు నీతో నాడఁ గల నిప్పుడు. 166

తే. వైశ్వదేవాదివిధుల సర్వమును దీర్చి
యరయుచున్నాఁడు నాభర్త యతిథిరాక
నతిథి పంక్తికి రాకున్న నారగింపఁ
డొంటి నొకనాఁడుఁ బతి యెట్టియొఱకమునను. 167

తే. అభ్రగంగ నుపస్పర్శ మాచరించి
వేగ విచ్చేయ వలయు నావిభుఁడు దశమి
యాఁకటికి నోర్వలేఁడు బ్రాహ్మణవరేణ్య!
యర్కమండల మిదె వ్రాలె నపరదిశకు. 168

వ. అనిన వేదవ్యాసుండు ముత్తైదువ కి ట్లనియె. 169

తే. కమలలోచన! కిన్నరాంగనవె నీవు?
నీవు గంధర్వభామవే నీలవేణి ?
యప్సర స్త్రీనవె నీవు బింబాధరోష్ఠి?
రమణి! నీవు విద్యాధరరాజసుతవె? 170

సీ. కల్యాణి! నిన్ను నీకాశికాపురములో
నెన్నండుఁ గాన నీ వెవ్వ రమ్మ?
నిన్ను దర్శింపంగ నిఖిలేంద్రియములకు
నత్యంతసంతృప్తి యావహిల్లె

రాహుదంష్ట్రాంకురక్రకచఘట్టనభీతి
జగతి కేతెంచినచంద్రకళవె?
నన్ను రక్షింపంగ నాపాలఁ గల్గిన
భాగ్యదేవతవు తప్పదు నిజంబు
తే. ఒండెఁ గైవల్యలక్ష్మివి యొండె నేని
కామినీత్వంబుఁ గైకొన్న కాశిపురివె?
యొండె నాఁకొన్నవారల నూఱడించి
యమృతభిక్షొన్న మిడువిశాలాక్షి వీవు. 171
తే. చేయఁ గలవాఁడ నేను నీ చెప్పినట్లు
బ్రాహ్మణుఁడఁ గాన నాకుఁ జాపలము ప్రకృతి
బుద్ధిఁ గృప నేసి రక్షింపు పుణ్యసాధ్వి!
కాంత! నీపేరు నాకు నిక్కముగఁ జెప్పు. 172
వ. అనిన నమ్మత్తకాశిని సాత్యవతేయున కిట్లనియె. 173
శా. ఊఁకోఁ జెప్పఁగ నెంత యేని తడ వౌ నో విప్రశార్దూల! నీ
వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం దాస్థానమైయుండియ
ట్టాఁకం బెట్టక చెప్పెదన్ సకలవృత్తాంతంబునుం దేటగా
వీఁక న్వేళయతిక్రమించెఁగుడువన్ విచ్చేయుమా క్రమ్మఱన్.
వ. అనినం బారాశర్యుం డయ్యార్యతో నమ్మా! యొక్కవిన్న 175
పంబు గల దాకర్ణింపు మని యిట్లనియె.
తే. అయుతసంఖ్యశిష్యు లాయాయివీథుల
వేఱువేఱ భిక్ష వేఁడితేఱ
నేను నొక్కవీథి నేకాంతవృత్తిమైఁ 176
బర్యటించి తెత్తుఁ బంచభిక్ష.
చ. దినము దినంబుఁ దప్పకిటు ద్రిమ్మరిచాలఁగ భిక్షయెత్తియేఁ
జను నెడఁ గూడ వత్తురుక్రుశానుసమానులు నన్నుఁబైలజై

మినిముఖు లై నశిష్యులు సమిద్ధమతిం బురసూర్యవీథికిన్
మునుకొనియెయ్యెనోయ్యెఁ గతముం గతవల్లియునుంబతిం
తే. శిష్యులును నేను గూడి రాజీవనేత్ర! [చుచున్.
యాశ్రమమునఁ బాషాణమతాంతరమున
రాశి వోయుదు మఖలపాత్రములయందు
నంచఱును దెచ్చినట్టి భిక్షాశనంబు. 178
సీ. పాయసాపూపసూపపదార్థనివహంబు
లేకీభవించిన నేర్పరించి
యన్నింట సగ మతిథ్యభ్యాగతార్థంబు
భాజనంబుల నించి పాయఁ బెట్టి
సగము భాగీరథీసలిలధారాప్రపూ
రంబునఁ బ్రక్షాళితంబు నేసి
తారతమ్యమున వృద్ధపురస్సరంబుగాఁ
బరిపాటి వేర్వేఱ బంతి సాగి
తే. యర్థి 'నమృతాయతా' మని యనుమతించి
యేను మున్ను ప్రాణాహుతు లెత్తఁ జూచి
చేయుఁ బ్రాణాగ్నిహోత్రంబు శిష్యకోటి
యెంతయును గాల మీవ్రతం బిట్లు సెల్లె. 179
ఉ. ఎన్నఁడుఁ జూడమున్నీనము నిట్టిమహాద్భుతమేమిచెప్పుదుం
గిన్నరకంఠి? యొ ట్టిడినకీలునఁ గాశిపురంబునందు భి
క్షాన్నము లేదు నీయడుగు లాన నిజంబుగ విన్నవించెదన్
నిన్నటనుండి యేము నిరునీఁగియునుంటిమి నిట్టుపాసముల్.
ఉ. చట్టలు డప్పిమై నవురుసా రయి పాత్రలుఁ దారుఁ గాశికా
హట్టములందుఁ గూటికి నుపాయము లేక పరిభ్రమింప వా

రెట్టరి పోవ నిమ్మనుచు నించుకయేనియుఁ దాల్మి లేక యే
నెట్టుభుజించువాఁడ ధవళేక్షణ! యొక్కఁడ నీగృహంబునన్.

తే. అస్తమింపంగఁ జేరినాఁ డహిమకరుఁడు
శిష్యులే కాక యయుతంబుఁ జిగురుఁబోఁడి!
వ్రతము దప్పి భుజింపంగ వలను గాదు
నేఁడు నిన్నటిమలునాఁడు నిక్కువంబు. 182

చ. అనవుడు నల్ల నవ్వి కమలానన యిట్లను లెస్సగాక యో
మునివర! నీవు శిష్యగణముం గొని చయ్యన రమ్ము విశ్వనా
థునికృపపేర్మి నెంద అతిథుల్ చనుదెంచినఁ గామధేనువుం
బనిగొనునట్లు వెట్టుదు నపారము లైనయభీప్సితార్థముల్.

వ. అనిన నట్లకాక మహాప్రసాదం బని వేదవ్యాసుండు శిష్యు
లం గూర్చుకొని భాగీరథికిం జని యుపస్పర్శం బాచరించి
యేతెంచిన. 184

తే. గొడుగు పాగలు గిలుకలు గులుకరింప
నిందుబింబాస్య యెదురుగా నేగుదెంచి
ఛాత్రసహితంబుగాఁ బరాశరతనూజు
బంతి సాఁగించె భుక్తిశాలాంతరమున. 185

వ. అనంతరం బావిశాలాక్షీ మహాదేవియనుభావంబున నమ్మహా
మునులముందటం గనకరంభాపలాశపాత్రంబులయందువిచి
త్రంబుగాఁ గలవంటకంబులు, నపూపంబులు, లడ్డువంబులు,
నిడ్డెనలు, గుడుములు, నప్పంబులు, నిప్పట్లు, జిల్లేడుకాయలు,
దోసియలు, సేవియలు, *నంగరపూవియలు, †సారిపత్తెలుఁ,
దోసియలు, సేవియలు, మణుఁగుఁబూవులు, మోరుం
జొత్తరలుఁ, జక్కిలంబులు, మణుఁగుఁబూవులు, మోరుం
డలుఁ, బుండ్రేక్షుఖండంబులుఁ, బిండఖర్జూరద్రాక్షానారికేళ

* 'అంగరొల్లె' లని శబ్దరత్నాకరము. † 'సారెసత్తులు' అని శ. ర.

కదళిపనసజంబూచూతలికుచదాడిమీకపిత్థకర్కంధూఫలంబులు, గసగసలుఁ, బెసరుపులగములుఁ, జెఱకుగుడములు, నరిసెలుఁ, బిసకిసలయములవరుగులుఁ, జిఱుగడములుఁ, బడిదెములుఁ, బులుసులుఁ, బులివరుగులు, నప్పడంబులు, బప్పులు, రొట్టియలును, జాపట్లుఁ, బాయసంబులుఁ, గర్కరీకారవేల్లకూశ్మాండనిష్పావకపటోలికాకోశాతక్యలాబూశిగ్రూదుంబరవార్తాకబింబికారవింద శలాటువులును, గందయుఁ, బొందయుఁ, జారులుఁ, దియ్యగూరలుఁ, బచ్చడులు, బజ్జులు, గిచ్చళ్లు, గిజ్జిణులు, వడియంబులుఁ, గడియంబులుఁ, గాయంబులు, గంధతోయంబులు, నుండ్రాలు, నానబాలు, ననుములు, మినుములు, బుడుకులు, నడుకులు, నిడియును, జలిమిడియును, ద్రబ్బడయు, వడయు, నుక్కెరలుఁ, జక్కెరలును, నేతులుఁ, దేనెతాలలుఁ, బిట్టును, గట్టును, దోసెలుఁ, బూపలు, మోదకంబులు, గుడోదకంబులు, ముక్కులు, మిరియలిచొక్కంపుఁబేరుఁబ్రాలమిలమిలని రాజనంపుమడుంగుటోగిరంబులు, పాడబంబులతోడఁ, బానకంబులతోడఁ, దిమ్మనంబులతోడఁ, దధిపిండఖండంబులతోడ, మీఁగడలతోడ, మజ్జిగలతోడ, నూరుఁగాయలతోడ, నంబకళంబులతోడ, రసావళులతోడంగూడ, భుగభుగం బొగపుఁగంపులతోడం బ్రతిభటించు రామఠామోదంబును, రామఠామోదంబుతో మంతనంబాడు మెంతులనెత్తావులు, మెంతులనెత్తావులతో బిత్తరించు జీరకంబులసౌరభ్యంబులును, జీరకంబులసౌరభ్యంబులతోడం బ్రస్తరించు కుస్తుంబరీకిసలయవాసనలును, గుస్తుంబరీకిసలయవాసనలతోడం బిసాళించు మంగ[illegible]ంబును,

గజేవేపాకుపరిమళంబుతో సంబంధించుకమ్మకసిందగంధంబును, గమ్మకసిందగంధంబుతోడందార్కొను నేలకులసౌరభంబులును, నేలకులసౌరభంబులతో సాళగించుకాలాగురుకురంగనాభి కర్పూరగంధసార నీహారవాగపూరంబుల వలపులును, కాలాగురుకురంగనాభికర్పూరగంధసారనీహారవాగపూరంబులవలపులతోడం గలహించుమహిసాక్షిగుగ్గులుధూపధూమంబుల కమ్మందనంబును, భోజనాగారగవాక్షమార్గంబులవెడలి కాశికానగరఘంటావీథులం బౌరనాసికాపుటకుటీరంబులకుఁ గుటుంబకంబుగా మిరియంబుపెరిమయు, బసుపుపసయు, శొంఠిసొబగు, నావ శేవయుఁ, జెందుప్పుచేఁగయుఁ, గారాపువ్వుమవ్వంబును, బిప్పలియొప్పును, నల్లంబు మొల్లంబును, జింతగ్రొజ్జురజ్జును, జేలపిండిమెండును, నిప్పపూమొగ్గల యగ్గలికయు, వెన్నపెన్నాటకంబునుం గలిగి యొక్కొక్కమజేయుఁ దనకుఁ దాన నులివేఁడికట్టావితో నావిర్భవించిన. 186

సీ. తరుణకంకేళిపాదపపల్లవముచాయ
    దవడించుజడలజూటంబు ముడిచి
హైమంబు లైనరుద్రాక్షకుండలములు
    శ్రవణపాశములందు సంతరించి
నిర్నాభిబిలముగా నెజే వీఁగుబొజ్జపై
    సలిలకాషాయవస్త్రము ధరించి
యాపాదమస్తకం బఖిలాంగకంబుల
    నవ్యభస్మోద్ధూళనం బొనర్చి
తే. పాశుపతదీక్ష రూపంబు వడసినట్లు
    శాంతి పుంభావ మొందినసౌష్ఠవమున

బంతినడిమికి నేతెంచి భవనభర్త
తపసులకు భక్తి నన్నంబు దారవోసె. 187

తే. ఆరగించెఁ జతుర్విధాహారములను
మనసుకోరిక నిండంగ మునిగణంబు
వారిబంతిన కుడిచె నావాసభర్త
ధర్మగేహిని తాలవృంతంబు వీవ. 188

వ. భోజనానంతరంబున నాస్థానమంటపంబున సుఖోపవిష్టుండై ధర్మపత్నియుం దాను గృహపతి బాదరాయణు రావించి కూర్చుండ నియమించి కనుసన్నఁ జేసి విశాలాక్షి నతనితో నాడఁ గలమాట లాడు మనిన నమ్మహాదేవి సాత్యవతేయున కిట్లనియె. 189

తే. ఆరగించితె కడుపు నిండార నీవు?
శిష్యతతి భోజనంబు సేసెనె యథేచ్ఛ?
నదను దప్పినఁ దలఁగి యంతంత నున్న
వారు లేరు గదయ్య మావంగడమున?. 190

వ. అనిన బాదరాయణుండు మహాదేవీ! షడ్రసంబులయందు నొక్కొక్కరసం బుల్బణంబును, ననుల్బణంబును, నుల్బణానుల్బణంబును ననుమూఁడుప్రకారంబుల ముయ్యాఱుభేదంబుల నాస్వాదనీయంబులై చతుర్విధాహారంబులయందు మాజిహ్వాకుం బండువు సేసె. కడుపు నిండ భుజించితిమి. వాసరద్వయోపవాస సంప్రభూత జఠర గోళక్షుధాగ్నితాపం బుపశమించె. అవసరంబు దప్పి భోజనంబు లేక యంతంత నున్నవారు మాయం దెవ్వరును లేరు. మున్నెన్నఁడుం జూడము వినము. ఈయట్టియద్భుతంబుం గలదె? పాత్రంబులయందు విచిత్రంబు లగునన్నంబులు

సవ్యంజనంబులయి తమకుం దా మావిర్భవించు టెట్లు? మీ ప్రభావంబు మీర యెఱుంగుదురు. మాకుఁ జూడ నీవు విశాలాక్షి వీయయ్య యావిశ్వేశ్వర శ్రీమన్మహాదేవుండునుం గావలయు నని పలికిన విని యీశాని యతండు కాశీనగరంబునకుం జేసిన యపరాధంబునకుం దగినశిక్ష సేయం దలంచి యి ట్లనియె. 191

క. *మే లగుఁ గాశీనగరం
బీలాగున భక్తి గలిగెనే భోజన మే
వేళం బుట్టదు? పుట్టని
వేళం గినియంగఁ దగునె వేదవ్యాసా? 192

ఉ. ఎట్టు పురాణము ల్పదియు నెన్మిదిఁ జెప్పితి? వెట్టు వేదముల్
గట్టితి వేర్పఱించి? సుడికారముసొం పెసలార భారతం
బెట్టు రచించి? తీవు బుషి వెట్టయి? తొక్కదినంబు మాత్రలోఁ
బొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణంబులరాశిఁ గాశికన్ 193

క. క్రోధంబు ఫలమె నిర్మల
బోధమునకుఁ? దీర్ఘవాసమున కర్హం బే
క్రోధము? వారాణసిపైఁ
గ్రోధించిన విశ్వభర్త గోపింపఁ డొకో? 194

వ. వారాణసి ముక్తిస్థానం బీతీర్థముమీఁద నెవ్వం డన్యాయము దలంచువాఁడు రుద్రపిశాచం బగు నని పలికి భవాని భవునియాననంబు వీక్షించిన. 195

* ఒక వ్రాఁతపుస్తకమున దీనికిఁ బద్యాన్తరము:—
'మేలుగఁ గాశీనగరం, బీలాగున భుక్తి గలిగె నీభోజన మే
వేళం బుట్టదు? పుట్టని, వేళం గినియంగఁ దగునె వేదవ్యాసా!'
మఱియొక ప్రతిలో 'క్షినియుం టిది తగవె' యని యున్నది.

తే. కాశి నుండంగ నర్హుండు గాఁడు వీఁడు
వెడలి పొ మ్మనుమాటలు వేయు నేల?
క్రోధనుం డెట్లు? కైవల్యకులగృహంబు
నానివాసంబు కాశికానగర మెట్లు? 196

వ. అని విరూపాక్షుండు పరుషాక్షరంబులఁ దన్ను నధిక్షేపించి
పలికినం గలంగి వడవడ వడంకుచు వేదవ్యాసుం డయ్యాది
మదంపతులపాదారవిందంబులకుం బ్రణమిల్లి యపరాధంబు
నేసితిఁ గోపం బుపసంహరింపవలయు నని ప్రార్థించిన. 197

సీ. కాశికాపురిఁ దొంటికట్టడ నుండక
పుణ్యకాలమునందు భూతతిథిని
వచ్చువాఁడవు శిష్యవర్గంబు నీవును
నైదుక్రోశములకు నవులనేల
నుండువాఁడవు పైఁడికుండలు ప్రాకార
వలయంబుఁ బొడగానవచ్చుచోటఁ
ద క్క-న్యతిథులఁ దీర్థంబు నిందింపకు
బుద్ధిమంతుఁడవు గాఁ బొమ్ము బ్రదుకు

తే. మంచు నంతర్హితుం డయ్యె నగజతోడ
విశ్వనాథుండు మునియును విశ్వభర్త
యాన తిచ్చినయట్లయ యధివసించెఁ
గాశికాపురి కెడదవ్వు కలుగునడవి. 198

తే. అనిన విని కుంభసంభవుఁ డాదరమున
నాంబికేయున కభివాదనంబు నేసి
కాశిఁ గలతీర్థములును లింగములు నాకు
నాన తి మ్మని ప్రార్థించి యడుగుటయును. 199

వ. కార్తికేయుం డగస్త్యున కిట్లనియె. 200

### క్షేత్రతీర్థకదంబవర్ణనము.

తే. అనఘ! యిట్టుల మాతల్లి యడిగె శంభు
హస్తములు మోడ్చి యడిగిన నధికకరుణ
నాన తిచ్చె విశాలాక్షి యనెడు పేరి
యస్మదంబకుఁ దరుణచంద్రార్ధమౌళి. 201

వ. విశాలాక్షీ ! మోక్షలక్ష్మికిం బుట్టినిల్లగు కాశీపట్టణంబున విశ్వేశ్వరాభిధానుండనైన నాచుట్టునను బంచక్రోశమధ్యంబునను విరించి హరిపురందరాదిబృందారకవందనీయంబులై గూఢంబులు నగూఢంబులు గూఢాగూఢంబు లగు దివ్యలింగంబులుం బుణ్యతీర్థంబులుం బావనవాపీకూపతటాకంబులు లెక్కించి చెప్పగోచరంబులుగావు. ఉద్దేశమాత్రంబునం జెప్పెద. సావధానమతివై యాకర్ణింపుము. సారసలోచన! సారస్వతేశ్వరుండు సారస్వతప్రదుండు; నీలవేణి! గోప్రేక్షుండు దాక్షిణ్యనిధి; అచలకన్యక! దధీచీశ్వరుండు పాపమోచకుండు; కనకకేతకీకుసుమగర్భపత్రసగోత్రగాత్రి! యత్రీశ్వరుండిహాముత్రఫలప్రదాత; లజ్జావతి! విజ్వరేశ్వరుండు గుజ్జుకల్పతరువు; తలోదరి! వేదేశ్వరుండు కరుణోదధి; కుశేశయగంధి! యాదికేశవుం డఖిలక్లేశనాశకుండు; తన్వంగి! సంగమేశ్వరుండు తంగేటిజున్ను; రతిబోఁటి! చతుర్ముఖేశ్వరుండు భయత్రాత; ఇంతి! శాంతికదేవిచింతామణి; కాంత! కుంతీశ్వరుండు సంతతికరుండు; విపులశ్రోణి! కాపిలహ్రదంబఘగదాగదంకారంబు; కిసలయోష్ఠి ! యనసూయేశ్వరుండు కొంగుపసిఁడి; ముగ్ధ! సిద్ధివినాయకుండు కామధుగ్ధేనువు; శరణ్యా! హిరణ్యకశిపులింగంబు ముంగిటనిధానంబు; మందగమన! మందాసురేశ్వరుండు వందారుజనమందారం.

బు; సుదతి! సత్కపీశ్వరస్కందేశ్వర ప్రసన్నవదనేశ్వరులుశా శ్వతైశ్వర్యసంధాయులు; చండి! ప్రసన్నోదకుండంబుదురిత ఖండనంబు; అష్టాదశ యోగపీఠికాధిష్ఠాత్రి! యట్టహాసేశ్వ రుండు ఘటితాఘప్రఘట్టుండు; జగద్ధాత్రి! మిత్రావరుణ వృద్ధవసిష్ఠకృష్ణయాజ్ఞవల్క్యప్రహ్లాదవైరోచనేశ్వరులుసర్వా ధీనఫలప్రదాయకులు; పల్లవపాణి ! బాణచంద్రవిద్యేశ్వరు లభద్రవిద్రావణులు; కర్ణమోటీ! వికటాదేవిజంబేటికా లువ; గౌరీ ! వీరేశ్వరుండు వారాణసీపంచముద్రమహాపీఠ పట్టాభిషిక్తుండు; లీలావతి ! వాలిహనూమదాశ్వినేశ్వరుల లింగంబులు మంగళప్రదంబులు; వెండియు. 202

దండకము. వినుమభినవవిద్రుమాతామ్రదంతచ్ఛదా!భద్రకుం డంబు గండూషితాశేషదోషంబు భద్రేశ్వర శ్రీమహాదేవుఁ డందుండుఁ, దత్కుండపూర్వోత్తరాశావిభాగంబునం జక్ర కుండంబు చక్రేశుఁ డందుండుఁ, దత్సేవ సంసారచక్రక్రమ ప్రక్రియాధిక్కృతి, ప్రౌఢ! తన్నైరృతాశం ద్రికూటేశ్వరుం డుండు, నాచేరువన్ శూలకుండంబు, శూలాప్రదస్నానపా నంబులన్ మానవుం డొందు నేనోనివృత్తిం, దదగ్రంబున న్నారదేశుండు చేటీశుఁడుం గోటితీర్థంబు నంగారకాధీశుఁ డున్, దుర్గ! చాముండియున్ భార్గవేశుండునున్గాపిలేశుండు నోంకారమత్స్యోదరీతీర్థరాజంబులున్ శంకుకర్ణేశ్వరాఘో రనాథేశుఁడున్ రుద్రదాసాప్రదంబున్ మహాపాతకోపద్ర వోద్రేకవిద్రావణ ప్రౌఢముద్రాసమున్నిద్రరౌద్రోదయస్ఫూర్తు లై యుంద్రు, నాచక్కటిం గౌస్తుభేశుండు సిద్ధేశుఁడుం గామకుండంబులక్ష్మీశసత్యానృతేశానులుం జంద్రకుండంబు నింద్రేశచంద్రేశ్వరాగ్నీశులున్ బాలచంద్రేశుఁడున్ వృద్ధ

కాళేశలింగంబు దక్షేశలింగంబునై రావణాధీశలింగంబు ధన్వంతరీశానలింగంబునుం దుంగనాథేశలింగంబు శ్రీభైరవాధీశలింగంబు దర్శించి మర్త్యుండు మృత్యూద్భవంబైనభీత్యుద్గమంబుల్ బెడంబాయు వ్యాసేశ్వరవ్యాసకుండంబులుం బంచచూడాసరోమధ్యమేశానమందాకినీతీర్థముల్ రామభద్రేశుఁడుల్ జంబుకశ్రీమతంగేశులుల్ సిద్ధకూపంబు సిద్ధేశుఁడుల్ వ్యాఘ్రలింగంబు శాతాతపేశానుఁడుల్ వారితేశుండుగాణాదకూపంబుగాణాదలింగంబునాషాఢనాథేశుఁడుల్ భారభూతేశుఁడుల్ శ్రీగభస్తీశుఁడుల్ మంగళేశుండునుం ద్వష్టృనాథేశుఁడుల్ దైవదైతేశుఁడుల్ మంగళాదేవియుల్ శ్రీమయూఖాంకుఁడుల్ వ్యాఘ్రపాదేశుఁడుల్ శ్రీవిభాండేశలింగంబుసిద్ధేశలింగంబునాలక్షకోట్యర్బుదన్యర్బుదానేకలింగంబులాకాశగంగాప్రతీరంబునన్ గాశికాక్షేత్రసీమావిభాగంబునన్ భోగమోక్షంబులుల్ సేవకశ్రేణికిఁజాలుఁ గల్యాణి! కాత్యాయనీ! దేవి! నారాయణీ! శ్రీవిశాలాక్షి! సత్యంబు సత్యంబు సత్యంబు ముమ్మాటికిన్. 203

క. గంగాధరుసన్నిధి వారి
ముంగిటఁ జదివినను విన్న ముక్తిధరిత్రీ
లింగాభిధానమాలిక
భంగించును బంచజనునిపాపౌఘములన్. 204

తే. ఒక్క పేరిలింగంబులు పెక్కు గలవు
కలవు పెక్కొకపేరివ కలువకొలఁకు
లొక్కపేరివ కలవు పెక్కుపవనములు
గాశికాపట్టణమునందుఁ గలువకంటి! 205

తే. అంధువులసంఖ్య లెక్కింప నలవి గాదు
కుండములసంఖ్య లెక్కింప గొలఁది గాదు
వాపికలసంఖ్య లెక్కింప వలను గాదు
పద్మలోచన! కాశికాపట్టణమున. 206

మ. మనుపు స్మచ్ఛటయున్న ప్రహాస్యమునసుస్ముద్రించినానాదివా
కసులాస్థానముఁ గూడియాడుదురు శ్రీకాశీప్రదేశంబునన్
గసవై పుట్టెడుభాగ్యమైన మనకున్ గల్పింపదా దైవమీ
కసుమాలం బగునాక మేలయనియుత్కంఠాతిరేకంబునన్.

తే. కాశి శివలింగకోటులఁ గన్నతల్లి
కాశి కైవల్యఫలదానకల్పవల్లి
గంగగారాబునెచ్చెలికత్తె కాశి
సురనరోరగదైత్యసంస్తుత్య కాశి. 208

తే. శైలసుత! సర్వతీర్థైకజన్మభూమి
సర్వవేదపురాణశాస్త్రములగరిడి
సర్వపాపౌఘుజలదజంఝామరుత్తు
సర్వమోక్షమ్ములకును నాస్పదము కాశి. 209

ఉ. దుర్గ! హిమాచలంబుపయి దుస్సహమైనతపంబు నేసి త
ద్ధూర్గరిమంబున న్ననుఁ గుతూహలిఁ జేసితి వీవు కాశి నై
సర్గిక మైనతేజమున సంతస మందఁగఁ జేయు నన్ను నీ
మార్గము కాశికానగరిమార్గముఁ జూడుమయెద్దియెక్కుఁడో?

క. నీ వెంతప్రియవు నాకును
దేవి! విశాలాక్షి, సర్వదేవనమస్యా
కైవల్యజన్మనిలయము
శ్రీవారాణసియు నంతప్రియ మెయ్యుండున్. 211

తే. స్కందనందిమహాకాళకరటిముఖులు
నైగమేశవిశాఖులు నలిననేత్ర!
పట్టిచూడంగ నా కెంత పరమహితులు
పాయ కవిముక్తమున నున్న ప్రజలు నట్లు. 212

తే. వేల్చినారు తపంబు గావించినారు
తీర్థములు సర్వములును సాధించినారు
కమలలోచన! యానందకాననమునఁ
బాయకుండెడుజనులు ప్రాగ్భవమునందు. 213

తే. భువనభారంబునకుఁ గాఁగఁ బుట్టినారు
కాశిఁ గాఁపున్న ప్రజలు దక్కఁగ లతాంగి!
యక్షగంధర్వగరుడవిద్యాధరులును
దందశూకులు నర్థవాదంబు గాదు. 214

తే. కాశికాపురి నున్నపుల్కసునిఁ బోల
రితరభూముల నున్నవా రెంతవారు
శ్రోత్రియులయింటఁ బుట్టనీ శ్రుతులు నాల్గు
నభ్యసింపంగ నీసరోజాయతాక్షి! 215

సీ. సాక్షాద్ద్విసంఖ్యాధికేక్షణుం డనవచ్చుఁ
గాశిఁ గాఁపుర మున్న కాఁపుకొడుకు
కాశిఁ బంచక్రోశికడసీమ మొలచిన
గణికతోఁ బ్రతి శావు కల్పకములు
కల్పాంతకాలంబు గరుసు దాఁటిననాఁడుఁ
గాశి ముంపఁగ లేదు కడలివెల్లి

బ్రహ్మాదులకుఁ గాశిఁ బాదచారము కాని
యెక్కు మర్యాద లే దెక్కిరింత
తే. సుదతి! పాపములకును జుక్కెదురు కాశి
వెలఁది! యుపపాతకములకు విషము కాశి
భామ! కల్యాణమున కాటపట్టు కాశి
ఇంతి! మోక్షములకుఁ బుట్టినిల్లు కాశి. 216
తే. అన్ని కుండంబులను దీర్థ మాడినఫల
మన్ని లింగంబులకు మ్రొక్కినట్టిఫలము
గలుగు నీహారగిరిరాజకన్య! నిజము
మరిగి యాతీర్థములు విన్నమానవులకు. 217
సీ. జపియింపఁ దగుఁ బితృశ్రాద్ధకాలంబుల
నిమ్మహాస్తోత్ర మద్రీంద్రతనయ!
పంచమహాపాపభద్రేభపంచాస్య
మిమ్మహాస్తోత్ర మద్రీంద్రతనయ!
పఠియించువారలపాలికల్పద్రుమం
బిమ్మహాస్తోత్ర మద్రీంద్రతనయ!
నాకు నత్యంతమనగ్రప్రమోదావహం
బిమ్మహాస్తోత్ర మద్రీంద్రతనయ!
తే. డాంబికున కుద్ధతునకు నధార్మికునకుఁ
గూటసాక్షికి శఠునకుఁ గుత్సితునకు
హేతువాదికి గ్రూరున కీ ననర్హ
మిమ్మహాస్తోత్రరాజ మద్రీంద్రతనయ! 218

వ. అని గంగాధరుండు కాశీలింగతీర్థవృత్తాంతంబు విశాలాక్షికి వినిపించుచుండె. ఆసమయంబున మందరాచలంబుననుండి దివోదాసవివాసానంతరంబు గాశి కేతెంచి బహిర్గేహంబు నం బట్టాభిషేకంబు గైకొని యంతర్గేహప్రవేశంబునకు శుభముహూర్తంబు ప్రతీక్షించుచుండ నమ్మహోత్సవ కాలం బాసన్నం బగుటయు నందికేశ్వరుం డేగుదెంచి యి ట్లనియె. 219

సీ. ఊర్జమాసంబున నుడురాజునభివృద్ధి
ప్రతిపద్దినంబున భాస్కరుండు
గగనహర్మ్యశిఖాగ్రకనకకుంభంబు గా
నభిజిత్తునందు మధ్యాహ్నవేళఁ
బ్రాలేయకరుఁడు సప్తమరాశితోఁ గూడఁ
బంచగ్రహము లుచ్చపదవి నుండఁ
గరణంబు యోగనక్షత్రంబులును లెస్స
గా లగ్నసంశుద్ధి కలిమి మెఱయఁ
తే. మంచికాలంబు సాధించి మనసు గెలిచి
బ్రహ్మహరివాసవాదులు పరమనిష్ఠఁ
గాచి యున్నారు నీరాకఁ గాలకంఠ!
వేగ విచ్చేయు గేహప్రవేశమునకు. 220

వ. అని నందికేశ్వరుండు విన్నవించినం బరమానందకందళిత హృదయారవిందుండై యిందుశేఖరుండు విశాలాక్షీసహితుం డై మోక్షలక్ష్మీవిలాసదర్పణం బైనయంతఃప్రాసాద మందిరంబు ప్రవేశించె. సురభిగంధంబు లై గంధవాహం

ఖులు వొలసె. గంధర్వులు దివ్యగాంధర్వంబున మంద్రకాది షమహాప్రబంధంబులు వాడిరి. అప్సరస లాడిరి. మహర్షులు హర్షించిరి. చారణులు సంస్తుతించిరి. ప్రమథులు ప్రమోదించిరి. విద్యాధరులు పుష్పవృష్టిఁ గురిసిరి. చరాచరభూత జాతంబు సంప్రీతిమేదురం బయ్యె. పంచమహావాద్యంబులు సెలంగె. ఇబ్భంగి గృహప్రవేశమహోత్సవారంభంబు త్రిభువనదృక్కారంభం బయ్యె నయ్యవసరంబున. 221

ఉ. వెగ్గల మైనవాసనలు విశ్వజగంబును గ్రమ్మ వేల్పుఁగా
గుగ్గులుధూపధూమము లగోచరలీల నజాండగోళము
న్దగ్గఱఁ బాఱె వానిమిళనంబునఁ గాదె నభంబు గల్పవూ
*మొగ్గయుఁబోలెనిప్పుడుసముద్ధతనీలిమమయ్యెఁజూడ్కికిన్.

తే. అవసరం బిచ్చి శివుఁడు బ్రహ్మాచ్యుతాది
దేవతల గారవించె నతిప్రియమున
నటు విశేషించి మధుకైటభాసురారి
నాదరించెను గారవం బతిశయిల్ల. 223

తే. నీకతంబునఁ గాదె నాళీకనయన!
కలిగెఁ గ్రమ్మఱ నానందకాననంబు
త క్కొరుఁడు నేర్చునే దివోదాసనృపతి
విబుధసందోహవిద్వేషి వెడల నడువ? 224

వ. నీకుం బ్రియం బెయ్యది? యదియ వరంబుగా నిత్తు ననిన నచ్యుతుం డంబికావల్లభున కిట్లనియె. 225

* మొగ్గయుఁబోలె నిప్పుడు సముంచిత ఇయ్యది విచార్యము.

తే. ప్రియము నా కొండు గలుగ దీత్రిభువనములఁ
గలదు ప్రియ మొక్కటియ చూడఁ గాలకంఠ!
కాశికాపట్టణమున నివేశనంబుఁ
గరుణ సొంపార నిమ్ము నీపారుగునందు. 226

—— విశ్వేశలింగమాహాత్మ్యము. ——

వ. అనిన శంభుం డొంగాక. విశ్వంభర! నాచేరువనే యుండు. మొదల నిన్ను నారాధించి పిమ్మటఁ బ్రజలు నన్నుదర్శించువారు. ఇదె చూడు. దక్షిణమంటపంబైన యీయపవర్గమంటపంబునఁ గాశీమాహాత్మ్యపుణ్యకథలు వినునది. మణికర్ణికా స్నానానంతరంబు ముక్తిమంటపంబునఁ బురాణంబు వినుట కర్తవ్యంబు. 227

తే. కాశిఁ దీర్థంబు లెన్నేని గలుగనిమ్ము
చక్రతీర్థంబు తీర్థంబు శార్ఙ్గపాణి!
కాశి లింగంబు లెన్నేని గలుగనిమ్ము
విశ్వపతి నేన లింగంబు విహగగమన! 228

క. కైవల్యమంటపం బిది
నావిహారణభూమి పద్మనాభ ! విముక్తి
శ్రీవనితాశుద్ధాంతము
గ్రైవేయవిభూష కాశికాపురమునకున్. 229

వ. ఈముక్తిమంటపంబునకు భవిష్యద్ద్వాపరంబునఁ గుక్కుటమంటపం బనునామాంతరంబు గలుగఁ గలయది. యావృ

త్తాంతంబు వివరించెద. ఆకర్ణింపుము. ఆనందకాననంబున మహానందుం డను బ్రాహ్మణుం డగ్రవేది పిన్నవాఁడు పితృమాతృవియోగంబు నొంది యవినయనిదానం బైనయావనంబున విషయాసక్తుం డై విషమశరశరశలాకాకీలితం బైన చిత్తంబున నుత్తమాంగననుంబోరుగింటిబ్రాహ్మణునిభార్య మైత్రీచ్ఛద్మంబున నపహరించి యపేయపానం బభక్ష్యభక్షణం బగమ్యాగమనం బనాచారాచరణంబుఁ గృత్యంబులుగా వర్తించుచు. 230

సీ. శైవుఁ డై యొకవేళ సర్వాంగకంబుల
భూతియు రుద్రాక్షములు ధరించుఁ
బఠియించు శ్రీగీతఁ బరమభాగవతుఁ డై
యుపశాంతి ధరియించు నొక్కవేళ
గొరగ యై మైలారుఁ గొనియాడు నొకవేళ
నొసలిపై బండారుపసుపుఁ దాల్చి
ప్రణుతించు నొక్కవీరాదేవి నొకవేళ
బవినీఁ డయి సమగ్రభక్తిగరిమ
తే. బౌద్ధుఁ డై యొకవేళఁ గాపాలికుఁ డయి
యొక్కవేళను జైనుఁ డై యొక్కవేళఁ
దిరుగు నాయాయిచిహ్నము ల్పరిఢవించి
యర్థకాంక్ష మహానందుఁ డవనిసురుఁడు. 231

తే. శైవపరిషత్తుఁ గూడి వైష్ణవుల నవ్వుఁ
బదరు శైవుల వైష్ణవప్రతతిఁ గూడి

శైవుఁడును గాఁడు తాను వైష్ణవుఁడు గాఁడు
పరమధూర్తాగ్రగణ్యుండు బ్రాహ్మణుండు. 232

క. ఏ వేషము ధరియించిన
నా వేషము తనకు నంద మై యద్ధాత్రీ
దేవుఁడు చెట్టునఁ బుడికిన
భావంబున నుండు రూపు ప్రాయము కలిమిన్. 233

తే. ద్వారవతి గంగమట్టి హస్తమునఁ గరఁచి
ఫాలమున నూర్ధ్వపుండ్రంబు పట్టె దీర్చి
యుభయదర్భల ధరియించి యుదయవేళ
గంగదరి నుండు దానాభికాంక్ష నతఁడు. 234

ఉ. ఏమని చెప్పఁ గాశిపురినెందును సంకుచితాగ్రహస్తుఁ డై
భూమిసురుండుదానములుపుచ్చుకొనండుదరిద్రుఁడయ్యునే
నేమఱుపాటఁ జూచినను నేటితటంబున దానకాంక్షఁ జే
రానుదపాకుచందమునహస్తములిచ్చియయుండువానికిన్.

తే. ఇవ్విధంబున బ్రాహ్మణుం డెఱిఁగి యెఱిఁగి
తిరుగుచుండఁగఁ బెక్కువత్సరము లరుగఁ
గలుగుదురు పుత్రు లిద్ద ఱక్కాలమునకుఁ
గుండగోళకవంశంబు కొనలు సాగ. 236

వ. అక్కాలంబునం దొక్కచండాలుండు బహుధనాఢ్యుండు
పర్వతదేశావాసి తీర్థయాత్రాప్రసంగంబునం గాశి కేతెంచి
చక్రపుష్కరిణీహ్రదంబునఁ దీర్థ మాడి యార్ద్రవస్త్రుం డై
దరికి నేతెంచి నలుదిక్కులుం జూచి యుచ్చైస్స్వనంబున.

శా. చండాలుం డనువింధ్యభూధరమహాసానుస్థలీపక్కణ
స్థుండం గాశికి వచ్చి సిద్ధతటినీతోయంబులం గ్రుంకి తా
వెండిం బైఁడియుఁ దెచ్చినాఁడఁ గలఁడే విప్రుండువిద్యాసమ
ర్థుం డీయర్థము వానికేనుపితృసంతోషార్థమై యిచ్చెదన్.

తే. అనిన విని భూసురోత్తము లద్దిరయ్య!
కాశి యఁట గంగ యఁట మణికర్ణిక యఁట
విశ్వపతి యఁట యవిముక్తవిహృతిభూమి
మాలచే దాన మందుబ్రాహ్మణుఁడు గలఁడె?. 239

తే. అనుచుఁ జేతులఁ గర్ణంబు లదిమికొనుచుఁ
బోవ నున్నారు నది నున్న భూమిసురులు
చూప నున్నాఁడు వ్రేల భూసురుఁ డొకండు
సాహసికుని మహానందు సన్న నేసి. 240

సీ. ప్రార్థింప నున్నాఁడు పాదాగ్రముల వ్రాలి
వెలివాడవాఁడు తద్విప్రకులుని
మేల్కొన నున్నాఁడు మిథ్యాసమాధి య
క్కపటధార్మికుఁ డప్డు కన్ను దెఱచి
ప్రణుతింప నున్నాఁడు బ్రాహ్మణబ్రువు మాల
కేల్దోయి నొసలిపైఁ గీలుకొలిపి
దీవింప నున్నాఁడు దెలిసి దోహరిబంటు
చెవి నక్షమాలిక చెరివి ద్విజుఁడు

తే. ప్రబలతరభక్తి నీలీలఁ బ్రస్ఫుటముగ
వివిధదంభంబు లిబ్బంగి విస్తరిల్ల

నంత్యజుండును నగ్రజన్మాధముండు
గంగదరిఁ దీర్త్తు రఖిలసత్కారవిధులు. 241

వ. అనంతరంబ పరద్రవ్యజిహీర్షాలోభగ్రహగ్రస్తుఁ డైనయయ్యగ్రజన్మాధముండు చండాలునిం గటాక్షమున వీక్షించి నిస్పృహత్వంబు నటించుచు. 242

తే. ఆస లేదు ధనంబుపై నంత్యజన్మ!
చాలు యాయావరము శిలోంఛంబు మాకుఁ
గలుగు నే వేడ్క సమలోష్టకాంచనులకు
నర్థములమీఁద? నని విప్రుఁ డపలపించు. 243

వ. ఆచందంబున మనసుపట్టి యుండం జాలక. 244

సీ. అవుఁ గాక! యేమిద్రవ్యము తెచ్చినాఁడవు?
తెచ్చినాఁడ ధనంబు దిమ్మలుగను
దెత్తు గా కేమి యీఁ దీరు నెంతసువర్ణ?
మెంత యిచ్చినఁ జిత్త మిగురు నంత
మేలు గా కేమి టంకాలజాళెము లెవ్వి?
యుల్లపెట్టియ నిండియున్నయవియ
యుండుఁ గా కేమి యేనో యెందఱో పాత్ర?
మీవ పాత్రంబు గా కెంద ఱేల?

తే. యనుచు నొండొరు లిట్లు మంతనం బాడుచుండ
బ్రాహ్మణుండును జండాలభటుఁడుఁ గూడి
ద్రవిణలాభంబు తీర్థయాత్రాఫలంబు
దివుటమైఁ గోరి భాగీరథీతటమున. 245

తే. అంత నమ్మక బ్రాహ్మణుం డర్థపరత
నిట్టు లనుఁ బుల్కసునితోడ నేవపడక
నేన యీయర్థము పరిగ్రహించువాఁడ
నొరుఁడు గలసిన నీధనం బొల్లఁ జూవె. 246

వ. అని పలికినఁ జండాలుండు సమ్మతించి మణికర్ణికా హ్రదంబు తీరంబున గోమయంబునం బట్టు నేసి మార్తాండకిరణంబులతో మాఱుమండు పదియాఱువన్నె బంగారంబు రాశి పోసి చతురశ్రం బగునప్పట్టుమీఁద బ్రాహ్మణునిలిపి భాగీరథీజలంబులఁ దత్పాదంబులు ప్రక్షాళించి గంధపుష్పాక్షతలం బూజించి యమ్మహాదానంబు ధారాసలిలపూర్వకంబుగా విశాలాక్షీసహితుండు గాశీపతి విశ్వనాథుండు సంప్రీతుం డగుంగాక యని యతని కాదానం బిచ్చిన బ్రాహ్మణుండు సంతుష్టాంతరంగుండై నిజనివాసంబునకరుగు. చండాలుండును దనదేశంబునకుం బోవుఁ దదనంతరంబ.

క. బహుళద్రవ్యంబుఁ బ్రతి
గ్రహము గొనియె మాలచేత గంగకడను ని
మ్మహీసురుఁడు వంశమునకును
బహిష్ఠుఁడో! యనుచుఁ జాటఁ బనుతురు విప్రుల్. 248

క. చండాలాత్తద్రవిణుఁడు
చండాలబ్రాహ్మణుండు జగతిని సాక్షా
చ్చండాలుఁడు గాశిని వీఁ
డుండిన నే ముండ మందు రుర్వీదివిజుల్. 249

వ. ఇవ్విధంబునం గాశికానగరంబున భూతాక్రోశంబుగాఁ
గన్నవారెల్లనుం దన్ను నిందింప విని విని విసివి వేసరి
యొక్కనాఁ డర్ధరాత్రసమయంబున మహానందుం డానంద
కాననంబు వెడలి పౌరభీతుం డై కాకభీతం బగుదివాం
ధంబునుంబోలెఁ జీకాకు వడి పుణ్యదేశంబులు చొరసెలవు
లేమిఁ గుటుంబసహితుం డై కీకటదేశంబునకుం బోవువాఁ
డై యటవీమార్గంబున. 250

తే. తాను నిల్లాలుఁగొమ్మయుఁ దనయయుగము
మొలల దీనారములజాళెములు వహించి
సాతుఁగూడి చనంగఁ దస్కరులు దాఁకి
నలుగురం బట్టి ధన మెల్ల నొలిచికొంద్రు! 251

వ. ఒలిచికొన యాదొంగ లి ట్లని విచారింతురు. 252

తే. ధనము హేరాళ మబ్బె నీతఁడు బళాయి
వీఁడు ప్రాణాన నరిగిన వెదకి వెదకి
మనల నెప మార్చుఁ గా కేల మనఁగ నిచ్చు
నితని వధియింత మని నిశ్చయింతు రపుడు. 253

వ. వధియింప నిశ్చయించి బ్రాహ్మణునిం జేరి కత్తిఁ దీడి యో
యివిప్రుండ! నీవు నీకుటుంబంబును మీయిష్టదైవంబులం
దలంచి కొం డనుటయు. 254

తే. అంబురుహనేత్ర శ్రీవిశాలాక్షిఁ దలఁచు
బ్రాహ్మణుఁడు చిత్తమున విశ్వభర్త దలఁచుఁ

దలఁచుఁ బుత్త్రద్వయంబు సద్భక్తియుక్తిఁ
గంఠపీఠాగ్రకరిరాజు డుంఠిరాజు. 255

వ. వెండియు మహానందుం డాత్మగతంబున. 256

సీ. పొరిగింటిబ్రాహ్మణిఁ బుణ్యగేహిని నేల
యపహరించితిఁ గన్ను లార్చి యార్చి?
పడరానిబ్రాహ్మణపదవి భస్మంబుగా
మధుమాంసముల కేల మరులుకొంటిఁ?
బరమనాస్తికుఁడ నై పాషండవేషంబు
ఘటియించుకొని యేల కాన నైతిఁ?
జక్రపుష్కరిణిలోఁ జండాలకునిచేత
ధన మపారం బేల ధార గొంటి?

తే. నాతతాయికి శఠున కన్యాయరతికిఁ
బాపబుద్ధికి విశ్వాసపాతకునకు
నాకు నీప్రాప్త మని మహానందుఁ డుండు
మస్తకము వాంచి కాంతారమధ్యభూమి. 257

చ. తలలు దెగంగ వ్రేయుదురు తస్కరవీరులు వారి నల్వురన్
నలువురుఁ జచ్చియన్యజననంబునఁ గుక్కుటజాతిఁబుట్టుటం
గొలఁకులకోళ్లలోఁ గలసి కోళ్లను నాలుగు నుండుఁగాన న
ప్పులుఁగులఁగూటఁ బెట్టుకొనిపోదురు కాశికి సార్థవాహకుల్

సీ. రేపాడి మణికర్ణికాపయోవేణిక
మజ్జనం బాడు నేమంబు మెఱయ

ముక్తిమంటపములో మునిజనంబు పఠింప
వినునాదిమపురాణవిస్తరంబు
విశ్వనాథునిదివ్యవేశ్మంబునకుఁ జేయు
మైత్రి మీఱఁ బ్రదక్షిణత్రయంబు
ద్వారభూములఁ జల్లునీరాజనక్రియా
దివ్యాన్నములఁ దీర్చు దేహయాత్ర

తే. నాల్గుజాలును సంజ్ఞాస్వనం బొనర్చుఁ
గోరి భజియించు నొకవేళఁ గొమరుసామిఁ
బ్రణవమంత్రంబు క్రేంకారపదముఁ గూర్చు
మిక్కుటం బగుగరిమతోఁ గుక్కుటములు. 259

వ. ప్రాగ్జన్మవాసనావశంబున జాతిస్మరణంబుగలిగి యాకుక్కుట చతుష్కంబు ముక్తిమంటపంబు నాశ్రయించి మోక్షంబు వడయుం గావున నమ్మంటపంబునకుఁ గుక్కుటమంటపం బనుసంజ్ఞాంతరంబు సంభవించు నని శంభుండు విశ్వంభరు నకు నావృత్తాంతం బానతిచ్చి విశ్వేశ్వరలింగంబుతో సాంగ త్యంబు వహించె నని చెప్పుటయు. 260

తే. కుంభసంభవుఁ డంబికాసంభవునకు
బ్రణతుఁడై దేవతాయాత్రపథము దెలుపు
క్రమము మై నేది మొదలుగాఁ గాశియందుఁ
దీర్థమాడంగ నర్హంబు దివిజవంద్య ? 261

### దేవతాయాత్రావిధానము.

వ. అనినం గుమారస్వామి చక్రపుష్కరిణీతీర్థంబున దేవర్షిపితృ తర్పణంబు సేసి యాదిత్యద్రౌపదీవిష్ణుదండపాణిమహేశ్వర

ఢుంఠివినాయకజ్ఞానవాపీనందికేశ్వర తారకేశ్వర కాలేశ్వరులసేవించి విష్ణువిశ్వేశ్వరుల నారాధించునది. అనంతరంబ ఓంకారలింగంబు మత్స్యదరీకృత్తివాసోలింగంబు రత్నేశ్వరుండు చంద్రేశ్వరకేదారేశ్వరకరవీరేశ్వరదక్షేశ్వర పార్వతీశ్వరపశుపతీశ్వరగంగేశ్వర స్వస్తీశ్వరసతీశ్వర తారకేశ్వరుల దర్శించునది. శైలేశ్వరసంగమేశ్వరమందాకినీశ్వర మణికర్ణికేశ్వర గోప్రేక్షేశ్వరకాపిలేశ్వరశుక్రేశ్వరాగ్నీధ్రేశ్వరనకులేశ్వరభారభూతేశ్వర కపీశ్వరమందాలనేశ్వరతిలపర్ణేశ్వరత్రిపురాంతకేశ్వర మనఃప్రకామేశ్వర ప్రీతికేశ్వరబ్రహ్మేశ్వరాగస్త్యీశ్వరకశ్యపేశ్వర హాటకేశ్వరసీమావినాయకత్రిసంధ్యేశ్వర విశాలాక్షీధర్మేశ్వరాశావినాయకవృద్ధాదిత్యచండిచండీశ్వర భవానీశ్వరపరాన్నేశ్వర వీరభద్రేశ్వర పంచవినాయకులం బూజించునది. 262

సీ. యాత్రాక్రమం బిది యానందకానన
వాస్తవ్యదేవతావర్గమునకు
నిది కాశికాఖండ మిమ్మహాఖండంబు
శ్రీమహాస్కాందవార్ధికి నమృతము
పఠియించినను దీనిఁ బ్రతిలిఖించిన విన్న
దానంబు చేసిన దారులోహ
పాషాణపీఠికోపరిభాగమున నిల్పి
గంధపుష్పముల నక్షతలఁ బూజ
తే. సేసినను గాశికాభర్త శివుఁడు విశ్వ
నాయకుఁడు లక్ష్మి నిచ్చు దీర్ఘాయు వొసఁగు.

బ్రాభవంబుఁ బ్రసాదించు భక్తతతికి
శ్రీవిశాలాక్షి కృప సేయుఁ జింతితములు. 263

ఆశ్వాసాంతము.

శా. కర్ణాటక్షితిపాలమౌక్తికసభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర ! దు
గ్ధార్ణోరాశిగభీర ! ప్రాఙ్ముఖమధ్యావహ్నిపరాహ్ణార్చితా
పర్ణావల్లభ ! రాజశేఖరమణీ ! పంటాన్వయగ్రామణీ ! 264

క. హేమాద్రిధీర ! దాశ
రామశ్రీభీమశంకరకృపాలక్ష్మీ
సామగ్రీపరివర్ధిత
భూమీసామ్రాజ్యవిభవ ! పుణ్యశ్లోకా! 265

మాలిని. వికచకమలనేత్రా ! నేమమాంబాసుపుత్రా!
సకలనృపశరణ్యా ! సంశ్రితాశేషపుణ్యా !
మకరనిధిగభీరా! మానినీచిత్తచోరా !
ప్రకటగుణతరంగా ! రాయవేశ్యాభుజంగా ! 266

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్య పుత్త్రసుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన కాశీఖండంబునందు సప్తమాశ్వాసము సర్వము సంపూర్ణము.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1933.—800.

చ. వరకవిసత్ప్రబంధములు బాలిశసంస్కృతి దుర్విదగ్ధతం
బొరసిపాకాలసంస్కరణముంబొనరించుటదుష్కరంబు; య
చ్చరిత మెఱింగియుం బరమసాహసరీతిఁ బొనర్చితిం బరి
ష్కరణము నెద్దియే నెరసుగల్గినసూరులుదెల్పుఁడీదయన్.

క. నలపుష్యకృష్ణదశమిఁ
లలిఁ గాశీఖండకృతి సలక్షణముగ ను
త్పల వేంకటనరసింహా
ర్యులు సంస్కరణం బొనర్చి రుద్దీప్తము గాన్.

